యాబది యైదవ పూజా పుష్పము

శ్రీరామకథా సుధాలహరి

# ఉత్తర కాండము

## మొదటి భాగము

(శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి - గీతికలలో)



## దుర్గాప్రసాద్

**శ్రీరామకథాసుధాలహరి**

ఉత్తరకాండము మొదటి భాగము -చతురస్ర గీతికలు

ప్రథమ ముద్రణము : 500 ప్రతులు



చిత్రభాను సంవత్సరము
శ్రావణ పూర్ణిమ - వర్షఋతువు
ఆగస్టు మాసము 2002

వెల : రు. **80=00**

డి.టి.పి. :
శ్రీ గాయత్రీదేవి గ్రాఫిక్స్, విజయవాడ - 3.

ముద్రణ :
తులసి గ్రాఫిక్స్, విజయవాడ - 2
ఫోన్ : 435732.

ప్రతులకు :
**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,**
విజ్ఞాన భవన్ బ్యాంకు స్ట్రీట్
హైదరాబాదు - 500 001.

**పి. దుర్గారావు,** యం.ఓ.యల్.
మీత్యాతండా, రాగడప పోస్టు - 508 207
(వయా) మిర్యాలగూడ - నల్లగొండ జిల్లా.




సమర్పణము :

కూజంతం రామరామేతి
మధురం మధురాక్షరమ్।
ఆరుహ్య కవితా శాఖాం
వందే వాల్మీకి కోకిలమ్॥

**పుష్పాంజలులతో**

# కృతజ్ఞతలు

1. ఆర్షవిజ్ఞాన ట్రస్టు హైదరాబాదు వారు ప్రచురించిన శ్రీ మద్రామాయణ గ్రంథము గీతికా రూపమున నేను రచించిన శ్రీరామ కథాసుధాలహరి అను గ్రంథమునకు మిక్కిలి తోడ్పడినది. వారికి నా హృదయపూర్వక నమస్కృతులు.

   అదే విధముగా టీకా తాత్పర్య సహితముగా వ్యాఖ్యానించిన ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారికి నా వినయపూర్వక నమో వాకములు.

2. నా యీ రామకథాసుధాలహరిని తమ బ్రాంచీల కన్నింటికి బంపి ప్రజలకు అందజేయుచున్న "విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్", హైదరాబాదు వారికి మిక్కిలి కృతజ్ఞుడను.

3. పది సంపుటాలుగా వెలువడిన యీ మహా గ్రంథమును, పుస్తక ప్రచురణలో సహకరించి సుందరముగా ప్రచురించిన శ్రీ డి.బి. ప్రింటర్సు విజయవాడ వారికి మిక్కిలి కృతజ్ఞతలు.

4. గ్రంథ రచనకు ప్రోత్సహించిన అనేక మంది మిత్రులకు వినయ పూర్వక నమస్కృతులు.

5. 3000 పుటలుగా పది సంపుటాలుగా రచించి ప్రచురించుట ఒక క్రతువు వంటిదని చెప్పవచ్చును. ఎన్ని అవాంతరాలు, అడ్డంకులు వచ్చినప్పటికి గ్రంథము పూర్తిగా ప్రచురించినందులకు పరబ్రహ్మ స్వరూపమైన శ్రీరామచంద్రునకు భక్తి పూర్వక నమస్కృతులు.

**- రచయిత.**

# దేవతావందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందర భావన! కవికులజన వరదాయిని
విశ్వరూప విమలచరిత! అక్షర రూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధ సేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

లలితకళానందమూర్తి విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధా కలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపలేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

# కృతజ్ఞతలు

1. ఆర్షవిజ్ఞాన ట్రస్టు హైదరాబాదు వారు ప్రచురించిన శ్రీ మద్రామాయణ గ్రంథము గీతికా రూపమున నేను రచించిన శ్రీరామ కథాసుధాలహరి అను గ్రంథమునకు మిక్కిలి తోడ్పడినది. వారికి నా హృదయపూర్వక నమస్కృతులు.

   అదే విధముగా టీకా తాత్పర్య సహితముగా వ్యాఖ్యానించిన ఆచార్య శ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడు గారికి నా వినయపూర్వక నమో వాకములు.

2. నా యీ రామకథాసుధాలహరిని తమ బ్రాంచీల కన్నింటికి బంపి ప్రజలకు అందజేయుచున్న "విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజ్ఞాన భవన్", హైదరాబాదు వారికి మిక్కిలి కృతజ్ఞుడను.

3. పది సంపుటాలుగా వెలువడిన యీ మహా గ్రంథమును, పుస్తక ప్రచురణలో సహకరించి సుందరముగా ప్రచురించిన శ్రీ డి.బి. ప్రింటర్సు విజయవాడ వారికి మిక్కిలి కృతజ్ఞతలు.

4. గ్రంథ రచనకు ప్రోత్సహించిన అనేక మంది మిత్రులకు వినయ పూర్వక నమస్కృతులు.

5. 3000 పుటలుగా పది సంపుటాలుగా రచించి ప్రచురించుట ఒక క్రతువు వంటిదని చెప్పవచ్చును. ఎన్ని అవాంతరాలు, అడ్డంకులు వచ్చినప్పటికి గ్రంథము పూర్తిగా ప్రచురించినందులకు పరబ్రహ్మ స్వరూపమైన శ్రీరామచంద్రునకు భక్తి పూర్వక నమస్కృతులు.

**- రచయిత.**

# దేవతావందనము

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

యోగివంద్య జ్ఞానజ్యోతి! సారస్వత స్వాదురూప!
మృదుపద సుందర భావన! కవికులజన వరదాయిని
విశ్వరూప విమలచరిత! అక్షర రూపిణి భారతి!
లలిత లలిత పదశోభిని! లాలిత సుందర భాషిణి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

ఉదయసంధ్య అరుణారుణ రేఖాంకిత సదయనేత్రి
కరుణామయి! కావ్యగేయ గాన కళా సుప్రసన్న!
అజరుద్రాచ్యుత పూజిత! ఆదిరూప! సుఖదాయిని!
బుధ సేవిత! ధవళవర్ణ! భూరికృపానంద లహరి!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!

లలితకళానందమూర్తి-విలసిత చైతన్యమూర్తి!
మానవ విజ్ఞాన భాండ మధుర సుధా కలశహస్త!
శివరూపిణి! ప్రణవనాద! తేజోమయి! దీపలేఖ!
అఖిల జీవకోటి హృదయ! ఆనందిని! శ్రీదుర్గా!

వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!
కామిత విద్యాప్రసన్న! కల్యాణీ! శుభదాయిని!
వాణీ! వీణాపాణీ! వందిత జన సకలలోక!

# మాతృ వందనము

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్న తల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

సకలసస్య శ్రీనిలయిని! సాధుమార్గ శుభదాయిని!
సర్వలోక జనపూజిత! సామగాన సురభాషిణి!
సకల ధర్మ సహజీవన సంస్కృతి విలసిత శోభిని!
పుణ్యకర్మ సువిరాజిత పూర్ణకలా తేజోమయి!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్న తల్లి! వందన మిదె ప్రియభారతి!

గంగ యమున గోదావరి కావేరీ కృష్ణవేణి!
ఉన్నత హిమ గిరి శిఖరము లొప్పిన శుభ కల్యాణీ!
అడుగడుగున పుణ్యభూము లమరు విమల సౌమ్యమూర్తి!
మధుర కావ్య గేయ శిల్ప మంజులతర శివగాయని!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్న తల్లి! వందన మిదె ప్రియభారతి!

సత్యము శివ సుందరములు సర్వదిశలు విలసిల్లిన
ఈ సుందర కర్మభూమి! ఈ పవిత్ర దివ్యధాత్రి!
నీ స్వరూప విలసనమే! నీ యనంత దర్శనమే!
అమ్మా! నీ యాశీస్సులు నలరి వేడుచుంటి నమ్మ!

ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!
ఓహో! నా కన్న తల్లి! వందన మిదె ప్రియభారతి!
ఓహో! నా జన్మభూమి! ఓహో! నా మాతృభూమి!

# వినయ వాక్యము

శ్రీ మద్రామాయణ మహాకావ్యము సంస్కృత భాషలో రచింపబడినది. రచించినది శ్రీ వాల్మీకులవారు, ఐదువేల సంవత్సరముల క్రిందట వ్రాయ బడినదని పెద్దలు జెప్పుదురు.

శ్రీ మద్రామాయణమును భారతీయ భాషలలో ప్రపంచ భాషలలో ఎందఱో మహానుభావులు ననువదించిరి. ఆంధ్రభాషలో గూడ గద్య పద్యగీతికా రూపాలలో ఎందఱో మహాకవులు గానము జేసిరి.

శ్రీ మద్రామాయణము భారతీయ సాహిత్యమునకును సంస్కృతికిని మూలము, ప్రతీక, రామాయణ కావ్యములోని నాయకుడైన శ్రీరామచంద్రుడు భారతీయులకు పరమ దైవము, పరబ్రహ్మ స్వరూపము. ఋషితుల్యుడు, ఆదర్శ మానవుడు.

తమ పుట్టినబిడ్డలకు తెలుగుదేశములో శ్రీరాముని పేరు పెట్టుకుందురు. రామ మందిరము లేని గ్రామము తెలుగుదేశములో లేదని చెప్పవచ్చును. అట్టి శ్రీరామ చరిత్రమును తెలుగులో, తేలిక భాషలో, సామాన్యులు పాడుకొనుటకు వీలుగా గీతికా రూపమున వ్రాయుటకు బూనుకొంటిని.

వృత్తిచేత ఉపాధ్యాయుడ నైనప్పటికినీ, సంస్కృతభాషా పరిజ్ఞానము స్వల్పమైనప్పటికీనీ, శ్రీరామునిపై గల భక్తి భావము చేతను, శ్రీ మద్రామాయణము నందు గల ప్రీతిభావముచేతను ఇట్టి మహత్కార్యమునకు బూనుకొంటిని. శ్రీరామచంద్రుడే నా చేత యీ కార్యమును జేయించుచుండెనని నా భావన.

**ఈగ్రంథములోని విశేషములు**

1. శ్రీ వాల్మీకి రామాయణము ననుసరించి, తేలిక భాషలో బాలుర కర్థమగు రీతిలో పాడుకొనుటకు వీలుగా రచించుటకు యత్నించితిని.
2. గీతికలుగా వ్రాయుటవలన స్వేచ్ఛానువాదమని భావింపవచ్చును. చేర్పులు, మార్పులు లేకుండా మూలముననుసరించి వ్రాయబడినది.
3. 37 సర్గములుగల ఉత్తరకాండము మొదటి భాగము దాదాపు 2000 చరణములతో పూర్తిచేయబడినది.

4. ఇందలి ఛందస్సు చతురస్రగతి, మధ్యాంతరమున యతిగాని ప్రాసగాని యుంచబడినది. పాడుకొనుటకు వీలుగా బాదాంతమున గురువు నుంపబడినది. నాలుగేసి పాదములు మూడు లేక రెండు ఒక గీతికగా గుది గ్రుచ్చబడినది.

5. ఏ సర్గమున కాసర్గ విడదీయబడి, విషయసూచిక జేర్చబడినది.

6. మూలమునందలి రెండు మూడు శ్లోకములను ఒక గీతికగా గూర్చబడినది.

7. మున్యాశ్రమములో మహర్షి వాల్మీకి దగ్గఱ నేర్చుకొని వీధి గాయకులుగా గానము జేసిన లవకుశులే నాకాదర్శము.

ఈ గ్రంథ రచనయందు భాషలో, భావనలో, అచ్చులో కథాగమన పుష్టిలో ఎన్నియెా దోషములుండవచ్చును. సహృదయులు దెలియబఱచిన సరిదిద్దుకొందును.

గీతికా రచనలోగాని, ప్రచురించుటలోగాని ఎట్టి యాటంకములు గలుగనందులకు శ్రీ రామచంద్రునకు నా నమోవాకములు, తక్కిన రామాయణకాండలను గూడ యిదే రీతిగా బ్రచురింపవలెనని నా యాకాంక్ష.

శ్రీ వాల్మీకులవారు శ్రీ మద్రామాయణ కావ్యమును రచించి ముద్దుగా కుశలవులచే బాడించిరి. అదే విధముగా విద్యార్థులు గూడ యీ రామాయణమును ముద్దుగా బఠించి గానము చేసి సంగీత సాహిత్య సంస్కృతులను సంపాదించుకొనవలెనని నా కోరిక.

శ్రీ రామాయణ గ్రంథము భారతీయులకు బూజనీయమైనది. ఆది కావ్యము. అట్టి గ్రంథము యొక్క ఆత్మీయతను, వాల్మీకులవారి కవితా హృదయమును, రామాయణములోని మహోజ్జ్వలములైన పాత్రలను స్పృశించుటయే గాక, రామాయణ గ్రంథమంతయు గీతికారూపమున వెలువరించుట నా పూర్వపుణ్య సుకృతమని భావించుచున్నాను. సహృదయులకు నమస్కారములు.

**-రచయిత.**

# విషయ సూచిక

సర్గ సంఖ్య — విషయము

10. రావణాదులు తపస్సుజేసి వరములు బొందుట.

11. రావణుడు లంకను నాక్రమించుట.

12. శూర్పణఖ వివాహము. రావణాదుల వివాహములు. ఇంద్రజిత్తు పుట్టుట.

13. రావణుడు నిర్మింపజేసిన శయన గృహములో కుంభకర్ణుడు శయనించుట. రావణుని దురాగతాలు కుబేరుడు దూతను బంపి, అతనికి ఉపదేశించుట. రావణుడు ఆ దూతను వధించుట.

14. రావణుడు యక్షులతో కలిసి వెళ్లి యక్షులపై యాక్రమణము జేయుట, యక్షులు ఓడిపోవుట.

15. మాణిభద్ర కుబేరులు ఓడిపోవుట, రావణుడు పుష్పకమును అపహరించుట.

16. నందీశ్వరుడు రావణుని శపించుట, రావణుడు పుష్పకమును అపహరించుట.

17. రావణుడు అవమానించుటచే బ్రహ్మర్షికుమార్తెయైన వేదవతి వానిని శపించి, అగ్నిలో ప్రవేశించుట. జన్మాంతరమునందు ఆమెయే సీతగా జన్మించుట.

18. రావణుడు మరుత్తుని జయించుట. ఇంద్రాది దేవతలు నెమిళ్లు మొదలైన వాటికి వరములను నిచ్చుట-

19. రావణుడు అనర్ణ్యుణ్ణి వధించుట, మరణానికి ముందు అతడు రావణుని శపించుట.

20. నారదుడు రావణునకు బోధించుట. అతని ప్రేరణ చేత రావణుడు యుద్ధమునకై యమలోకమునకు వెళ్లుట. ఆ విషయమునందు నారదుడు ఆలోచించుట.

21. రావణుడు యమలోకముపై ఆక్రమణము జేసి యముని సైన్యములను సంహరించుట.

22. యమ రావణుల మధ్య యుద్ధము జరుగుట. రావణుని జంపుటకై యెత్తిన యమదండమును యముడు బ్రహ్మదేవుని ఆజ్ఞచేత ఉపసంహరించుట రావణుడు విజయవంతుడై యమలోకమునుండి తిరిగి వెళ్లుట.

23. రావణుడు నివాతకవచులతో స్నేహము జేసికొని, కాలకేయులను వధించి వరుణ పుత్రులను నోడించుట.

ప్ర.స. 1. రావణుడు బలిచక్రవర్తి నివసించు అశ్మ నగరమునకు వెళ్లి యతనిని జూచి, మాటలాడుట.

ప్ర.స. 2. రావణుడు సూర్యుని జయించుటకై సూర్యలోకమునకు వెళ్లుట.

ప్ర.స. 3. రావణుడు చంద్రునితో యుద్ధానికి బయలుదేరి వెళ్లుచూ దారిలో స్వర్గలోకాలకు వెళ్లుచున్న కొందఱు పుణ్యాత్ములను జూచుట. మాంధాత కనబడగా అతనితో యుద్ధము జేయుట- పులస్త్య గాలవులు వచ్చి వారి యుద్ధమును నిలుపుట.

ప్ర.స. 4. రావణుడు చంద్ర లోకమునకు వెళ్లి చంద్రునితో యుద్ధము జేయుటకు ప్రారంభింపగా బ్రహ్మ దేవుడు వారించి, రావణునకు పారమేశ్వర మంత్రమును ఉపదేశించుట.

ప్ర.స.5. రావణుడు పశ్చిమ సముద్రములో నున్న ఒక ద్వీపమునకు వెళ్లుట. అచ్చట నున్న కపిలుని చేతిలో పరాభవము పొంది తిరిగి వచ్చుట.

24. రావణుడు అపహరించిన దేవతా కన్యాదులు, స్త్రీలు విలపించుట, వారు రావణునకు శాపము నిచ్చుట. రావణుడు శూర్పణఖను నోదార్చుట. ఆమెను ఖరునితో గూడ దండ కారణ్యమునకు బంపుట.

25. మేఘనాథుడు యజ్ఞమునుజేసి సఫలత్వమును బొందుట. విభీషణుడు పరస్త్రీ హరణము మంచిది కాదని రావణునకు బోధించుట- రావణుడు కుంభీనసిని యోదార్చి మధువుతో కలిసి దేవలోకమును ఆక్రమించుటకై వెళ్లుట.

26. రావణుడు రంభను బలాత్కరించుట. నలకూబరుడు రావణుని శపించుట.

27. రావణుడు సైన్యముతో ఇంద్రుని లోకమును ముట్టడించుట. ఇంద్రుడు సహాయము కొఱకు విష్ణువును నర్థింపగా 'భవిష్యత్తులో రావణుని చంపెదను' అని చెప్పి విష్ణువు దేవేంద్రుని వెనుకకు బంపుట, దేవతలకు, రాక్షసులకు యద్ధము జరుగుట- వసువు సుమాలిని సంహరించుట.

28. మేఘనాథ - జయంతులు యుద్ధము జేయుట. పులోముడు జయంతుని మఱియొక చోటునకు దీసికొని బోవుట- ఇంద్రుడు యుద్ధ రంగములో ప్రవేశించుట. రుద్రులు, మరుత్తులు రాక్షస సైన్యమును సంహరించుట- ఇంద్ర రావణుల సంగ్రామము.

29. రావణుడు దేవతల సైన్యమునుండి బైటకు బోవుట. అతనిని బట్టు కొనుటకై దేవతలు బ్రయత్నించుట, ఇంతలో మేఘనాథుడు మాయా ప్రయోగముజేత ఇంద్రుని బంధించి, విజయవంతుడై సైన్యముతో లంకకు ప్రయాణమగుట.

30. బ్రహ్మదేవుడు ఇంద్రజిత్తునకు వరమునిచ్చి యింద్రుని బంధనము నుండి విడిపించుట. ఇంద్రుడు పూర్వము జేసిన పాప కృత్యమును నతనికి గుర్తుజేసి, వైష్ణవ యాగము జేయుటకు సమ్మతినిచ్చుట, యజ్ఞమును పూర్తిజేసి, యింద్రుడు స్వర్గమునకు వెళ్లుట-

31. రావణుడు మాహిష్మతికి వెళ్లుట, అచ్చట కార్తవీర్యార్జునుని గానక మంత్రులతో కలిసి వింధ్యగిరి ప్రాంతమునందున్న నర్మదానదిలో స్నానము జేసి శివుని యారాధించుట.

32. కార్తవీర్యార్జునుడు భుజములజేత నర్మదా ప్రవాహమును నిలిపి వేయగా, రావణుడు శివలింగముపై పూజించిన పుష్పములన్నియు గొట్టుకొని పోవుట రావణాదులతో కార్తవీర్యార్జునుడు యుద్ధము జేయుట, రావణుని బంధించి యతడు తన నగరమునకు బయలుదేరివెళ్లుట.

33. పులస్త్యుడు వచ్చి రావణుని బంధనము నుండి-విడిపించుట.

34. రావణుడు వాలి నుండి పరాభవమును బొంది, యతనితో మైత్రి జేసికొనుట.

35. రాముడు ప్రశ్నింపగా అగస్త్యుడు హనుమంతుని జన్మ పరాక్రమాదులను వర్ణించి చెప్పుట.

36. బ్రహ్మాది దేవతలు హనుమంతుని మఱల జీవింపజేసి, వరములు నిచ్చుట. వాయువు హనుమంతుని దీసికొని బోవుట- ఋషుల శాపము జేత హనుమంతుడు తన బలమును మఱచిపోవుట, నేను చేయబోవు యజ్ఞమునకు రావలెను. అని ప్రార్థించి, రాముడు అగస్త్యాదులను బంపవేయుట.

37. రాముడు సదస్యులతో గూడి రాజసభను అలంకరించుట.

ప్ర.స. 1. బ్రహ్మదేవుని కన్నీటి నుండి ఋక్ష రజస్సు అను వానరుడు బుట్టుట, ఒక సరస్సులో మునుగగానే అతడు స్త్రీయగుట, ఆమెను జూచి మోహించిన ఇంద్ర సూర్యుల ద్వారా వాలీ సుగ్రీవులు బుట్టుట. ఋక్ష రజస్సును బ్రహ్మదేవుడు కిష్కింధలో వానర రాజుగా జేయుట.

ప్ర.స. 2. రావణుడు సనత్కుమారుని నుండి శ్రీ మహావిష్ణువునకు గల మహాత్మ్యమును తెలిసికొని యతని చేతిలో మరణము తనకెట్లు లభించునాయని ఆలోచించుట.

ప్ర.స. 3. సనత్కుమారుడు రావణునకు శ్రీ మహావిష్ణువు గొప్ప తనమును వర్ణించి చెప్పి, అతడు రాముడుగాను, లక్ష్మి సీతగాను నవతరింప గలరని దెలుపుట.

ప్ర.స. 4. అగస్త్యుడు నారదుడు జెప్పినట్లుగా ఈ కథను గొనసాగించుట.

ప్ర.స. 5. నారదుడు చెప్పగా శ్వేతద్వీపమును గూర్చి విని రావణుడు అచటి వారితో యుద్ధము జేయుటకై అచ్చట స్త్రీల చేతిలో అవమానమును బొందుట, సనత్కుమారుడు రావణునకు శ్రీ మహావిష్ణువు ప్రభావ మును దెలుపుట. అతని చేతిలో మరణింపవలెనని రావణుడు నిశ్చయించుకొనుట.

# నివేదన

శ్రీ రామాయణ పుణ్యగథను దనచిత్తము హర్షము రంజిలగా!
మధుర పదములను మధుర భావముల మల్లెమాలగా నలరింపన్!
శ్రీ గణేశ్వరుని జిన్మయభక్తిని జిత్తము బొంగగ స్మరియింతున్!
శ్రీ భారతి గిరిజామ తల్లులను సిద్ధిని గోరుచు బ్రార్థింతున్!

ఆదికవులు శ్రీ వాల్మీకుల కిదె యలరి జేయుదును వందనముల్!
పూర్వకవులకును బుణ్యమతులకును బూర్ణ భక్తినే నర్చింతున్!
రామకథను వ్రాసిన ఘనులకు నిదె రమ్య నమస్కృతు లర్పింతున్!
సీతారాముల భజించువారిని జేరికొలుతు నే నడుగడుగున్!

ఆ సేతు హిమాచల పర్యంతంబును నలరెడి భారతదేశమునా!
భారతీయులకు బరమాదర్శము భవ్య రామ సీతాకథయే!
వారి మార్గమే యాదర్శము మఱి వారి చరిత దగ్దర్శనము!
వారు నడిచినా మధుర మార్గమే వన్నెదెచ్చు జీవనధర్మం!

చిన్ని మాటలను చిఱుత బాలురకు తీయని తీయన రాగములన్!
తెలియజేయగను బూనుకుంటినీ తేనె లొలికెడి గీతికలన్!
రామాయణమది మహాసముద్రము రంజిలు హిమగిరి శిఖరమదీ!
తేటతెలుగులో మహాత్ములెందఱో తెలియగ వ్రాసిరి విశదముగా!

అందులకే నే నఖిల దేవతల యారాధనలను జేసితినీ!
వదముల నిమ్మని భావము లిమ్మని భారతాంబ నర్థించితినీ!
ఇష్టదైవమగు నిందిరారమణు నిహపరమిచ్చెడి రఘుపతినీ!
భక్తి భావమున శిరమును మోడ్చితి భావమునందున నిలువమనీ!

ఎట్టి పుణ్యమును జేసితినో మఱి యెట్టి సుకర్మలు జేసితినో?
గట్టిగ యా శ్రీరాముని చరితము బట్టువడెను నా మనసునకున్!
మధురాక్షరములు మధురపదములై మంజుల గీతముగా వరుసన్!
లయతాళములను నృత్యము చేసెను లలితరాగ మధురోక్తులతోన్!

అల వాల్మీకులు వ్రాసిన దానిని యా శ్రీరాముని సభయందున్!
వీధిగాయకులుగా కుశలవులును విమలగానమును జేసినదీ!
ఆ పాటను నే దెనుగున బాడితి నమరగానమును జేయంగన్!
తెలుగుబాసలో తేటతెనుగులో దెలుగు బాలకులు బాడుటకున్!

కఠిన పదములకు దూరముగా నే కఠిన భావముల జొరనీకన్!
బాలకులగు నా కుశిలవులనే భవ్యాదర్శముగా గొనుచున్!
శ్రీరాముని మహనీయ చరితమును జేయగ బూనితి గేయముగా!
బాలురు వృద్ధులు బాడుకొనుటకై భవ్యరాగలయ తాళములన్!

భారతదేశమునం దణువణువును భవ్య రామ శుభచరితంబున్!
పాడు కొనును శ్రీరామరామ యని భవ్య రాగలయ తాళములన్!
గాలికదలికల వినిపించును నా కమ్మని రాముని నిస్వనముల్!
అట్టి కథను నే రచింప బూనితి ఎట్టి సుకృతినొ యీ జన్మన్!

సిద్ధి వినాయక! చిత్తము రంజిల శిల్పి వోలె
శ్రీ రామయణ చిత్రమందిరము జేయుచుంటి భక్తిని రక్తిన్!
ఒక్కొక్క చరణము నందియిమ్ము నే మక్కువ తోడను నిర్మింతున్!
మధురాక్షరములు దుధురభావములు మానసంబు జిందులు ద్రొక్కన్!

కన్నతల్లివని కలలు యందునను గాంచుదుకద! భారతి! వాణీ!
అంధకారమును దొలగజేసి నన్నాదరింపు వీణాపాణి!
హృదయకమలమున నిడుగిడి దయతో హృది వెన్నెలను గావించీ!
కావ్యకన్యకను గమనీయముగా కాంచన కుసుమము గావింపూ!



**శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (మొదటి సంపుటము)**

# ప్రథమ సర్గము

(శ్రీరాముని సభకు మహర్షులు వచ్చుట - వారితో శ్రీరాముడు సంభాషించుట - వారిని కొన్ని విషయములను ప్రశ్నించుట)

శ్రీరాముడు రాజ్యమును బొంది మఱి స్వీకరించె పరిపాలనమున్,
రాక్షసవధ జేసిన తదుపరి యా రఘుకుల సీతారమణుండున్
అట్టి సమయమున యఖిల ఋషిమునులు నభినందింపగ శ్రీరామున్
అయోధ్యనగరికి యరుగుదెంచిరీ యాశీస్సులతో హర్షమునన్! 1

పూర్వదిశను వసియించు మునులునూ పుణ్యతపసి యా కౌశికుడున్
అవక్రితుడును గార్గ్యుండును మఱి యలగాలవుడును విచ్చేసెన్,
మేధాతిథి పుత్రుండగు కణ్వుడు మేదుర దీవెన లందింపన్
ఆప్యాయతతో నరుగుదెంచిరీ యభినందింపగ శ్రీరామున్! 2

అటుపిమ్మట దక్షిణ దిశయందున యాశ్రయమందిన ఋషిమునులున్
ఆత్రేయుండును, నముచి, ప్రముచియును అగస్త్యుండునూ యత్రియునూ,
పూజ్యుడైన సుముఖుండు వచ్చెనూ పుణ్యవ్రతుడు విముఖుడు వచ్చెన్,
అగస్త్య సహితులుగా విచ్చేసిరి యగ్నులవలె రాముని కడకున్! 3

పశ్చిమదిక్కున యాశ్రయించినా పరమ ఋషులు తమ శిష్యులలో
కవషి, వృషంగుడు ధౌమ్యుడు వచ్చిరి కౌషేయుండను మహర్షియున్,
వేద మంత్రములు జదువుచు వచ్చిరి విమలమైన యాశీస్సులతో
రాజ్యభారమును స్వీకరించినా రాముని దీవింపగవేగన్! 4

ప్రతి నిత్యము నుత్తర దిశ యందున బరగ వసించెడి సప్త ఋషుల్
వసిష్ఠుండు, కశ్యపుడు, నత్రియును, విశ్వామిత్రుడు, గౌతముడున్
జమదగ్నియు మఱి భరద్వాజుడును సద్గుణవంతుడు రామునికిన్
అభినందములు నందజేయగా నాప్యాయత మది జిగురొత్తన్! 5, 6

అగ్నులతో సరిసమానమైనా యమల తేజమును గలవాడున్,
అఖిల వేదవేదాంగములందున యమలపండితులు నగువారున్,

నానాశాస్త్ర విశారదులైనా నయముగ పండితులగు వారున్
రాముని నివేశమును జేరిరి మఱి రమ్య ద్వారపాలుర తోడన్
రామచంద్రునకు దెలుపుట కొఱకును రహి నిలిచిరి యగ్నులవోలెన్! 7

మునిసత్తముడును ధర్మాత్ముండును మోదముతో నా యగస్త్యుడున్
ద్వారపాలకునితో నిటు బలికెను త్వరితగతిని రాముని తోడన్,
'ఋషులమైన తా మొచ్చినామనుచు రూఢిగ దెలుపుము రామునకున్'
అనుచు బలికె నా యగస్త్యుండునూ యలరిమునులు మది సంతసిలన్! 8

ద్వారపాలకుడు యగస్త్య పలుకుల యలరుచు విని వేగముతోడన్,
వినయముతోడను నమస్కరించుచు వేగముగా బరుగెత్తు నటుల్
మహాత్ముడగు శ్రీరాముని కడకును కూరిమి కరములు జోడించీ,
మునులు వచ్చినా వార్తను దెలుపగ మోదముతోని సమీపించీ! 9

నయమును నింగిత మనోభావములు నయముగ దెలిసిన వాడు మఱిన్,
మంచి నడవడిక గలవాడును మఱి యంచితముగ దక్షుండు మఱిన్,
ధైర్య సమన్వితమైనవాడును, ద్వారపాలకుడు వినయమునన్,
పూర్ణచంద్ర సమ ద్యుతి గలవాడును పురుషోత్తముడగు రామునకున్
అగస్త్య మహర్షి యాగమనంబును నలరి దెలిపె ప్రియ వాక్యములన్! 10, 11

బాల సూర్యసమ ప్రభలు గలిగినా భవ్య ఋషులు వచ్చిన వార్తన్
విని శ్రీరాముడు సంతోషముతో విమలానందము మది గలుగన్,
తిరిగి ద్వారపాలకుతో బలికెను తీయని కంఠ ధ్వనితోడన్
యథా సుఖముగా ప్రవేశపెట్టుము! నాదర సత్కారంబులతో! 12

వచ్చిన మునులును గాంచి రాముడును మచ్చిక ప్రత్యుత్థానముతో
చేయబడిన దోసిలి గలవాడగుచును స్థిరనమస్కృతిని జేయుచునూ,
ఆదర పూర్వముగా వృషభంబును సర్పణ జేయుచు వారలకున్
అర్ఘ్యపాద్యములతో నర్చించెను నఖిల మునులు సంతసమందన్! 13

రాముడు ఋషులకు నమస్కరించుచు రమ్య నియమ వంతుండగుచున్,
ఆసనములయం దధిష్ఠింపమని యలరికోరె నా ఋషిమునులన్,
కాంచన చిత్రిత మగు నాసనముల గడుశోభావంతుడు నైనా,
లోపల కుశముల నుంచి నట్టివియును లోలత కృష్ణాజినములతో,

కూడినట్టి యా యాసనములలో కూరిమి ఋషి పుంగవులు మఱిన్,
యథార్హ్యముగనూ యధిష్ఠించిరీ యలరుచు శ్రీరాముని గనుచున్! 14, 15

రాముని చేతను కుశలమడిగినా రమ్యభావమున శిష్యులునూ
పరివారమును ముందు నడిచెడీ బరగ వేదవేత్తలు నైనా,
మహాఋషులు శ్రీరాముని తోడను మానుగ బలికిరి యీ రీతిన్,
'మహాబాహువులు గలవాడా! ఓ రఘునందన! సీతారమణా!
అన్ని విధములను క్షేమము మేమును ననుచు బలికి రా ఋషిమునులున్! 16

'శత్రువులందఱ సంహరించి మఱి శాంతముతో నుండిన నిన్నున్
గనుచుంటిమి గద! భాగ్యవశంబున కఠిన కర్కశుని రావణునీ,
లోక రావణుండగు రావణునీ లోలత హత మొనరించితివీ,
శాంతిని బొందెను ఋషిముని గణములు భీతి దొలగె లోకంబులకున్! 17

'పుత్రపౌత్రుడగు నా రావణునీ భూరిబలుడు నా రాక్షసునీ
పరిమార్చుట యది నీకొక భారము బరిశీలింపగ కాదుగదా!
ధనుస్సు బట్టిన త్రైలోక్యంబులు ధన్యత జయింప గలుగుదువూ!
సందియ మింతయు లేదు సుమా! మఱి సందేహము నింతయు లేదూ! 18

'భాగ్యవశంబున నీ చేతను మఱి బలవంతుండగు రావణుడున్
హతమొనరింపగ బడెను గదా మఱి యఖిల లోకములు సుఖమందెన్,
విజయవంతుడవునై యయోధ్యలో విమల జానకీ సహితుడవై
యున్న నిన్ను గనుచున్నారముగద! యెన్నగ యిది మా భాగ్యమునూ! 19

'ధర్మాత్ముడవగు శ్రీ రఘురామా! ధర్మహితంబును జేసిన యా
సోదరుడగు లక్ష్మణుని తోడనూ సుమతులు నగు దల్లుల తోడన్,
భాతృ సహితముగ నిన్ను గాంచుచును భవ్యభాగ్యవశమున చేతన్
కన్నులార నినుగాంచుచుంటిమీ, కమనీయంబగు పాలనమున్! 20

అదృష్టవశమున ప్రహస్తుండునూ అల విరుపాక్షుడు వికటుండున్
మహోదరుండును దుర్ధర్షుండును మఱి యకంపనుడు గడతేరెన్!
ఈ రాక్షసులందఱు మరణించిరి యిల జరిగిన సంగ్రామములో,
శాంతి గూర్చితివి సకల లోకముల కాంతి గూర్చితివి జగములకున్! 21

'ఎవని ప్రమాణము కంటె విపులమగు నవని లేదో యా ప్రమాణమున్
గలిగినట్టి యా కుంభకర్ణుడును గతించె భీకర యుద్ధమునన్
నీ బాణంబులచే మృతిజెందెను నిఖిల వీరులును కనుగొనగన్
దేవతలందఱు పూవులు జల్లిరి పూనిక నీపై మోదమునన్! 22

భాగ్యవశంబున శ్రీరఘురామా! బరగ రాక్షసులు నైనట్టీ
త్రిశిరస్సు మఱి యతికాయుండును, దేవాంతకుడు, నరాంతకుడున్,
మహాపరాక్రమ విక్రములైనా యా నిశాచరులు యుద్ధమునన్
సంహరించితివి నీ బాణములను సకలలోకములు సంతసిలన్! 23

రఘురామా! విను కుంభకర్ణునీ రణ విజయులునగు కుమారులున్
భయంకరంబగు దర్శనములు గల బలవంతులునగు రణ వీరుల్
కుంభ నికుంభులు మరణించిరి గద! కూరిమి నీతో యుద్ధమునన్
నమస్సుమాంజలు లర్పించిరిగద! నయముగ దేవతలును గూడన్! 24

ప్రళయకాలమున యమోపమానులు బన్నుగ యుద్ధోన్మత్తులునూ
మత్తుడు మఱి బలవంతుడునైనా మహా యజ్ఞకోపుడు గూడన్
ధూమ్రాక్షుండను నామము గలిగిన దుష్ట రాక్షసుడు గూడ మఱిన్
భయంకరంబగు కదనము జేయుచు భాగ్యవశము జేతను వీరున్
భయంకరంబగు నీ బాణములను బరగ ధరణి కొరిగిరి వేగన్! 25, 26

దివి దేవతలకు నవధ్యుడైనా యలరు రాక్షసేంద్రుండైనా
అల రావణుతో ద్వంద్వ యుద్ధమున యలసట యింతయు లేకుండన్
భాగ్యవశంబున జయించితివికద! బరగ దేవతలు దిలకింపన్
విజయలక్ష్మినీ జేకొంటివి గద! వీరులందఱును దిలకింపన్! 27

సంగ్రామంబున రావణు జంపుట సరి పరాక్రమము గాదేమో!
ప్రత్యక్షముగా కనబడువారికి బరగ వధించుటయగును సుమా!
ద్వంద్వయుద్ధమున యింద్రజిత్తుతో దరికొని విజయమునందితివీ,
మాయా యుద్ధము జేయువానినీ మరణింపగ జేసెను గాదా!
నీ తమ్ముడు లక్ష్మణుని చేతనూ నీరసించె యల రావణియున్! 28

మహాబాహువులు గలవాడా! ఓ మహా వీరుడా! శ్రీరామా!
భాగ్యవశంబున కాలయమునివలె పరుగుల దీయుచు వచ్చెడి యా,

ఇంద్రజిత్తునకు ముక్తుడవైతివి సాంద్రబలంబున సమరమునన్
అదృష్టవశమున విజయమునందీ యలరుచుంటివీ శ్రీరామా! 29

మహామాయనూ ధరించువాడును మానుగ లోకమునందుననూ
సర్వభూతములకును నవధ్యుడు చంపగ శక్యము కాదతనిన్
ఇంద్రజిత్తునూ చంపిన వార్తను సాంద్రముగా వినియును మేమున్
అభినందనములు జేయుచుంటిమీ యతులమైన సంతోషముతో! 30

రఘు వంశీయుల హేకులవర్ధన! రామా! మా భాగ్యము జేతన్
కామరూపమును గల వారును మఱి కడు పరాక్రమము గలవారున్
బహు రాక్షసులను సంహరించితివి బరగ నీదు విక్రమముననూ
అభివందనములు దెలుపుచుంటిమీ! ఆనందంబును బులకింపన్! 31

మహావీర! ఓ అమిత్రకర్శన! మానుగ లోకమునంతటికిన్,
పుణ్యప్రదమును, సామ్యమైన యా భూరికృపను మఱి జూపుచునూ,
అభయ దక్షిణను నిచ్చిలోకమున కార్తిబాపితివి శ్రీరామా!
అదృష్టవశమున విజయ దీపికను నలరుచునుంటివీ రఘురామా! 32

భావితాత్ములగు మునుల వచనముల బన్నుగ విని శ్రీరాముడునూ
ఆశ్చర్యంబున మునిగి దేలుచును నలరు కరములను జోడించీ,
నమస్కరించుచు బలికె నిట్టులను రమ్యభావములు దొలుకాడన్
ప్రశ్నార్థంబుగ బలికె మునులతో ప్రవిమల తేజము వికసింపన్! 33

మహాపరాక్రమమును గలిగిన యా మహా కుంభకర్ణుని మఱియున్
నిశాచరుండగు రావణాసురుని నిశితముగా లెక్కింపకనూ!
అతిక్రమించుచు నింద్రజిత్తునూ యలరి ప్రశంసను జేయుటయున్
ఎందులకని నా మది సంశయమును కుందజేయుడో మునులారా! 34

మహాపరాక్రమ వంతులైన యా మహోదరుని మఱి ప్రహస్తునీ
విరూపాక్షునీ మత్తోన్మత్తుల వికృత దుర్ధర్షులు నైనా
దేవాంతక మఱి నరాంతకులనూ తేలిక భావముననుగాంచీ,
ఇంద్రజిత్తునీ ప్రశంసించుటది సాంద్రముగా విన గోరెదనూ! 35

మహావీరుడగు నతికాయుని మఱి యలరాక్షసుడగు త్రిశిరసున్
రాక్షసుడగు ధూమ్రాక్షుని గూడను రహి దిరస్కరించుచు వారిన్
అతిక్రమించుచు నింద్రజిత్తునూ యలరి పొగడుటయు యెందులకూ?
తెలియజెప్పుడో మునులారా! మఱి తేటతెల్లముగ విశదముగన్! 36

అతని పరాక్రమ మది యెట్టిదియో యాతని బలమది యెట్టిదియో,
పరాక్రమంబది యెట్టిదియో మఱి బాహుబలం బది యెట్టిదియో,
ఏ కారణముల చేత యింద్రజితు నిలలో యా రావణు కంటెన్
అధికుడగుచునూ యున్నవాడొకో! యలరి దెలుపుడో మునులారా! 37

వినుటకు నాకది యోగ్యమైనచో వివరింపుడు ఓ ఋషులారా!
రహస్యమైనది కానిచో నదియు రమ్యముగా వినిపింపు డికన్
వినవలెనని నే గోరుచుంటినీ విశదముగా నా యింద్రజితున్
ఆజ్ఞా పింపగలేను మిమ్ములను నతి వినయంబుగ బ్రార్థింతున్! 38

ఇంద్రజిత్తు దేవేంద్రుని గూడను నింపుగ రణమున యోడించెన్,
ఘనవరంబులను యెటులను బొందెను ఘన తపస్సు లెటులను జేసెన్?
తండ్రికంటె యా కుమారుడెట్టుల సాంద్రదీప్తిచే వర్ధిల్లెన్?
తండ్రియైన యా రావణుడెట్టుల తన తనయునితో సరికాదూ? 39

ఓ మునీంద్రుడా! యొప్పగ దెలుపుము ఒలకబోయుమా రహస్యమున్?
ఆ రాక్షసుడును దండ్రి కంటెనూ యలరుచు మించెను నధికుడునై?
మహా యుద్ధమున జయింపగలిగెను మానుగ దేవేంద్రుని గూడన్,
వరము లెటుల పొందెను మఱి తెలుపుడు వరుసను దేవతలను గొలిచీ
అతనికి సంబంధించిన విషయము లన్ని దెలుపుడో! మునులారా? 40

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
ప్రథమసర్గము సమాప్తము



### శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# రెండవ సర్గము

(అగస్త్యుడు పులస్త్యుని గుణములను, తపస్సును వర్ణించి చెప్పి, అతనికి విశ్రవస్సు జన్మించుటను చెప్పుట)

మహాత్ముడగు శ్రీరాముని వచనము మానుగ విని యా అగస్త్యుడున్
మహా తేజమును గలిగిన యాతడు మర్మముగా నిటులను బలికెన్! 1

రామా వినుమా! యింద్రజిత్తుకథ రమ్యతేజమును బలములనూ,
ఇంద్రజిత్తు నెందఱి శత్రువులను సాంద్ర పరాక్రమముల తోడన్
వధియించెనొ మఱి పరాజితులనుగా వరుసగ జేసెనొ లోకములన్
వధింప శక్యముగాని వాడుగా వన్నెలు జిందెనొ ధరయందున్
అట్టివాని చరితను తేజస్సును గట్టి బలంబును దెలిపెదనూ! 2

రాఘవ! ముందుగ వినుమా దెలివెద రావణు కులమును జన్మమునూ
ఆతడు పొందిన వరదానములను నాతడు జేసిన తపములనూ!
ఆతని పూర్వుల వృత్తాంతంబును నలరునట్టి తల్లిదండ్రులనూ!
వివరముగా విశదీకరించెదను విలక్షణంబగు చరితంబున్! 3

రామా! పూర్వము కృతయుగమందున రహి ప్రజాపతికి కుమారుడున్
బ్రహ్మదేవునికి పుత్రుడు ప్రభువును బ్రహ్మదేవుడే యనునటులన్
పులస్త్యుండు అను పేరు గలిగినా పుణ్యవంతుడగు బ్రహ్మర్షి
ధరణీతలమున వర్ధిలుచుండెను ధర్మ కార్యములు జేయుచునూ! 4

అతని ధర్మము శీలములకు మఱి యనుసంబంధించిన గుణముల్
వర్ణింపగ మఱి శక్యము గానివి వరుస పేర్కొనగ రానివియున్,
అతనిని యాతని పేరు చేత మఱి యల ప్రజాపతికి పుత్రుడనీ
తెలుపగవలె మఱి తేట తెల్లముగ తేజ మహస్సుల గనుగొనుచున్! 5

ప్రజాపతికి సుతుడగుటచేతనే యల దేవతలకు నిష్టుండై
ఘనమగు బుద్ధియు గలవాడగుటను ఘనమగు సుగుణంబులచేతన్
సమస్త లోకములకు నిష్టుండై సరస గుణములను శోభిలుచున్
కర్మిష్ఠుండై వర్ధిలుచుండెను గడునిష్ఠను నీ లోకమునన్! 6

ఆ మహామునియు ధర్మమునందున యల ధర్మాచరణమునందున్
అసక్తియుగల వాడు నగుటయును నలరు మేటు పర్వతమందున్
పార్శ్వమందు గల దొక యాశ్రమమును బన్నుగ ఋషి మునులను గూడీ
తృణ బింద్వాశ్రమమును జేరెను మటి దీరుగ వశియించెను నందున్! 7

ధర్మాత్ముండగు నా పులస్త్యుడును దగ స్వాధ్యాయము నందుననూ
ఇంద్రియముల నేకాగ్రత జేసీ విమల తపస్సుల జేసె మటిన్
కన్యకామణులు కలకల స్వనముల కమనీయముగా నాశ్రమమున్
జేరి విఘ్నములు జేయుచుండిరీ స్థిర మానసుడగు పులస్త్యునీ! 8

ఋషి కన్యకలును, నాగ కన్యకలు, రూప వైభవము తులకింపన్,
నాగకన్యకలు, రమ్యాప్సరసలు, రమ్య దేవతా కన్యకలున్
ఆటపాటలను క్రీడించుచునూ అందమైన శృంగారమునన్
ఆ ప్రదేశమును వచ్చుచుండిరీ యలరుచు నృత్యంబులతోడన్! 9

ఆ వనమందున యన్ని ఋతువులను ననుభవించుటకు యోగ్యంబై
ఫలపుష్పంబుల సుందరమగుటను బన్నుగ సుగంధ పుష్పములన్
విరబూయుటచే నా కన్యకలును విమల హర్షమున విహరింపన్
ఆ వనమునకును జనుచుండిరి మటి యలరు ప్రకృతిని దిలకింపన్! 10

బ్రాహ్మణుడగు నా పులస్త్యుడెచ్చట బరగ తపస్సుల జేసెడినో
ఆ ప్రదేశమతి సుందరమగుటను ననిందితులునగు కన్యకలున్
గానముజేయుచు, నృత్యము జేయుచు కమ్మని అభినయముల తోడన్
తపసును జేసెడి యామహామునికి దగ విఘ్నంబులు జేసి రటన్! 11

అటుపిమ్మట యా రుష్టుడైన ముని చటుల కోపమున మండిపడీ
ఈ విధముగ దా శాపమునిచ్చెను వికటముగా నా కన్యలకున్
ఏ కన్యక నా దర్శనంబునకు నిచట విహారము జేసెడినో
కంటబడిన కన్యక గర్భంబును కమనీయముగా ధరియించున్! 12

అనుచు ముని బలుగ నా కన్యకలును నా ముని పలికిన పలుకు వినీ
బ్రాహ్మణ శాప భయంబుచేత మటి భయ బీతాత్ములునై మిగులన్!

ఆ ప్రదేశమును వెళ్లుట మానిరి యా ముని జూచుటయును మానీ
ఆటపాటలను నా ప్రదేశమున యలరి జేయుటయు మానిరటన్! 13

కన్యకలందఱు వినిరి గాని మఱి కఠినమైన యాముని పలుకుల్
రాజ ఋషియునగు తృణబిందువునకు రమణీయంబగు సుతగలదూ!
ఆ ముని పలుకులు వినలేదు గదా! యా ప్రమాదమును గన లేదూ!
ఆశ్రమ పదమును జేరి వనములో నతినిర్భయముగ విహరించెన్! 14

ముని శాపంబును విని కన్యకలును మోదము విడి భీతాత్మలునై
ఆ వనంబునకు వచ్చుట మానిరి యల పప్రమాదమును వచ్చుననీ
తృణ బిందువు సుత కీ ప్రమాదమును తెలియక వచ్చిన దగుట మఱిన్
ఏ సఖి యచటకు వచ్చినట్లుగా నింపుగ గనజాలక పోయెన్
ఆ సమయంబున మహా తేజుడును నలరి తపస్సున పవిత్రుడై
స్వాధ్యాయాధ్యయనముల జేయుచును తన్మయుడై యుండెనునపుడున్! 15, 16

ఆ వేద ధ్వని విని యా కన్యక యా తపో మహానిధియైనా
ఆ పులస్త్యునీ గాంచి కన్యకయు యమల గర్భమును ధరియించెన్
స్పష్టమైన యాగర్భ చిహ్నములు గనబడుచుండెను కన్యకలో
పాండు దేహమును గలదిగ యాయెను బరగ యుదరమును బరువాయెన్! 17

తనలో గలిగిన మార్పును కనుగొని తగదోసంబును గ్రహియించి
సముద్విగ్న మానసయైకన్యక స్వగతముగా భావించె మదిన్
ఇదేమి? నా కిట్లేల జరిగినది? ఎన్నడులేని విధంబుననూ!
అని భావించుచు తండ్రి యాశ్రమము నలరి జేరి వసియించె నటన్! 18

అటుపిమ్మట యా తృణబిందువునూ యలరి గాంచి తన కన్యకనూ
అసదృశంబుగా నుంటివి పుత్రీ! యందమైన నీ శరీరమున్
నుండవలసినా విధముగ లేవు! నూహింపగ లేకను యుంటిన్
ఇది యేమమ్మా? ఏమి జరిగినది? వివరింపు మనుచు ప్రశ్నించెన్! 19

అంతట ! కన్యక దీనురాలగుచు నంజలి ఘటించి వినయముతో,
తపో ధనుండును రాజఋషియునగు దన పితృపాదున కిటు లనియెన్,
తండ్రీ! యే కారణము జేత మఱి తగ నా రూపము నిటులాయెన్?
నాకును తెలియదు! ఆ కారణమును నరయులే ననుచు నిటు బలికెన్! 20

నేను పూర్వమొక దినమున చెలులను పొలుపుగ వెదుకుచు నొంటరిగా
భావితాత్ముడగు మహర్షియైనా బరగ యగస్త్యుని దివ్యమునౌ
ఆశ్రమస్థానము గూర్చి బోయితిని యలరుచు ప్రకృతి కనుగొనుచున్
ఆటల పాటల నాడగోరుచును నటుబోయితి నే నొంటరిగా! 21

ఆ ప్రదేశమును బోయిచూడగా నటలేరుగదా యొక సఖియున్
సఖీజనంబును నన్వేషించితి చక్కని యా వనమందుననూ
అంతలోను నా రూపము నందెను నాశ్చర్యంబును బొందితినీ!
భయము వలన నే నిట కొచ్చితినీ భద్రంబగునని మది దలచీ! 22

జ్యోతి ప్రభయు గలిగిన రాజర్షియును జ్యోతిని దర్శించుచు మదినీ
తృణ బిందు వపుడు ధ్యానముదోడను దివ్య దృష్టితో కనుగొనగా
ఆ ఋషి శాపము వలన గలిగెనని యంత రంగమున గ్రహియించెన్
సుత తప్పిద మేమియు లేదనుచును తన మది యందున భావించెన్! 23

పవిత్రమగు మనసును గలిగిన యా బరగ మహర్షి శాపమనీ,
తెలిసికొనుచు తన కుమార్తెనప్పుడు దీరుగ పులస్త్య నొద్దకునూ,
వెంట దీసికొనిపోయి పులస్త్యుని వేయి విధంబుల ప్రార్థించీ
ఆ మునితోడను నిటులను బలికెను నా తృణ బిందువు వినయముతో! 24

పూజ్యుడవగు ఓ ఋషి పుంగవ విను! పూర్ణభావమున దయగనుమా
ఈ కన్యామణి నా కుమార్తె సుమ! యింపుగ సుగుణంబుల చేతన్
అలంకరింపగ బడినది వినుమా! యమలమైన సహనము గలదీ!
తనకు తానుగా వచ్చిన భిక్షను దయతో గైకొను ఋషివర్యా! 25

తపశ్చరణ యుక్తుడవు నీవుసుమ! సకలేంద్రియముల శ్రమించుచున్
అలసిపోయితివి! అలరి దాసిగా అన్ని పనులు జేయుట యందున్
శుశ్రూషలు చేయుట యందే మతి సురుచిర యాసక్తిని గలిగీ
యుండగలదు, సందేహము లేదూ! పండిన ధాన్యపు రాశి వలెన్! 26

ధార్మికుడగు తృణ బిందువు బలికిన దగ విని యా బ్రాహ్మణుడును మతిన్
ఆ కన్యను దా స్వీకరింపగా ఆత్మను దలచుచు నాతండున్

ఆతృణ బిందువు తోని బలికెనూ యబ్బుర మింతయు లేకుండన్
తప్పక యటులే జరుగుగాత యని దగ బలికెను నా బ్రాహ్మణుడున్! 27

తృణ బిందువు తన కుమార్తె నప్పుడు దీరుగ నాతనికిచ్చి మఱిన్
తన యాశ్రమమును దరలిపోయెనూ తత్తర పాటును లేకుండన్
ఆ కన్యయునూ తన గుణములచే తగ సంతసమును గూర్చునదై
ఆపులస్త్యు నాశ్రమమున నుండెను నలరుచు పత్నిగ సేవలతో! 28

ఆ మునిశ్రేష్ఠుడు నామె శీలమును నామె నడవడిక గమనించీ
సంతోషించెను సాధ్విగ గనుచును సంప్రీతుండై యుండె నటన్
మహా తేజుడగు నా పులస్త్యుడును మానుగ నా సాధ్వీ మణితో
ప్రేమ మీర యీ వచనము బలికెను రమణీ! యనుచును నొకనాడున్! 29

సుశ్రోణీ ! నీగుణ సంపదకును సురుచిరమగు శుశ్రూషలకున్
పరితుష్టుడనైతిని ఓ రమణీ పల్లవించె నామది ప్రీతిన్
ఆ కారణమున యాత్మసముండగు నలరు పుత్రునీ దయజేతున్
ఉభయ వంశముల నుద్ధరించునూ యుర్విని పౌలస్త్యుం డనుచున్! 30

ఇచట నేను వేదాధ్యయనంబును నింపుగ జరుపుచు నుండగనూ
వింటివిగద! శ్రద్ధాభక్తులనూ చంటిపాపవలె మనసుంచీ
విశ్రవసుండను నామముగలుగును వినుతికెక్కు లోకమునందున్
సందియమింతయు లేదు సఖీ! మఱి సద్గుణవంతుడు జన్మించున్! 31

భర్తయైన యా పులస్త్యు వాక్యము బన్నుగ విని యా దేవియునూ
సంతోషించెను నచిరకాలమున యఖిల లోకముల బ్రసిద్ధుడున్
యశో ధర్మములతో గూడికొనీ యలరు ప్రకాశము గలవాడున్
విశ్రవసుడు నను పుత్రుని కనియెను విమల ముహూర్తము నందుననూ! 32

పులస్త్యు పుత్రుండగు విశ్రవసు పూర్ణతేజుడై తండ్రివలెన్
వేదవేదాంగ పారంగతుడును విమల సమదృష్టి గలవాడున్
వ్రతాచార తత్పరుడును నగచును వాసికెక్కె గుణశీలునిగా
తపస్సుతోడను గూడిన వాడును తన్మయుడును శాస్త్రములందున్! 33

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
రెండవ సర్గము సమాప్తము

శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# మూడవ సర్గము

(విశ్రవసుకు వైశ్రవణుడు అను కుమారుడు జన్మించుట, అతడు తపస్సుచేసి
వరములు పొంది, లంకలో నివసించుట)

అటు పిమ్మట యా పులస్త్యు పుత్రుడు నా విశ్రవసు తండ్రి వలెన్
అచిరకాలమున యా తపోధనుడు నావిశ్రవసు దపస్వియై
తపోనిష్ఠలో లీనమాయెనూ తన్మయమాయెను వ్రతనిష్ఠన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 1

సత్యవంతుడును శీలవంతుడును సకల శాస్త్రముల జ్ఞాతుండై
స్వాధ్యాయాధ్యయనముల యందునను సత్యమునం దాసక్తుండై
ఇంద్రియ నిగ్రహ వంతుడగుటయును నిల భోగములను ద్యజయించీ
నిత్యము ధర్మము నాచరించుచును నిరతము సమాధిలో నుండున్! 2

మహామునియునగు భరద్వాజుడును మానుగ విని యావిశ్రవసున్
అతని శీలమును నతని నడతయును సన్నియు దా మది గ్రహియించీ
దేవతవంటీ రూపము గలిగిన దివ్యమైన తన పుత్రికనూ
భార్యనుగా దయజేసెను నతనికి భవ్యాదర గారవములతో! 3

ధర్మజ్ఞుడును ముని పుంగవుడును ధార్మికుడగు నా విశ్రవసూ
అమితముదంబును గూడిన వాడై నలరుచు సంతానము గూర్చి
ఆలోచించెడి బుద్ధితోని మఱి యలరు భరద్వాజుని సుతనూ,
ధర్మ మార్గమున స్వీకరించి మఱి తనకు జనించెడి పుత్రునికై
శ్రేయస్సును మఱి యాలోచించుచు శ్రీకరమగు తన సతియందున్
పరాక్రవంతుడు, పరమాద్భుతుడును సమస్త బ్రాహ్మణ గుణములతో
వర్ధిలువాడును యట్టి యపత్యము వన్నెలు చిన్నెలు గలవానిన్
జనింపజేసెను పుత్రునిగా తన జాడను బయనించెడి వానిన్! 4,5

అతనిపుట్టుకను నాపితామహుడు నా పులస్త్యుడును సంతసిలెన్
శ్రేయస్కరమగు బుద్ధిని గాంచీ శ్రీకర లక్షణములును గనీ,
ధనాధ్యక్షుడై వర్ధిలు నీతడు ధర్మము దప్పక వర్తించున్
అనుచు బలికె యాపులస్త్య బ్రహ్మయు నల దేవ ఋషుల గూడికొనీ
సంతోషంబున నామధేయమును సరసత బెట్టిరి బాలునికిన్! 6,7

విశ్రవసుని పుత్రుండైన యీతడును విశ్రవసుని పోలికతోడన్
నున్నవాడు గద! సాదృశ్యంబున యూహ జనించెను నామదిలో
వైశ్రవణుండును నామధేయమును వల నొప్పగ నిపుడును బెడితిన్
చిరకాలము జీవించు నీతడును చిరకాలము ఖ్యాతిని బొందున్! 8

అట్టి సమయమున యా వైశ్రవణుడు నా తపోవనము నందుననూ
తల్లిదండ్రులా యొద్దనుండెనూ, తపోవిద్యలను నేర్చుచునూ
ఆ వైశ్రవణుడు క్రమక్రమముగా నాహుతిలిచ్చిన హోమముగన్
అగ్నివోలె బహు తేజస్సులతో అలరి పెరిగె బహు వేగముగన్! 9

ఆశ్రమమందు వసించు చుండినా అలవైశ్రవణునకును వేగన్
మానసమందున జ్ఞానోదయమై మనసు కాంతివంతంబగుచున్!
ధర్మమేగదా యతి యుత్తమ గతి! ధర్మ మాచరించెద నేనున్!
అనెడి భావ ముదయించెను మదిలో నల చంద్రోయ మగురీతిన్! 10

వేలకొలది వత్సరములు నాతడు విమల తపస్సులు జేసి మతిన్
ఉగ్రములగు నియమంబుల చేతను నున్నతమగు తపసును జేసెన్
ఆ సమయంబున యా వైశ్రవణుడు నన్నివిధములను నర్చించెన్
పరమాత్మను తన మదిలో జేర్చుచు బన్నుగ జ్యోతిని గనుగొనుచున్! 11

పూర్ణమైన వే వత్సరంబులును, పూర్ణమైన తదుపరి నతడున్
జలమును మాత్రము ద్రావుచుండెనూ జతనమునను భుజియించుచునూ
గాలినిమాత్రము నాహారముగా గలవాడగుచును నిత్యంబున్
నిరాహారుడై తపోనియమముల విరతము దా నిర్మించుకొనీ
తపస్సు జేసెను వేల వర్షములు తన్మయుడై యా తపమందున్
ఒక వర్షముగా గడిచిపోయెనూ వరుసగ వర్షములవి యన్నీ! 12

అటుబిమ్మట ఘన తేజము గలిగిన యా బ్రహ్మయు సంతోషించీ
ఇంద్రుని తోడను దేవతాగణము నింపుగ ఋషులను గూడికొనీ
ఆ వైశ్రవణుని యాశ్రమంబునకు అలరిపోయి బహు చింతనతో
ఆ మునితోడను నిటుల బలికెనూ యాప్యాయతతో గూడికొనీ! 13

సువ్రత! వత్సా! వైశ్రవణా విను! సురుచిర కర్మల చేతను నే
పరితుష్టుండను నైతి కుమారా! బరగవరములను గోరుకొనూ!

వరార్హుండవూ! వరమునుగోరుము! వాలాయముగా మదిలోనీ
నీకు భద్రమగు గాక! నీ తపసు నిర్ణయింప శక్యముగాదూ! 14

అంతట వైశ్రవణుండు వచ్చినా యా పితామహుని గనుగొనుచున్
అలరి వలికె చేతులు జోడించీ యల ప్రజాపతికి మ్రొక్కుచునూ!
ఓ పూజ్యుడ! దయసేము నాకును యొనరగ ధనాధిపత్యమునూ
లోకపాలనము దయసేయుము ప్రభు! లోలత నే గోరుచునుంటిన్ ! 15

అటుబిమ్మట సురగణముల తోడుత యలరుచు వచ్చిన బ్రహ్మయునూ
సంతోషించిన మనస్సుతోడను సఖ్యముగా నానందముతో
తప్పక యట్లే జరుగుగాక! యని దగబలికెను వైశ్రవణునితో
విరులను గురిసిరి దేవతలంతట విమల ధ్వనులను జేయుచునూ! 16

ధర్మజ్ఞుండవు వైశ్రవణా విను ధార్మికుండవును లోకమునన్
యమేంద్ర వరుణులు లోక పాలురుగ యలరి యుండిరీ ముువ్వురునూ,
నాల్గవవానిని సృజింపగా మది నయముగ గోరుచునుంటిని నే
నీ యభీప్సితము నెఱవేరును గద! నిధుల కాధిపత్యంబు నికన్
పొందుము వత్సా! సకల ధనములకు భూరియాధిపత్యంబు నికన్
ఇంద్ర వరుణ యములకును దోడుగా సాంద్రయాధిపత్యము నందున్,
నాల్గవవానిగ లోకపాలునిగ నయముగ నుండుము లోకమునన్! 17, 18

నీ ప్రయాణమునకును నా మది నిర్ణయించితిని వైశ్రవణా!
సూర్యసన్నిభము నైన విమానము సురుచిర పుష్పకమను నదియున్
విమాన రాజము బరిగ్రహింపుము! విమలమైనదియు సుందరమున్
దివ్యులతోడను సమానమగుమా! దీప్తిజెందుమా! నిక మీదన్! 19

నీకు స్వస్తియగుగాక నాయనా నీ కాశీర్వాదము విదిగో!
మే మందఱమును వచ్చినట్లుగా మేదుర సంతోషము నందీ
వెడలిపోవుచుంటిమి వైశ్రవణా! విమల వర ద్వయముల నిచ్చీ
కృతకృత్యులమైతిమి! మే మింకను మతి యానందము నందుచునూ! 20

బ్రహ్మదేవు డీ విధమున బలికీ బన్నుగ దేవతలను గూడీ
స్వస్థానమునకు వెడలిపోయెనూ సరి యాకాశ సుమార్గమునన్
అటుపిమ్మట యా ధనేశుండునూ యంజలి ఘటించి వినయమునన్
తండ్రితోడుతను నిటులను బలికెను దగిన విధంబుగ మధురముగన్! 21

పూజ్యుడైన యా పితామహునితో భాజనమగు వరములనందీ
ధన్యుడనైతిని తండ్రీ వినుమా! తపసు ఫలంబుల నందితినీ
కాని నాదు దురదృష్టము జేతను కమనీయంబగు నివాసమున్!
విధించి యుండగలేదుగదా! మఱి విధి నిర్ణయమది చిత్రముగా! 22

ఓ పూజ్యుడ! ఓ సర్వసమర్థుడ! యెక నివాసమును నా కొఱకున్
సుందరమైనది శుభకరమైనది సుఖప్రదమును నగు ప్రదేశమున్!
నా కొఱకై యే ప్రాణికి గూడను నయముగ మది వ్యధలేని విధిన్
అట్టి నివాసము నలరిదెలుపుమా! యాప్యాయత దుది జిగురొత్తన్! 23

పుత్రుడైన యా వైశ్రవణునిచే పొలుపుగ తండ్రియు విని మఱియున్
సర్వధర్మములు దెలిసినవాడును చారు శీలుడగు విశ్రవసూ!
బ్రహ్మదేవునీ వరములనందీ పరగ ధన్యుడగు పుత్రునితో
ఆదరమున యీవిధమున బలికెను సాదరమున పుత్రా! యనుచున్! 24

దక్షిణ సముద్ర తీరమునందున దగ త్రికూటమను పర్వతమున్
గలదు కుమారా! దానియగ్రమున కమనీయంబగు మహేంద్రునీ
పురివలెనుండీ విశాలమైనా పూర్ణమైన సౌకర్యములన్
గలిగిన పట్టణ మొకటున్నది సుమ! కలకలలాడెడి లంకయునూ!
ఇంద్రుని యమరావతి వలె లంకయు నింపును గూర్చును సుందరతన్
మహారాక్షసుల నివాసార్థమై మానుగ నిర్మింపగ బడియెన్! 25, 26

అట్టి లంకయందున వసియింపుము నలరి రాజ్యమును జేయుచునూ!
నీకు క్షేమమును గలుగు కుమారా! నిర్ణయించితిని యటనుండన్
బంగరు ప్రాకారమును గడియలును బన్నుగ యంత్రంబులతోడన్
ఆయుధములతో గూడినట్టిదియు నమిత సుందరము నైనట్టీ
బంగారము వైడూర్య వికారము బహుముఖ ద్వారంబులు గలదీ
ప్రసిద్ధమైనా యా పట్టణమును బన్నుగ పూర్వము రాక్షసులున్
విష్ణు భయముచే బీడింపగబడి విడిచిరి రాక్షసు లా పురినీ! 27, 28

రసాతలమునకు నడుగు భాగమును రయమున బోయిరి రాక్షసులున్
ప్రస్తుత మీ పురి శూన్యమైనదీ బరగ రాక్షసులు లేరచటన్
ప్రభు వెవ్వడు లే డచట కుమారా! ప్రజలు కూడనూ లేరచటన్
అందఱు బోయిరి పాతాళమునకు హరి భయంబుచే నివసింపన్! 29

పుత్రా! నీ వట నివసించుటకును స్ఫూర్తి యధాసుఖముగ జనుమా!
ఆ లంకను నీవుండుట వలనను నంటదు ముట్టదు దోషంబున్
ఎవరి బాధయును నీకుండదు సుమ! యెవరి పోరు నీకుండదుగా!
ఏ ప్రాణియు నీకపకారంబును నింపుగ జేయదు నిక్కముగన్! 30

ధర్మాత్ముడు నగు నా వైశ్రవణుడు ధర్మ సమ్మతములైనవియున్
తండ్రి వచనముల విని యాతండును తన మదిలోపల యోజించీ
పర్వతాగ్రమున యున్న లంకనూ పన్నుగ సుఖవంతము నైనా!
తన నివాసముగ యేర్పరచుకొనెను తండ్రి యాజ్ఞ తల దాల్చుచునూ! 31

అంతట యాతని శాసనంబుచే నచిరకాలమున యాలంకన్
సంతోషంబున యానందంబున సకల రాక్షసులు నటజేరీ
నివాసంబులను గూర్చికొనిరి యట నిర్భయ నిశ్చల భావమునన్
వేలకొలది రాక్షసులు నిండిరీ విమలమైన పురి యాలంకన్! 32

ధర్మాత్ముండగు నైరృతర్షభుడు దగ వైశ్రవణుడు దగు రీతిన్
సముద్రుడే పరిఖగనున్నట్టి సరసరీతి నట జేరుకొనీ
ఆ లంకాపురి వైభవంబుగా నాతడు సంతోషముతోనీ
వసియించెను నట యిష్టారీతిని వనర నచటి ప్రజ పాలించెన్! 33

ధర్మాత్ముండును ధనేశ్వరుండును దగ నా వైశ్రవణుండు మతిన్
ఆయాకాలములందు నతండును నలరి పుష్పకము నెక్కి మతిన్
వినయపూర్వకముగా తల్లిదండ్రుల వేడుక వచ్చెడివాడు గనన్
భక్తిని మ్రొక్కి పరామర్శతో బన్నుగ బోయెడి వా డతడున్! 34

దేవ గంధర్వ గణములజేతను ధీరత నుతింపబడు వాడున్
అప్సర వనితల నృత్యంబులచే నలంకరింపగ బడినట్టీ
అందమైన భవనంబును గలిగిన యా ధనేశుడును నొకసారీ
తండ్రి సమీపమునకు బోయెను దా దగ దర్శింపగ యాతనినీ! 35

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
మూడవసర్గము సమాప్తము

### శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము ప్రథమ సంపుటము

# నాల్గవ సర్గము

(రాక్షస వంశ వర్ణనము సేతి - విద్యుత్కేశ సుకేశులయుత్పత్తి)

అగస్త్యు మాటలు విని రాఘవుడును నాశ్చర్యము నొందుచు మదినీ
పూర్వకాలమున లంకా నగరిని బుట్టిరి యెటులను రాక్షసులున్
ఏ విధముగ జీవించిరి వారలు నే విధముగ వర్తిలిరి యటన్
ఆశ్చర్యంబును బొంది రాఘవుడు నాలోచించుచు మదియందున్! 1

అటు బిమ్మట శిరసును కదల్చుచును నగ్ని పర్వతము సమానమౌ
శరీరంబుగల యా మహామునిని సరసరీతి వీక్షించుచునూ
అంతరంగమున మాటిమాటికిని అతి విస్మయమును నొందుచునూ
ప్రశ్నాపూర్వముగా మహామునిని ప్రవిమల సువిమల వాక్యములన్! 2

ఓ పూజ్యుడ! ఓ మహామునీ విను! ఓరిమి నాదు సువాక్యములన్
ఈ లంకాపురి పూర్వముగూడను నింపుగ పిసితాశనులకునూ!
వాసముగా నుండినదని చెబితివి భగవంతా! నీ వాక్యములన్
అధికమైన విస్మయముగలిగినది అంతులేని సందేహమునూ! 3

రాక్షసులను వారలు నీ జగతిని రహిపులస్త్యునీ వంశమునన్
జనించినారని విని యున్నారము జగతిని వాడుకలో నుండెన్
అంతకు పూర్వము నుండి రాక్షసులు నలరి యుండిరని బలికితివీ
ఇతరుల నుండియు జనించినారని మతిమంతుడ దెలిపితి విపుడున్! 4

ఆ రాక్షసులును రావణుకంటెను నలరు కుంభకర్ణుల కంటెన్
ప్రహస్తు కంటెను, వికటుని కంటెను బలపరాక్రమము గలవారా?
రావణు పుత్రులకంటె వారునూ రహితేజస్సులు గలవారా?
ప్రజ్ఞావంతులొ? అధిక బలులొ మఱి? యలరి దెలుపుమా వివరముగన్! 5

ఓ బ్రాహ్మణుడా! వివరింపుము మఱి యోరిమి నాదు సుప్రశ్నలకున్
ఎవ్వడు పూర్వుడు? నెవ్వడు బలుడూ? యెట్టి నామధేయము వాడూ?
ఏ యపరాధంబుల జేసిరి మఱి యే దుష్కర్మల జేసియునూ
విష్ణువు చేతను వెడలుగొట్టబడి వేఱుగ లంకకు దూరముగా
ఆ రాక్షస వృత్తాంతమంతయును నలరి దెలుపుమా వివరముగన్! 6

దోషరహితుడా? దీనిని సర్వము దోరముగా వివరింపుమికన్
సూర్య ప్రభలు నా తమోరాశినీ సురుచిరముగ తొలగించి నటుల్
నాలో గలిగిన సందేహములను నయముగ దీర్పుము ధీశక్తిన్
మనవి జేయుచుంటిని బ్రాహ్మణుడా! మది సంశయమును దీర్పుమికన్! 7

శ్రీరాఘవునీ వచనములను విని చిత్తమందు సంతసమందీ
సంస్కారాలంకృతమగు ప్రశ్నను చారు శుభప్రదమైనదియున్
మంగళకరమగు వచనంబుల విని మానుగ విస్మయమందుచునూ
అగస్త్యుడంతట బలికె రామునితో నలజడి లేకను మదియందున్! 8

జలముల పద్మమునుండి జనించిన జలజాక్షుండగు బ్రహ్మయునూ
భూమిక్రింద నున్నట్టి జలములను భూరి సంద్ర రూపంబైనా
జలముల సృజించి రాత్రంతయునూ జలముల యందున్నట్టియునూ
విష్ణునాభి శ్రీకమలమునందున వేడుకతో నటనుండియునూ
ఆ యుదకములను రక్షించుటకై యలరి జీవులను సృజియించెన్! 9

ఆ ప్రాణులు క్షుత్ పిపాస భయముల యలరి సొక్కుచును పీడితమై
మేము ఏమి చేయగ వలెనో మఱి మే మర్థించుచు నుంటిమిటన్
ఈ విధముగ బలుకుచును బ్రాణులును వినయ పూర్వముగ జనిరటకున్
తమను సృజించిన బ్రహ్మదేవునీ దయను వేడుచును వేగముగన్! 10

అల ప్రజాపతియు నలరి నవ్వుచును నందఱగని సంతోషముతో
కలయ జూచుచును నలువైపులనూ కమ్మని బలుకుల బలుకుచునూ
యత్న పూర్వకముగా యీ జలముల యత్నింపుడు రక్షించుటకున్
అనుచు బలికి మఱి యూరకుండెనూ యా ప్రజాపతియు చతురముగా! 11

వారి లోపలను నాకలిగొనినా వారిటుబలికిరి వినయముగా
ఈ జలముల రక్షించెద మనుచును నింపుగ బలికిరి దేవునితో
ఆకలిగొననీ కొందఱు బలికిరి యలరి వీని పూజింతుమనీ
అనుచు బలుక యా బ్రహ్మదేవుడును నలరి బలికె నీ విధముగనూ! 12

మీలో నెవ్వరు రక్షించెదమని నింపుగ బలికిరొ యా ప్రాణుల్
రాక్షసులుగా నగుదురు గాకని రమ్యముగా బలికెను విభుడున్
పూజించెదమని యెవరు బలికిరో పొలుపుగా యా ప్రాణులు నింకన్
యక్షులుగా జీవింతురు యిక యని యా బ్రహ్మయునూ పలికి చనెన్! 13

వారి లోపలను హేతి ప్రహేతులు వరుసను మధు కైటభుల వలెన్
శత్రు సంహరణ జేసెడి వారలు సహజ పరాక్రములగు వారున్
రాక్షసాధిపులుగా నుండిరి యట రణ విక్రములగు సోదరులున్,
రాక్షసులను బాలించుచుండిరీ రమ్య దండయాత్రల తోడన్! 14

వారి లోపలను ప్రహేతి మిక్కిలి పరమ ధార్మికుడు గుణశీలీ,
తపోవనమునకు వెడలిపోయెనూ తాపసివలె తపమును జేయన్
హేతి మాత్రమట వైవాహికమును వనర జేసికొనగా జింతన్
మహా ప్రయత్నము జేయుచుండెనూ మానుగ కన్యను వెదుకుచునూ! 15

అమేయాత్ముడును మహామతియునగు నా హేతియు దా స్వయముగనే
వెదికి వెదికి యా యమ సోదరినీ భయంకరియు నగు యమను మఱిన్
ఆ కన్యకనూ వివాహమాడెను నందఱు చూడగ వేడుకనూ
తగిన భర్త మఱి తగిన భార్యయని తగిన వధూవరులనిరి ప్రజల్! 16

పుత్రవంతులను శ్రేష్ఠుండును మఱి భూరి పరాక్రమవంతుడునూ
రాక్షస పుంగవుడైన హేతి దా రమ్యమైన దనసతియందున్
విద్యుత్కేశుడు అను రక్కసునీ వేడుక జనింపగా జేసెన్
ఆ బాలుండును ప్రసిద్ధుడై మఱి యలరెను రాక్షస కులమందున్! 17

దీప్తార్కునితో సమాన ప్రభగల దివిటీ వలె వెలుగుచును మఱిన్
మహాతేజమును గలిగిన యాతడు మానుగ విద్యుత్కేశుడునూ!
హేతి పుత్రుడగు నాతడు జూడగ హేతివోలె కనబడుచుండెన్
నీరము మధ్యను దామర పూవుగ తేజసులను వర్ధిలుచుండెన్! 18

హేతికుమారుడు నిశాచరుండును విద్యుత్కేశుడు నెపుడైతే
మంగళకరమగు యౌవనంబునూ సంగతి పొందెనొ వెనువెంటన్
వానికి దార క్రియను జేయగా వనరగ దన హృదయమునందున్
నిశ్చయించెనూ అందు నిమిత్తము నిర్ణయించె వధువును వెదుకన్! 19

అటుపిమ్మట రాక్షస పుంగవుడును అలరి హేతి తన ప్రభావతన్
సంధ్యతోని సరిసమానురాలగు సంధ్యా దుహితను పుత్రునికై!
వధువునుగా దా నిర్ణయించెనూ వాసిగ తన వంశము నిలుపన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా! సీతారామ్! 20

పుత్రా! నీ వట నివసించుటకును స్ఫూర్తి యధాసుఖముగ జనుమా!
ఆ లంకను నీవుండుట వలనను నంటదు ముట్టదు దోషంబున్
ఎవరి బాధయును నీకుండదు సుమ! యెవరి పోరు నీకుండదుగా!
ఏ ప్రాణియు నీకపకారంబును నింపుగ జేయదు నిక్కముగన్! 30

ధర్మాత్ముడు నగు నా వైశ్రవణుడు ధర్మ సమ్మతములైనవియున్
తండ్రి వచనముల విని యాతండును తన మదిలోపల యోజించీ
పర్వతాగ్రమున యున్న లంకనూ పన్నుగ సుఖవంతము నైనా!
తన నివాసముగ యేర్పరచుకొనెను తండ్రి యాజ్ఞ తల దాల్చుచునూ! 31

అంతట యాతని శాసనంబుచే నచిరకాలమున యాలంకన్
సంతోషంబున యానందంబున సకల రాక్షసులు నటజేరీ
నివాసంబులను గూర్చికొనిరి యట నిర్భయ నిశ్చల భావమునన్
వేలకొలది రాక్షసులు నిండిరీ విమలమైన పురి యాలంకన్! 32

ధర్మాత్ముండగు నైర్పతర్షభుడు దగ వైశ్రవణుడు దగు రీతిన్
సముద్రుడే పరిఖగనున్నట్టి సరసరీతి నట జేరుకొనీ
ఆ లంకాపురి వైభవంబుగా నాతడు సంతోషముతోనీ
వసియించెను నట యిష్టారీతిని వనర నచటి ప్రజ పాలించెన్! 33

ధర్మాత్ముండును ధనేశ్వరుండును దగ నా వైశ్రవణుండు మతిన్
ఆయాకాలములందు నతండును నలరి పుష్పకము నెక్కి మతిన్
వినయపూర్వకముగా తల్లిదండ్రుల వేడుక వచ్చెడివాడు గనన్
భక్తిని మ్రొక్కి పరామర్శతో బన్నుగ బోయెడి వా డతడున్! 34

దేవ గంధర్వ గణములజేతను ధీరత నుతింపబడు వాడున్
అప్సర వనితల నృత్యంబులచే నలంకరింపగ బడినట్టి
అందమైన భవనంబును గలిగిన యా ధనేశుడును నొకసారీ
తండ్రి సమీపమునకు బోయెను దా దగ దర్శింపగ యాతనినీ! 35

శ్రీరామ కథాసుథాలహరి యందు - ఉత్తరకాండలో
మూడవసర్గము సమాప్తము

### శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# నాల్గవ సర్గము

(రాక్షస వంశ వర్ణనము చేసి - విద్యుత్కేశ సుకేశులయుత్పత్తి)

అగస్త్యు మాటలు విని రాఘవుడును నాశ్చర్యము నొందుచు మదినీ
పూర్వకాలమున లంకా నగరిని బుట్టిరి యెటులను రాక్షసులున్
ఏ విధముగ జీవించిరి వారలు నే విధముగ వర్ధిలిరి యటన్
ఆశ్చర్యంబును బొంది రాఘవుడు నాలోచించుచు మదియందున్! 1

అటు బిమ్మట శిరసును కదల్చుచును నగ్ని పర్వతము సమానమౌ
శరీరంబుగల యా మహామునిని సరసరీతి వీక్షించుచునూ
అంతరంగమున మాటిమాటికిని అతి విస్మయమును నొందుచునూ
ప్రశ్నాపూర్వముగా మహామునిని ప్రవిమల సువిమల వాక్యములన్! 2

ఓ పూజ్యుడ! ఓ మహామునీ విను! ఓరిమి నాదు సువాక్యములన్
ఈ లంకాపురి పూర్వముగూడను నింపుగ పిసితాశనులకునూ!
వాసముగా నుండినదని చెబితివి భగవంతా! నీ వాక్యములన్
అధికమైన విస్మయముగలిగినది అంతులేని సందేహమునూ! 3

రాక్షసులను వారలు నీ జగతిని రహిపులస్త్యునీ వంశమునన్
జనించినారని విని యున్నారము జగతిని వాడుకలో నుండెన్
అంతకు పూర్వము నుండి రాక్షసులు నలరి యుండిరని బలికితివీ
ఇతరుల నుండియు జనించినారని మతిమంతుడ దెలిపితి విపుడున్! 4

ఆ రాక్షసులును రావణుకంటెను నలరు కుంభకర్ణుల కంటెన్
ప్రహస్తు కంటెను, వికటుని కంటెను బలపరాక్రమము గలవారా?
రావణు పుత్రులకంటె వారునూ రహితేజస్సులు గలవారా?
ప్రజ్ఞావంతులొ? అధిక బలులొ మఱి? యలరి దెలుపుమా వివరముగన్! 5

ఓ బ్రాహ్మణుడా! వివరింపుము మఱి యోరిమి నాదు సుప్రశ్నలకున్
ఎవ్వడు పూర్వుడు? నెవ్వడు బలుడూ? యెట్టి నామధేయము వాడూ?
ఏ యపరాధంబుల జేసిరి మఱి యే దుష్కర్మల జేసియునూ
విష్ణువు చేతను వెడలుగొట్టబడి వేఱుగ లంకకు దూరముగా
ఆ రాక్షస వృత్తాంతమంతయును నలరి దెలుపుమా వివరముగన్! 6

దోషరహితుడా? దీనిని సర్వము దోరముగా వివరింపుమికన్
సూర్య ప్రభలు నా తమోరాశినీ సురుచిరముగ తొలగించి నటుల్
నాలో గలిగిన సందేహములను నయముగ దీర్పుము ధీశక్తిన్
మనవి జేయుచుంటిని బ్రాహ్మణుడా! మది సంశయమును దీర్పుమికన్! 7

శ్రీరాఘవునీ వచనములను విని చిత్తమందు సంతసమందీ
సంస్కారాలంకృతమగు ప్రశ్నను చారు శుభప్రదమైనదియున్
మంగళకరమగు వచనంబుల విని మానుగ విస్మయమందుచునూ
అగస్త్యుడంతట బలికె రామునితో నలజడి లేకను మదియందున్! 8

జలముల పద్మమునుండి జనించిన జలజాక్షుండగు బ్రహ్మయునూ
భూమిక్రింద నున్నట్టి జలములను భూరి సంద్ర రూపంబైనా
జలముల సృజించి రాత్రంతయునూ జలముల యందున్నట్టియునూ
విష్ణునాభి శ్రీకమలమునందున వేడుకతో నటనుండియునూ
ఆ యుదకములను రక్షించుటకై యలరి జీవులను సృజియించెన్! 9

ఆ ప్రాణులు క్షుత్ పిపాస భయముల యలరి సొక్కుచును పీడితమై
మేము ఏమి చేయగ వలెనో మఱి మే మర్థించుచు నుంటిమిటన్
ఈ విధముగ బలుకుచును బ్రాణులును వినయ పూర్వముగ జనిరటకున్
తమను సృజించిన బ్రహ్మదేవునీ దయను వేడుచును వేగముగన్! 10

అల ప్రజాపతియు నలరి నవ్వుచును నందఱగని సంతోషముతో
కలయ జూచుచును నలువైపులనూ కమ్మని బలుకుల బలుకుచునూ
యత్న పూర్వకముగా యీ జలముల యత్నింపుడు రక్షించుటకున్
అనుచు బలికి మఱి యూరకుండెనూ యా ప్రజాపతియు చతురముగా! 11

వారి లోపలను నాకలిగొనినా వారిటుబలికిరి వినయముగా
ఈ జలముల రక్షించెద మనుచును నింపుగ బలికిరి దేవునితో
ఆకలిగొననీ కొందఱు బలికిరి యలరి వీని పూజింతుమనీ
అనుచు బలుక యా బ్రహ్మదేవుడును నలరి బలికె నీ విధముగనూ! 12

మీలో నెవ్వరు రక్షించెదమని నింపుగ బలికిరొ యా ప్రాణుల్
రాక్షసులుగా నగుదురు గాకని రమ్యముగా బలికెను విభుడున్
పూజించెదమని యెవరు బలికిరో పొలుపుగా యా ప్రాణులు నింకన్
యక్షులుగా జీవింతురు యిక యని యా బ్రహ్మయునూ పలికి చనెన్! 13

వారి లోపలను హేతి ప్రహేతులు వరుసను మధు కైటభుల వలెన్
శత్రు సంహరణ జేసెడి వారలు సహజ పరాక్రములగు వారున్
రాక్షసాధిపులుగా నుండిరి యట రణ విక్రములగు సోదరులున్,
రాక్షసులను బాలించుచుండిరీ రమ్య దండయాత్రల తోడన్! 14

వారి లోపలను ప్రహేతి మిక్కిలి పరమ ధార్మికుడు గుణశీలీ,
తపోవనమునకు వెడలిపోయెనూ తాపసివలె తపమును జేయన్
హేతి మాత్రమట వైవాహికమును వనర జేసికొనగా జింతన్
మహా ప్రయత్నము జేయుచుండెనూ మానుగ కన్యను వెదుకుచునూ! 15

అమేయాత్ముడును మహామతియునగు నా హేతియు దా స్వయముగనే
వెదికి వెదికి యా యమ సోదరినీ భయంకరియు నగు యమను మఱిన్
ఆ కన్యకనూ వివాహమాడెను నందఱు చూడగ వేడుకనూ
తగిన భర్త మఱి తగిన భార్యయని తగిన వధూవరులనిరి ప్రజల్! 16

పుత్రవంతులను శ్రేష్ఠుండును మఱి భూరి పరాక్రమవంతుడునూ
రాక్షస పుంగవుడైన హేతి దా రమ్యమైన దనసతియందున్
విద్యుత్కేశుడు అను రక్కసునీ వేడుక జనింపగా జేసెన్
ఆ బాలుండును ప్రసిద్ధుడై మఱి యలరెను రాక్షస కులమందున్! 17

దీప్తార్కునితో సమాన ప్రభగల దివిటీ వలె వెలుగుచును మఱిన్
మహాతేజమును గలిగిన యాతడు మానుగ విద్యుత్కేశుడునూ!
హేతి పుత్రుడగు నాతడు జూడగ హేతివోలె కనబడుచుండెన్
నీరము మధ్యను దామర పూవుగ తేజసులను వర్ధిలుచుండెన్! 18

హేతికుమారుడు నిశాచరుండును విద్యుత్కేశుడు నెప్పుడైతే
మంగళకరమగు యౌవనంబునూ సంగతి పొందెనొ వెనువెంటన్
వానికి దార క్రియను జేయగా వనరగ దన హృదయమునందున్
నిశ్చయించెనూ అందు నిమిత్తము నిర్ణయించె వధువును వెదుకన్! 19

అటుపిమ్మట రాక్షస పుంగవుడును అలరి హేతి తన ప్రభావతన్
సంధ్యతోని సరిసమానురాలగు సంధ్యా దుహితను పుత్రునికై!
వధువునుగా దా నిర్ణయించెనూ వాసిగ తన వంశము నిలుపన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా! సీతారామ్! 20

వధువును వరునకు నివ్వక తప్పదు వసుధలోని యాచారమదే
అని యాలోచన జేసి సంధ్యమును నంతరంగమున దీర్ఘముగా
ఆ పుత్రిక సాలంకటంకటను అల విద్యుత్కేశునకును నిచ్చి
పాణిగ్రహణము జేసి శుభముగను బదుగురు మెచ్చగ తనవారున్! 21

రాక్షసుడగు నా విద్యుత్కేశుడు సంధ్య కుమార్తెను వివాహమై
అన్యోన్యంబుగ నలరియుండిరీ యపురూపంబగు ప్రేముడితో!
ఇంద్రుని తోడను పౌలోమ్యాసతి సాంద్రముగా గ్రీడించినటుల్
విద్యుత్కేశుడు సంధ్యాసుతతో విమలముగా క్రీడించెనటన్! 22

అటుపిమ్మట సాలంకటంకటయు నల విద్యుత్కేశునితోని మతిన్
రమించి పొందెను కొన్ని నాళ్లును రమ్యముగా ఘనరాజియునూ!
సముద్ర జలముల నుద్భవించినటు చక్కని యా సంధ్యాసుతయున్,
గర్భంబును ధరియించె మక్కువను కమనీయంబగు కాలమునన్! 23

అటుపిమ్మట నా రాక్షస స్త్రీయును నల మందర పర్వతముజనీ
గంగాదేవియు యగ్నివలన మతి సంగమించినా యద్భుతమౌ,
రుద్రతేజ రూపంబగు గర్భము నలరి విడిచినటు రాక్షసియున్
పిడుగుతోని సమ కాంతివంతమగు వడివిడిచెను తన గర్భమునూ! 24

విద్యుత్కేశునితో రమింపగా విమలమైన కోరిక గలిగీ
ఆ గర్భంబును విడిచివేసియును ఔరస పుత్రుని విస్మృతినీ
భర్తతోని రమియించె నాసతియు భాగ్యవశంబున నపుడపుడే
ఘన శబ్దముతో సమానమైనా గర్భము విడిచెను వేవెంటన్! 25

ఆ రాక్షసిచే విడువబడిన యా యర్క సముద్యుతితో గూడీ
శిశువు జనించెను జిఱు నగవులతో శ్రీకరమగు కాంతులతోడన్
స్వయముగ తానే పిడికిలి ముఖమున చిటి పొటి ముడిముడి చేష్టలతో
మెలమెల్లగ యా బాలుండప్పుడు సల్లలితముగా రొదజేసెన్! 26

అట్టి సమయమున వృషభమునందున యాపరమేశ్వరుడును వేగన్
అధిష్ఠించి మతి బోవుచుండెనూ యల పార్వతినీ గూడికొనీ
గగన మార్గమున బోవుచున్న మా కమనీయంబగు దంపతులున్
బాలుని రోదన విని దంపతులను భవ్య కరుణనూ కనుగొనిరీ! 27

పార్వతితో కూడిన మహదేవుడు భవ్యరూపమును గలవాడున్
త్రిపురాసురు హరియించిన వాడును శ్రీగణేశుని తండ్రియునూ
రాక్షసపుత్రుని రోదన స్వనమును రయమున విని కడు దయతోడన్
జాలి ప్రేమలను గాంచెను బాలుని విలసిత కరుణను గనబఱచెన్! 28

నాశరహితుడును, నవ్యయుండయిన యా మహదేవుడు నల బాలున్
తల్లి వయసుతో సమముగ నాతని దయతోడను గావించి మఱిన్
మరణభయంబును లేకుండగనూ మాధుర్యంబును సమకూర్చెన్
అంత యెత్తుగా పెరుగునట్లుగా మంతనంబునూ దయచేసెన్! 29

సతి పార్వతి కోరిక ప్రకారమును బన్నుగ రాక్షస బాలునకున్
ఆకాశములో సంచరించెడీ యందమైన ఒక నగరంబున్
ప్రసాదించెనూ యా కుమారునికి బన్నుగ దిరుగగ గగనమునన్
ఉమగూడను దయతో గూడినదై నురుతరమగు వరములగూడన్
ప్రసాదించెనూ రాక్షస స్త్రీలకు బన్నుగ దయతో గూడికొనీ! 30

గర్భము గలుగుట ప్రసవించుటయును, కమనీయముగా వెనువెంటన్
పుట్టిన వెంటనె తల్లితోడుతను, పూర్ణసమానము వయస్సుతో
పెరుగుటయును మఱి యా పరమేశుడు పేరిమి వరముల దయజేసెన్
ఆశ్చర్యంబుగ యపుడే పెరిగెను నవురూపంబగు రూపముతో! 31

అటు బిమ్మట యాఘనుడు మహామతి అలరి సుకేశుడు ప్రభువైనా
పరమేశ్వరుచే యైశ్వర్యంబును బన్నుగ యాకాశమునందున్
సంచరించు నగరంబును బొందెను సకల వస్తు పరికరములతో!
దేవేంద్రుని వలె సంచరించెనూ, దివి భువి సకలములందుననూ! 32

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
నాల్గవసర్గము సమాప్తము



## శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఐదవ సర్గము

(సుకేశుని సంతానమైన మాల్యవత్, సుమాలి, మాలుల సంతాన వర్ణనము)

విశ్వావసుతో సమానమైనా విమలకాంతి గలవాడు మఱిన్
గ్రామణి యనియెడి గంధర్వుండును గడు నానందము గూడికొనీ
ధార్మికుండు మఱి వరలబ్ధుండును దగ రాక్షసుడగు సుకేశునీ
చూచి కన్యకకు దగిన వానిగా సురుచిరముగ నిచ్చెను గూతున్! 1

ఆ గ్రామణియును గంధర్వునకును నలరు మూడు లోకములందున్
ప్రసిద్ధురాలును యౌవన శాలియు బన్నుగ రూప ప్రకాశితయున్
రెండవ లక్ష్మీదేవి వంటిదియు పండుగగా కనిపించునదీ
దేవవతీ యను పేరుగలిగినా దివి యప్సరసకు వలె నుండెన్
ధర్మాత్ముండగు నాగంధర్వుడు దగ నా సుకేశునకు వేగన్
రాక్షసేశ్వరుడు రాజ్యలక్ష్మివలె యర్పించెను దన పుత్రికనూ! 2

వరదానంబుల జేత సంపదలు వరుసగ పొందినవాడైనా
తన ప్రియుడైనా రాక్షసేశ్వరుని దగ పతిగా గ్రహియించి మఱిన్!
దేవవతియు మిక్కిలి సంతాపమును మేరలు లేకను పొందినదీ
ధనమును బొందిన నిర్ధనునికివలె దా బొందెను సంతోషమునూ! 3

ఆమెను గూడిన రజనీచరుడును నంజనమగు దిగ్గజమునకున్
పుట్టినట్టి యా మహాగజమువలె పూనికతో యా రాక్షసుడున్
ఆడ యేనుగును గూడినట్లుగా నా దేవవతిని గూడికొనీ
మిగుల ప్రకాశముతో వర్ధిల్లెను మేదిని యాకాశములందున్! 4

రామచంద్ర! పిమ్మట శుకేశునకు రమ్యమైన తగు సమయమునన్
గార్హపత్యమును దక్షిణాగ్నియును గలిగిన యావహనీయమునూ
త్రేతాగ్నులతో సమానమైనా దీరుగ దేహము గలవారున్
ముప్పురు పుత్రులు జననమందరీ మిగులానందము నందగనూ! 5

ఆ సుకేశుడును శివునితోను మఱి యలరు సమానుల పుత్రులనూ
మాల్యవంతుడును సుమాలి యనెడి యలరెడి పుత్రుల మఱి యింకన్
బలవంతులలో మిగుల శ్రేష్ఠుడును బరగ మాలినిని గూడమఱిన్
ముగ్గురు పుత్రుల శివుని సమానులు మేదిని జన్మింపగ జేసెన్! 6

బాధలు లేనీ మూడు లోకములు బన్నుగ యుండిన రీతి మఱిన్
మూడగ్నులవలె యుగ్రములైనా మూడు మంత్రముల రీతి మఱిన్
త్రయ అమయంబులు వాతపిత్తములు శ్లేష్మ రూపముల వలె వారున్
త్రేతాగ్నులకును సమానులైనాతేజోవంతులు సుకేశునీ
ముగ్గురు పుత్రులు నుపేక్షింపబడి మొరట వ్యాధులకు దూరముగా
వర్ధిలుచుండిరి వన్నెల చిన్నెల వనరగ ధాత్రిని తండ్రికడన్! 7,8

ఆ సోదరులును తమదు తండ్రికిని యలఘన వరముల ప్రాప్తియునూ
తపోబలముచే సంప్రాప్తించిన దరుగని సంపద లభించుటన్
తెలిసికొనియు నా సోదరులందఱు దపస్సు జేయగ వలెననియున్
నిశ్చయించుకొని మేఱు పర్వతము నిర్మల మతితో జని రటకున్! 9

ఓ నృపసత్తమ రామా! వినుమా! వనరుగ రాక్షసు లట జేరీ
కఠిన నియముల స్వీకరించి మఱి కమనీయంబగు తపస్సునూ!
సకల భూతములు భయపడునట్లుగ సకల జగంబును భయమందన్
ఆ రాక్షసులును తపస్సు జేసిరి యలరుచు మేఱువు గిరిపైనీ! 10

సత్యముతోడను, ఋజుత్వములతో, శమంబుతోడను గూడికొనీ
భువిలో దుర్లభమైన తపస్సుల బూని మూడు లోకములందున్
దేవాసుర మానుషు లందఱకును ధీరత్వంబును నశియింపన్
సంతాపంబును గలిగించుచునూ వింతగ దపమును జేసిరటన్! 11

అటు బిమ్మట యా చతుర్వక్త్రుడును నా బ్రహ్మయు సంతసమందీ
విమానశ్రేష్ఠము నాశ్రయించి మఱి వేగముగా నటకును జేరీ
సుకేశు పుత్రుల జేర బిలిచి తన సుభాషితములను బలుకుచునూ
వరముల నిచ్చెద గోరుకొండనుచు వల నొప్పగ బలికెను కరుణన్! 12

ఆ రాక్షసులందఱును వినయమున యలయింద్రాది గణంబులతో
వచ్చిన వారును బ్రహ్మదేవుడని వరముల నివ్వగ వచ్చెననీ
ఎత్తబడిన దోసిలిగలవారై చిత్తమందు భక్తిని గలిగీ
వృక్షంబులవలె వణుకుచు వారలు విధితో నీ విధి బలికిరటన్! 13

తపసారాధితుడవైన నీవు మఱి దగవరముల నివ్వగదలచీ
వచ్చినచో మఱి వరములనిమ్మా మచ్చిక మాకును దయతోడన్
జయింప శక్యముగానీ వారమును, శత్రుమూకలను జంపుచునూ
చిరకాలము జీవించు వారలము సర్వ సమర్థులమై మిగులన్
పరస్పరము స్నేహము వర్ధిల్లగ బ్రతుకు వారమై యుండునటుల్
వరములనిమ్మా! మాపై దయతో వర్ధిల్లుగ మే మందఱమున్! 14

బ్రాహ్మణ వత్సలుడైన బ్రహ్మయును పలికె నిటుల వాత్సల్యముతో
అట్లే మీరలు నగుదు రనుచునూ నలరుచు సుకేసు పుత్రులతో
బలుకుచు బ్రహ్మయు దరలిపోయెనూ బ్రహ్మలోకమును వేగముగన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా! సీతారామ్! 15

వరముల నందీ సుకేశుపుత్రులు వర గర్వము జేతను బొంగీ
ఏ మాత్రంబును భయములేక మఱి యెట్టి ముందు చూపును లేకన్
సురాసురులనూ బాధలు బెట్టిరి నరాంతకులుగా మారి రటన్
భయము, కరుణలను, దాక్షిణ్యంబును దాపస ధర్మము నొదిలి రటన్! 16

వారిచేత బాధింపగ బడెడీ వరుసగా ఋషి సంఘంబులునూ
చారణులను గూడిన దేవతలును సర్వ సుజన ముని సంఘములున్
నరకములో నుండెడి నరులకు వలె నయముగ రక్షణ లేకుండన్
యలమటించిరీ యా దుండగముల యనుభవించుచును దిగులొందీ! 17

రఘుసత్తమ! ఓ రామా! వినుమా! రయమున రాక్షసులును వేగన్
శిల్పులలో నుత్తముడు, శ్రేష్ఠుడును చిరంజీవియును, అవ్యయుడున్
విశ్వకర్మనూ సమీపించి మఱి వినయము జూపుచు రాక్షసులున్
ఈ విధంబుగా బలికి రతనితో విమలమైన సంభాషణలన్! 18

ఓజస్సును, తేజస్సు బలమునూ యెనరగ గలిగిన వారు మఱిన్
తేజస్సులలో గొప్పవారయిన దీరుగ దేవతలకును మఱిన్
వారి హృదయములు నానందంబున వర్ధిలునట్లుగ గృహములనూ
నిర్మించిన వాడవు నీవే కద! నీవే ఘనుడవు శిల్పులలో! 19

మహామతే హిమవంతమునందున మహా మేఱు మందరములనూ
ఎచ్చటనైనా యాశ్రయించి మఱి ముచ్చటగా మాకును గూడన్
వరుస గృహంబుల నిర్మింపుము మఱి వన్నెలు చిన్నెలు జిందగనూ
మహేశు గృహమును బోలిన దానిని మాకును నిర్మింపుము వేగన్! 20

అటుపిమ్మట యా మహాబలుండును బటుతర శిల్పకళామయుడున్
విశ్వకర్మయును నా రాక్షసులను విమల భాషణల భాషించీ
దేవేంద్రుని యమరావతితోడను దేవనగరికిని సమమైనా
నివాసనగరము బరికల్పింపగ నెమ్మది దెలిపెను వారలకున్! 21

రాక్షసేశ్వరులు! వినుడో దెలిపెద రమ్యమైన మీ నివాసమున్
దక్షిణ సముద్ర తీరమునందున దగ త్రికూటమను నామమునన్
పర్వతమున్నది మఱి సువేలయను బర్వతమున్నది రెండవదీ
అచట మీకు బహు వాసయోగ్యమని యాలోచించుచునున్నాడన్! 22

ఆ త్రికూట పర్వతము జాడగా నంబుద సమానమైనదియున్
పక్షులు గూడను జొరబడరానిది భద్రమైనదియును నా పురియున్
టంకము చేతను ఛేదింపబడిన వంకలు లేనీ నలుదిశలున్
ఇంద్రుడపుడు నాజ్ఞాపించుటచే సాంద్రరీతి నే గట్టితినీ
ముప్పది యోజన విస్తీర్ణంబును మోదముగా శత యోజనముల్
పొడవును గలిగిన లంకాపురినీ పొలుపుగ నిర్మించితి నవుడున్
బంగరు ప్రాకారంబునున్నదియు రంగుగ చుట్టును సొగసులతో
బంగరు ముఖద్వారంబు తోడనూ సింగారము వెలయుచు నుండున్! 23, 24, 25,

రాక్షస పుంగవులారా! వినుడూ రమ్యమైన యా పురియందున్
అమరావతి నగరంబును పొందీ, యలదేవతలకు వలె మీరున్

ఆ రాక్షసులందఱును వినయమున యలయింద్రాది గణంబులతో
వచ్చిన వారును బ్రహ్మదేవుడని వరముల నివ్వగ వచ్చెననీ
ఎత్తబడిన దోసిలిగలవారై చిత్తమందు భక్తిని గలిగీ
వృక్షంబులవలె వణుకుచు వారలు విధితో నీ విధి బలికిరటన్! 13

తపసారాధితుడవైన నీవు మఱి దగవరముల నివ్వగదలచీ
వచ్చినచో మఱి వరములనిమ్మా మచ్చిక మాకును దయతోడన్
జయింప శక్యముగానీ వారమును, శత్రుమూకలను జంపుచునూ
చిరకాలము జీవించు వారలము సర్వ సమర్థులమై మిగులన్
పరస్పరము స్నేహము వర్ధిల్లగ బ్రతుకు వారమై యుండునటుల్
వరములనిమ్మా! మాపై దయతో వర్ధిల్లగ మే మందఱమున్! 14

బ్రాహ్మణ వత్సలుడైన బ్రహ్మయును వలికె నిటుల వాత్సల్యముతో
అట్లే మీరలు నగుదు రనుచునూ నలరుచు సుకేసు పుత్రులతో
బలుకుచు బ్రహ్మయు దరలిపోయెనూ బ్రహ్మలోకమును వేగముగన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా! సీతారామ్! 15

వరముల నందీ సుకేశుపుత్రులు వర గర్వము జేతను బొంగీ
ఏ మాత్రంబును భయములేక మఱి యెట్టి ముందు చూపును లేకన్
సురాసురులనూ బాధలు బెట్టరి నరాంతకులుగా మారి రటన్
భయము, కరుణలను, దాక్షిణ్యంబును దాపస ధర్మము నొదిలి దటన్! 16

వారిచేత బాధింపగ బడెడీ వరుసగా ఋషి సంఘంబులునూ
చారణులను గూడిన దేవతలును సర్వ సుజన ముని సంఘములున్
నరకములో నుండెడి నరులకు వలె నయముగ రక్షణ లేకుండన్
యలమటించిరీ యా దుండగముల యనుభవించుచును దిగులొందీ! 17

రఘుసత్తమ! ఓ రామా! వినుమా! రయమున రాక్షసులును వేగన్
శిల్పులలో నుత్తముడు, శ్రేష్ఠుడును చిరంజీవియును, అవ్యయుడున్
విశ్వకర్మనూ సమీపించి మఱి వినయము జూపుచు రాక్షసులున్
ఈ విధంబుగా బలికి రతనితో విమలమైన సంభాషణలన్! 18

ఓజస్సును, తేజస్సు బలమునూ యెనరగ గలిగిన వారు మఱిన్
తేజస్సులలో గొప్పవారయిన దీరుగ దేవతలకును మఱిన్
వారి హృదయములు నానందంబున వర్ధిలునట్లుగ గృహములనూ
నిర్మించిన వాడవు నీవే కద! నీవే ఘనుడవు శిల్పులలో! 19

మహామతే హిమవంతమునందున మహా మేఱు మందరములనూ
ఎచ్చటనైనా యాశ్రయించి మఱి ముచ్చటగా మాకును గూడన్
వరుస గృహంబుల నిర్మింపుము మఱి వన్నెలు చిన్నెలు జిందగనూ
మహేశు గృహమును బోలిన దానిని మాకును నిర్మింపుము వేగన్! 20

అటుపిమ్మట యా మహాబలుండును బటుతర శిల్పకళామయుడున్
విశ్వకర్మయును నా రాక్షసులను విమల భాషణల భాషించీ
దేవేంద్రుని యమరావతితోడను దేవనగరికిని సమమైనా
నివాసనగరము బరికల్పింపగ నెమ్మది దెలిపెను వారలకున్! 21

రాక్షసేశ్వరులు! వినుడో దెలిపెద రమ్యమైన మీ నివాసమున్
దక్షిణ సముద్ర తీరమునందున దగ త్రికూటమను నామమునన్
పర్వతమున్నది మఱి సువేలయను బర్వతమున్నది రెండవదీ
అచట మీకు బహు వాసయోగ్యమని యాలోచించుచునున్నాడన్! 22

ఆ త్రికూట పర్వతము జాడగా నంబుద సమానమైనదియున్
పక్షులు గూడను జొరబడరానిది భద్రమైనదియును నా పురియున్
టంకము చేతను ఛేదింపబడిన వంకలు లేనీ నలుదిశలున్
ఇంద్రుడపుడు నాజ్ఞాపించుటచే సాంద్రరీతి నే గట్టితినీ
ముప్పది యోజన విస్తీర్ణంబును మోదముగా శత యోజనముల్
పొడవును గలిగిన లంకాపురినీ పొలుపుగ నిర్మించితి నవుడున్
బంగరు ప్రాకారంబునున్నదియు రంగుగ చుట్టును సొగసులతో
బంగరు ముఖద్వారంబు తోడనూ సింగారము వెలయుచు నుండున్! 23, 24, 25,

రాక్షస పుంగవులారా! వినుడూ రమ్యమైన యా పురియందున్
అమరావతి నగరంబును పొందీ, యలదేవతలకు వలె మీరున్

ఆ లంకాపురి యందు వసింపుడు సమరులవలె మీరును గూడన్
సౌఖ్య విలాసంబులతో మీదును సరసరీతి వర్తింపుడికన్! 26

అటుబిమ్మట యా రాక్షస శ్రేష్ఠులు నల విశ్వకర్మ వచనములన్
యాదరించి నా లంకాపురిలో నమరులవలె తామును గూడన్!
వేలకొలది యనుచరులను గూడుక విమలమైన లంకాపురికిన్
జని దపియించిరి సుఖసౌఖ్యంబుల చారు విలాస సుహాసములన్! 28

ఆరజనీచరులందఱు గూడీ యాలంకాపురి నగరమునన్
దృఢప్రాకారము తోరణములను దీప్తిని హేమ వికారములున్
వేలకొలది గృహములతో గూడిన విమలమైన లంకను పొందీ
సంతసించుచును నటవసియించిరి సకల వస్తు పరికరములతో! 29

అనఘా దశరధరాజకుమారా! యలరివినుము నావచనములన్
అదే కాలమున యందున గలదూ యలరుచు స్వేచ్ఛా చారిణిగా
సంచరించుచు నొక గంధర్వ స్త్రీ వంచన లేకను నలుగురిలో
నర్మదయనెడి నామముతోడను నయముగ సఖియల గూడికొనీ! 30

హ్రీ శ్రీ కీర్తి సమద్యుతి గలిగిన హేమకాంతిగల కొమరితలన్
కన్యాత్రయమును గలిగియుండెనూ కలవరపాటును లేకుండన్
ఆ రాక్షస స్త్రీ కాని యామెయును నలరుచు సంతోషించుచునూ
పూర్ణచంద్రునీ ముఖములు గలిగిన పొలతుల ముప్పురు పుత్రికలన్
ఆ రాక్షసునీ జ్యేష్ఠక్రమమున యలరి యిచ్చె పత్నులుగాగన్
ఆ ముప్పురు గంధర్వ కన్యకలు నల భగుండు దేవతగలుగూ!
ఉత్తర ఫల్గుని నక్షత్రంబున ఉరుబలవంతులు సమయజ్ఞుల్
రాక్షసేంద్రులకు దల్లిచేత మఱి రమ్యముగా నర్పింపబడెన్! 31, 32

అటు బిమ్మట ఓ రఘురామా విను! నలరుచు సుకేశు పుత్రులునూ
దేవ పురుషులప్సర భామలతో దివ్యముగా క్రీడించినటుల్
తమ పత్నులతో క్రీడించిరిగా తన్మయముగ సంతోషముతో
సంతానంబును బొందిరి వారలు తమ తమ పత్నులచేత మఱిన్! 33

అటుబిమ్మట నా మాల్యవంతుడునుఅలరు భార్య సుందరి పేరన్
బరగుచునుండెను సుందరీ మణియు బహు చక్కనిదీ జూచుటకున్
ఆమె యందు నే సంతానంబును నాతడు బుట్టించెనొ వినుమా!
కాలధర్మమును మార్చజాలరూ కవులును ప్రభువులు ధరయందున్! 34

రామా! సుందరి యందు జనించెను రమ్య మాల్యవంతున కపుడున్
వజ్రముష్టి మఱి విరూపాక్షుడును దుర్ముఖుండు సుప్తఘ్నుడునూ
యజ్ఞకోపుడును మత్తోన్మత్తులు నట జనియించె కుమారులునూ
అనల యనెడి యొక కన్యకామణియు నతి సుందరియును జన్మించెన్! 35,36

అనఘా సుమాలి యను వానికినీ రమ్యకేతుమతి యను పేరన్
పూర్ణచంద్రునీ ముఖమును గలిగిన పొలతి వివాహంబయ్యె నటన్
ఆసుమాలికిని యలకేతుమతియు నలరెను ప్రాణ సమానముగా
అన్యోన్యంబుగ యాసతీ పతులు నానందంబుగ వర్ధిలిరీ! 37

మహారాజ ఓ దాశరథీ విను! మానుగ యల వృత్తాంతమునూ
రాక్షసుడగు నా సుమాలి యంతట రమణి కేతుమతి యందుననూ!
పుట్టించిన సంతానము నెట్టిదో పొలుపుగ వినుమా రఘురామా!
రఘుపతి రాఘవ రాజారామా! పతీత పావనా! సీతారామ్! 38

ప్రహస్తుండునూ యకంపనుండును వికటుడు కాలిక ముఖుండునూ
దూమ్రాక్షుండును దండుడు బుట్టెను మహా బలముగల సుపార్శ్వుడున్
సింహ్రాదియునూ ప్రఘసుడు మఱియును భాసకర్ణుడను రాక్షసుడున్
ఇట్టి కుమారులు జనించి రంతట యట్టి కేతుమతి సుమాలికిన్
సుచిస్మితమునగు రాకా మఱియును సుందరియగు పుష్పోత్కటయున్
కైకసి మఱి కుంభీనస యనియెడి కూతులు బుట్టిరి కొమరొప్పన్! 39, 40

సౌందర్యముతో బ్రకాశించునది సుందర పద్మసునేత్రములన్
నలరియు మిక్కిలి శ్రేష్ఠురాలైన కమనీయంబగు యక్షిణితో
సమానురాలును సహజ సుందరియు సకల గుణంబులు గలదియునూ
వసుధ మనెడి గంధర్వ కాంతయును వలనొప్పగ సతి మాలికినీ! 41

రఘుపతి రాఘవ రాజారామా! పతీత పావనా! సీతారామ్!
రఘురామా! 'విను! మాలివలననూ వసుధ యందు కలిగినయట్టీ
సంతానంబును గూర్చి దెలిపెదను సరగున వినుమా! విశదముగన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతీత పావనా! సీతారామ్! 42

అనలుడు అనిలుడు హరుడు సంపాతి యనెడి ప్రసిద్ధులు నైనట్టీ
విభీషణా మాత్యులు వరుసగనూ మాలిపుత్రులను విశదముగన్! 43

అటుబిమ్మట యామువురు రాక్షసులు నలరుచు శ్రేష్ఠులుగా నుండి
ఇతర రాక్షసులతోడ గూడికొని నింపుగ వందల కొలదియునూ
పుత్రుల తోడను గూడినవారై పొలుపుగ యధిక పరాక్రమమున్
గల వారగుచును వాయింద్రునితో కలకల లాడెడి దేవతలన్
ఋషులను, నాగుల, యక్షులనూ మఱి రూడిగ బాధించిరి జగతిన్! 44

వాయువునకు వలె లోకమునంతయు వరుసగ దిరుగుచు నుండి మఱిన్
దురాసదులను యుద్ధములందున దోర్బల మృత్యువు సమానమై
తేజస్సును మఱి గలవారగుచును తీరుగ వరముల చేత మఱిన్
గర్వితులగుచును క్రతుక్రియలకును ఘాతము జేయుచు యజ్ఞములన్
ధ్వంసము జేయుచు సజ్జన సంఘము దగ బాధించిరి యనిశమునూ! 45

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఐదవసర్గ సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఆఱవ సర్గము

(శివుని సమ్మతి చేత దేవతలు రాక్షసులను జంపుటకై విష్ణువును శరణు జొచ్చుట, విష్ణువు ధైర్యమును జెప్పగా వారు తిరిగి వెళ్ళిపోవుట - రాక్షసులు దేవతలతో యుద్ధము జేయుటకై వెళ్ళుట - వారికి సహాయము జేయుటకై విష్ణువు వచ్చుట)

ఆ రక్కసులును బీడింపగబడి యటగల దేవతలందఱునూ
తపసే ధనముగ గలిగినట్టి యా దగ ముని ఋషి గణములు నంతన్
భయార్తులై గడగడ వణుకుచునూ బన్నుగ యట్టి మహేశ్వరునీ
శరణు జొచ్చిరీ యంజలితోడను కరుణ జూడ మని ప్రార్థనలన్! 1

సృష్టిని యంతము జేయువాడునూ! పుట్టుక లేనీ వాడు మఱిన్
అవ్యక్తంబగు రూపముతోడను నఖిల లోకములకును ప్రభువై
ఆధారంబై యుండువాడునూ యారాధింపగ దగువాడున్
సకల జగములకు గురువగు వాడును శత్రువు మన్మథునకు మఱియున్
త్రిపురారుడు మఱి త్రినేత్రుండునూ తీరుగ కరుణను గలవాడున్
అట్టి మహేశ్వరు జేరి వినయమున నిట్టె భయము గద్గదములతో
మునులు, దేవతలు, ఋషులందఱును మ్రొక్కుచు ప్రార్థన జేసి రిటుల్! 2,3

ఓ పూజ్యుడ! ఓ ప్రజాధ్యక్షుడా వనరగ సుకేశు పుత్రులునూ
బ్రహ్మ యిచ్చినా వరములజేతను బాహు పరాక్రమ గర్వితులై
శత్రు పీడనము జేయుచు వారును, సకల ప్రజల మునిగణములనూ
సురలను గూడను బాధలు బెట్టుచు ద్రుక్కజేయుచుండిరి దేవా! 4

మా గృహంబులును నాశ్రయంబులను మన్నింపక బహు గర్వముతో
అరక్షణీయము జేసిరి వారలు నరకొర యాలోచన లేకన్
స్వర్గమునుండీ దేవతలందఱు సరగున దొలగించుచు వారున్
దేవతలకువలె నీ స్వర్గములో ధీరత నుండిరి సౌఖ్యములన్! 5

మాలి, సుమాలీ, మాల్యవంతుడును మానుగ ముందర నడిచెడి యా
ఎవరున్నారో యా రాక్షసులును నించుక భయమును లేకుండన్
యుద్ధ మందు గర్వించినవారై-యద్దతులై బహు గర్వమునన్
నే విష్ణువునూ, నే రుద్రుడనూ, నేనే బ్రహ్మ ప్రజాపతినీ

నేనే దేవేంద్రుండను యముడను, నే వరుణుడ నే చంద్రుడనూ
నేనే సూర్యుడ ననుచు జెప్పుకొని నిఖిల లోకముల గర్వితులై
బాధలు బెట్టుచు నున్నవారు సూ! ప్రబల గర్వితులు లోకమునన్! 6,7

పరమ శివుడ! ఓ ప్రజాధ్యక్షుడా! బన్నుగ యా కారణముననూ
భయార్తులమునగు మాకు నిప్పుడును భద్రము జే కూర్పుము దేవా!
అభయము నిచ్చి మము కాపాడుము! అర్హత నీకే గలదు సుమా!
భయంకరంబగు రూపము దాల్చి ప్రబల రాక్షసుల హరింపుమా! 8

సురముని గణములు నిటుల బలుకుచును బరిపరి విధముల ప్రార్థింపన్
జటాధారి ప్రభువైన యీశ్వరుడు చలియించెను వారల మొఱలన్
కాని శివుడు తన నాశ్రయించినా కఠినుడైన యా సుకేశుపై
పక్షపాతమును గలవాడగుటను బలికెను నిటులను వారలతో! 9

దేవతలారా! ఓ మునులారా! దీరుగ వరముల నిచ్చితినీ,
చంపదగిన వారలు కాదు సుమా! చంపగ జాలను వారలనూ!
అయితే వారల జంపువారినీ యాలోచన నే జేసెదనూ
ఆ యాలోచన మీకు దెలిపెదను! అలరి భద్రమగు నికముందున్! 10

మునులారా! ఓ ఋషి పుంగవులూ! మోదముననను దేవతలారా!
ఈ కార్యమును జేయుట కొఱకై యింపుగ విష్ణువు కడకేగీ
మహా విష్ణువును శరణుబొందుడూ మన్నించును మీ ప్రార్థనలన్
సమర్థుడగు నా మహావిష్ణువును సంహరింప గలుగును వారిన్! 11

అటు బిమ్మట రాక్షసుల భయంబున యల దేవతలును, ఋషులు, మునుల్
ఆ మహేశ్వరుని యభినందించుచు నలరుచు జయ శబ్దంబులచే
జయ! విజయీభవ! యనుచును వారలు చయ్యన యా విష్ణువు కడకున్
శరణు వేడగా బోయిరి వారలు శరణు శరణనుచు విష్ణువునూ! 12

శంఖ చక్రములు ధరించినట్టి సర్వేశ్వరుడగువిష్ణువుకున్
నమస్కరించుచు వారందఱునూ నయముగ గౌరవమును జేసీ
ఆ సుకేసునీ పుత్రులగూర్చి యపరిమితంబగు భయంబుతో
గూడిన వాక్యము బలికిరి నిట్టుల కూరిమి భక్తి ప్రపత్తులతో! 13

దేవదేవ! త్రేతాగ్ని1 సన్నిభులు దిరుగ ముప్పురు రాక్షసులున్
అసుకేసు పుత్రులు నా ముప్పురు నలరు ప్రజాపతి వరములచే
గర్వితులై మఱి మా స్థానంబులు కలచి గైకొనిరి నిక్కముగా
గృహ సంపదలును నాక్రమించిరీ గీపెట్టగ మే మందఱమున్! 14

ప్రవేశింపగా రాని నగరమది బన్నుగ లంకా యనుపేరన్
త్రికూట పర్వత శిఖరమునున్నది స్థిరముగ యితరులు జొరకుండన్
ఆ రాక్షసులును నట వసియించుచు నలరుచు మమ్ములనందఱినీ
బాధలు బెట్టుచు, భంగబఱచుచును బలు హింసల గురి జేయుచునూ! 15

ఓ సురేశ్వరా! మధుసూదన విను వనరగ మాహితమును గోరీ
ఆ రాక్షసులను సంహరింపుమా! నార్తులమగు మము రక్షింపూ!
నిన్ను శరణమును వేడుచుంటిమీ! నీనేగతియని నమ్మితిమీ
ఆలశింపకుము సంహరింపుమా! అల రాక్షసులను వేగముగా! 16

ఆ రాక్షసులా ముఖపద్మంబుల యలరి చక్రమున ఛేదించీ
యమలోకమునకు బంపుము వారల యభయమిచ్చి మము రక్షింపూ
భయము గలుగునపుడును మఱి నీవే భయము దీర్చువాడవు నీవే!
నీవు దప్ప మాకెవ్వరు లేరూ! నిర్ణయింపుమా! రక్షింపన్! 17

మదముచేత మితిమీరిన వారిని మఱి పరివారము గలవారిన్
సమరమునందున సంహరింపుమా! సభ్యతలేనీ వారలనూ
భాస్కరుండు నీహారతెరమువలె బరగ తొలగజేసిన యటులన్
మాదు భయంబును దొలగ జేయుచూ మానుగ రాక్షసులను ద్రుంచీ! 18

దేవదేవుడును నభయ ప్రదాతయు దీన రక్షకుడు విష్ణువునూ
సురలు మునుల మాటలు విని విష్ణువు సురుచిరమగు నోదార్పులతో!
వారల కభయము నిచ్చి విష్ణువును నండ నే ననుచు బలుకుచునూ
మఱియు వారితోసంభాషించెను మధురముగా నీవిధముగనూ! 19

ఈశ్వరు వరములచేత గర్వితుడు నింపుగ యెఱుగుదు సుకేశునీ,
వారి యొక్క తనయుల నే నెఱుగుదు వలనొప్పగ జ్యేష్ఠుడునైనా
మాల్యవంతునీ నె నెఱుగుదునూ మానుగ తదితర పుత్రులనూ
దుండగముల నే నిర్మూలించెద చెండెద వారల సమరమునన్! 20

సమతిక్రాంత మర్యాదులు వారును సాహసులును మఱి దుర్మతులున్
వారిపైని సంక్రుద్ధుడనై నే వధియించెద నిదె నిక్కముగా
మనస్తాపమును విడిచి పెట్టుడూ మానుగ ధైర్యంబును గలిగీ
వర్తింపుండని బలికెను విష్ణువు వనరగ దేవతలను గనుచున్! 21

ప్రభ విష్ణువునగు విష్ణువు పలుకులు బన్నుగ సమస్త దేవతలున్
మునులు దేవతలు సంతోషించిరి మోదము చెందిరి మదియందున్
విష్ణుదేవునీ ప్రశంసించుచును విమలముగా కీర్తించుచునూ
తమ తమ తావులకును బయనించిరి తగ ఋషి మునులును దేవతలున్! 22

నిశాచరుండగు మాల్యవంతుడును నిశితమైన యాలోచనతో
విబుధుల ప్రయత్నములను తెలిసికొని వేగముగా దమ్ముల బలిచీ!
వీరులైన వారలతో నిట్లనె వీర ప్రతాపము జేయుచునూ
రఘుపతి రాఘవ! రాజారామా! పతిత పావనా సీతారామ్! 23

మునులు దేవతలు ఋషులందఱునూ జని యా విష్ణువు కడకు మఱిన్
మన సంహారము గోరువారునై మానుగ మహేశ్వరుని జేరీ
ఈ విధి వారలు బలికినారటా! యింపుగ ప్రార్థనలను జేసీ
తమ బాధలనూ దెలిపిన వారట! తగ భక్తిని స్తుతులను జేసీ! 24

దేవదేవ ఓ శత్రుభయంకర! తీరుగ మా మొఱలను వినుమా!
సుకేశు పుత్రులు వరదానంబున శుభము దలంపక క్రూరులునై
భయంకరంబగు రూపంబులతో బలగర్వితులై యడుగడుగున్
బాధలు బెట్టుచు నున్న వారు సుమ! బరగ మాకు నభయము నిమ్మా! 25

ప్రజాపతే! హే మహేశ్వరా విను! బన్నుగ మాదు సుప్రార్థనలన్
అభిభూతులమై యున్న వారమును యాసుకేసు పుత్రుల చేతన్
దురాత్ములగు వారలచే మేమును దుఃఖాత్ములమైతిమి దేవా!
వారి భయముచే మా గృహములనూ వసింపజాలక యుంటిమిగా! 26

త్రిలోచనా! విను! ఆ కారణమున దీరుగ మా హితమున కొఱకై
ఆ సుకేసు పుత్రుల ముగ్గురినీ యణచి మేయుమా వేగముగన్
కాల రాక్షసుల హుంకారంబును నేల రాయుమా వేగముగన్
అభయమిచ్చి మము సంరక్షింపుము నాదుకొనుము వేగము మమ్మున్! 27

ఆ ముని దేవత లటుల బలుకగా నంధక సూదనుడైనట్టీ
ఆ పరమేశ్వరు డా పలుకులు విని యలరుచు శిరస్సు హస్తములన్
కదిలించుచు వారలతో నిట్లనె కమనీయంబగు బలుకులనూ!
రఘుపతి రాఘవ! రాజారామా! పతిత పావనా సీతారామ్! 28

ఓ ముని దేవతలారా! వినుడో! ఓ ఋషులారా! వినుడు మఱిన్
ఆ సుకేశుపుత్రుల నే రణమున యలరి చంపగా రాదు మఱిన్
వారలనెవ్వడు జంపగలగునో యా యుపాయమును దెలిపెదనూ!
ఆ విధమున జేసిన మీకగునూ యఖిల శుభంబులు వేగముగన్! 29

శంఖ చక్రములు గలవాడును మఱి శార్ఙ్గము గదయును గలవాడున్
పచ్చని వస్త్రము గలవాడును మఱి బరగశత్రుజన పీడకుడున్
పాపహరుండును శ్రీమంతుడును పావన లక్ష్మీ వల్లభుడున్
అట్టి ఘనుడు శ్రీ నారాయణునీ యిట్టె శరణు బొందుడు మీరున్! 30

ఆ మహేశ్వరుని యాలోచనలను నలరి దేవతలు గ్రహియించీ
అల శివునకునూ నమస్కరించీ యందుకొనుచు బహు దీవెనలన్
శ్రీ నారాయణుని గృహంబుజేరీ చిత్తమందు బ్రార్థించుచునూ
అతనికి నంతయు దెలియజెప్పిరీ మతి యందున గల వేదననూ! 31

అటు బిమ్మట యా మహావిష్ణువును నలయింద్రాది సుదేవతలున్
ఓదార్చుచు వారల వేదనలను వనరగ యీ విధమున బలికెన్
ఆ రాక్షసులను సుకేశు పుత్రుల యణచివేసెదను సురలారా!
నిర్భయంబుగా నుండుడు మీరలు నిశ్చయంబులివి నా పలుకుల్! 32

రాక్షస పుంగవులారా! వినుడూ! రయమున నా పలుకులు వినుడూ!
భయ భీతులునగు దేవతలకునూ పరగ మనల జంపెద ననుచున్
ప్రతిజ్ఞజేసెను నల విష్ణువునూ బన్నుగ వినుడో సఖులారా!
ఏమి చేయగా వలెనో యిప్పుడు నింపుగ యోచింపుడు మీరల్! 33

హిరణ్యకశిపుడు వన్య రాక్షసులు అతనిచేత మృతి నొందిరిగా!
నముచి కాలనేమియు వీరుండగు సంహ్రాదుండును మరణించెన్
బహుమాయలుగల రాధేయుండును బన్నుగ ధార్మికుడగు వాడున్
లోకపాలుడును యమలార్జునులును, హార్దిక్యుడు, కుంభుడుగూడన్!

నిశుంభకుండును యమలార్జునులను హార్దిక్యుడు, శుంభుడు గూడన్
నిశుంభకుండును సత్త్వవంతులును నిష్ఠుర బలురగు నసురులునూ!
దానవులును వీరందఱు గూడను దగ సంగ్రామము జేసి మఱిన్
పరాజయంబును బొందక మఱలను బాహుబలంబుల గృహములకున్
బోయినట్లుగా వినబడలేదూ! బొంకముగా విజయశ్రీతో! 34, 35, 36

అసురులందఱును వందలకొలదియు నలరుచు క్రతువులు జేత మఱిన్
వరములు బొందిన వారేగానీ, వన్నె దప్పి వర్తింపరుగా!
అందఱు మాయలు దెలిసిన వారే యందరు సర్వాస్త్రములందున్
చతురత గలిగిన వారేగానీ చవటలు కాదుగదా యనిలో!
అందఱు శత్రుభయంకరులును మఱి యనిలో వీరపరాక్రములున్
కానీ యనిలో చంపబడిరిగా క్రమముగ నారాయణుజేతన్! 37

దీని దెలిసికొని మన మందఱమును దీక్షను యుక్తమునగు దానిన్
చేయవలసినది జేయుదమిపుడును జేరగవలయును గమ్యమునూ!
మనలజంపుటకు నారాయణుడును మానుగ నిశ్చయమును జేసెన్
ఆ నారాయణు జయించుటనునది అది బహు కష్టము యోచింపన్! 38

అటు బిమ్మటనూ సుమాలి మాలియు నట్టి మాల్యవంతుని బలుకుల్
విని మిక్కిలి యాశ్చర్యమును బొందుచును విమల వచనములతోడ మఱిన్
అశ్వని దేవతలు నింద్రునితో నలరి బలికినటు జింతనతో
అన్నగారితో బలికె నిట్టులను జెన్నుగ గారవమును దొలుకన్! 39

అన్నా! మన మధ్యయనంబులనూ యలరి జేసితిమి బాగుగనూ!
యాగంబులు మఱి జేసిన వారము దానంబులు మఱి జేసితిమీ!
నిరామయంబగు నాయుర్దాయము నిర్మలముగ మనమందితిమీ
సుధర్మమార్గము స్థాపించితిమీ! సురచిరముగ మన రాజ్యమున్! 40

అక్షోభ్యంబగు దేవసాగరము నస్త్రంబులను బ్రవేశించీ
సాటిలేని విధముగ శత్రువులను జయించినారము రణమందున్
శత్రువులందఱ జయించినారము శాత్రువులును మఱిలేకుండన్
అందు చేత మృత్యువుతో మనకును చందముగా భయమును లేదూ! 41

నారాయణుడును రుద్రుడు నింద్రుడు నయముగ యముడును గూడ మఱిన్
అలదేవతలును యక్ష కిన్నరలు నల పన్నగులును భయపడుచున్
సమ్ముఖమున నిలబడుటకు గూడను నిమ్మగ భయపడుచుంద్రు గదా!
సంగ్రామంబున నెటుల వచ్చునిక సరసముగా నారాయణుడున్! 42

రాక్షస రాజా! విష్ణువునకు మఱి రహిమనపై ద్వేషములేదూ!
ఆ దేవతలా చెప్పుడు మాటలు నలరి వినెను నారాయణుడున్
చెప్పుడు మాటలు జేటు వచ్చుగద! కప్పను మ్రింగిన పాములెన్
రఘుపతి రాఘవ! రాజారామా! పతిత పావనా సీతారామ్! 43

ఆ కారణమున వలన యిప్పుడే యన్యోన్యంబును గూడికొనీ
ఏ దోషంబున వలన విష్ణునకు నీ దోషంబును గలిగినదో
అట్టి దేవతల సంహరింపగను నిట్టె బోవుదము త్వరితముగన్!
ఆలసింపకను నా కార్యంబును నలరిచేయుదము ఈనాడే! 44

బలవంతులునగు రాక్షస శ్రేష్ఠులు బరగ యీ విధము యోజించీ
సకల సైన్యములతో గూడికొనీ సర్వ ప్రయత్నములను జేసీ
జంభుడు వృత్రాసురులకు బోలెను సరగున రాక్షసులకు దెలిపీ
సంగ్రామమునకు బయలుదేరిరీ సరగున సురలను మర్దింపన్! 45

రఘురామా! విను! రమణీయమునగు రమ్యమైన వృత్తాంతంబున్
మహాకాయమును మహాబలముగల మానుగ రాక్షస వీరులునూ
ఈ విధముగ యాలోచనజేసీ, యీ విధముగ యత్నముజేసీ
యుద్ధము జేయగ బయలుదేరిరీ యిద్ధర జెందగ భయభీతుల్! 46

బలముచేత గర్వించిన వారును పరాక్రమముచే వారలునూ
రాక్షసులందఱు లంకను విడిచీ రయమున రథములు యేనుగులున్
కరి సన్నిభములునగు హయములతో, గార్ధభములు, వృషభంబులతో
శింశుమారముల తోడను మఱియును సంశయమింతయు లేకుండన్
సర్పంబులతో మొసళ్ళతోడను పరుగున తాబేళుల చేతన్
చేపలతో గరుడోసమానమగు గలుగు విహంగంబుల తోడన్
సింహంబులు వ్యాఘ్రంబులతోడను శ్రీ వరాహములు సృమరములున్
చతుర మృగములను నధిరోహించే చతురులైన రాక్షస వీరుల్
యుద్ధము జేయగ దేవలోకమును యుద్ధతిబోయిరి రాక్షసులున్! 47, 48, 49

అటు బిమ్మట యా లంకను గలిగిన యలరెడి ప్రాణులు నన్నియునూ
లంకలోని మార్పులు గమనించుచు వంకలు, దుశ్శకునములు మఱిన్
అన్నివైపులను భయమును జాచీ యారాటము జెందుచు మదిలో
ఉత్సాహ శూన్యమగు మనసులు గలిగీ యూహ కందనీ విధమగుచున్! 50

అటు బిమ్మట యారాక్షస వీరులు నలరి వేలకొలదియు వారున్
శ్రేష్ఠములైనా రథములనెక్కి శీఘ్రము ప్రయత్న పూర్వముగన్
స్వర్గలోకమును బయలుదేరిరీ స్వర్గవాసులను మర్దింపన్
అటు రాక్షసులును బయలుదేరగా నిటు బరుగెత్తిరి దేవతలున్! 51,52

ఇల పృథివికి సంబంధించినవియునూ యల యాకాశమునకు గూడన్
సంబంధించిన యపశకునంబులు సరగున కనబడె వారలకున్
రాక్షస వినాశమును సూచించుచు రయమున కనబడె వారలకున్
ఉత్పాతంబులు గనబడె వారికి యూహకు నందని విధముననూ! 53

మేఘుంబులు నస్థులను రాల్చినవి మిగుల వేడి రక్తము గురిసెన్
సముద్రములునూ తీరంబులనూ సముత్క్రాంతమై దొరలినవీ
పర్వతములు గూడను జలించినవి బన్నుగ ధ్వనులను జేయుచునూ
పిడుగుల తోడను వర్షము గురిసెను పెనుగాలులు వీచెను ధరిణిన్! 54

కొన్ని భూతములు నట్టహాసములు కొమరొప్పగ జేయుచు నుండెన్
వెకిలి నవ్వులను నగుచు మేఘములు వెలవెల నుఱుములు సుఱుమునటుల్
ఘోర దర్శనము గలుగు నక్కలును గూయుచునుండెను బెనుమ్రోతన్
భయంకరముగా బీభత్సముగా ప్రకృతి యుండెనూ జూచుటకున్! 55

అటు బిమ్మట పృథివ్యాది భూతములు చటులత క్రమానుసారముగా
నేలమీద బడిపోవుచున్నటుల నిండు దృశ్యములు గనిపించెన్
అపుడచ్చటను మహత్తరమైనా నలగృధ చక్రము గనిపించెన్
ఘనమగు జ్వాలల విడిచెడి ముఖముల కాలయముని వలె కనిపించెన్
రక్షోగణములపైని దుముకుచును రవలు జేయుచుండెను మిగులన్! 56

ఎఱ్ఱని పాదంబులు గలిగిన యా యెగురుచు కపోతములు వచ్చెన్
ఆవిధముగనే గోరింకలునూ నటకొచ్చెను నెగురుచును మఱిన్
కాకులు, పిల్లులు, ద్విపాదికలునూ కలయజూచుచును దిక్కులనూ
కూయుచు నుండెను బలు విధములుగా కువలయంబు మార్మ్రోగగనూ! 57

బలదర్పితులును సుకేశు పుత్రులు బన్నుగ యా రాక్షసులు మఱిన్
అవశునంబులు నలరి జూచుచును యనాదరంబును జేయుచునూ
మృత్యు పాశముల తగుల్కొనుచునూ, మేదిని యడుగులు వేయుచునూ
ముందుకు బోవుచు నుండిరిగానీ కందుచు వెనుకకు బోరుగదా! 58

ఆ రాక్షసులకు ముందు నడిచెడీ యల మాల్యవతుడు సుమాలియున్
సుమహాబలుడగు మాల్యవంతుడును శూరులు మఱి యా రాక్షసులున్
జ్వలించుచుండిరి యగ్నులవలెనూ, చలింపకుండిరి వారలునూ!
దివి దేవతలను మర్దింపగనూ ధీరత వోయిరి దండెత్తి ! 59

ఆ సమయంబున రాక్షసులందఱు నలరు మాల్యవంతుని వారున్
మాల్యవంతమును పర్వతమునుగా మానుగ భావించిరి యపుడున్
దేవతలందఱు బ్రహ్మదేవునీ తేజము జూచిన యటుల మఱిన్
మాల్యవంతునీ జూచిరాక్షసులు మానుగ యాశ్రయమంది రటన్! 60

మాలివశమునందున్న సైన్యమును మహామేఘముల ధ్వని గలిగీ
ఆ రాక్షస నాయకుల బలంబును నల జయమును సాధింపగనూ
దేవలోకమును బయలుదేరెను దీక్షతోని యాయుధములతో
పలు నాదములను జేయుచు బోయిరి పటు వచనములను బలుకుచునూ! 61

అట్టి సమయమున ప్రభువగు విష్ణువు నారాక్షసుల ప్రయత్నంబున్
ఆలోచనలను దేవదూతలును నటు వినివింపగ వేగముగన్
సుకేసు పుత్రులతోని యుద్ధమును శూరత జేయగ కల్పించీ
బయలుదేరెనూ ప్రబలాయుధములు బన్నుగ తన వెంటను నుండన్! 62

అటు బిమ్మట కనులేక్షణుండునగు నా విష్ణువు బహు త్వరితగతిన్
సిద్ధాయుధములు నంబుల పొదులును సకలాయుధములు ధరియించీ
వైన తేయునీ వాహనంబుగా బన్నుగ గైకొని వేగముగా
సహస్రార్కు సమ ద్యుతులును గలిగిన సవ్యమైన కవచమునందీ
శరసంపూర్ణములును విమలములును ధరియించుచు నంబుల పొదులున్! 63,64,65,66

శ్రోణిసూత్రమును విమల ఖడ్గమును సూటిగ శంఖము చక్రములన్
గదా శార్ జ్గముల వివిధాయుధముల గడు నాసక్తిని ధరియించీ
సువర్ణ శోభల రెక్కలు గలిగిన శోభితగిరి సంకాశమునూ

గరుత్మంతునీ యధిష్ఠించుచును కండకావరము గలిగిన యా
రాక్షస వినాశమును జేయుటకై రయమున బోయెను విష్ణువునూ!
పచ్చని వస్త్రములను ధరించియను బరగ వైనతేయుని మీదన్
నల్లని దేహపు ఛాయను గలిగిన నయమగ శ్రీ నారాయణుడున్
బంగరు గిరి శిఖరంబు మీదనూ రంగుగ మెఱుపును గూడిన యా
మేఘమునకు వలె ప్రకాశించెనూ మిగుల మహా విష్ణువు నపుడున్! 67

అసురసేన శత్రువునైనట్టి యా నారాయణుడును వేగన్
సిద్ధులు, సాధ్యులు దేవఋషులునూ, స్థిరముగ మహోరగులు గూడన్
గంధర్వులు, యక్షులు నందఱునూ కరణాకరు నటస్తుతియింపన్
శంఖు చక్ర ఖడ్గముల ధరించీ సంహరింప యా రాక్షసులన్
బయలుదేరెనూ గరుత్మంతుపై బన్నుగ మునులును హర్షింపన్! 68

గరుత్మంతునీ ఱెక్కలగాలిని కావరమంతయు బోనాడీ
ఎగిరిపోవుచుండిరి రాక్షసులును నెండుటాకులను బోలె నటన్
తిరిగిపోవుచుండెను పతాకలును తేజముదప్పుచు వ్యోమమునన్
ఆయుధములు జెల్లాజెదరగుచును నటు నిటు బోయెను దెరలుచునూ
ఆ విధమగ యా రాక్షస సైన్యము నల నల్లని రాళ్లను గలుగూ
నల్లని పర్వత శిఖరంబుల వలె నయముగ కదలెను నటునిటులన్! 69

అట్టి సమయమున రాక్షస వీరులు చుట్టుముట్టి యామాధవునీ
రక్తమాంసముల బూయబడిన యా రమ్యప్రళయ కాలములోనీ
అగ్నుల యాకారంబు గలిగినా యరుణారుణ కాంతులు జిందన్
వాడియైన శ్రేష్ఠములైనట్టే వరాయుధములను విష్ణువునూ
కొట్టసాగిరీ నలువైపులనూ కూరిమి యా రాక్షసు లపుడున్ ! 70

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఆఱవ సర్గ సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (మొదటి సంపుటము)

# సప్తమ సర్గము

(శ్రీ మహావిష్ణువు రాక్షసులను సంహరించుట, రాక్షసులు పారిపోవుట)

రాక్షసు లనియెడి యంబుదంబులను రొహిగర్జించుచు తీంద్రముతో
మేఘంబులు మఱి పర్వతంబుపై మిక్కిలి వర్షించిన రీతిన్
నారాయణుడను పర్వతంబుపై నయముగ శరవర్షము జేతన్
కురిపించిరి యా రాక్షస వీరులు గూరిమి యా విష్ణువు పైని! 1

నల్లనైన రాక్షస శ్రేష్ఠులచే నిర్మలి చుట్టును ముట్టగనూ
నల్లగాను శుభ్రముగా నన్నా నారాయణుడును నలుగుచునూ
వర్షించెడి యా మేఘంబులచే వరుసగ కప్పగ బడినట్టీ
అంజన గిరివలె భాసిలుచుండెను నా విష్ణువు నా సమయమునన్! 2

అట్టి రాక్షసుల ధనువుల నుండియు నిట్టె బయలుదేరిన యట్టీ
వజ్ర - వాయు - మన - జవములు గలిగిన వచ్చిన యా బాణంబులునూ
మిడతలు, దూసిన పంట చేనువలె మేలిమి దోమలు నగ్నివలెన్
అమృతకలశమును నీగలవలెనూ ప్రళయమున లోకములవలెన్
ఆ నారాయణు శరీరంబులో నలరి ప్రవేశించిన వపుడున్! 3,4

రథముల నెక్కి వచ్చిన వారును రథికులునూ బహూవేగముగన్
గజములనెక్కి వచ్చిన వారును గజారూఢులును త్వరితగతిన్
అశ్వంబులపై నధిరోహించిన యాశ్వికులును బహు వేగముగన్
ఆకాశముపై నిలిచినట్టి యా అలరు కాలిబంటులు గూడన్
పర్వతముల బోలెడి రాక్షసులును బాణంబులచే శూలచే
తోమరములచే బుష్టుల చేతను దోరముగా నా విష్ణువునూ
ప్రాణాయామంబులు ద్విజానకు వలె బరగజేసినవి నిశ్వాసన్! 5,6

మీనంబులు మఱి మహాసంద్రమును మీటిన యట్టుల రాక్షసులన్
మహావిష్ణువును గొట్టుచుండగా మఱి యెదిరింపగ రానట్టీ!
నారాయణుడును శార్ఙ్గ ధనస్సును నయముగ సంధించుచు వేగన్
ఆ రాక్షస మూకలపైశరములు నలరి ప్రయోగించెను నపుడున్! 7

అటుబిమ్మట యా మహావిష్ణువును నలరి వజ్రముల సమానమౌ
మనోవేగమును గల తేజముగల మానుగ వందలు వేలు మతిన్
పూర్తిగ లాగీ యా రాక్షసులను బొగరణగించెను సమరమునన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 8

ఆ పురుషోత్తముడైన విష్ణువును అలరి మొదలిడిన వర్షమునూ
వాయువునకు వలె యారాక్షసులను వరుసను తన బాణంబులచే
తరిమివేసి ఘన పాంచజన్యమును దగ పూరించెను రణమందున్
ఆ రాక్షసులకు గుండెలు దడదడ నటమట నొందగ తీవ్రముగన్! 9

ప్రాణబలము నంతను బూరించీ బన్నుగ పూరింపగ బడినా
శంఖముంబులలో శ్రేష్ఠమైన యా శంఖము పాంచజన్యంబున్
త్రైలోక్యంబుల జీవులన్నిటికి తెరలి భయంబును గలుగునటుల్
భయంకరముగా ధ్వనులను జేసెను బరగ రాక్షసులు భయమందన్! 10

అటుపిమ్మట నా శ్రేష్ఠ శంఖ ధ్వని యరణ్య మధ్యము నందుననూ
సింహ గర్జనము వోలె ధ్వనించెను జింత జెందగా నల జగముల్!
ఆ రాక్షసులకు భయముగలుగగా నటునిటు బరుగెత్తిరి వారున్
చిందరవందరగా హయంబులును కందుచు పారెను కుంజరముల్! 11

పాంచజన్య ధ్వని విని హయంబులును బన్నుగ నిలువగ లేక యనిన్
దుర్బలంబులై చదికిలబడుచును దురుసుతనంబింతయు లేకన్
కుంజరముల మదమంతయు బోయెను గూలెను రణరంగమునందున్
వీరులు రథముల నుండి జారిపడి విలవిల బోయిరి దిక్కులకున్! 12

శార్ఙ్గచాపమును నుండి వెడలినా శౌరిజేత విడువగబడినా
వజ్రతుల్యమగు నగ్రభాగములు వనరగ సుపుంఖములు గలుగూ
అట్టి బాణములు నా రాక్షసులను అణచి చీల్చివేయుచు ధరణిన్!
ప్రవేశించుచున్నవి జూచుటకును భయము గలుగ జేయుచు నుండెన్! 13

నారాయణు హస్తములనుండియును నయముగ జారిన బాణములన్
యుద్ధమునందున భిద్యమానులగు యోధులు రాక్షస వీరులునూ

వజ్రముచేతను గాల్చబడిన యా వనరగ శైలంబుల వోలెన్
నేలమీద శయనించిరి వారలు నిద్రబొందిరీ దీర్ఘమునౌ! 14

విష్ణుదేవునీ చక్రమునుండీ విక్రృతముగ జేయగబడినా
శత్రుబలగముల వ్రణముల నుండీ స్రవియించెను శ్రోణిత ధారల్
అచలములందున స్వర్ణధారలును నలరి స్రవించెడి విధమునమా
అస్రృక్ ధారలు బ్రవహించెనుగా నా రాక్షసులకు రణమందున్! 15

శ్రేష్ఠమైన యా శంఖ ధ్వనియును స్థిరముగ శార్ జ్గధ్వని మఱియున్
విష్ణుమూర్తి జేసెడి యారవమును వికలము జేసెను రణమందున్
ఆ రాక్షసులా ధ్వనుల నన్నిటిని యలరి మ్రింగివేయుచు నుండెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 16

ఆహరి పటుబాణుంబులచేతను నట్టి రక్కసుల బలగమునూ
కదల్చబడినా కంఠంబులనూ కరముల శరముల ధ్వజములనూ
ధనస్సులను, రథముల, పతాకలును దగ యంబుల పాదులును గూడన్
ఛేదించెను తన బాణంబులచే ఛేదించెను రాక్షస బలమున్! 17

అటుపిమ్మట నారాయణజేతను నలరి ప్రయోగింపగ బడినా
శార్జ్గమునుండీ విడువబడిన యా శతసహస్రములుగా శరముల్!
సూర్యుని నుండీ ఘర్మ కిరణములు సూటిగ వచ్చిన రీతిగనూ
ఘన సంద్రంబున జల ప్రవాహముల గదులుచు వచ్చిన రీతిగనూ
గిరుల నుండియును గజేంద్రంబులును వరుసగ వచ్చిన విధముగనూ
మేఘము నుండీ జలధారలునూ మిగుల ధరణి కురిసిన యటుల్
శీఘ్రముగా వచ్చెను రణమందున చిందుచు జెండుచు రక్కసులన్! 18, 19

ప్రభు విష్ణుండగు మహా విష్ణువును బన్నుగ యారాక్షసులను మఱిన్
శరభమృగముచే సింహంబునువలె సింహము జేతను కరులవలెన్
ఏనుగుచేతను పెద్దపులులవలె వ్యాఘ్రముచే జిఱుతల వలెనూ!
చిఱుత చేత మఱి శునకంబులవలె శునకముచే పిల్లుల-వోలెన్
పిల్లిచేత సర్పంబుల వోలెను సర్పముచే నెలుకల వోలెన్!

ఆ విధముగ యా రాక్షసులందఱు నలరి విష్ణువును దరుమగనూ
వారందఱునూ బరుగు లెత్తిరీ వరుసగ భయబడుచును వేగన్!
శయినించిరి కొందఱు రాక్షసులును దీర్ఘ నిద్దురను కుంభినిపై! 20, 21, 22

మధుసూధనుడును వేలకొలది యా మానుగ రాక్షసులను జంపీ
దేవేంద్రుడు తోమరమును వోలెను శంఖంబును పూరించి మఱిన్
తన విజయంబును జాటెను రణమున దగ రాక్షసు లపజయమందన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 23

నారాయణునీ బాణంబులచే నయముగ పరాజయమును నందీ,
భయపడినట్టియు భంగపడిన యా పాంచజన్య ధ్వనులను వినుచున్
రాక్షస బలగము విహ్వలమాయెను ప్రభగ్నమై పరుగులు దీసెన్
అభిముఖంబుగా లంకకు బోయిరి యా రక్కసులందఱు గూడన్! 24

రాక్షస సైన్యము నారాయణుచే రహిశరములచే గొట్టబడీ
ప్రభగ్నమగుచుండగ దా జూచీ బన్నుగ నపుడు సుమాలియునూ
సంగ్రామంబున మాలి విష్ణువును శరజాలంబున తీవ్రముగా
అడ్డుకొనెను మఱి నివారించెనూ యా విష్ణువు బలవిక్రమమున్! 25

ఆసుమాలియును, నా విష్ణువునూ యలరి బాణవర్షము జేతన్
పొగమంచును వలె యా భాస్కరునీ గప్పి వేయునటు దా గప్పెన్,
అటుబిమ్మట సత్త్వముతో గూడిన చటుల రక్కసులు ముదమందీ,
ధైర్యంబును బొందిరి శీఘ్రముగా వీర్య పరాక్రమములు దొలుకన్ ! 26

అటుబిమ్మట యా బలదర్పితుడును నాసుమాలియను రాక్షసుడున్
మహానాదమును జేయుచు వాడును మానుగ గర్జన జేయుచునూ,
రాక్షసులందఱ రణరంగములో రహిప్రతికింపగ జేయుచునూ
యున్నాడా యనునట్లు విష్ణుపై యురవడిగా బోయెను వేగన్! 27

ఆ రాక్షసుడును కుంజరమును వలె యాభరణంబులు గలిగిన యా
హస్తంబును మఱి యెత్తి కదుల్చుచు నలరి సంతసము గూడికొనీ
మెఱుపులతో గూడిన మేఘమువలె మిగుల ధ్వనుల జేసెను యనిలో
అటునిటు దొలగిన రక్కసులందఱు నలరి మఱల వచ్చిరి యనికిన్! 28

ఆ సుమాలియును రణరంగంబున యలరు ధ్వనులు జేయుచునుండన్
అతని సారధిని జ్యలితకుండలుని యాతని శిరసును ఛేదించెన్
అపుడా రాక్షసు గుఱ్ఱంబులునూ యటునిటు దిరిగెను చలితములై
సారధిలేనీ రథమెందుల కిక రథ మదెందులకు రణమందున్? 29

సారథిలేనీ హయంబు లచ్చట సరగున స్వేచ్ఛను దిరుగుటతో
ఇంద్రియంబులను గుఱ్ఱంబులనూ సాంద్రముగా తిరుగుచు నుండన్!
నిలకడలేనీ మానవునకు వలె నిస్తేజంబును బొందుచునూ
రాక్షస ప్రభువగు సుమాలి యచ్చట రయమున బోయెను వెనుదిరిగి! 30

అటుబిమ్మట యా సుమాలి రథమును నా గుఱ్ఱములను దూరముగా
గొనిపోయెను నంతట మాలియునూ కొమరొప్పగ యనికిని వచ్చెన్,
యుద్ధమునకు సన్నద్ధుడగుచునూ యుద్ధతి ధనుస్సు ధరియించీ
సంగ్రామంబున వచ్చుచున్న యా సర్వేశ్వరుడగు హరిపైకిన్
ఆతని ఘనమగు రథము మీదికిని నఱచుచు బోయెను శీఘ్రముగన్ ! 31

మాలి ధనుస్సున నుండి వెడలినా మానుగ బంగారము చేతన్
అలంకరింపగ బడిన బాణములు నల పక్షులునూ వేగముగన్
క్రౌంచ పర్వతమువలె నా హరినీ యంచితముగను సమీపించీ
నారాయణునీ దేహమునందున నయముగ జొరబడె శీఘ్రముగన్ 32

అటుబిమ్మట యా మాలిచేతనూ చటులమైన బాణములనూ
వేలకొలదియును విష్ణుదేవునీ వికటముగా వేధించిననూ,
జితేంద్రియుండును మనో వ్యధలచే జిడి ముడి బొందడొ యారీతిన్,
ఆ విష్ణువుగూడను రణమందున యలక్షోభను జెందగ లేదూ! 33

ఖడ్గము గదనూ ధరించినట్టీ గరుడ వాహనుడు రక్షకుడున్
సకల భూతభావను డా దేవుడు సవ్యసాచి యటుబిమ్మటనూ
మౌర్వీ స్వనమునుజేసి ధనుస్సును మానుగ శరమును సంధించీ
రాక్షసుడగు నా మాలిపైననూ రయమున శర వర్షము గురిసెన్! 34

వజ్ర విద్యుత్ప్రభాకాంతులు గలిగిన వరుసగ యా బాణములు మఱిన్
మాలిదేహమును సమీపించి మఱి మానుగ సర్పంబులుమ మఱిన్
అమృతరసంబును ద్రాగినట్లుగా యతని రక్తమును ద్రాగినవీ
చేసెడి దేమియులేకను మాలియు స్థిరముగ నుండెను నరదముపై 35

శంఖు చక్రముల గదను ధరించిన సరగున యా నారాయణుడున్
మాలిని సంగ్రామంబునందునను మానుగ విముఖునిగా జేసీ
కిరీటంబును ధ్వజము ధనుస్సును, కిమ్మనకుండగ బడగొట్టెన్
రథాశ్వములునూ చెదిరిపోవగా రయమున రథమును గూల్చె మతిన్ 36

రాక్షసులందున శ్రేష్ఠుండైనా రయమున మాలియు వేవెంటన్
చేయునదేమియులేక రాక్షసుడు స్థిర ధైర్యంబును వహియించీ
పర్వతాగ్రమున నుండి సింహమును బన్నుగ క్రిందికి దుమికి నటుల్
ఆ విధముగ దుమికెను నా మాలియు నల యరదము పైనుండి మతిన్! 37

అంతట మాలియు గదను ధరించీ యా యీశ్వరుని యముండు మతిన్
వజ్రము ధరించి యా యింద్రుడునూ వనరగ పర్వతమును వోలెన్
అల విష్ణువునకు వాహనమైనా యా గరుడుని బహు శీఘ్రముగన్
లలాట దేశమునందున గొట్టెను లావుగ వెనుకంజయు లేకన్ 38

ఆ రాక్షసుడును గదతో గొట్టిన యల విష్ణువు వాహనమైనా
గరుత్మంతుడును బాధను జెందుచు గలతనొందె యా దెబ్బకునూ!
వేదనచే పీడితుడై నాతడు విష్ణుదేవుడును యుద్ధమునన్
పరాన్ముఖునిగా విష్ణుని జేసెను బాధనొంద యా దేవుడునూ! 39

మాలిచేత యా గరుత్మంతునీ మానుగ గదతో గొట్టుటచే
యా విష్ణువునూ పరాన్ముఖునిగా నటజేయగ యా రాక్షసులున్,
'విజయమందితిమి' యని రాక్షసులును వీరప్రలాపము లాడుచునూ
ఘన గర్జనమును జేసిరంతటను ఘనముగ మాలిని బొగడుచునూ! 40

ఇంద్రుని తమ్ముడు భగవంతుండగు సాంద్రవ్యాప్తుడగు విష్ణువునూ
రాక్షస ప్రముఖుల విజయ ధ్వనులను రయమున మనసున కోపించీ
వైనతేయునకు పైనడ్డముగా వనరగ గూర్చొని మాలినిపై
వెనుక తిరిగి నుండియు చక్రంబును వేగమె నాతనిపై వాదిలెన్! 41

కాల చక్రమును వలె దిరుగుచునూ కదులు సూర్యమండలము వలెన్
కాంతులతోడను గగనమండలము గప్పుచు భాసించుచు వేగన్
మాలి శిరస్సును త్రుంచి వేసెనూ మానుగ నేలను బడిపోవన్
సురలందఱునూ పుష్ప వర్షమును సురుచిరముగ గురిసిరి యపుడున్ 42

రాక్షసేంద్రుని రమ్య శిరస్సును రయమున భూతలమున బడుచున్
అరుణారుణ రక్తములను గార్చుచు నతి భయంకరముగా నుండెన్
అమృత మథనమున యల రాహువు తల యల రక్తంబును నొలుకుచునూ
క్రిందబడినటుల మాలి శిరస్సును క్రిందబడెను రక్తము నొలుకన్! 43

అటుబిమ్మట దేవతలు మునులునూ యల నారాయణు స్మరించుచున్
దేవదేవ! మఱి బాగు బాగ నుచు దిక్కులన్నియును బిక్కటిలన్,
స్తుతి వాక్యంబులు బలికిరి మునులును మతిమంతుని యా విష్ణువునూ
గంధర్వులు యక్షులు నాగులునూ గగనమందు జేసిరి ధ్వనులన్! 44

మాలి యీ విధము జంపబడుటయును మాల్యవంతుడును సుమాలియున్
శోకముతోని తపించిన వారై శూరసైన్యమును తోడికొనీ
పారిపోయిరీ లంకకు వారును బరుగులు దీయుచు వేగముగన్
చెడువర్తనములు జేటు తెచ్చుగద! చెడు సర్వస్వము వారలకున్! 45

గరుత్మంతుడును దెప్పరిల్లుచును గడుకోపముతో గూడికొనీ
మఱల వచ్చియును యుద్ధభూమిలో మానుగ పూర్వపు విధముగనూ
కోపముతో టెక్కలగాలులతో గూడిన మిగిలిన రాక్షసులన్
ఆ గాలులతో నటునిటు బోయిరి యాలంకకునూ శీఘ్రముగన్! 46

ఆ సంగ్రామమునందు రాక్షసులు నా నారాయణు చక్రముచే
కొందఱు దైత్యుల ముఖపద్మంబులు చిందగ ఛేదింపగ బడియెన్
కొందఱి దైత్యుల వక్షస్థలములు కంది చూర్ణమై పోయెనటన్
నాగలి చేతను వాడిపోవునటు నయముగ కంఠములును నుండెన్! 47

ఆ యుద్ధంబున రోకళ్లను మఱి యల శిరసులు బ్రద్దలు నయ్యెన్
ఛేదింపగబడి కొందఱుండిరీ చిందుచు ఖడ్గంబుల జేతన్
కొందఱు బాణంబుల గాయములను గొందఱుండిరీ బడి నేలన్
కొందఱు రాక్షస వీరులంతటను కుందుచు సంద్రములో బడిరీ! 48

ఆ శ్రీమన్నారాయణుడును నా రాక్షసులను వధియించెన్
జుట్టుముడులు విడిపోయిన నసురుల సురుచిరముగ ధనువును బట్టీ!
పిడుగుల వంటీ బాణంబులచే ప్రిదిలిపోవగా రాక్షసులన్

మెఱుపులతో కూడిన మేఘంబును మేలిమి పిడుగుల చేత మఱిన్
చీల్చివేసినటు జీల్చివేసెనూ చెదిరిపోవ వారందఱునూ! 49

ఆ రాక్షస ఘన సైన్యమంతయును నటునిటు భయమున బరుగెత్తెన్
ఆతపత్రములు విరిగిపోయెనూ యాయుధములు జారుచు నుండెన్
వస్త్రంబులు మఱి చిరిగిపోవుచును వరుసను దొలగుచు నుండెనటన్
ప్రేవులు బయటకు వచ్చుచునుండెను ప్రిదిలినేత్రములు జ్వలించుచున్
ఈ రీతిని యా రాక్షస సైన్యము నేపుగ యున్మాదము జెందెన్! 50

పురాణ సింహము జేత రాక్షసులు బొందుగ పీడింపగబడుచున్
కుంజరములతో గూడిన దైత్యులు కూడిన రవములు గుదురుగనూ!
సింహంబులతో బీడింపగబడు చెదిరిన కుంజర ధ్వనుల వలెన్
సమముగ నయ్యెను యుద్ధభూమిలో సహజముగా నాసమయమునన్! 51

హరి బాణంబుల సముదాయంబును నలరి నివారింపగ లేకన్
తమ బాణంబుల ప్రయోగించుచును తత్తర మొందెడి రాక్షసులున్
కాల మేఘములు వాయువు జేతను గగనంబున బరుగెత్తు నటుల్
ఆ రాక్షసులును పారిపోయిరీ యల నలుదిక్కులకును వేగన్ ! 52

ఆ బహు ఘన రాక్షసులును మఱియును యా చక్రము దెబ్బలనందీ
శిరస్సులును దెగిపోయెను వారివి కరములు, కాళ్లును త్రెంపబడెన్
శరీరంబులును చూర్ణములైనవి ఛాయలు పోలిక లేకుండన్
ఖడ్గ ప్రహారంబుల చేతను మఱి ఖండము లాయెను రెండుగనూ!
పర్వతముల వలె నేలను గూలిరి పరగ వేదనల ధ్వనితోడన్! 53

మణిహారంబులు కుండలంబులును, మానుగ వ్రేలాడుచునుండన్
నిరంతరంబును బడగొట్టగబడు నిర్భరదైత్య సమూహంబున్
ఆకాశము బడగొట్టుచున్న యా యలరెడి నల్లని గిరులవలెన్
దట్టముగా నట గనబడుచుండిరి పట్టు దప్పి నా రాక్షసులున్! 54

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
సప్తమ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (మొదటి సంపుటము)

# ఎనిమిదవ సర్గము

(మాల్యవంతుడు యుద్ధముజేసి పరాజితుడగుట - సుమాలి మొదలగు రాక్షసులు రసాతలములో ప్రవేశించుట)

ఆ రాక్షసులను పద్మనాభుడును నలరి వెనుక భాగమునుండీ
సంహరింపబడు చుండుట కనుగొని సాహసియగు యా మాల్యుండున్
తీరంబును చుంబించి సంద్రమును దీరుగ వెనుకకు మఱలి నటుల్
మాల్యవంతుడును వెనుకకు వచ్చీ మఱి యా విష్ణువుతో ననియెన్! 1

నిశాచరుడు సంరక్తనయనుడై నిరవధికంబగు కోపముతో
కదులుచున్న శిరసును గలవాడై కఠినముగా నారాయణుతో!
సర్వ జగములను బరిపాలించెడి సర్వేశ్వరుడగు విష్ణువుతో
ధీరత బలికెను నిలిచి యెదురుగా దీనత యించుక లేకుండన్! 2

ఓ నారాయణ! ఓ విష్ణూ విను! యొసరగ పురాతనంబైనా
క్షాత్ర ధర్మమును నీకు తెలియదా క్షత్రియుడవు కాదా నీవున్?
సామాన్యునివలె యుద్ధమునందున దగని రీతి వర్తించెదవూ!
యుద్ధమునందున మనస్సులేనీ యుద్ధమనగ బహుభయంబుతో
యున్న వారి నిటు జంపుచు నుంటివి! బన్నుగ నీ వొక వీరుడవా?
ప్రాచీనంబగు క్షత్రియ ధర్మము బన్నుగ వినలేదా నీవున్?
వెన్ను జూపినా వారిని జంపుట యెన్నగ వీరుని లక్షణమా? 3

సురేశ్వరా! ఓ పద్మనాభ విను! సురుచిరముగ యుద్ధమునందున్
పరాఙ్ముఖుల మఱి జంపుట పాపము బన్నుగ క్షత్రియ ధర్మమిదీ!
అట్టి వధను యిల జేయువానికిని యిట్టె పుణ్యకర్మల వలనన్
లభించు స్వర్గము నందగ జాలడు లభింప దా సుకృతంబు మఱిన్! 4

శంఖము చక్రము గదను ధరించిన చారుమూర్తి విను నా పలుకుల్
అటుగాకను నీ వుద్ధతుండవై యనిసేయగ సంసిద్ధుడవై

యుండినచో యిదిగో! నిలిచితినిట! దండిగ యుద్ధము సేయు మికన్
బలశౌర్యంబులు నెంత యున్నవో బన్నుగ గాంచెద నేను మఱిన్! 5

బలవంతుడును నింద్రుని తమ్ముడు బన్నుగ సకలేశ్వరుడు మఱిన్
మాల్యవంత పర్వతమును బోలిన మానుగ రాక్షస రాజైనా,
మాల్యవంతునీ కనుగొని విష్ణువు మానుగ యీ విధమున బలికెన్
ఉన్న యధార్థము బలికెను విష్ణువు సన్నుగ రాక్షసు తోడుతనూ! 6

మీ వలనను వచ్చిన భయంబునూ మిక్కిలి భీతావహులైనా
దేవతలకు, మునులకు, ఋషులకునూ యఖిల సాధు పురుషుల కపుడున్
రాక్షస సంహారము జేయుదునని రయమున ప్రతిజ్ఞ జేసితినీ,
ఆ ప్రతిజ్ఞ పాలించుచుంటినీ అలరి నేడు మీకును ప్రతిగా! 7

నే నెల్లపుడును సాధుపురుషులకు నిఖిలము నర్పింతును నిజమున్
మునులకు, ఋషులకు సురలకెపుడును మోదము గలిగించుచు నుందున్
అట్టి నేను మీరాపాతాళము నిట్టె జేరినను గూడను నే
మిమ్ముల సంహారంబు జేసెదను మేదినిపై దుష్టాత్ములనూ! 8

సంక్రుద్ధుండగు మాల్యవంతుడును సత్యము బలుకుచు నున్నట్టే
ఎట్టని పద్మంబుల సమానమును నింపుగ నేత్రములును గలుగూ
ఆ సర్వేశ్వరు డటుల నుండగా నలరి కోపమున రాక్షసుడున్
శక్తి బాణమును భుజాంతరంబున రక్తిగ విష్ణువుపై నొదిలెన్! 9

మాల్యవంతునీ భుజములచేతను మానుగ విడువగ బడినట్టీ
శక్తి శరంబును గంటల మ్రోతను రక్తిని గణగణ మ్రోగుచునూ
విష్ణుదేవునీ వక్షస్థలమున విమలముగను దగ్గఱ జేరీ
మేఘముమీదీ మెఱుపు దీగవలె మిగుల ప్రకాశించెను నపుడున్! 10

అటు బిమ్మట యా శక్తి ధర ప్రియుడు నలకుమార స్వామికి ప్రియుడున్
పద్మలోచనుండైన విష్ణువును బన్నుగ లాగుచు నా శక్తిన్
మాల్యవంతునీ యుద్దేశించీ మఱల దానినే రాక్షసుపై
తన భుజబలమున విసిరివేసెనూ దివిదేవతలందఱు గనగన్! 11

ఆ గోవిందుని కరమున వెడలిన నా శక్తియు బహు తీవ్రముగా
అల కుమారస్వామియు విసిరిన యటు నంబర వీధిని జనుదెంచీ
ఆ రాక్షసునీ గోరుచున్నదై యగ్నులు విరజిమ్ముచు మఱియున్
మహోల్క యంజనగిరి మీదికినీ మానుగబోయిన విధముగనూ!
ఆ రాక్షసునీ మీదికి శక్తియు యాహుతి సేయగ బయనించెన్! 12

ఆ శక్తియునూ నటుబయనించుచు హారభారమున మెఱయుచునూ
విస్తీర్ణంబగు రాక్షసేంద్రునీ విమల భుజాంతరమందుననూ
పర్వత శిఖరమునందు పిడుగువలె బన్నుగ యగ్నుల గ్రుక్కుచునూ
మాల్యవంతుని వక్షస్థలమున మానుగబడె శక్తియును మఱిన్! 13

దాని తాకుడుకు దమకవచంబును దగ బ్రద్దలునై పోవుటయున్
మాల్యవంతుడును మూర్ఛను బోయెను మానుగ తమస్సు వ్యాపింపన్
కొలది సమయమున మూర్ఛను దేరెను గూరిమి చీకటులును బోయెన్
పర్వతమునువలె కదలకుండగా బన్నుగ నిలబడి ధీరతనూ! 14

అటు పిమ్మట యా రాక్షసుండునూ యలరుచు ననేకములునైనా
ముండ్లతోని మఱి వ్యాప్తమునైనా మొండి శూలమును గ్రహియించీ
విష్ణువువక్షస్థలమునందుననూ విసిరెను బలప్రయోగమునన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 15

అట్లే రణరక్తుడు రాక్షసుడును నలరిపిడికిలిని బిగియించీ
వాసవానుజుండగు విష్ణువునూ వనరగ గొట్టీ నిర్భయతన్
ధనుర్మాత్ర దూరంబున నిలిచెను తత్తరమొందగ దేవతలున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 16

అటుబిమ్మటనూ 'సాధు సాధు' అను యలరి మహాశబ్దంబులునూ
జయలుదేరినవి బహునాదములును బన్నుగ దేవతలును బెదరన్
భగవంతుడగు విష్ణుదేవునీ బరగ గొట్టి యా రాక్షసుడున్
విష్ణు వాహనము వైనతేయునీ కష్టంబును మఱి గలిగించెన్! 17

అటుపిమ్మట యాగరుత్మంతుడును చటులకోపమున రక్కసునీ
తనదు పక్షముల గాలులచేతను దగ బలీయముగ వీచుటచే

శుష్కపత్రముల ప్రోవులు ధరణిని శూన్యమునకు యెగిరిన యటులన్
ఆ రక్కసునీ రెక్కల గాలిని యలరి యెగురవేసెను పైకిన్! 18

గరుత్మంతునీ ఱెక్కలగాలిని గగనమునకు మఱి యెగిరిన యా
అన్నయైన యా మాల్యవంతునీ బన్నుగ కనుగొని సుమాలియున్
తన సైన్యములను గూడికొనియు దా తరలె లంకకును నభిముఖుడై
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 19

వైనతేమునీ ఱెక్కల గాలిని వెగుర గొట్టబడి రాక్షసుడున్
మాల్యవంతుడును తన బలములతో సమాగమ్యమై తలవంచీ
సిగ్గుతోని గూడిన వాడగుచును జేరెను లంకకు శీఘ్రముగన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 20

కమలేక్షణ! ఓ రఘురామా! విను! కమనీయముగా హరిచేతన్
ఈ విధమగనే రాక్షసులందఱు నిలపైబడి మృత్యువునందన్
రాక్షస నాయకులైన వారినీ రయమున జంపెను యోడించీ
మిగిలినవారును నోటమిజెందీ తగలంకకు బోయిరి వేగన్! 21

ఆ కమలాక్షుని యెదుట నిలిచి మఱి యనిసేయుటకు నసమర్థులునై
ఆ రాక్షసులును భయ పీడితులై యా లంకా నగరము వదిలీ!
భార్యా పిల్లలతోని గూడికొని పాతాళంబునకును వేగన్
ఆ రాక్షసులును దరలిపోయిరీ యట నివాసమును జేయుటకై! 22

రఘుసత్తమ! ఓ రామా! వినుమా! రమ్యరాక్షసుల వంశమునూ!
సాలకటంకట వంశమునందున సాహసులును మఱి పరాక్రమున్
ఆ రాక్షసులును పాతాళములో నలరి సుమాలీ పాలనలో
జీవించుచు నుండిరి సుఖంబుగా చిరసౌఖ్యంబుల బొందుచునూ! 23

రఘురామా విను! నీవు వధించిన రావణాది ముఖ్యులు వీరుల్
పులస్త్యవంశమునందు జనించిన పులస్త్యులనియెడి నామముతో,
పిలువబడిరి యీ లోకమునందున పొలుపుగ పులస్త్య సంతతినీ,
మాల్యవంతుడును సుమాలి, మాలీ మానుగ రావణు పూర్వికులున్
వారందఱునూ విక్రమవంతులు చనరగ యతి బలవంతులునూ!
రావణాదులాకంటెను గూడను రమ్య పరాక్రమవంతులునూ! 24

శంఖు చక్ర పీతాంబరుడైనా శ్యామసుందరుడు విష్ణువునూ
అతడు దప్ప మఱి యెవ్వరుగూడను నలరు దేవ శత్రువుల మఱిన్,
ఆ రాక్షసులను జంపువాడునూ యలసురలను రక్షించుటకున్
మఱియొక ప్రభువును వీరుడు లేడూ మానుగ సురబాధలు దీర్పన్! 25

రఘురామా ! నీవును ప్రభుండవూ! రమ్యసనాతనుడైనట్టీ
శ్రీమన్నారాయణుడవు మఱియును చింతలు దీర్చెడి వాడవునూ!
రాక్షసులను మఱి దుష్టచిత్తులను రయమున జంప జనించితివీ
జయింప శక్యముగాని వాడవును సర్వసమర్థుడవును నీవున్! 26

నష్టధర్మమును నిలుపువాడవును నయముగ కరుణా భావముతో
ఆశ్రితులను రక్షించువాడునూ యలరు ప్రజాకరుడగు వాడున్
అట్టి విష్ణువును నా యా కాలములందు జనించును విక్రమతన్
దుర్మార్గుల వధియింపగ జగమున సన్మార్గుల రక్షింపగనూ! 27

నరాధిపా! ఓ రఘుసత్తమ విను! నయముగ రాక్షస జన్మకథన్
ఆ వృత్తాంతంబంతయు దెలిపితి యరయగ నీ కంతయు నిపుడున్
ఆ దశ కంఠుని యతని పుత్రులయు నలరు జన్మ వృత్తాంతంబున్
సాటిలేని వారల ప్రభావమును సరసత దెలిపెద నేనిపుడున్! 28

ఆ సమయంబున సుమాలియును మఱి యా విష్ణువునకు భయపడుచున్
సహచరులగు రాక్షసులను గూడీ సరసత రసాతలము జనియెన్
అట్టి సమయమున ధనేశ్వరుండును నిట్టె పుత్రపౌత్రులతోడన్
ఆ లంకానగరము బాలించెను నమరులు స్వర్గంబునకు వలెన్! 29

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఎనిమిదవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (మొదటి సంపుటము)

# తొమ్మిదవ సర్గము

(రావణాదులజన్మ - వారు తపస్సునకై గోకర్ణ ఆశ్రమమునకు బోవుట)

అటుబిమ్మట మఱి కొంతకాలమున నా విధముగ జరిగిన పిదపన్
సుమాలియనియెడి రాక్షసోత్తముడు శూరుడు పాతాళమునుండీ
పుత్రికతోడను గలిసివచ్చెనూ, పొలుపుగ ప్రకృతి కనుగొనగన్
భూలోకంబున సంచరించుచును బుడమి వింతలను గనుగొనుచున్! 1

అపుడు పద్మములు ధరింపనట్టీ యా లక్ష్మికి వలెనున్నట్టీ
అవివాహితయగు దుహితను గ్రహించి యల భూలోకమునందుననూ
నీలజీమూత సంకాశుండును నిఖిల దేవతల వైరియునూ
తప్త కాంచనా కుండలములతో దగ రాక్షసులా రాజు మఱిన్
సంచరించు సమయంబున కనుగొనె యంచితముగ నా ధనేశునీ
పుష్పక విమానమునను బోవుచును స్ఫురిత వైభవము దొలుకుచునూ! 2,3

అల పులస్త్యునీ కుమారుడైనా యలకుబేరుడును దన తండ్రిన్
గనుటకు బోవుచు నున్నవాడునూ, కడు సమర్ధుడును సురలకునూ
సంకాశుండును, స్వచ్ఛందమునగు శంకలేని వాడును మఱియున్
దేవతుల్యుడై యగ్నికి వోలెను దివిరి ప్రకాశించెడివాడున్
పులస్త్యపౌత్రుని కుబేరుగాంచీ బొలుపుగ విస్మయ ముప్పొంగన్
మర్త్య లోకమున నుండి సుమాలియు మఱి పాతాళమునకును జనీ
ఈ రీతిగ చింతించెను నాతడు నీ విధముగ యోజించె మదిన్
మనమును యెట్టీ సత్కార్యములను మానుగ జేసిన కుబేరుతో
సరిసమానముగ వృద్ధి నందెదము సకల సౌఖ్య సుఖ సంపదలన్! 4,5

అటుబిమ్మట యాసుమాలి యసురుడు నలరుచు కైకసి పుత్రికనూ
కనుగొని యిటులను బలికె రాక్షసుడు కమ్మని మాటలతో నపుడున్
పుత్రీ కైకసి ప్రదాన కాలము పొలపుగ చనుదెంచెను నిపుడున్
నీ యౌవనమును దాటుచున్నదీ నిన్ను వరుని కర్పింపవలెన్! 6

అడిగినచో యెటు ప్రత్యాఖ్యానము నటు జరుగునా యని భయబడుచున్
పరులచేత యందులకే నిన్నును ప్రతిగ్రహింప జేయుట లేదూ!
ధర్మమునందాసక్తి గలిగినా దగ మేమందఱమును గూడన్
నీ నిమిత్తమై బహు మిక్కిలిగా నిట్టూర్పులతో నుంటి మిలన్ ! 7

పుత్రీ సమస్త సద్గుణములతో సాక్షాత్ లక్ష్మిగ యుంటివిగా
మానకాంక్షితులు నగువారలకును మానుగ యా తలిదండ్రులకున్
మిగుల దుఃఖ కర మగునుగదా మఱి మిగుల హీనస్థితి యగు పుత్రీ!
కన్యను నెవ్వడు గోరుకొనునోయని కలలను గాంచుచు నుండెదమూ!
ఏ గృహస్థునికి భార్యయునగునో నించుక తెలియదు బితరులకున్! 8,9

కన్య యొక్క తలి వంశంబును మఱి తండ్రి వంశమును యెచ్చోటన్
కన్య యెవరి వంశమునకు బోవునా కన్యా భర్త సువంశంబున్
మూడు వంశములు నెల్లప్పుడునూ ముదమును వీడుచు భయంబుతో
సంశయంబుతో నుండును పుత్రీ! వంశగౌరవము నిలుచుటకున్! 10

పుత్రీ! నీవును మునివరుడైనా పొలుపుగ శ్రేష్ఠుండైనట్టీ
బ్రహ్మకులోద్భవుడైన యట్టి యా బరగ విశ్రవసు భజియింపూ!
ఆ పులస్త్యునీ పుత్రుడైన యా యలరి విశ్రవసు వరింపుమా!
స్వయముగ బోయీ వరింపు పుత్రీ! స్వీయ వచో గుణ సంపదలన్! 11

పుత్రీ! నీకును జన్మించెదరూ పుడమిని లేనీ విక్రములున్
భాస్కర సముడగు ధనేశుడెటులో బన్నుగ నీ పుత్రులు గూడన్
అట్టి పరాక్రములును జనియింతురు నట్టి కాంతి వంతులు జగతిన్!
సంశయ మింతయు లేదు సుమా మఱి వంశగారవములను నిలుపూ ! 12

ఆ కన్యకయును తద్వచనములను నలరి వినుచు బహునాసక్తిన్
తండ్రి మీదగల గౌరవంబునను దగ విశ్రవసు బహునిష్ఠన్ !
తపసు చేయుచున్నట్టి చోటునకు తరుణి బోయె శృంగారముగా
నిలిచె విశ్రవసు ముని ముందఱనూ నిర్మల భాసుర కాంతులతో! 13

రఘుపతి రాఘవ రాజా రామా! పతిత పావన సీతారామా!
బ్రహ్మణుడైనా పులస్త్యు తనయుడు బరగ విశ్రవసు బహునిష్ఠన్

అట్టి యవసరము నందున నాతడు నలరెను నాల్గవ యగ్నివలెన్
సాయంకాలపు అగ్నిహోత్రమును సవ్యముగా జేయచు నుండెన్! 14

ఆ కన్యకయునూ యమిత గౌరవము నల పితరుని పై గలిగియునూ!
దారుణ సంధ్యా సమయమనుచునూ దగ యోచింపక యా తరుణీ
ఆ ముని పాదములను గాంచుచునూ యలరి పాద బొట్టన వ్రేలిన్
మాటి మాటికిని నేల వ్రాయుచును మానుగ నిలిచెను నిర్మలతన్! 15

పరమోదారుడునగు విశ్రవసును బరగ కాంచె నా కన్యకనూ
అందమైన సుశ్రోణియు గలదియు చందమైన చంద్రుని వంటీ
మోమును గలిగీ సహజ తేజమున మోదమందు నా సుందరినీ
ఆ కైకసినీ గాంచి విశ్రవసు నలరి బలికె నీ విధముగనూ! 16

ఓ మంగళ ప్రదురాలా! దెలుపుము! వనర యెవని దుహితవు నీవున్!
ఓ శోభామణి! యే పనిమీదను వనరగ యెచ్చటి నుండి మఱిన్
ఇచటికి వచ్చితివో మఱి తెలుపుము ఏకారణమున వచ్చితివో
అంతయు దెలుపుము నలరి వినియెదను! సుంతయు దాపక దెల్లముగన్! 17

ఆ కన్యకయును కైకసి గూడను నలరి పొంగుచును మదియందున్
అంజలితోడను నమస్కరించుచు నా మునితోడను నిటుబలికెన్!
ఓ మునిచంద్రా! నా మతమేమో వనర నాదు ఆలోచననూ
నీ తపసులచే నీ ప్రభావమున నిజమును దెలియుము నీవింకన్! 18

ఓ బ్రహ్మర్షీ! యొనరగ వినుమా! యోరజాపునను జూడుమా!
తండ్రి యాజ్ఞచే వచ్చినదానను దగ వినుమా! నా పలుకులనూ
కైకసి యని నను బిలుతురు లోకులు కమ్మని గుణములు గలవనుచున్
మిగిలిన విషయమునంతయు నీవే మేలిమి గ్రహించి దెలిసికొనూ! 19

ఆ ముని ధ్యానముజేత తెలిసికొని యలరి సకల విషయంబులనూ,
కైకసి తోడను నా ముని బలికెను కమ్మని మధుర సువాక్యములన్
ఓ మంగళ ప్రదురాలా! వినుమా వనరగ నీ మది భావననూ
నీ మనస్సు తలపులు యేవో మఱి నిండుగ దెలిసెను సుశ్రోణీ! 20

మత్తమాతంగ గామిని వినుమా! మది కుతూహలము దెలిసినదీ
నాచే పుత్రులు గలుగవలయునని నయముగ వచ్చితి వీ వంకన్!
కానీ నీ విటు నావద్దకునూ కఠినమైన దారుణమైనా
సంధ్యా సమయమునందు వచ్చితివి సమముగ చీకటి వ్యాపించెన్!
అందువలన నీకెట్టి పుత్రులును చందము గలుగుదురో వినుమా!
భయంకరులు మఱి భయదాకారులు భగ్గున మండెడి వారలునూ
దారుణమైనా యభిజన ప్రియులును క్రూరకర్ములును కుటిలురునూ
అట్టి రాక్షసుల ప్రసవించెదవూ! అలరు పూబోడి నిక్కముగన్! 21, 22

ఆ కైకసియును నా మాటలు విని యంజలి తోడను నామునికీ
నమస్కరించుచు నిటులను బలికెను నయముగ మదిలో గ్రుంగుచునూ!
ఓ భగవంతుడ! కరుణా సింధూ! వనరగ నా పలుకులు వినుమా!
వేదాధ్యేతవు! అట్టి నీనుండి విమలమైన నా తనువుననూ
ఇట్టి దుష్కృతుల దురాచారులను నెట్లు భరింతును గర్భమునన్?
అనుగ్రహింపుము స్వామీ! నన్నిటు నాగ్రహింపకుము గోపమునన్
అటుల బలికెనూ యాకైకసియును చటుల దుఃఖమున వేదనతో
ప్రారబ్దంబును దప్పుకొనరుగా ప్రభావితులు దేవతలైనా! 24

ముని శ్రేష్ఠుండగు విశ్రవసుండును మోదముతో కైకసి పలుకుల్
విని మదిలో పరిపూర్ణ చంద్రుడును విమలమైన రోహిణితోడన్
పలికినటుల దా బలికె మునీంద్రుడు బన్నుగ యోదార్చుచు నామెన్
గ్రహగతి నెవ్వరు దప్పింపరుగా విహగరాజు గజరాజైనన్! 25

శుభాననా విను! నా పలుకులనూ శుష్కింపకుమా వేదననూ!
పశ్చిమ పుత్రుడు యెవడైయుండునో బన్నుగ నతడు మదీయంబున్
వంశాను క్రమ రూపుడైయుండి వంశము నిలిపెడి వాడుగనూ
ధర్మాత్ముండై ప్రసిద్ధి గాంచును దగ సందేహమువలదు సుమా! 26

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్
విశ్రవసుడు నిటు జెప్పిన మీదట విమలమైన కాలమునందున్
ఆ కన్యామణి కైకసి కనియెను నలరి కొంతకాలంబునకున్
సుదారుణుండును భయంకరుండును సూక్ష్మవిద్యలును గలవాడున్
రక్షో రూపము గలిగిన వానిని యాకైకసియును ప్రసవించెన్! 27

పది కంఠంబులు గలిగిన వాడును బరగ మహా దంష్ట్రల తోడన్
నల్లని కాటుకతో సమానుడును నయముగ యెఱ్ఱని పెదవులునూ
వింశతి భుజములు గల వాడును మఱి వికృత ముఖములు గలవాడున్
దీప్త మూర్ధజము గలవాడును మఱి దీరుగ కైకసి ప్రసవించెన్! 28

అట్టి సమమున యా బాలుండును నిల జనింప నా సమయమునన్
జ్వాలాకబళములను గూడికొనీ జ్వలించు ముఖముల తోడుతనూ
ఆడునక్కలును క్రవ్యాదులునూ యపసవ్యంబుగ దిరిగినవీ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 29

దేవ దేవు డగు వర్షదేవుడును దీరుగ రక్తము వర్షించెన్
మేఘంబులునూ ఖర నిస్వనములు మేదురముగనూ ధ్వనియించెన్
ప్రభాకరుడుగూడను నా వేళను ప్రభలు దప్పి జీకటి విరిసెన్
మహోల్కలును నాకాశమునుండీ మానుగ భూతలమున వడియెన్! 30

భూమియు గూడను కంపించినదీ భూతములును నిల యదిరిపడెన్
దారుణంబులగు గాలులు వీచెను దారుణమునునగు వేడిమితో
క్షోభింపగ శక్యముగానట్టీ క్షుభితంబై యల సంద్రంబున్
తీరము దాటీ యుప్పొంగినదీ తికమక జెందెను మర్త్యములున్! 31

బ్రహ్మదేవునీ సమానుడైనా బరగ విశ్రవసు మది చింతన్
పదికంఠములను గలిగిన బాలుని బరగ గనుగొనుచు గాఢముగా
ఆ బాలునకిని బేరుపెట్టెనూ యాశ్చర్యంబున గూడికొనీ
దశగ్రీవుండను నామధేయమును దగ బిలిచెను వాత్సల్యముతో! 32

ఆ దశగ్రీవుని యనంతరంబున యలరి కుంభకర్ణుడు బుట్టెన్
అతని శరీర ప్రమాణము మించిన నలరు ప్రమాణము లోకమునన్
కనజాలము వినజాలము ధరణిని గడు భయంకరముగా నుండెన్
ఆ బాలుని గాంచిన రాక్షసులును నడలిపోయిరీ దూరముగన్! 33

అటు బిమ్మట శూర్పణఖ జనించెను నాకైకసికిని చిత్రముగా
వికృతమైన రూపములో బుట్టెను వింత గొలుపుచును నందటినీ

ధర్మాత్ముండగు విభీషణుండును దగ జన్మించెను దరువాతన్
ఆ కైకసికిని పశ్చిమ పుత్రుగ యలరి జనించెను సహజముగన్! 34

మహాసత్త్వుడగు నతడు జనింపగ యంతరిక్షమున క్షేమముగన్
పువ్వుల వానయు గురిసె నప్పుడును బూర్ణతేజమును వ్యాపించెన్
నభస్థలంబున దేవదుందుభులు నయముగ మ్రోగెను బహు ధ్వనులన్
'బాగు బాగు' నను వాక్యంబులును బన్నుగ వినబడె దిక్కులనూ! 35

మహాతేజమును గలవాడును మఱి మానుగ లోకంబునకు మఱిన్
భయమును గలిగించెడి దశగ్రీవుడు బరగ కుంభకర్ణుండు మఱిన్
అచటే వారలు వృద్ధిబొందిరీ యట్టి మహారణ్యము నందే!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 36

ప్రమత్తుడగు నా కుంభకర్ణుడును మదించి మిక్కిలి గర్వముతో
ధర్మమునందున ప్రేమగలిగినా తాపసులను భక్షించుచునూ
అంతులేని యాకలిని గూడికొని యసంతృప్తితో సతమతమై
మూడు లోకముల దిరుగుచుండెనూ మునుల ఋషుల భక్షించుచునూ! 37

ధర్మాత్ముండగు విభీషణుండును ధారుణి యందెల్లప్పుడునూ
నిత్యము ధర్మమునందే స్థిరుడై నిత్యము స్వాధ్యాయమునందే
ఆహార నియమముల బాటించుచునూ యందఱి మన్నన జేకొనుచున్
ఇంద్రియముల తన వశమందుంచీ సాంద్ర భక్తితో నతడుండెన్! 38

అటు బిమ్మట ఒక కాలమునందున నలరుచు లంకకు ప్రభువైనా
ధనేశ్వరుండగు కుబేరుడంతట దనదు తండ్రినీ గనుగొనగా
పుష్పక విమానమున పై నాతండును బొలుపుగ నచటికి జనుదెంచెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 39

అట్టి సమయమున రాక్షసియైనా యాకైకసియును కనుగొనియెన్
మిగుల తేజసుల నొప్పువాడునూ మిక్కిలి బలవంతుడునైనా
అలకుబేరునీ కనుగొని కైకసి నలరు కుతూహలమున గూడీ
తన సుతుడగు దశగ్రీవుని జేరీ తగ నాతనితో నిటులనియెన్! 40

పుత్రా! కనుగొను! సోదరుడైనా పొలుపుగ యట్టి కుబేరునీ
తేజసావృతుండైన యాతనిని దీరుగ యాతండేరీతిన్

నున్నవాడు మఱి సోదరత్వమున యుండుట సమానమేయైనా
నిన్ను నీవు మఱి జూచుకొనుమురా! నిన్నును నతనిని బోల్చుకొనీ! 41

నాదు కుమారా! అమిత విక్రమా! యలరి వినుము నా పలుకులనూ
నీవు గూడ యా కుబేరు తోడను నిండు సమానుడవగుము నిలన్
నీవు గూడ నాతనితో సమానముగ నిలిచెదవో యా విధముగనూ
యత్నముజేయుము వేడుకలరగా రత్నము వలె నాతని రీతిన్! 42

ప్రతిభా వంతుడు ప్రతాపుడైనా పన్నుగ దశగ్రీవుం డవుడున్
తల్లి వచనములు విని యాతండును ధనేశుడగు నా కుబేరుపై
సాటిలేని కోపంబును జెందెను తోటివానిపై యసూయతో
తల్లి దగ్గఱను ప్రతిజ్ఞజేసెను తల్లడిల్లి తన మనసుననూ! 43

తల్లీ! యిదిగో! ప్రతిజ్ఞజేసీ తనయుడ బలుకుచు నున్నాడన్
బలముజేత తేజస్సుల జేతను భ్రాతృతుల్యుడను గాగలనూ!
అతని కంటె నే నధికుడనగుదును నలరి వినుము నా పలుకులనూ!
మనసునందుగల సంతాపంబును మానుగ విడువుము వేదననూ! 44

అటుబిమ్మట తమ్ములతో గూడను నాదశగ్రీవుడు గ్రోధముతో
దుష్కరమైనా శక్యముగానీ దోషరహితమగు దపసులనూ
చేయదలచి మది నిశ్చయించుకొనె స్థిరమగు బుద్ధిని తమ్ములతో
బయలుదేరెనూ తల్లికోరికను బరువును దీర్చుటకై వేగన్! 45

తపస్సు చేతను దనకోరికనూ దగ సాధించుటకై వేగన్
నిర్ణయించుకొని నిశ్చితబుద్ధిని నీరాజనముల గైకొనుచున్
కార్యసిద్ధికై బయలుదేరెనూ కడు బవిత్రమగు ప్రదేశమున్
గోకర్ణ క్షేత్రమునకు బోయెను గూర్మియచటి యాశ్రమమునకున్! 46

మహోగ్రమగు విక్రమమును గలిగిన మానుగ యా దశగ్రీవుడునూ
అనుజులతోడను గూడినవాడై నతుల తపస్సును నట జేసెన్
ప్రభువగు నట్టి యా పితామహుని బరగ సంతసము గావించెన్
జయావహములగు వరముల నిచ్చెను జనరంజకుడగు బ్రహ్మయునూ! 47

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
తొమ్మిదవ సర్గము సమాప్తము

శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (మొదటి సంపుటము)

# పదియవ సర్గము

(రావణాదులు తపసుజేసి వరములను బొందుట)

అటుపిమ్మట శ్రీరామచంద్రుడును నా ముని యగస్త్యుతో ననియెన్
బ్రాహ్మణోత్తమా! యటపిమ్మటనూ బహు మహాబలముగల యట్టి
ఆ సోదరులును నా వనమందున అలరి వార లే విధముగనూ
తపసులు జేసిరొ, వరములు బొందిరొ దగ వివరింపుము విశదముగన్!! 1

ఆ పిమ్మట సంప్రీత మానసుడు నారామునితో నగస్త్యుడున్
నీ విధి రామా యనుచును బలికెను నింపుగ యా రాక్షస గాథన్
ఆ భ్రాతరులును నా ప్రదేశమున యఖిల సుఖములను వర్జించీ
ఆయా ధర్మ విధానంబులనూ యాచరించరీ రాక్షసులున్ ! 2

అటు పిమ్మటనూ కుంభకర్ణుడును కటు ప్రయత్న శీలుండగుచున్
నిత్యంబును తన తపస్సునందున నిలిచిన వాడగుచును మఱియున్
గ్రీష్మకాలమున పంచాగ్నులకును భీష్మముగా మధ్యను నిలిచీ
తపస్సు జేసెను నేకలగ్నమున దగ నీశ్వరు ధ్యానించుచునూ! 3

వర్షాకాలమునందు నాతడును వరుసగ మేఘోదకములచే
తడిసినవాడై వీరాసనమున దగ కూర్చుండెను ధ్యానమునన్
శిశిరకాలమున నిత్యము నాతడు నిశితముగా దృష్టిని బఱపీ
జలమధ్యంబును నాశ్రయించెనూ బలవంతుండగు రాక్షసుడున్! 4

ఈ విధముగ యా కుంభకర్ణుడును నింపుగ ధర్మము విషయమునన్
స్థిరముగ నుండీ తపస్సు జేసెను శీలము దప్పక యుండెనటన్!
ఆ విధి తపమును జేయుచుండగా నలరుచు బదివేల్ వత్సరముల్
గడచిపోయినవి కమనీయముగా కఠిన తపస్సును జేయగనూ! 5

ధర్మాత్ముండగు విభీషణుండును ధర్మము దప్పక నిత్యమునూ
పవిత్రు డగుచును నాతడు గూడను పవిత్ర సుధర్మ మార్గమునన్

ఐదువేల వత్సరములు నాతడు కై దుజేసినా వానివలెన్
నొంటిపాదమున నిలబడిజేసెను జంట యెవరు లేకుండగనూ! 6

అతని నియమములు సమాప్తంబునై నలరునపుడు నప్సర గణముల్
నృత్యము జేసిరి పుష్పవర్షమున నిజహస్తములను జల్లిరటన్
దేవతలందఱు గానము జేసిరి దీరుగ లయతాళంబులతో
సిద్ధులు, నాగులు, యక్షులుగూడను జేరి సుధ్వనులును జేసిరటన్! 7

ఐదువేల వత్సరముల కాలము నా విభీషణుడు దన మనసున్
స్థిరముగ నిలిపీ ముఖము, బాహువులు దీరుగ పైకెత్తుచు నిలిచీ
సూర్యదేవుని యనుసరించెనూ శూరుడు విభీషణుడు నపుడున్
ఏ దిక్కున సూర్యుండు నిలుచునో యా దిక్కున ముఖమును ద్రిప్పీ! 8

ఈ విధముగ నియతాత్ముడైన యా యింపుగ విభీషణుడు గూడన్
దశ సహస్ర వర్షములు తపసియై దగ తామసమును త్యజియించీ
నందనవనమున స్వర్గధామమున చందముగా నుండిన వాడున్
బొందునటులుగా నాత్మ సుఖంబును నొందెను నాత్మ సుఖంబు మతిన్! 9

ఆ దశ గ్రీవుడు బరిపూర్ణమునగు నల దశ సహస్ర వర్షములున్
నిరాహరుడై వర్ష సహస్రము నిండిన మీదట నొక శిరసున్
అగ్నులయందును నలరి వేయుచును నట హోమము జేసెను నతడున్
ఆశ యనునదీ మనసున నుండీ యతి సాహసములు జేయించున్! 10

ఆ విధముగ యా దశగ్రీవుడును నలతొమ్మిదివేల్ వత్సరముల్
తపసుజేయుచుండగ కాలంబును దరలిపోయినది ప్రకృతిలో!
ఆతని తొమ్మిది శిరసులు గూడను నగ్నులందునను బడవైచీ
హోమముజేసెను భయంకరముగా హోమాగ్నులకును సంప్రీతిన్! 11

పదివేల్ వత్సరములును బూర్తియై బన్నుగ యా సమయము నందున్
పదియవ శిరస్సు హోమమునందున బన్నుగ యర్పింపగ దలచీ
తన శిరస్సు ఛేదింపగ దలచీ బన్నుగ ఖడ్గము గైకొనగా
బ్రహ్మ దేవుడును నచటికి వచ్చెను బరువు భారమున నిటు బలికెన్! 12

బ్రహ్మదేవుడును సుప్రీతుండై బహు సంతసమును గూడికొనీ
దివి దేవతలను గలసి వచ్చెనూ దివ్య ప్రభావము గలవాడున్
ఆ దశగ్రీవునితోడను బలికెను నలరుచు బ్రేమాస్పదుడగుచున్!
దశగ్రీవా! నే సంతసించితిని దగ నీదు మహాతపసునకున్! 13

ధర్మజ్ఞా విను! ఏ వరంబులను దగ కాంక్షించెదవో నీవున్
ఆ కోరికలను గోరుకొనుము నే నలరి యిచ్చెదను శీఘ్రముగన్!
నీవు చేసినా ఘన తపస్సు లవి నిలిచిపోవగా రాదుగదా!
కోరికలేవో వివరింపుము మఱి కొసరు లేమియును లేకుండన్! 14

ఆటుమీదట యా దశగ్రీవుండును యలరి సంతసము నొందుచునూ!
మనస్సునను దలవంచి బ్రహ్మకును మధుర సమస్కృతులను జేసీ
దేవా! యనుచును బ్రార్థించుచునూ దివ్యస్తోత్రమును జేయుచునూ!
ఇటుల బలికెనూ యా రాక్షసుడును చటుల చతుర వచనంబులతో! 15

ఓ భగవంతుడ! యిల ప్రాణులకును వనరగ మరణము కంటె మఱిన్
అన్యత్రమునగు భయము లేదుగద! యా విషయము నీకును దెలియున్!
మృత్యువు కంటే శత్రువులేదూ, మృత్యువాత నే బడకుండన్
అమరత్వంబును గోరుచుంటినీ యా వరమును దయచేయు మికన్! 16

ఆ మాటలు విని బ్రహ్మదేవుడును నా దశగ్రీవునితో బలికెన్
శాశ్వతామరత్వంబనునది యీ ధర సాధ్యముగానిది ప్రాణులకున్
మఱియొక వరమును గోరుకొనుము యిక మానుగ దయసేయుదు నీకున్
ఆ దేవునకును నలవిగానివీ యలరి భక్తులును గోరుదురూ! 17

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా! సీతారామ్
లోకములను సృజియించు ప్రజాపతి లోలత యాతని పలుకు వినీ
దశ గ్రీవుడు నంజలిని ఘటించుచు దగ నమస్కృతుల గావించీ
ఆ ప్రజాపతికి బలికె నిట్టులను నా రాక్షసుడును జతురముగా! 18

ప్రజాపతీ! ఓ ప్రజాధ్యక్షుడా! బరగ నాదు ప్రార్థన వినుమా!
పక్షులకును, నాగులకు యక్షులకు, బరగ దైత్య దానవులకునూ!
దేవతలకును మఱి యా రాక్షసులకును దివి గంధర్వులకును గూడన్
చంపగ జాలక యుండునట్లుగా నింపుగ దయసేయుము వరమున్! 19

అమర పూజితా! అలరి వినుము నా యర్థించెడి నా వచనములన్
అన్య ప్రాణులా విషయమునందున యలరి చింతయును లేదు సుమా!
మానుషాదులను తృణ భూతములుగ మానుగ దలచుచునున్నాడన్
ఆ వరంబునూ దయసేయుము నిక యలరి నేను గోరిన యుటులన్! 20

రాక్షసుడైనా దశగ్రీవునకును రహి ధర్మాత్ముడు దక్షుడునూ
బ్రహ్మదేవుడును నిటులను బలికెను బన్నుగ మోదము గలవాడై!
రాక్షస శ్రేష్ఠుడ! దశగ్రీవా విను! రయమున నీ కోరిన రీతిన్
అటులే జరుగును ననుచు బలుకుచును నలరి బలికి మఱి యిటులనియెన్
నీ విషయంబున సంతోషించిన నేనును మఱియొక వరంబునూ
యిచ్చుచుంటినీ వినుమా రక్తిని మచ్చికతో బహు పదిలముగా! 21, 22

అనఘా! రాక్షస! దశగ్రీవా విను! నలరి నీ చేత పూర్వమునన్
ఏ శిరసులు నగ్నులయందుననూ నింపుగ హోమము జేసితివో
ఆ శిరసులు మఱి పూర్వమువలెనే యలరి వచ్చు గతమునకు వలెన్
అట్టి తపస్సును జేసి నావు గద! యిట్టె నితరులకు సాధ్యంబా? 23

ఓ సౌమ్యుడ విను! దురాసదంబగు వనర యన్య వరమును గూడన్
ప్రసాదించుచుంటిని విను రాక్షస! ప్రేమ మీరగను నీ యందున్!
మనసునకును నీకేది యిష్టమో! మానుగ యా రూపంబు మఱిన్
నా వరంబుచే లభింపగలదూ! నయముగ సందేహము లేదూ! 24, 25

ఆ ప్రజాపతియు జెప్పిన రీతిని యా దశగ్రీవుడు రాక్షసుకున్
తపస్సునందున యగ్నులలో దా దగ హోమము జేసిన యట్టి

అల తొమ్మిదియగు శిరసులు గూడను నలరి మొలిచినని యథా స్థితిన్
వలదన్నను దుష్టులకు కోరికలు వరుసను సమకూడుచు నుండున్! 26

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
సకల జగములకు బితామహుండును సరసత యట్టి ప్రజాపతియున్
దశగ్రీవునితో నటుల బలికియును దగ నటు బిమ్మట నాతండున్
ఉత్తముడగు నా విభీషణునితో జిత్తము హర్షము నందగనూ! 27

వత్సా! ధర్మాత్మా! విభీషణా! వనరగ నా పలుకుల వినుమా
సువ్రత1 ధర్మమునందు బుద్ధిగల శుభములు గలుగును నీకు మతిన్
నీ విషయంబున సంతోషించితి నీవే వరములు గోరుదువో!
అలరి ప్రసాదించెదను నాకునూ యాత్మీయుడ వైతివి నీవున్! 28

కిరణంబులచే చంద్రు డే విధము విరియుచు ప్రకాశమందెడినో
ఆ విధముగనే విభీషణుండును నలరుచు సద్గుణముల తోడన్
అంజలి ఘటించి నమస్కరించుచు నలరి పలికె నీ విధముగనూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 29

ఓ భగవంతుడ! లోకపూజ్యుడా! వనరగ నా ప్రార్థన వినుమా!
ఏ కారణమున నా విషయంబున నింపుగ వరమును గోరుమనీ
కోరుచుంటివీ కృతకృత్యుడ నే కుదురుగ వినుమా నా పలుకున్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 30

భగవంతుడ! ఓ ప్రజాపతీ విను! బన్నుగ మహాదాపదలందున్
నా మది ధర్మమునందే స్థిరముగ నడుచునట్లుగా వరమిమ్మా
ఉపదేశము లేకున్నను గూడను నున్నతమగు బ్రహ్మాస్త్రంబున్
నాదు మదిని మతి స్ఫురించుగాతను! నయముగ నీదు ప్రభావమునన్! 31

ఏ యే యాశ్రమముల యందుననూ యే యే బుద్ధులు స్ఫురించునో
ఆయా బుద్ధులు ధర్మ సమ్మతము నగును గాత! సద్ధర్మమునన్!
ఆ యా ధర్మంబులను శ్రద్ధతో నలతి నేను బావించునటుల్
అట్టి రెండువరములు దయసేయుము నిట్టి నీకు దయ గలిగినచో! 32

పరమోదారుడ! ప్రజాపతీ విను! బన్నుగ నాదు సుకోరికలన్
అనుగ్రహింపుము! నివి నా కిష్టము నలరుచు ధర్మమునం దెపుడున్
ధర్మము నందును, సత్యము నందును దగ యాసక్తి గలారికినీ
లోకము నందున దుర్లభమైనది లోలత లేదుగదా జూడన్! 33

అల ప్రజాపతియు నఖిల లోకపతి నా బ్రహ్మయు సంతసమందీ
విభీషణునితో నీ విధి బలికెను విమల కరుణ దొలుకాడగనూ!
ఓ దర్మిష్ఠుడ! వత్సా! వినుమా! వనరగ నీ వే విధముగనూ
బలుకు చుంటివో యా విధముగనే భవిష్యత్తులో బరగును గాతన్! 34

అమిత్ర నాశన! విభీషణా విను! నల రాక్షస జన్మమునందీ
నీదు బుద్ధి యా యధర్మమందున నిలచుచు ప్రసరింపగ లేదూ!
ఆ కారణమున యా సుగుణమునను అలరి నీకు నమరత్వంబున్
వరము ప్రసాదించుచు నుంటిని నే వర్ధిలు శాశ్వతమును నిలలో! 35

ఆ ప్రజాపతియు విబీషణునితో నా విధముగ బలుకుచు మఱియున్
కుంభకర్ణునికి వరములిచ్చుటకు కూరిమితో నట నిలువగనూ
అట్టి సమయమున యా ప్రజాపతికి యఖిల దేవతలు నంజలితో
నమస్కరించుచు బలికి రిట్టులను నమ్రభావమును దొలుకాడన్! 36

ప్రజాపతీ! ఓ లోకపూజ్యుడా! బరగ కుంభకర్ణునికి మఱిన్
వరములనిచ్చీ ప్రోత్సహింపకుము! వల్లమాలినా దుండగముల్
దుర్మతి మఱియును దురాచారుడును దుఃఖము జగతికి గలిగించున్
నీకు దెలియు నీతడు గత కాలము నిర్దయ జేసిన దురితములున్! 37

బ్రహ్మదేవుడా! వినుమా దయతో బరగ కుంభకర్ణుని జేతన్
స్వర్గమందు నందన వనమందున సప్తాప్సరసలు, పదిమందీ
యా మహేంద్రుని యనుచరులును మఱి యలమునులును మఱి మహర్షులున్
మనుష్యులును భక్షింపబడిరిగా మహారాక్షసుడు వీడు సుమా! 38

అలబ్ధ వరముల పూర్వమందునను నటుల జేసె నీ రాక్షసుడున్
తెలుపగ రానీ దుష్కృత్యంబుల దీరుగ జేసెను లోకమునన్

వరముల పొందినచో నిక యీతడు వల్లకాడుగా త్రిలోకముల్
జేయును గావున యనుగ్రహింపకు జిరకాంక్షితములు నగు వరముల్! 39

అమితప్రభ ఓ ప్రజాపతీ విను! యలరి జేయు మా ప్రార్థనలన్!
వరవ్యాజంబున కుంభకర్ణునికి వనరగ మోహము శీఘ్రముగన్
నిమ్మా యితనికి లోక క్షేమమును నిమ్ముగ జరుగును నిక మీదన్
వీడు కోరినా కోరికదీరును వికటమునగు నా కోరికలున్! 40

దేవత లందఱు నిటుల బలుకగా దీరుగ యా బ్రహ్మయు గూడన్
యాలకించి మఱి యా వచనములను నలరి యోచనము జేసె మదిన్!
వాగ్దేవిని తన సతిని దలచెనూ వందిత లోక సరస్వతినీ
ఆ దేవియు మఱి సమీపించెనూ యలరుచు నాతని పార్శ్వమునన్! 41

ఆ సరస్వతీ దేవియు గూడను నలరి పార్శ్వమున నిలిచి మఱిన్
అంజలి ఘటించి నమస్కరించుచు నాతనితో నీ విధి బలికెన్!
దేవ దేవ! ఓ లోక ప్రభూ విను! దీరుగ వచ్చితి నే నిటకున్
ఏ కార్యంబును నిర్వహింపవలె నెఱుగ దెలుపుమా విశదముగన్! 42

ప్రజాపతియునగు బ్రహ్మదేవుడును బన్నుగ వచ్చిన వాగ్దేవిన్
పార్శ్వంబున నిలిచిన యామెను గని బరగ బలికె నీ విధముగనూ!
ఓ వాణీ! ఓ వీణాపాణీ! సురలకు నిష్టమునగు వాక్కున్!
రాక్షసేంద్రుడగు కుంభకర్ణుతో రమ్య వాక్కులను బలికింపూ! 43

'అటులే!' యనుచును బలికి సరస్వతి యతని వాక్కునను జేరె మఱిన్
అటు బిమ్మట యా బ్రహ్మ దేవుడును నల రాక్షసుతో నిటు లనియెన్!
మహా బాహు! ఓ కుంభకర్ణుడా! మానుగ నీకే వరములునూ
కావలెనని మఱి గోరుచుంటివో కరుణను నిచ్చెద గోరుకొనూ! 44

కుంభకర్ణుడును దద్వాక్యము విని కూర్మి ప్రజాపతి కిటు లనియెన్!
పితామహా! నా కోరిక ఒకటే ప్రేమను నిమ్మా మహా ప్రభూ!
అనేక సంవత్సరములు నేనును నలరి నిద్ర బోవలెనంచున్
మనసులోని నా కోరిక నిమ్మా! మన్నింపుము నను పితామహా! 45

ఆ పితామహుడు 'అట్లే యగు' నని యలరి బలుకుచును రాక్షసుతో
అల దేవతలను గూడి బ్రహ్మయును నలరి బోయె తన లోకంబున్!
ఆ వాగ్దేవీ యా సరస్వతీ నల రాక్షసునీ విడిచి మఱిన్
తన లోకమునకు దరిలిపోయెనూ తగ ప్రజాపతిని గూడికొనీ! 46

బ్రహ్మను గూడుక యా దేవతలును బరగ నభ స్థలమును జేరీ
వెడలుచుండగా నటు బిమ్మటనూ వికృతుడగు నా రాక్షసునీ
విమలమైన యా వాగ్దేవియునూ విపులమైన యాతని ముఖమున్
విడిచిపోవగా నా రాక్షసునకు విమలమైన తన స్పృహ గలిగెన్! 47

దుష్టాత్ముడు నగు కుంభకర్ణుడును దు:ఖితుడై చింతను గూడీ
యీ విధమున యతడాలోచించెను నీసును గలుగగ సురలందున్
ఈ సమయంబున నా వదనంబున యిట్టి వాక్య మొచ్చినదేమో!
ఇచటికి వచ్చిన సురలందఱునూ యిట్టి మోహమును గలిగించీ
వెడలిపోయిరీ నా దురదృష్టము గడు మోసము జేసిరి నన్నున్! 48

తేజస్సులతో ప్రకాశించు నా ఓజస్సునుగల రాక్షసులున్
ఈ విధంబుగా వరములనందీ యింపుగ గర్వములను జెలగీ
శ్లేష్మాతక యను వనమును జేరీ శ్రీకరముగ నట సుఖముగనూ
వసియించిరి యా సోదరులందఱు వన్నెలు జిందుచు గరముననూ! 49

శ్రీరామ కథాసుథాలహరి యందు - ఉత్తరకాండలో
పదియవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (మొదటి సంపుటము)

# పదునొకండవ సర్గము

(రావణుడు లంకా నగరమును ఆక్రమించుట)

ఆ రాక్షసులును వరములనందీ అల్లశ్లేష్మాతక వనమందున్
వసించు నటులను దెలిసికొనియునూ వనరగ నపుడు సుమాలియునూ
భయమును వీడీ తన యనుచరులను బరగ గూడికొని యాతండున్
రసాతలంబును వీడి బయటకును రయమున భూతలమున కొచ్చెన్ ! 1

ఆ రాక్షసునకు మంత్రులునైనా! యలమారీచుడు ప్రహస్తుడున్
విరూపాక్షుడును మహోదరుండును విమల సంతసము గూడికొనీ!
ఆ పాతాళము నుండి వచ్చిరీ యిల భూతలమునకును వేగన్
సుమాలితోడను వెంట వచ్చిరీ సుఖములు నందగ యాతనితో! 2

ఆ సుమాలియును మంత్రులై న యా యతిరథులైన పరాక్రములున్
రాక్షస పుంగవులను గూడికొనీ రయమున దశగ్రీవుని కడకున్
సమీపించి మఱి కౌగలించుకుని చక్కని యభినందనములతో
ప్రీతిని యీ వాక్యములను బలికెను ప్రేమమీద దశగ్రీవునితో! 3

వత్సా! నీవును త్రిలోక శ్రేష్ఠుడు బ్రహ్మనుండి యుత్తమమైనా
మహోజ్వలంబగు వరముల నందీ మానుగ ధన్యత నొందితివీ!
అదృష్టవశమున నీ కోరికయును నలరి పొందబడినది యిపుడున్
రాక్షసవంశము ధన్యమైనదీ రమ్యముగా నీ వలన సుమా! 4

మహాబాహువులు గలవాడా! విను! మానుగ మేమందఱము నటన్
దేవివలన యా లంకను విడిచీ దీరుగ రసాతలంబునకున్
వెడలితిమో యా విష్ణుకృతంబగు వీడితి మిక నా భయంబునూ!
చెదిరిపోయినవి చిక్కులన్నియును మదిని భయంబులు వీడినవీ! 5

మే మందఱము అనేక మాఱులు మిగుల భయంబున విష్ణువుకున్
పరాజయము పొందిన వారమునై బన్నుగ స్వమాలయము వీడీ

పారిపోయినా వారలమగుచును బన్నుగ మఱలను గలిసికొనీ
రసాతలంబును బ్రవేశించితిమి! రహి వసింపగా యందఱమున్! 6

ఈ లంకా నగరంబు మనది సుమ! యీ రాక్షసులు వసించినదీ!
ఇట్టి లంకనూ ధీమంతుడునగు అట్టి నీదు సోదరుడు మఱిన్
ధనాధ్యక్షుడగు కుబేరుండునూ తామసముగ యా నగరంబున్
ఆక్రమించి మఱి వసించుచుండెను నపహరించి యన్యాయముగన్1 7

అనఘా! ఘన భుజములు గలవాడా! యా లంకా నగరంబు మఱిన్
సామోపాయము చేతగాని మఱి సరి దానము చేతను గానీ
బలప్రయోగము చేతగాని మఱి బన్నుగ సంపాదించినచో
మంచిపనిని సాధించినట్లగును నంచితముగ సుకృత మగునూ! 8

వత్సా! నీవును లంకకంతయును వనరగ యధీశ్వరుండవునై
భవిష్యత్తునను నుండగలవు సుమ! బన్నుగ సందేహము లేదూ!
మునిగిపోయినా రాక్షస వంశము మోదమునను బైకెత్తితివీ
ప్రభుండవై మా కందఱికిని మఱి ప్రభుత జేయవలె మునుముందున్! 9

అటుపిమ్మట యా దశగ్రీవుండును నటు వచ్చిన మాతామహునీ
జూచియు బలికెను నీ విధంబుగా సురుచిరముగ బహు వినయమునన్!
ధనేశుండునగు అన్న కుబేరుడు దగ మాకును బూజ్యుండు సుమా!
ఇట్టి వచనముల బలుకరాదు సుమ! గట్టిగ మన కత డాప్తుండున్! 10

గరీయసుండగు దశగ్రీవుండును కమ్మని మృదువగు పలుకులనూ!
త్రోసిపుచ్చుటయు దనను కాదనుచు దోరముగా బలుకుట చేతన్
ఆ సమయంబున యతని భావమును యలరి దెలుపగా మౌనముగాన్
మఱు మాటను మాటాడగలేదూ! మానుగ సుమాలియును నపుడున్! 11

అటుపిమ్మట మఱి కొంత కాలమును నటుల జరుగుచును నుండగనూ
అటనివసించెడి ప్రహస్తుండునూ యా దశగ్రీవునితో ననియెన్!
హేతుగర్భితములగు వాక్యములను నీతివంతములు నగునవియున్
సవినయంబుగ నిటులను బలికెను సహజ బుద్ధి వికసింపగనూ! 12

మహాబాహు! ఓ దశగ్రీవా విను! మానుగ యీ దృశ వాక్యములన్
బలుకుట నీకును తగదు సుమా! బరగ వినుము నా పలుకులనూ!
శూరులకును మఱి భాతృ ప్రేమయును సురుచిరముగ నుండగ దగదూ
ఉదాహరణముగ దెలుపుచుంటినీ యూహింపుము నీ మనసుననూ! 13

పరమ రూపమును గలవారును మఱి బరగు సోదరీ మణులు మఱిన్
అదితీ దితియను నామధేయముల నలరుచు నుందురు వారు మఱిన్
ప్రజాపతియునగు నా కశ్యపునకు బన్నుగ భార్యలు నిరువురునూ
రఘుపతి రాఘవ! రాజారామా! పతిత పావనా! సీతారామ్! 14

ఆ కశ్యపునీ సుదతి అదితియును యలరి దేవతల బ్రసవించెన్
దితి కశ్యపుని వలన నుండి మఱి యతి బలవంతుల రాక్షసులన్
ప్రసవించెను మఱి విధి నిర్ణయమది బరగ వారలా గుణములతో
సురలుండిరి మఱి సద్గుణములతో నసురులు దుర్గుణముల తోడన్! 15

ధర్మంబులు దెలిసిన వాడా! విను1 దగ సాహసవంతుడ వినుమా!
సముద్రమే వస్త్రముగా గలిగిన సకల పర్వతములను గూడీ
ఉండినట్టి యీ ధరా తలంబును నుండెను రాక్షసులకు వశమై
అలదైత్యులునూ యలరి ధరణిపై యధికారులుగా నుండిరటన్! 16

ప్రభవిష్ణుండగు విష్ణుదేవుడును బన్నుగ సంగ్రామము నందున్
దైత్యుల వధించి యవ్యయంబుగను దగ త్రైలోక్యంబులను మఱిన్
దేవతలకు స్వాధీనము జేసెను దీరుగ సద్గుణములు ప్రబలన్
రాక్షసులను నర్భకులను జేసెను రహి నా విష్ణువు ద్వేషముననన్! 17

ఈ విపర్యయము నీవే కాదూ! నిజముగ లోకము నందుననూ
సురాసురులచే నాచరింపబడి స్రుక్కిరి వారును వీరు మఱిన్!
సోదర ద్వేషము నంతటగలదూ, శోధించిన ప్రత్యక్షమగున్
అందువలన నే దెలిపినట్లుగా చందముగా జేయుము నింకన్! 18

ఇటుల పలుకగా ప్రహస్తుండునూ చటుల రాక్షసుడు రావణుడున్
ఆ మాటలు విని మనస్సునందున యలరి ద్వేషమున పొంగుచునూ!

క్షణకాలము యోచించి నాతడును మనసున మథనముజేసి మతిన్
సరియే! తప్పక యటులే జేసెద! సరసత ప్రహస్తుతో బలికెన్! 19

వీర్యవంతుడగు దశగ్రీవుండును విమలమైన యుత్సాహమునన్
ఆ రోజుననే యాక్షణంబునను నటగల రాక్షసులను గూడీ
తన వనమునకును బయలుదేరెనూ, తత్తరబాటును లేకుండన్
దుర్మార్గుల ప్రేరణము జేతనే దుష్టులగుదు రీ మేదినినీ
సన్మార్గులునూ జెడుచుందురుగద! సహజముగా దుష్టుల చేతన్! 20

అటు మీదట యా రాక్షసుడైనా చటుల పరాక్రము డైనట్టీ
దశగ్రీవుండును త్రికూట గిరిపై దగ తానుండియు శీఘ్రముగన్
మాటల యందున నేర్పరియైనా మాతామహుడగు ప్రహస్తునీ!
ఆ కుబేరుతో దౌత్యము జేయగ యలరిబంపె నా రావణుండున్! 21

ప్రహస్తుడా! ఓ మాతామహుడా! బన్నుగ శీఘ్రము బయనించీ
ధనాధిపతియగు కుబేరుతోడను దగ దెలుపుము నా మాటలుగా!
సామపూర్వకముగా నాతనితో సమయమునకు దగినట్టులుగా
తీయని మాటల దెలుపు మతనితో దీరుగ మన మది భావములన్! 22

ఓ సౌమ్యుడ! ఓ అనఘా! రాజా! వనర సౌమ్యమగు నా పలుకుల్
వినుము! నొకప్పుడు మహాత్ములునగు విమలులైన రాక్షసులకునూ!
వశమైయుండెను కాని లంకనూ! వశముజేసి కొంటివి యిపుడున్
ఇది నీకును యుక్తము కాదు గదా! నింపును కాదు గదా నీకున్! 23

అతుల విక్రమా! ధనాధిపా విను! అందువలన నీవును నిపుడున్
ఈ లంకను మాకర్పించినచో నింపుగ సంతసమును గలుగున్
ధర్మంబును బాలించిన వాడవు దగ నగుదువు కీర్తిని బొందీ
దగ లంకా రాజ్యమును వెంటనే దయతో మా కర్పింపు మికన్! 24

ఆ ప్రహస్తుడును రావణు బంపున యలరుచు లంకా పురమునకున్
తరలిపోయెను దౌత్యము సేయగ తగ లంకా రాజ్యంబునకై
లంకా పురమును జేరి ప్రహస్తుడు శంక లేక యా ధనదునితో
ఉదారమగు వాక్యములను బలికెను యున్నతమగు భావముతోడన్! 25

మహాబాహు! ఓ సువ్రత వినుమా! మహాస్త్రములునూ గలవాడా!
సమస్తమైనా శస్త్రధారులను సరి నీకెవ్వరు లేరుగదా!
నీ సోదరుడగు దశగ్రీవుండును నిర్మల మదితో నీదరికిన్
పంపినాడు గద! దౌత్యము సేయగ బన్నుగ లంకాపురి కొఱకున్! 26

సర్వశాస్త్రములు దెలిసినవాడా! సకల ధనంబులు గలవాడా!
మహాప్రాజ్ఞ! ఓ మంచి బుద్ధి గల మహిమాన్వితుడవు నీవు సుమా!
ఆ దశగ్రీవుని యాజ్ఞజేతనూ యలరి పలుకు నా వచనములన్
ఆలకింపుమా! యాప్యాయతనూ యలరుచు యోజింపుము మదినీ! 27

విశాలమగు నేత్రంబులు గలిగిన విమల భావ! ఓ ధనేశుడా!
రమ్యమైన యీ లంకా నగరము రహి పూర్వంబున విశదముగా
భయంకరంబగు పరాక్రమముగల బాహుబలులు నాసుమాలియున్
ప్రముఖ రాక్షసులు ననుభవించిరీ బన్నుగ యీ లంకాపురినీ! 28

తండ్రి కుబేరా! విశ్రవసాత్మజ! సౌమ్య వచనముల విను మింకన్
ఆ కారణమును స్నేహము తోడను నలరి యాచించు దశగ్రీవున్!
సోదరుగా భావించి యాతనికి శూరతగా నీ నగరంబున్
ఇచ్చివేయుమా! మచ్చిక తోడను, నచ్చముగా సోదరు వోలెన్
ఇపుడీ విషయము విశదరూపమున యింపుగ దెలుపుచు నున్నాడన్! 29

దేవుడైన యా వైశ్రవణుండును, దీరుగ బ్రహస్తు రాక్షసునీ
వచనములను విని యా కుబేరుడును వరుసను సద్విషయములైనా!
సద్వాక్యములను బదులు జెప్పెనూ సారసాక్షరములతో నపుడున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 30

ఓ ప్రహస్తుడా! రాక్షస వినుమా! వనరగ నాదు సువాక్యములన్
రాక్షసు లెవ్వరు లేని లంకనూ రహి నా తండ్రియు నాకిచ్చెన్
నేను ప్రజలకును వాసయోగ్యముగ నిర్మల మతినీ జేసితినీ
దాన, మానముల గుణముల చేతను దగ నాచే పాలింపబడెన్! 31

ఓ ప్రహస్తుడా! దశగ్రీవునకును వనరగ దెలుపుము నీ రీతిన్
అనుచు బలికె నా ధనేశుండునూ ననునయ సాదర వచనములన్

'మహాబాహు! ఓ దశగ్రీవా విను! మానుగ నాదు సువాక్యములన్
ఈ నగరంబును నా యీ రాజ్యము నింపుగ నీకును జెందినవే!
అకంటకంబుగ యీ సంపదలను ననుభవింపు పూనిక మీరన్!
నా రాజ్యమును నా సంపదలును నయముగ నీతో బంచుకొనీ
అనుభవింపవలసిన పనిలేదూ! యందఱ మొకటిగ నుండుదమూ!
మన మిద్దఱమును నన్నదమ్ములము మానుగ యవిభక్తములు నివీ! 32, 33

ఈ విధముగ యా కుబేరుండునూ నింపుగ ప్రహస్తుతో బలికీ
తండ్రి యొద్దకును బోయి యతనికిని దగ విధేయ యభివాదంబున్
జేసి రావణుని మనసు కోరికను శ్రీకరముగ తండ్రికి దెలిపీ
తండ్రియైన యా విశ్రవసునితో దగ నీ విధముగ వాక్రుచ్చెన్! 34

తండ్రీ! యీ దశగ్రీవుడు నాకును దగబంపెను దూతను మఱియున్
పూర్వము రక్షో గణములచేతను బొలుపుగ నుండిన యీ లంకన్
'తిరిగి యిచ్చివేయుము' యటంచును దీరుగ బంపెను బ్రహస్తునిన్
అనుష్ఠింపవలసినది దెలుపమా! యలరుచు నీ సమయమునందున్! 35

ఈ విధముగ బలుకగ కుబేరుడును నింపుగ బలికెను బ్రహ్మర్షీ
మునిపుంగవుడగు నా విశ్రవసువు మోదముననను నాశీస్సులతో
ప్రాంజలితో నుండిన యా ధనదుని బరగ శిరస్సును ముద్దాడీ
యీ విధముగ బలికెను నాతనితో నింపుగ సుమధుర వాక్యములన్! 36

మహాబాహువగు నా దశగ్రీవుడు మానుగ నా సన్నిధియందున్
ఈ విషయంబును బ్రస్తావించెను నెద్దియు మనసున దాపకనూ!
చాల చెడ్డ బుద్ధియు గలిగాతడు జెలగుచుండు నా రావణుడున్
అనేక విధముల గోపించితినీ యనేక విధముల దెలిపితినీ! 37

సక్రోధముతో నా దశగ్రీవుకు సరసముగా మది దెలిపితినీ
అటుల జేయుచో నశించెదవు సుమ! చటుల శాపమున నా చేతన్!
అనేకమారులు బెదిరించితి గద! యసలు వినడుగద! మూర్ఖుండున్
కావున పుత్రా! శ్రేయస్కరమును కలహము లేకుండెడి యటులన్
ధర్మసమ్మతము నగునొక మాటను దగ దెలుపుచు నుంటిని వినుమా! 38

వరప్రదానముజేతను మిక్కిలి వరగర్వంబున నాతండున్
నా శాపంబున చేత గూడ మఱి నయముగ దారుణ స్వభావమున్
పొందినాడుగద దుర్మతి యాతడు 'పొగరుబోతు'అని భావింతున్
మంచి చెడ్డలును దెలియవు వానికి యంచితమగ మూఢుండతడున్! 39

మహాబాహు! ఆ కారణంబునను మానుగ లంకను విడిచి మఱిన్
సహచరులను మఱి గూడికొనుచునూ సరగున బొమ్మా ప్రదేశమున్
కైలాసంబను పర్వతంబునకు కలహ మెందులకు మూర్ఖునితో
నివాసార్థమై నిర్మించుము నట నిశ్చలముగ ఒక నగరంబున్! 40

కైలాసాచల ప్రాంతమందునను కమ్మని నీరును గలదియునూ
నదులయందునను నుత్తమమైనది నయముగ మందాకిని గలదూ
ఆ నదీజలము సూర్యుని తోడను నలరుచునుండును సయముగనూ
తెల్ల కలువలను నల్ల కలువలను దీరుగ సుగంధ వాసనలన్
గూర్చినట్టివియు నితర పుష్పములు గుదురుగ నుండును నిండుగనూ! 41, 42

ఆ మందాకిని తీరమునందున నలరుచు విహార శీలురునూ
గంధర్వులునూ యప్సరసలునూ యురగులు కిన్నెరలును గూడన్
దేవతాగణము నెల్లప్పుడునూ యట యాశ్రయమును బొందుచునూ
క్రీడించుచు నుందురు నెల్లపుడును కిన్నరలను మ్రోగించుచునూ! 43

ధనేశుడవు! దాక్షిణ్యముగలదూ! దగ యీ రాక్షసు తోని మఱిన్
వైరమెందులకు? యుక్తముగాదూ! వలస బొమ్ము! మందాకినికిన్!
వీని చేత బహు గొప్పదైన యా విశదమైన వరమును బొందెన్!
సంపాదించిన వరముల సంగతి చక్కగ దెలియును నీకు మఱిన్! 44

ఇటుల బలుకబడి పితరుని జేతను మెట్లు దిగిన యట్లును నతడున్
పితరుని యందున గలగౌరవమును పెద్దగ మది మన్నించుచునూ
సదార పుత్రులతోడను మఱియును సామాత్యులనూ గూడికొనీ
వాహనములతో ధనంబుతోడను వలస బోయె కైలాసంబున్! 45

అటుబిమ్మట నా ప్రహస్తుండునూ చటుల ప్రహృష్టాత్ముండగుచున్
మంత్రులతోడను, తమ్ములతోడను మానుగ సహచరులను గూడీ

యుండినట్టి యామహాత్ముడైనా దండి బలంబును గలవాడున్
ఆ దశ గ్రీవుని సమీపంబు జని అటులబలికె నీ విధముగనూ! 46

శూన్యమైనదీ లంకానగరము శూన్యమైనదీ జనములతో
ధనదుడు దానిని విడిచిపోయెనూ దారాపుత్రులతో గూడన్
నీవును మాతో గలిసిగూడికొని నిర్జనమగు లంకాపురీనీ
ప్రవేశించి నీ స్వధర్మంబునూ పరిపాలింపుము శూరతనూ! 47

మహాబలుండగు దశగ్రీవుండును మానుగ ప్రహస్తు మాట వినీ
సంతసించుచును మదిలో మిక్కిలి యంతములేని మదంబుననూ
అనుచరులను మఱి సైన్యము గూడుక యల సోదరులను గూడికొనీ
లంకానగరము ప్రవేశించెనూ శంక లేక యించుకయైనన్! 48

దేవశత్రువగు నా దశగ్రీవుడు దీరుగ తన బంధుల తోడన్
ధనదుని చేతను విడువబడిన యా ధార్మిక పురియగు నా లంకన్
విశాలంబులగు మార్గంబులనూ విమల సుందరంబగు నగరిన్
దేవేంద్రుండును స్వర్గ ధామమును దీరుగ నడుగిడు నట్టులనూ
ఆ దశగ్రీవుడు నలరి లంకలో నడుగిడె నందఱు కీర్తింపన్! 49

అపు డా దశాననుండు లంకును నభిషిక్తుండై శీఘ్రముగన్
ఆ లంకా నగరంబు నందునను నావాసంబును జేసికొనెన్!
ఆ పురి నీలబలాహకోపమై యల రాక్షసులను నిండుకొనీ
పూర్ణమైనదీ సకల కళలతో పూర్ణిమ చంద్రుని వలె నుండెన్! 50

అట్టి సమయమున వైశ్రవణుండును నిట్టి తండ్రి మాటల పైనీ
గౌరవంబుజేతను విమలమునగు కైలాసగిరీ యందుననూ
దేవేంద్రుండును స్వర్గధామమున దీరుగ యా యమరావతినీ
నిర్మించిన యటు దశగ్రీవుండును తివిరి త్రికూటపు గిరియందున్
లంకా నగరము నిర్మించెను మఱి వంకలేని భవనంబులతో! 51

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
పదనొకండవ సర్గము సమాప్తము

శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# పంద్రెండవ సర్గము

(శూర్పణఖ వివాహము - రావణాదుల వివాహములు - ఇంద్రజిత్తు పుట్టుక)

అటు మీదట యా రాక్షసేంద్రుడును నభిషిక్తుండై తరువాతన్
తన సోదరులను కూడినవాడై తమ సోదరి శూర్పణఖనూ
ప్రదాన విషయము నాలోచించెను బన్నుగ వరుని గుఱించియునూ
అన్ని విషయముల నాలోచించెను నా సోదరులను గూడికొనీ ! 1

రాక్షసరాజగు దశగ్రీవుండును రయమున సోదరి యగుదానిన్
అ శూర్పణఖా వైవాహికమును వనరగ జేసెను శీఘ్రముగన్!
కాలకేయునీ పుత్రుడైన యా కాలయమునికీ సముడైనా
విద్యుజ్జిహ్వుని కిచ్చి జేసెనూ వివాహమును వైభవముననూ! 2

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్
ఆ విధముగ శుర్పణఖ వివాహము నలరిజేసి తా నొంటరిగా
ఆడంబరమున వేటకు జనగా నట కనబడె దితికుమారుడున్
మయుడు వనియెడీ నామధేయుడును మాయలు గలవాడును మఱియున్! 3

కన్యక తోడుత నాతని గాంచుచు కలవరబాటును జెందుచునూ
ఆ దశగ్రీవుడు నాతనిగాంచీ యలరుచు నాతని ప్రశ్నించెన్
ఎవడవు నీవు? పేరేమిటి మఱి? యెచ్చటి వాడవు తెలియదుగా
మానవులును మఱి మృగములు లేనీ మాఱు మూల నున్నట్టి వనిన్
ఒంటరిగా మఱి లేడి పిల్లవలె వనరగ యింతలు కనులుగలా
యీమెను గూడుక యీ వనమందున నెందులకుంటివి దెలుపుమనన్! 4

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్
ఆ దశగ్రీవుడు నటు ప్రశ్నింపగనా మయుండనూ నిటు బలికెన్
ఏ విధముగ జరిగినదో నంతయు నింపుగ నంతయు దెలిపెదనూ
సాంతము దెలిపెద యున్న దున్నటుల వింతగ జాడకు నన్నిచటన్! 5

రావణ1 వినుమా! హేమయనియెడీ రమ్యాప్సరసయు గలదు సుమా!
ఆమె నామధేయంబును నీవును అలరి వినియు యుండగవచ్చున్
దేవేంద్రుడును శచీదేవినీ దీరుగ యిచ్చిన యటు నాకున్
ఆ హేమను నాకిచ్చి పరిణయము నలరుచు జేసిరి దేవతలున్! 6

ఎంతోకాలము నామె తోడుతను వింతగ కాపురమును జేసీ
ఆమె యందు మది లగ్నము జేసీ యలరిగడిపితినీ కాలమునూ!
ఆమె ప్రస్తుతము దేవ కార్యమున నటుబోయెను శుభమును గూర్పన్
వర్ష త్రయోదశమును గడిచినదీ వనరగ పదునాలుగు గూడన్! 7

గడచిపోవుచున్నదిగానీ మఱి కానరాదు గద హేమయునూ
అటుమీదట నే మాయచేతనూ యలరి హేమ మయమైనట్టీ
వజ్రవైడూర్య మణులతోడనూ వనరగ నిర్మించితిపురమున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 8

ఆ హేమయు లేకను శూన్యుడనై యలరి దుఖమున దీనుడనై
ఆ నగరమునను వసించితిని నే యలరుచు హేమ సువిరహమునన్
ఇపుడునేను ఆ నగరమునుండీ యా కోమరితనూ దీసికొనీ
ఈ వనంబునకు నే వచ్చితినీ యిచట నిన్ను బొడ గాంచితినీ! 9

ఓ రాజా వినుమా ! దశగ్రీవా వనరగ మా వృత్తాంతంబున్
ఆ హేమకు కుక్షిని బెరిగినదీ అలరు నాదు పుత్రిక సుమ్మా
తల్లికి వలె నే పెంచితి నీమెను దయయు ప్రేమయును వర్ధిలగన్
ఈమెకు భర్తను వెదుకుచుంటినీ యీమెను గూడను దెచ్చితినీ! 10

మాన కాంక్షితులు నగు వారికినీ మానుగ సర్వులకును మఱియున్
కన్యాపితృత్వము తండ్రికినీ గడు దుఖము గలిగించుగదా!
కన్య యెల్లపుడు రెండు కులములకు గడు సంశయమును గలిగించీ
బాధపెట్టుచుండును లోకంబున బరువు పెట్టుచుండును నెపుడున్! 11

అట్టి భార్య యా హేమయందునను నిట్టె యిరువురూ పుత్రులునూ
పుట్టినారు దశగ్రీవా వినుమా! పొలుపుగ సంతసమును గలుగన్

మాయావీ యనువాడు ప్రథముడును మానుగ రెండవ వాడుదగన్
దుందుభి యనియెడి నామధేయమున యందముగా బరగుచునుండున్! 12

ప్రశ్నించితివీ కావున నీవును బన్నుగ సర్వము దెలిపితినీ
యథాతథముగా సత్యము దెలిపితి యల జరిగిన విషయములన్నీ
నాయన! నీవును సత్యము దెలుపుము! నయముగ నీ విషయము నంతన్!
ఎవ్వరివాడవు? ఎవ్వడ వీవును? ఎందులకొచ్చితి విచ్చటికిన్? 13

ఈ విధముగ యాతండు బలుకగా నింపుగ యా దశగ్రీవుండున్
వినీత భావము గలవాడగుచును విశ్రుతమగు తన కథ దెలిపెన్
పులస్త్యునికి నే పుత్రుని పుత్రుడ! పొలుపుగ దశగ్రీవుండనెడీ
నామధేయమున బరుగుచుంటినీ! నయముగ యా ప్రజాపతికిన్
తృతీయ పుత్రునిగా యెవరుండెనొ యట్టి విశ్రవసుకు కుమారుడన్! 14, 15

ఆ దశగ్రీవుని బలుకుల వినుచును నలదానవుడగు మయుండునూ!
విశ్రవసునకును సుతుడని దెలిసియు విమల హర్షమున యుప్పొంగెన్!
అచ్చటనే యతనికి తన తనయను ముచ్చటగా నివ్వగ దలచెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 16

అంతట దైత్యేంద్రుండగు మయుడును చెంతనున్న తన కొమరితనూ!
దశగ్రీవుని హస్తంబుజేతనూ తన సుత హస్తంబును మఱియున్!
గ్రహింపజేయుచు నవ్వుచు బలికెను కరమున దశగ్రీవుని తోడన్
తన పుత్రికనూ జూపుచు బలికెను దగు రీతిని యా సమయమునన్ 17

రాజా! లంకాధిప! వినుమా మఱి రమ్యమైన యీ సుందరియున్
హేమయనెడి యప్సరస గర్భమున హేమంతంబున కలువ వలెన్
వికసించినదీ మండోదరి యను విమల నామధేయము తోడన్
బరుగుచున్నవీ యీ కన్యకయును పాణిగ్రహమున గైకొనుమా! 18

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
దశగ్రీవుండును మయుదైత్యునితో దగ యీ విధమున బలికెనటన్
'అట్లే పాణిగ్రహణము జేతును నినుచు బలికె యచ్చోటుననే
అగ్నిని యట జ్వలియింపగజేసీ యామెను గైకొనె తన సతిగా! 19

రఘుపతి రాఘవ రాజారామా! పతితత పావనా సీతారామ్!
ఆతడు దారుణ స్వభావుండు నగు యల సుజనత్వము మఱచుచునూ!
అనుచు విశ్రవసు రావణుకిచ్చిన నల శాపము విషయము దెలియున్
పితామహుని వంశము గమనించీ ప్రీతినిచ్చె తన కన్యకనూ! 20

అతని కమోఘము పరమాద్భుతమును నలరి తపస్సున పొందినదీ
శక్తియనెడి యస్త్రంబును గూడను రక్తిగ మయుడిచ్చెను దానిన్
ఆ దశ గ్రీవుడు సంతోషించెను నలశక్తిని గైకొనుచు మదిన్
ఆ శక్తిని గద ప్రయోగించెను నా లక్ష్మణుపై రణముననూ! 21

సమర్థుడగు నా దశగ్రీవుండును సరసరీతి వైవాహికమున్
జేసికొనియు తన సతితో గూడను జేరెను లంకాపురమునకున్
తమ్ములిద్దఱికి గూడను నాతడు తగ భార్యలనూ గొని వచ్చెన్
వైవాహికముల జేసివైచెనూ వైభవముగ కనుపండువుగన్! 22

వైరోచనునీ దౌహిత్రియునగు వజ్రజ్వాల యను కన్యకనూ!
కుంభకర్ణునికి భార్యగ జేసెను కూరిమి తమ్మున కప్పుడునూ
విభీషణునికీ కన్యను దెచ్చెను విమల మహాత్ముడును నైనా!
గంధర్వులకును చక్రవర్తియగు వింధ్య పర్వతము బలముగలా
శైలూషుని పుత్రిక యగు నట్టీ చక్కగ ధర్మము లన్నియునూ
తెలిసినట్టి యా సరమను సతిగా దీరుగ వివాహమును జేసెన్!
ఈ రీతిని తన తమ్ములకును మఱీ యింపుగ వివాహములు జేసెన్! 23, 24

ఆ సరమా యను కన్యకామణియు నల విభీషణుని పత్నియునూ
మానస సరవర తీరమునందున మానుగ జన్మించెను మఱియున్
అది వర్షాకాలము గావుననూ యలరి పొందె వృద్ధిని సరసున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతితత పావనా సీతారామ్! 25

అపు డా తల్లియు మధుర స్నేహమున యలరి బలికె బహువక్కువగన్
ఓ సరోవరమ పెరుగకుమా యిక! 'వర్ధిలబోకుము మానసమా!
అనుచు దల్లియును ప్రార్థించినదట! అందులకే యా బాలికకున్
సరమా యనియెడి నామధేయమును సరసత బెట్టిరి బాలికకున్! 26

ఆ రాక్షసులును నట్టి విధముగా అల వివాహములు జేసికొనీ
తమ తమ భార్యలతోని గూడికొని దగ సుఖ సౌభాగ్యంబులతో
నందన వనమున గంధర్వులునూ యందముగా క్రీడించినటుల్
ఆ లంకను క్రీడించిరి వారలు నందచందములు జిందగనూ! 27

అటు బిమ్మట మఱి కొంతకాలమును జరుగగ నా మండోదరియున్
మేఘనాథుడను పుత్రుని కనియెను మిక్కిలి బలీయుడగు వానిన్
ఆతనినే యా మేఘనాథునే యలరి యింద్రజిత్తనుచు మఱిన్
పిలుచుచున్న వారందఱు మీరలు ప్రేమ మీర కడు భయంబునన్! 28

రావణ సుతుడగు నింద్రజిత్తునూ రహి పుట్టీ పుట్టగ నంతన్
మేఘ ధ్వనితో సమానమైనా మిగులరోదనము జేయగనూ!
అతడు జేసినా ఘనమగు ధ్వనికిని యవని తల్లిడిలునట్టులుగా
కదలికలునూ గలిగిన వప్పుడు గలిగినదట ఘన శబ్దంబున్! 29

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
ఆ సమయంబున నాతడు జేసిన యా ధ్వనికిని లంకాపురమున్
జడమైపోయెను చైతన్యంబును జారిపోయెనట జనములకున్!
అందులకే యాతని తండ్రియునూ నలరి జనించిన బాలునికిన్
మేఘనాథుడను నామకరణమును మేదిని జేసెను గర్వముగా! 30

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
అపుడా రావణు కుమారుడైనా యలరు మేఘనాథుం డపుడున్
తలిదండ్రులకును మహార్షంబును దగు రీతిని గలిగించుచునూ!
వరస్త్రీలను రక్షింపబడుచునూ వర్ధిలుచుండెను బాలుండున్
కాష్టంబులచే కప్పబడిన యా కనలెడి యనలము వోలె మఱిన్
ఆ రావణు నంతఃపురంబులో నలరి పెరిగె యా బాలుండున్! 31, 32

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
పండ్రెండవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (మొదటి సంపుటము)

# పదుమూడవ సర్గము

(రావణుడు నిర్మింపజేసిన శయన గృహములో కుంభకర్ణుడు శయనించుట -
రావణుని దురాగతాలు -కుబేరుడు దూతను బంపి యతనికి యుపదేశించుట -
రావణుడు వచ్చిన దూతను వధించుట )

అటు పిమ్మట ఒక కాలమునందున యల లోకేశ్వరు చేత మతిన్
పంపబడిన యా నిద్రాదేవత కంపన జేయుచు కన్నులనూ!
ఆవులింతలా రూపంబునుగల నతి తీవ్రంబగు నిద్రయునూ!
కుంభకర్ణునీ యావరించెనూ కూరిమి మత్తత గలిగించీ! 1

అటుపిమ్మట యా కుంభకర్ణుడును నాసీనుడుగా నున్నట్టీ
సోదరుడైనా దశగ్రీవునితో పోలుచు నీ విధమున బలికెన్
రాజా! నన్నును నిద్రాదేవత రయమున బాధించుచునుండెన్
నాకొక యాలయమును నిర్మింపుము నయముగ నిద్రను బోవుటకై! 2

అపుడు రావణుడు నాజ్ఞాపింపగ అలరు విశ్వకర్మకు వోలెన్
శిల్పులు వచ్చిరి యట నిర్మించిరి శిలలతోని శిల్పంబులతో!
యోజన ప్రదేశమును వెడల్పునూ యోజన త్రయము పొడవు గలిగీ
చూచుటకందముగా విశాలముగ సుందరముగ నొక భవనమునూ!
కుంభ కర్ణునీ కొఱకై శిల్పులు కూరిమి నిర్మించిరి గృహమున్! 3

స్ఫటిక వికారము గలిగినట్టిదియు చక్కని బంగరు చిత్రములున్
చిత్రితమైనా స్తంభంబులతో శ్రీకరమగు గృహమంతటనూ
శోభింపగనూ జేయబడినదీ సుందరమగు నా భవనంబున్
వైడూర్యములును, మాణిక్యములును వరుసను మెట్లును గలదియునూ! 4

అచ్చటచ్చటను చిఱుగంటలునూ ముచ్చటగా వ్రేలాడుచునూ
దంత తోరణములను విన్యస్తము దగ వజ్ర వికారము గలదీ

స్ఫటిక మణిమయము నరుగులు గలదియు బరగ మనోహరమైనదియున్
సకల సుఖంబులు గల గృహంబునూ సాంప్రదాయ శిల్పంబులతో!
తమ్మునికై నిర్మింపజేసెనూ నిమ్మగ యా రావణుడు మతిన్! 5

అంతట నిత్యము సుఖము నిచ్చునది వింతగ మేరువు గుహకువలెన్
పుణ్య ప్రదమగు గృహమును జొచ్చీ పొలుపుగ రావణు తమ్ముడునూ
కుంభకర్ణుడట జృంభిత నిద్రను స్తంభిత చేష్టలు గలవాడై
కొన్ని వేల వత్సరములు నాతడు బన్నుగ శయనించెను నచటన్
అన్నము నడుగడు నాహారంబును బన్నుగ నీరంబును గూడన్! 6, 7

కుంభకర్ణు డా విధమున నిద్రను గూరిమి పరవశుడగుచు మతిన్
ఈ లోకంబును మఱచిపోయెనూ నింపుగ తానెవరో గూడన్
అల దశగ్రీవుడు నిరయుశుండై యడ్డులేని వాడై తనుకున్
దేవతలను, ఋషులను, గంధర్వుల తివిరి యక్షులను బీడించెన్! 8

చిత్రములగు నందన వనంబులను జిర ప్రఖ్యాతములైనట్టీ
ఉద్యాన వనంబులకును జేరీ ఉన్నతములగు పూదోటలనూ
స్వయముగ బోయీ సంక్రుద్ధంబున సాహసమున గూలగద్రోసెన్
పూవులు బూచెడి లతలను ద్రుంచెను బుత్తడి బొమ్మల బడద్రోసెన్! 9

క్రీడించెడి గజములును నదికివలె క్రిందులు మీదులు గావించెన్
విసురు గాలులకు వృక్షంబులవలె విసవిస తరువుల గావించెన్!
విడువబడిన వజ్రమునకు గిరులును విరగిపడునటుల భూస్థితినీ
రావణు డావిధి ధ్వంసము జేసెను రమ్యోద్యాన వనంబులనూ! 10

అట్టి సమయమున ధనేశ్వరుండును గట్టిగ ధర్మజ్ఞుండు మతిన్
అట్టి కుబేరుడు నలదశాననుని నిట్టి నడవడిక దెలిసికొనీ
తనదు కులమునకు ననురూపముగల దగు ప్రవర్తనము స్మరియించీ
భ్రాతృ ప్రేమనూ జూపుట కొఱకై భవ్యమైన హితవును జేయన్
ఒక్క సుదూతను లంకకు బంపెను జిక్కులు దొలగగ నందఱకున్! 11, 12

ఆ దూతము లంకానగరమునకు నలరుచుబోయి విభీషణునీ
సమీపంబునకు జనియెను నాతడు చక్కని సపర్య గైకొనుచున్
విభీషణుండును నా దూతను మఱి వినయరీతి సత్కారంబున్
జేసి యాతడును వచ్చిన కార్యము శ్రీకరముగ ప్రశింపగనూ! 13

ఆ విభీషణుడు నా కుబేరునీ యలరు బంధువుల క్షేమంబున్
కుశలంబగు వృత్తాంతము లడిగెను గూరిమి రంజిల యాదూతన్!
అటుమీదటనూ యా సభయందున యలరి గూర్చొనీ యున్నట్టీ
దశగ్రీవుని జూపించెను నాతడు సద్భావముగల దూతకునూ! 14

వచ్చిన దూతయు నచ్చట నిలబడి వనర వందనములను జేసీ
స్వతేజంబుతో బ్రకాశించెడీ సరసత యా రాక్షస రాజున్
గాంచి 'జయీభవ' 'విజయీ భవ!' యని కమ్మని పలుకులు బలుకుచునూ!
క్షణకాలము నతడూరకుండెనూ! సందేశంబును వినిపింపన్! 15

అటుపిమ్మట యా దూతయు నచ్చట చటుల ప్రవృత్తిని గనబఱచీ
శ్రేష్ఠమైన యాస్తరణము తోడనూ శ్రీకాంతులు జిందుచునున్నా
ఉత్తమమగు పర్యంకమునందున యుపవిష్టుండగు రాక్షసుతో
రావణుతో నా దూతయు బలికెను రమ్య వచనముల తోడుతనూ! 16

పేరుగనగు ఓ రాజా! వినుమా! వైశ్రవణుని యా పలుకులనూ
మీ యుభయుల కులమునకు, చరిత్రకు మీరక తగు రీతియుగాగన్
నీ సోదరుడును జెప్పినదంతయు నిర్మల హృదయముతో వినుమా!
అతడు జెప్పినది యంతయు నీకును నలరుచు వినిపింతును నిపుడున్! 17

మంచి నడవడిక మదియుండినచో యుచితముగ నదియే చాలున్
అందుచేత మఱి శక్యమైనచో కందువ ధర్మపథంబుననూ
అవలంబింపుము! నాచరింపుమా! యలరి సద్గతియు నొందగనూ!
మంచి మార్గమే ప్రతి జీవునకును సంచిత పుణ్య ప్రదంబగునూ! 18

రాక్షస రాజా! భగ్నము జేసిన రమ్య నందనము గాంచితినీ
నీవు ఋషుల మఱి జంపినట్లుగా నిలకడగా నే వినియుంటిన్
అంతేకాదు సుమా! దేవతలును సుంత భయంబును లేకుండన్
నిను సంహారము జేయుట కొఱకై నిండు మనసునను దేవతలున్
యత్నము జేయుట విని యున్నాడను సత్యముగా నివి నా పలుకుల్! 19

రాక్షస రాజా! నీవును నన్నును రయమున యనేకమారులునూ
నిరాకరించియు ద్రోసివేసితివి! నిస్తేజునిగా జేసితివీ!
అయినను గూడను యంటి యుంటి నిను నలరి బంధు భావనతోడన్
బాలుడు నపరాధమును జేసినను బంధువులందఱు గూడికొనీ
యా బాలుని రక్షింపవలెను గద1 యలరి బంధు భావన చేతన్! 20

రుద్రునకును సంబంధించిన యా రూఢిగ వ్రతమును దరియించీ
నియమ వంతుడనుగా యచ్చట మఱి నియతేంద్రియుడను నగుచు మఱిన్
ధర్మంబును నే నుపాసింపగా దగ హిమవత్ పర్వతమునకున్
పై భాగమునకు నే బోయితినీ బరగ తపస్సును జేయుటకై 21

అచట నేను పార్వతితో గూడను అల సర్వసమర్థుండు మఱిన్
అల పరమేశ్వరుడైన రుద్రునీ నటగాంచితి నే ముదముననూ!
దైవ వశంబున సవ్య చక్షువును తగ మాతయునగు పార్వతిపై
ప్రసరించినదీ యామెను గాంచితి బరగ చింతనను జేసితినీ! 22

రాక్షస రాజా! యీమె యెవ్వరని రయమున నా నేత్రం బిచటన్
ప్రసరించినదే కాని యన్యమగు బరగ కారణము కాదు సుమా!
ఆ రుద్రాణియు యనుపమంబునగు నపురూపంబును ధరియించీ
ఆ రుద్రుని ప్రక్కన యుండగ నే నలరి జూచి యోచించితినీ! 23

ఆ రుద్రాణియు దివ్య ప్రభావము నలరి సవ్య నేత్రముతోడన్
జూచుట తడవుగ వామ నేత్రమును సురసుర దగ్ధము కాబడియెన్

ఆ జ్యోతియునూ పరాగంబుచే నలరి జల్లగా బడినటులన్
పింగలత్వమును బొందిన దప్పుడు బిదప జ్యోతియును జల్లారెన్! 24

అటు బిమ్మటనూ యాహిమవద్గిరి చటుల విశాలమునైనట్టి!
మఱియొక చరియకు బోయి యచ్చటను మానుగ తపమును జేయుటకున్
ఎనిమిది వందల సంవత్సరములు మౌనముతో నే నా గిరిపై
మహా తపస్సును నాచరించితిని మానుగ నియతేంద్రియుడనునై! 25

అటుపిమ్మట నే నా గిరియందున చటుల తపసు పరిపూర్ణంబై
సమాప్తమైనది యగుచు నుండగా సర్వసమర్థుడు దేవుండున్
మహేశ్వరుండును సంతోషించుచు మధుర మనస్సున నను గాంచి!
ప్రీతి వాక్యమున యీ విధి బలికెను ప్రేమలు పొంగులు వారగనూ! 26

ధర్మంబులు మఱి దెలిసినవాడవు! ధనాధిపా సువ్రత వినుమా!
నీవు జేసినా యీ వ్రతమునకును నిర్మల భావము నందితినీ
ఇట్టి తపోవ్రతమును నే పూర్వము నింపుగ జేసితి యానాడున్!
ఇపుడు నీవు జేసితివి కుమారా! యే యడ్డయులు లేకుండన్! 27

ఈదృశ వ్రతమును జేసినవాడూ! యిలయందువ మఱి లేడు సుమా!
మూడవ పురుషుడు లేడుగదా మఱి ముచ్చటగా ధరణిని లేడూ!
సుదుష్కరంబగు నీ వ్రతంబునూ సురలు మునులు జేయగలేదూ!
పూర్వము నేనే కనుగొంటిని కద! బొలుపుగ యీ వ్రతమును జేయన్! 28

ధనేశ్వరా! తత్కారణంబునను దగ నా తోడను స్నేహంబున్
అంగీకారము సూచింపుము నిక యలరుచు సఖ్యతతో నుండన్!
అనఘా వైశ్రవణా! ధనాధిపా! యలరి తపసుచే జయించినా
మిత్రుడవగుమా! సఖ్యత నందీ చిర మిత్రునిగా నుండు మిటన్! 29

నీ దగునట్టీ సవ్య నేత్రమును నిబ్బరముగ యే కార్యమునన్
దేవి యొక్క యే ప్రభావంబుచే దీరుగ దగ్ధము గా బడెనో

పచ్చదనంబును నందబడినదో బరగ యందువలనను గూడన్
'ఏకాక్షి పింగలి' యను నామంబును యేపుగ శాశ్వతముగను నుండున్! 30

ఈ విధముగ యా పరమశివునితో నింపుగ స్నేహంబును బొందీ
ఆ శంకరుతో ననుజ్ఞగూడను నలరి పొంది వచ్చిన నాకున్
నీవు చేసినా పాపకర్మములు నిజముగ నాకును వినబడియెన్
దుష్కార్యములును దుష్కృత్యంబులు దుశ్చేష్టలు నా చెవిని బడెన్. 31

ఆ కారణమున కుల దూషణ మగు అపకీర్తిని దెచ్చెడి పనులన్
ధర్మ సమ్మతము కాని కార్యముల దగజేయకుమా! గ్రహింపుమా!
ఋషులు, దేవతలు, మునులును గలిసీ రూఢిగ నిను జంపుట కొఱకున్
ఉపాయంబు మఱి జేయుచుండిరని యూహించుచు నే నున్నాడన్! 32

దూతపలుకగా నా పలుకులనూ దురితుండగు నా రావణుడున్
కోప సంరక్త లోచనుండునై కూర్మి దంత హస్తంబులనూ
కొఱుకుచు, చఱచుచు, భీకరుండునై కొఱవి దయ్యమునకును వోలెన్
దూతతోని యీ విధముగ బలికెను మతిమాలిన మాటల తోడన్! 33

దూతా! నీదగు వాక్యంబులునూ దుష్టములని నే భావింతున్
నీ వాక్యముల భావమంతయును నిర్దుష్టముగా దెలిసినదీ!
నీ విక నుండవు! నిను బంపిన యా నీరసుడగు నా భ్రాతయునూ!
ఇలపై ప్రాణంబులతో నుండడు నింక ప్రతిభాషింపకుమా! నాతో 34

ఆ కుబేరుడును దెలుపుచున్నదీ అలరి సమ్మతము కాదు మఱిన్
మూఢుడునగు నా ధనపతి యిమ్ముగ మోదమునను బరమేశ్వరునీ
సఖ్యత్వంబును గర్వముతోడను జాటుచు నున్నాడును మఱియున్
అట్టివాని మాటలు దేనికి మఱి యిట్టి యాతనిని నిరసింతున్! 35

ఓ దూతా! నీ వింతవఱకునూ! వనరగ సంభాషించినదీ
క్షమనీయంబైనది కాదు సుమా! క్షమింపదగినదికాదు మఱిన్!

ఇంతవఱకునూ యాతని జోలికి సుంతయు బోలే దందుకనే
అన్నను నేనూ! నన్ను జంపడను నతిశయ భావముతో నుండెన్ 36.37

ఇపుడు నతని వాక్యంబుల వినుచును నిట్టి బుద్ధి గలుగుచు నుండెన్
బలహీనుడనని భావించుచు నను బరగ నిశ్చయించుచు నతడున్
ఈరీతిని నిను బంపినాడు గద! ఎపుడో కాదు సుమా! యిపుడే!
బాహు వీర్యమును నాశ్రయించి నే బరగ మూడు లోకంబులనూ
జయించి వైచెద లోకజనంబులు జయ జయ ధ్వనులను జేయగనూ 38

ఆ ధనేశుడగు కుబేరుండునూ యలరి యీ విధము బలుకుటచే
ఏ తన్ముహూర్త మందే నేనును నింపుగ రణమును జేయగనూ
బయలుదేరెదను అల నలుగురినీ బరగ లోక పాలకులను నే
యమలోకమునకు నతిథుల జేసెద! యానందించెద శీఘ్రముగన్! 39

లంకేశుండగు రావణుండునూ శంకలేక యటులను బలికీ
వచ్చిన దూతను తన ఖడ్గముచే వనరగ జంపిన వాడగుచున్!
చంపిన దూతను దుష్ట రాక్షసుల కంపెను భక్షించుట కొఱకై
తన మనసుననూ మోదము నందెను తాను జేసినా పనికి మతిన్! 40

సాహసుడగు రావణు డంతటనూ స్వస్త్యయనము జేయించుకొనీ
మూడులోకముల జయింపగోరుచు ముదమున మహారథమునెక్కీ
విజయము గోరుచు బయలు దేరెనూ వీరుండగు నా ధనేశుడున్
ఉన్న చోటికిని ముందగ బోయెను నెన్నగ యతనిని మర్దింపన్ 41

శ్రీరామ కథాసుథాలహరి యందు - ఉత్తరకాండలో
పదమూడవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (మొదటి సంపుటము)

# పదునాల్గవ సర్గము

(రావణుడు మంత్రులతో కలిసివెళ్ళి యక్షులపై యాక్రమణము జేయుట యక్షులు ఓడిపోవుట)

అటు పిమ్మట యా నిత్య బలోద్ధతు డగు శ్రీమంతుడు రావణుడున్
మహోదరుండును బ్రహస్తుతోడను మారీచుడు శుక సారణుడున్
యుద్ధమునందున యాసక్తియుగల యుద్ధతుడగు ధూమ్రాక్షుడునూ
ఆఱుగురగు మంత్రుల తోడుతనూ యరుణారుణ నేత్రములతో
లోకంబులను దహించుచున్నటుల లోలత యుండెడి వానివలెన్
బయలుదేరి వెళ్లెను లోకములను విజయము బొందగ శీఘ్రముగన్ ! 1,2

ముహూర్తకాలమునందు నగరములు మోదముననను నదులను దాటీ
పర్వతంబులను వనంబులను మఱి బరగ యుపవనములను గూడన్
దాటుచు నాతడు జేరగవచ్చెను దగ కైలాసముగిరిదాపున్
అచటనున్న యక్షులను దరిమిరీ చటుల పరాక్రమ ధీరతనూ 3

ఆ పర్వతమున విడిసి యున్న యా యతి బలవంతుని రావణునీ
ఉత్సాహముతో మంత్రుల తోడను నూహకందనీ విధముననూ
యుద్ధము జేయగ వచ్చినాడనుచు యుద్ధతి రాక్షసు నెదిరింపన్
అచట నిలువజాలక బోయిరిగా నా యక్షులు వెనుకకు దిరిగీ! 4

ఆ రావణుడును రాజు కుబేరును నలరు సోదరునిగా దలచీ
ఆ యక్షులునూ కుబేరు డెచ్చట యలరి యుండెనో నచ్చటికిన్
జని కుబేరునీ సమీపంబునకు సన్నగ దెలిపిరి విషయంబున్
రావణుడెందుకు వచ్చెనో యటకు రయమున దెలిపిరి సర్వమునూ! 5

అటుబిమ్మట యా యక్షులునూ మఱి యల కుబేరు ననుమతి నందీ
సంతసంబునను నా యక్షులునూ పంతమునను యుద్ధంబునకున్
బయలుదేరిరీ యట్టి సమయమున బరగ కుబేరుని సైన్యంబున్

సంక్షోభంబును సముద్ర జలముల సంక్షోభము వలె రాజిల్లెన్!
పర్వతమును మఱి కదిల్చివేయుచు బరగ యున్నదా యనునట్లున్! 6, 7

అటుబిమ్మట యా యక్షరాక్షసుల యతి సయుల సమరము జరిగెన్
ఎవరు గెలుతురో యను సందేహము నెవరూహింపగ లేకయునూ
అలజడి జెందిరి యక్ష రాక్షసులు నడలుచు మనసుల యందుననూ
అపుడు రావణుని మంత్రులుగూడను నల నిరాశ మది బొందిరిగా 8

ప్రసిద్ధుడగు నా నిశాచరుండును బన్నుగ దశ గ్రీవుండు మఱిన్
దైన్యము నందిన సేనను గాంచీ తాను మిగుల సంతసముననూ!
హర్షనాదములు జేయుచు మిక్కిలి యతి కోపంబున యక్షులునూ
బరిమార్పగ కోపముతో జనియెను బన్నుగ యెదురుగ యక్షులనూ 9

రాక్షసేంద్రునీ ఘోర విక్రములు రయమున మంత్రులు నార్గురునూ
వారి లోపలను ఒక్కొక్కరునూ వరుసగ బలవిక్రములు మఱిన్
వేలమంది యక్షులను నెదుర్కొని విలవిల సమరము జేసిరిగా
జయమునునదియును దెలువలేరుగా జయమపజయములు చలియించున్! 10

అపుడా యక్షులు గదలతోని మఱి ముసలంబులతో ఖడ్గములన్
శక్తితోమరంబులచేతను మఱి రక్తి రాక్షసులు బాధింపన్
రావణుండు మఱి సైన్యములోనికి రయమున జొరబడె శీఘ్రముగన్
ఆ యక్షుల్నునూ నటునిటు జూడక యటుల యెదుర్కొనె రావణునీ! 11

వర్షించెడి జీమూతంబుల వలె వనర బాణముల ధారలచే
ఆ యక్షులనూ గొట్టుచుండగా నా రావణు డా సమయమునన్
నిరుచ్ఛ్వాసవలె నిలబడి పోయెను నిట్టూర్పులు విడుచుచు నుండెన్
ఆ యక్షులునూ నడ్డుకొనిరి యా యతిరథుడగు నా రావణునీ! 12

రణరంగంబున యా యక్షులునూ రయమున యా యుధములతోడన్
కొట్టుచున్ననూ యా దశగ్రీవుడు కూరిమి మేఘంబుల చేతన్
జలధారలతో కొట్టబడిన యా కూరిమి పర్వతమునకు వలెన్
వ్యథను జెందగా లేదుగదా మఱి మధన జెందగా లేదు మఱిన్! 13

అటుపిమ్మట యా మహాత్ముడైనా చటుల బలోపేతుండయినా
ఆ రావణుడును యమదండముతో నలరు గదను ధరియించుచునూ
అల యక్షులనూ యమక్షయమునకు విలవిల బొందించుచు వేగన్
ఆ సైన్యంబున ప్రవేశించెనూ నతి భయంకరముగా నతడున్! 14

ఆ రావణుడును వాయువుచేతను నాదీప్తంబగు నగ్నివలెన్
విశాలమైనా శుష్కేంధనములు విరివిగ గలిగీ వ్యాకులమై
డొంకువలెనూ యక్ష సైన్యమును వంకలేక కాల్చిన యటులన్
అల సైన్యంబును కాల్చివేసెనూ నక్షయముగ మంటలు లేకన్! 15

ఆ సమయంబున మహోదరుండును అలశుకుండు మొదలగు వారున్
అట్టి యమాత్యులు నల యక్షులనూ యలరు వాయువులు మేఘములున్
ఎగురవేసినటు నెగురవేసిరీ గగన భాగమున యంతటనూ
కొంచెము మాత్రము మిగులునట్లుగా యంచితముగ జేసిరి వారిన్! 16

ఆ సమయంబున యక్షులు గొందఱు నడలి యోటమిని జెందుచునూ
గాయంబులచే నేలను బడిరీ కదలలేక యుండిరి యచటన్
కుపితులైన కొందఱు యుద్ధముననను కూలిరి క్రోధము తోడతనూ
పెదవులు గొరికిరి రక్తము జిందగ పేద యఱపులను యఱచుచునూ! 17

అట్టి సమయమున కొందఱు యక్షులు అలసిపోయి సంగ్రామమునన్
వస్త్రంబులనూ జారవిడిచిరీ చయ్యన బలమును గోల్పోయీ
ఒకరి నొకరు మఱి కౌగలించుకొని ఓపిక లేకను సోలుచునూ!
నీటిచేత మఱి నదీ తీరములు నిలువలేక కూలిన యటులన్
ఆ యక్షులునూ నిలువలేక మఱి యటులే గూలుచు నుండిరిగా! 18

చంపగబడినా యక్షులందఱును స్వర్గమునకు బోవుచునుండన్
సంగ్రామంబును జేయు వారలును చక్కగ పరుగులు దీయగనూ
అందుచేత యని చూచుట కొచ్చిన చందముగా ముని సంఘములున్
ఆకాశంబున నిలుచుండుటకును అచట స్థలంబును లేకుండెన్ 19

మహాబాహువగు ధనాధ్యక్షుడును మానుగ యోటమి చెందిన యా
మహాబలముగల యక్షేంద్రులనూ మధన జెందుచును గాంచి మఱిన్
మఱి కొందఱు యక్షులను బంపెనూ మానుగ సంగ్రామము జేయన్
దశగ్రీవుని వంపగ బంపించెను దగ రాక్షసులను వేధింపన్! 20

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
ఈ లోపున బహు సైన్యము తోడను నింపుగ బహు వాహనములతో
సయోధకంటక నామంబును గల సాహస వంతుడు యక్షుడునూ
కుబేరుడంపగ రణరంగమునకు కూరిమి వచ్చెను యని సేయున్ 21

ఆ యక్షుండును విష్ణువునకు వలె నా యుద్ధంబున చక్రముతో
కొట్టగా నపుడు మారీచుండును కుదురుగ క్షీణించిన యట్టీ
నక్షత్రమువలె గిరిపైనుండీ నయముగ నేలకు రాలుచునూ
స్పృహను దప్పి యా రాక్షసుండునూ స్రుక్కెను నల్లని రూపముతో! 22

ఆ మారీచుడు ముహూర్త కాలము నటుల రణంబును జేయుచునూ
ఆ యక్షుని మఱి గెలువ జాలకను నట నాగుచు మారీచుండున్
ఆ యక్షునితో యుద్ధము జేసెను నటు మీదటనూ తన శక్తిన్,
కానీ రణమున పరాజితుడై కడు వేగంబున బరుగెత్తెన్ 23

అటుపిమ్మట యా రావణుండునూ యలరు కాంచనా చిత్రితముల్
అవయవంబులను గలదియు మఱియును నల వైడూర్య పరాగములన్
చల్లబడినదీ ద్వారపాలకుల నుల్లసిలెడి హద్దులు గలదీ
ఆ ముఖద్వారము మధ్యమునందున నల రావణుడు ప్రవేశించెన్! 24

ఓ రఘురామా! నిశాచరుండగు వనరగ యా రావణుడు మఱిన్
ఆ ముఖద్వారము ప్రవేశింపగా నలరుచు యత్నము సేయగనూ
అటనిలుచుండిన సూర్యభానుడను అలరు యక్షుడును నాతనినీ
అడ్డుకొనెను రాకుండగ లోనికి నాయుధములతో నెదిరించెన్ 25

ఆ విధముగ యాయక్షుని జేతను అట వారింపగ బడుచున్నన్
ఆ రావణుడును బ్రవేశించెనూ యా ముఖద్వారము లోపలకున్

నివారించినను యాగకుండినా నిష్ఠురుడగు నా రాక్షసునీ
తోరణంబు బెకలించి గొట్టెనూ తోరముగా నా యక్షుండున్! 26

శైల శిఖరమును సమానమైనా శ్రీకరమగు తోరణముననూ
గొట్టబడిన యా రావణుడంతట కూరిమి రక్తముగార్చుచునూ
గైరిక ధాతువు స్రావంబులచే గదిలెడి పర్వతమును బోలెన్
ప్రకాశించుచున్నాడు గదా మఱి ప్రవినుల కాంతులు జిందుచునూ
కాని బ్రహ్మవరములచే నాతడు గలిగియుండె ప్రాణంబులనూ! 27, 28

అటుబిమ్మట యా యక్షుండును మఱి యలదశగ్రీవుని జేత మఱిన్
ఆ తోరణమున గొట్టబడెను మఱి యతని శరీరము చూర్ణంబై
ఆతడు మఱి యట కనబడలేదూ యందు లేడు నా యక్షుండున్
మాయంబాయెనో మఱి యట కనబడి మానుగ యని జేయగలేదూ! 29

అటుబిమ్మట యా యక్షులందఱును నా దశగ్రీవుని విక్రమమున్
గనుచు పారిపోయిరి దూరముగా గనలుచు మానస మందుననూ
ఆయుధములనూ వదిలివేసిరీ యలసిపోయినా వారగుచున్
వివర్ణ ముఖములుతో గలవారగుచును వేగ బ్రవేశించిరి గుహలన్! 30

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
పదునాల్గవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (మొదటి సంపుటము)

# పదునైదవ సర్గము

అటు పిమ్మట యా ధనాధ్యక్షుడును నటుల పరాక్రమమును వీడీ
వేలకొలది యా యక్షనాయకులు విలవిల బరుగెత్తుచు నుండన్
మహాయక్షుడగు మణీ భద్రునీ మానుగ గాంచుచు కుబేరుడున్
ఈ విధము బలికెను నాతనితో నింపుగ వీరత్వము జిందన్! 1

యక్ష నాయకా! ఓ మణిభద్రా! యక్షయముగ నడవడిక గదా!
పాపమైన చిత్తము గలవాడును పరమ దుష్టునీ రావణునీ
చంపుము లేదా యుద్ధ శాలురను సాహసులగు మన వారలనూ
యక్షులకును రక్షణగా నుండీ రక్షింపుము రాక్షసునుండీ! 2

ధనాధ్యక్షు డీ విధమున బలుకగ మహాబాహువును దుర్జయుడున్
ఆ మణిభద్రుడు ఆ మాటలు విని యతిశయముగ వీరత్వమునన్
నాలుగు వేలా యక్షుల గూడుక నలువైపులనూ గ్రమ్ముకొనీ
ఆ రాక్షసుతో రణమును నలిపెను నతిశయ వీరత్వము తోడన్! 3

అపు డా యక్షులు నా రాక్షసులును అలరు గదల ముసలంబులతో
ప్రాసలతోడను శూలతోడను బరగ తోమరంబులతోడన్
కనబడినట్టీ యా రాక్షసులను గసరిగొట్టుచును తీవ్రముగన్
వారల మీదికి పరుగలెత్తిరీ వరుసగ యక్షులు కోపమునన్! 4

తుములమైన యుద్ధమును జేయుచును దోరముగా నా యక్షులునూ
డేగల వలె మఱి సంచరించుచును డీ గొట్టుచు రాక్షసులను మఱిన్
'తప్పక యుద్ధము జేయగ రమ్మా' తగ పోరను వెనుకకు మఱలన్
'వాని ఆయుధములను ఖండింపుము' వనరగ బలుకుచు బోయి రనిన్! 5

ఆ సమయంబున గంధర్వులునూ నలరు దేవతలు గూడ మఱిన్
వేదాధ్యయనము జేయువారలును, వికటమైన యా యుద్ధంబున్
గాంచి పరమమగు విస్మయరంబునూ యంచితముగ బొందిరి వారున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 6

ఆ రణమందున బ్రహస్తుండునూ ఆ యక్షులనూ వికటముగా
వేయిమందినీ ఖండించెను మఱి విపులాయుధములతో మఱియున్!
మహోదరుండును వేయిమందినీ మానుగ యక్షుల ఖండించెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 7

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
అట్టి సమయము కోపించిన యా నిట్టె మారీచునిచేత మఱిన్
యుద్ధము జేయుచు నిమిషకాలమున యుద్ధతి శీఘ్రముగా నతడున్
రెండు వేల మందిని యక్షులనూ దండిగ యమపురికిని యంపెన్! 8

పురుష శ్రేష్ఠుడ రామా! వినుమా! పూనికతో యా యద్ధమునూ
కపటంబును నిసుమంతయులేనీ గల యుద్ధముగద! యక్షులదీ
మాయా బలమును గూడి యున్నదీ మానుగ రాక్షస యుద్ధమిదీ
దానికి దీనికి పోలిక యెచ్చట దగ రాక్షసులే యధికులుగా! 9

మహారణంబున ధూమ్రాక్షుండును మణిభద్రునుని సమీపించీ
గదను గట్టిగా నూపుచు నతడును గ్రమ్మర వక్షస్థలమందున్
కొట్టెను కానీ యక్షుండును మఱి  కూలలేదు మఱి బడలేదూ
కంపముగూడను చెందలేదు మఱి వంపగ లేదూ శిరస్సునూ! 10

అటుబిమ్మట యా మాణిభద్రుడును చటుల గదను వేగముగా నూపీ
ఆ ధూమ్రాక్షుని వక్షస్థలమున నదిమి గొట్టగా వేవెంటన్
ఆ రాక్షసుడును వ్యాకులుడగుచును నడలి నేలపై పడిపోయెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 11

ఆ రాక్షసుడగు ధూమ్రాక్షుండును నటులగొట్టబడి రక్తమునూ
స్రవించుచును బడిపోవుట గాంచీ సరసత యాదశగ్రీవుండున్
యుద్ధ రంగమున మణి భద్రునిపై యుద్ధతి మార్కొన బరువెత్తెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 12

యక్షపుంగవుండగు మణిభద్రుడు అక్షయ బల సంపన్నుడునూ
సంక్రుద్ధుండును సాహసవంతుడు సమరనాయకుడు రావణునిన్

పరుగెత్తచు మఱి వచ్చుచున్న యా పగతుని మార్కొని యక్షుండున్
మూడు శక్తి బాణంబుల గొట్టెను మోదమునందగ యక్షులునూ! 13

తాడితుడైనా దశగ్రీవుండును దగ సంగ్రామమునందుననూ
మాణిభద్రునీ కిరీటమందున మానుగ తన గద తోడుతనూ!
కొట్టగ యా యక్షుని కిరీటమును కూరిమి దిరిగెను ప్రక్కకునూ
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 14

అటుపిమ్మట యా దశగ్రీవుండును నా మణిభద్రుని దోడ మఱిన్
ఎదిరింపగ బడినప్పటికిని మఱి యదిరి కంపమును గాంచకనూ!
నాడు మొదలుగా మాణిభద్రునకు నయముగ 'పార్శ్వ సుమౌలి' యనీ
నామమునందీ ప్రసిద్ధి జెందెను నర్మిలి లోకులు బిలువగనూ! 15

ఓ రఘు రామా! మహాత్ముడైనా వనరగ యా మణిభద్రుడునూ
విముఖీభూతుండగుచుండగ మఱి వీరులందఱును గనుచుండన్
ఆ పర్వతమందున ఘనమగునొక యమిత శబ్దమును వినిపించెన్
సంగ్రామములో యుద్ధవీరులును చయ్యన గాంచిరి నటువైపున్! 16

అటుపిమ్మట యా ధనాధ్యక్షుడును చటులమైన గద ధరియించీ
శుక్రుండును మఱి ప్రోష్టపదుడునను శుభకరులగు మంత్రులగూడీ
పద్మము శంఖము అను పేరులుగల బన్నుగ నిధులను గూడికొనీ
దూరమునుండీ కనిపించెను మఱి తోరము ప్రకాశమానుండై! 17

ధీమంతుండగు ధనాధ్యక్షుడును ధీరత యుద్ధమునందుననూ
శాపవశంబున కులగౌరవమును దగభ్రష్టుండై పోయిన యా
సోదరుడగు దశగ్రీవుని గాంచీ సొక్కుచు చింతను గాఢముగా
బ్రహ్మకులంబున బుట్టిన వాడూ బలుక దగిన పలుకులు బలికెన్! 18

ఓ దుర్బుద్ధీ! నివారించినను నొర్పులేక నిలువగ లేకన్
తెలియుటలేదూ నేను తెలిపినది తీరుగ యోచించుట లేదూ!
అందుకనే మఱి యాకారణమున చెంది నరకమును బిమ్మటనూ
దీని ఫలితమును దెలిసి కొందువూ తీరుగ తెలియవు అందాకన్! 19

దుష్ట బుద్ధిగల వాడెవ్వడొ మఱి దుష్ట విషంబును ద్రాగియునూ
తెలిసికొనక యుండునొ నాతండును దీరుగ జీర్ణంబైనపుడున్
తాను జేసినా కర్మఫలంబును దగిన విధంబున దెలిసికొనున్
ఎవడు జేసినా పాపకర్మమును అవని వా డనుభవింపవలెన్! 20

ధర్మయుక్తమగు పనిజేసినను దగ దేవతలును గూడను నిన్
అభినందింపరు, నానందింపరు, నలరు నీదు విని సుకృతముల్!
ఈ దృశమగు యా దుష్టభావమును నెందుకు గలిగినదో యిదియున్!
తెలిసికొనుట లేదుగదా సోదర! తీరుగ భావించుట లేదూ! 21

తల్లిని, తండ్రిని, విప్రుని మఱియును దగ యాచార్యుని యెవడైతే
అవమానించినవాడు, బొందునూ యల మరణాంతరమందున్
తను జేసిన దుష్కర్మపలంబును తానే యనుభవమున బొందున్
ఎవరాపినను యాగదుగా మఱి యెట్టి దపంబులు జేసినను! 22

ఈ శరీరమును నస్థిరమేకద! యిది శాశ్వతమును కాదు గదా!
ఈ సమయంబున తపార్జనంబును నిమ్మగ జేయడో మూఢుండై!
మరణానంతరమున తన గతినీ మానుగ బొందును నిక్కముగన్
తాను జేసినా పనికి ఫలంబును దాను అనుభవింపగ గలడూ!
పొందవలసినా దుర్గతినందీ బొందును పశ్చాత్తాపంబున్! 23

ధర్మమువలనను రాజ్యము, ధనమూ, ధర సౌఖ్యంబును గలుగు సుమా!
అధర్మమును మఱి యాచరించినా అల దుఃఖము గలగుచునుండున్
ఆ కారణమున సుఖమునందగా నలరుచు ధర్మము జేయవలెన్
పాపంబును మఱి విసర్జింపవలె పాముపడగనూ గాంచినటుల్! 24

పాపంబునకును ఫలము దుఖమే పాపము జేయగరాదు మఱిన్
ఆ దుఖమునూ యతని చేతనే యనుభవింప వలయును నిచటన్
ఆ కారణమున మూఢుడెవ్వడను నాత్మ వినాశము నందుటకై
ఏ పాపంబును జేయడు మఱియును నెట్టి దుష్కృతము జేయడుగా! 25

బుద్ధి హీనుడగు నెవనికి గూడను బుడమి మాతృపితృల సేవల్
గురుల సేవలను జేయ కుండగా గూరిమి పుట్టవు సద్బుద్ధుల్
మానవుండు మఱి యెట్టి కర్మలను మహిలో జేయుచునుండు మఱిన్
అట్టి ఫలంబులనే బొందు సుమా గట్టిగ వసుధా స్థలమందున్! 26

మహియందున మానవులందఱునూ మానుగ పుణ్య సుకర్మలచే
ఆర్జింపగ బడినట్టి మఱియునూ యలరి జయింపగబడినట్టీ
బుద్ధి రూపమగు నట్టి ఫలంబును పుత్రులనూ మఱి ధనములనూ
శూరత్వంబును బొందుచు నుందురు సురుచిర సాధు సుకర్మలచే! 27

ఈ దృశమైనా బుద్ధిని గలిగిన నింపుగ యల నరకంబునకే
పోవువాడవును గావున నీతో బొలుపుగ సంభాషింపను నే!
చెడ్డనడవడిక గలవారలతో జేడు కర్మలు జేసెడివారిన్
మాటాడను నే మౌనముండుదును! మఱి నా నిర్ణయ మిదియె సుమా! 28

అనుచు బలికి యా ధనాధ్యక్షుడును నటగల మారీచుడు మఱియున్
అమాత్యులందఱితో గూడను మఱి యటుల బలికి శరవేగముగా!
వానిని గొట్టెను నాయుధములతో వరుసగ విక్రమమునుగూడీ
యుద్ధ విముఖుడై పారిపోయిరీ యుద్ధతులగు రాక్ష సవీరుల్! 29

అటుబిమ్మట యా మహాత్ముడైనా చటుల పరాక్రమ వంతుడునూ
ధనాధ్యక్షుడగు నా కుబేరుడును దగ గద గైకొని దశ గ్రీవున్
గదతో గొట్టెను గాఢముగా మఱి కంపించెను ధర యంతయునూ!
అయినను గూడను దశగ్రీవుండును నదరలేదు బెదరగ లేదూ!
ఉన్నచోటునను గదలక యుండెను చిన్నబోవుటను లేదు మఱిన్! 30

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
అపు డా యుద్ధమునందు కోపమున యన్యోన్యంబున ఢీకొనుచున్
కొట్టుకొనెడి యా కోపవంతులగు కుదురుగ రావణ కుబేరులున్
ఇంత వ్యాకులత జెందగ లేదూ సుంత నలసటయు గనలేదూ! 31

అపుడు ధనేశుడు సమరమునందున నారావణునీ యణచుటకై
ఆగ్నేయాస్త్రము బ్రయోగించెనూ యంతట యగ్నులు రాల్చుచునూ!

ఆ రావణుడును చటుల దర్పమున అలవరుణాస్త్రము జేత మఱిన్
ఆ యస్త్రంబును నివారించెనూ యంతట వానలు గురియగనూ! 32

అటుబిమ్మట యా దశ గ్రీవుండును చటుల పరాక్రమ వంతుడునూ!
రాక్షసమాయను ప్రవేశించి మఱి రయమున కుబేరు జంపుటపై
శతసహస్ర రూపంబుల నాతడు జతురత నిర్మించెను నపుడున్
జూచు వారలకు నయోమయముగా చోద్యముగా గనిపించెనటన్! 33

ఆ దశాసనుడు నా సమయంబున యలరుచు వ్యాఘ్రము రూపమునన్
వరాహమునుగా మేఘముగానూ, పర్వతమునుగా గనిపించెన్!
సంద్రముగానూ, వృక్షముగానూ, సాంద్రయక్షునిగ వైద్యునిగా
కనబడె నప్పుడు దశగ్రీవుండును గన్నులు మూతలు బడు చుండెన్! 34

అనేక రూపంబులను గూడనూ యా దశాసనుడు గావించెన్
తాను మాత్రమట కనబడలేదూ! కనులు దెఱచి చూచిన గూడన్!
అటుపిమ్మట యా రావణుండునూ చటులాస్త్రము గద ధరియించీ
యూపుచు దానిని కుబేరు శిరసున యొరగ వేసెను తీవ్రముగన్! 35

ఈ విధమున రావణుడు గొట్టగా నిలపై బడుచును ధనేశుడున్
విహ్వాలుడై యా కుబేరు డంతట వేగముగా రక్తము జేతన్
దడుపబడిన వా డగుచును వేగము దగ నా సమయము నందుననూ
మొదలు నఱికినా యశోకమును వలె మూర్ఛను బొందెను రణమందున్! 36

అటు బిమ్మట యా ధనదు డచ్చటను చటుల పరాక్రమమును జూపీ
నేలమీద బడి స్పృహను దప్పగా నిధులచేత యావృతుడగుచున్
అతనిని నందనవనమును జేర్చిరి యా యధిష్టాన దేవతలు, మఱిన్
సేద దీర్చిరీ యలసట దీరగ సేవలు జేసిరి యాతనికిన్! 37

రాక్షసేంద్రుడును నా కుబేరునీ రయమున రణమున యోడించీ
హృష్టమానసుండై రావణుడును కష్టమేమి లేకుండగనూ
తన విజయంబునకును చిహ్నముగా అల కుబేరునకు గలిగిన యా!
పుష్పక విమానమును గ్రహియించెను బొలుపుగ త్రిలోకములు దిరుగన్! 38

దుష్ట బుద్ధిగల రాక్షస రాజును దోర్బలమున యా కుబేరునిన్
గెలిచి, పుష్పకము యనెడి విమానము కీలక విజయ సుచిహ్నముగా!

గ్రహియించెను మఱి యా పుష్పకమును కలకల లాడెడి యందములన్
వర్ణింపగ మఱి తరముగాదుగా వాసుకి కైనను బ్రహ్మకునూ! 40

బంగరు స్తంభములను గూడినదీ బరగ వైడూర్యములును, మణుల్
తాపినట్టి ముఖద్వారము గలదియు, దగముత్తెంబులు గూడికచే
కప్పగబడినది సర్వ కాలముల కమ్మని ఫలముల నొసగెడి యా
వృక్షంబులతో గూడినట్టియు విమల మనోజవమునుగలదీ! 41

కామగమంబును కామరూపమును, గగనమునందున బోవునదీ
మణి కాంచన సోపానంబులు మఱి మానుగ బంగరు నరుగులునూ
గలది సురలకు వాహనంబు మఱి గలిగియుండు నక్షయ్యముగనూ
దృష్టికి, మనసుకు సుఖకరమైనది దీరుగ బహ్వైశ్చర్యంబు మఱిన్! 42

భక్తి చిత్రమును బ్రహ్మ చేత మఱి పరినిర్మితమై యుండినదీ
సర్వకామములతో నిండినదీ సర్వ మనోహరమైనదియున్
అనుత్తమంబును చల్లదనంబును నలరు వేడిమియు లేనిదియున్
సర్వ ఋతువులను సుఖము నిచ్చునది, సర్వకాల మంగళ ప్రదమున్
స్వేచ్ఛారీతిని సంచరించునది వీర్య నిర్జితంబైనదియున్! 43

అట్టి పుష్పకంబను విమానమును నధిరోహించియు రావణుడున్
గర్వముచే తను మూడు లోకములు గడు జయమందిన రీతిగనూ!
మనసునందునను దలచెను నాతడు మానుగ కడు గర్వము జేతన్!
దేవతలకును ప్రభువైన కుబేరుని దీరుగ జయించి వీర్యమునన్
అల కైలాసము పర్వతంబు దిగె యలరెను విలసోన్మాదముతో! 44

ప్రతాపవంతుండైన రావణుడు ప్రవిమల కిరీట హారములన్
ధరించి బహు తేజస్సులతోడను బరగ కుబేరుని యోడించీ
ఘనమగు విజయము సాధించియు మఱి ఘన విమాన మధిరోహించీ
యజ్ఞశాలలో నున్న యగ్ని వలె యుజ్జ్వలముగ బ్రకాశించెన్! 45

శ్రీరామ కథాసుధాలహరి యందు - ఉత్తరకాండలో
పదునైదవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి – ఉత్తరకాండము (మొదటి సంపుటము)

# పదునాఱవ సర్గము

(నందీశ్వరుడు రావణుని శపించుట – పరమేశ్వరుడు రావణుని గర్వమును అణచుట – పరమేశ్వరుని నుండి రావణుడు ఖడ్గమును బొందుట)

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్
రామా! శ్రీరఘురామా వినుమా! రమ్యమైన నా వచనములన్
రాక్ష సాధిపుండైన రావణుడు రయమున సోదరుడైనట్టీ
ధనాధ్యక్షునీ జయించి వేగము దగ మహాసేనుడు జనించినా
శరవణమునకును బయలుదేరెనూ వర ప్రభావము జూపింపన్! 1

అటు పిమ్మట యా దశగ్రీవుండును నలరు కిరణ సముదాయముచే
కప్పబడినదీ, రెండవ సూర్యుని కాంతివోలె భాసించునదీ
మహనీయంబగు బంగరు వికార మానుగ శరవణమును గాంచెన్
శరవణమనగా రెల్లుగడ్డితో శ్రీ విలసిల్లెడి వనము సుమా! 2

రామా! ఆతడు దశగ్రీవుండును రమ్య వనాంతర మందుననూ
గలుగు నొకానొక పర్వతమెక్కెను విలసితమగు నచ్చోటుననూ!
అపుడు నచట తన పుష్పకంబునూ యాగిపోవుటను గమనించీ
ఆశ్చర్యంబును బొందెను నాతడు నలరి మంత్రులను గూడికొనీ! 3

ఆ దశగ్రీవుడు నా మంత్రులతో నాలోచించెను బహు విధమున్
మనసు కోరునటు బయనించునదీమనోహరంబగు పుష్పకమున్!
ఎగురకుండగా జేయబడినదియు కళ్లెము బిగించి నట్టులుగా
నిలిచిపోవుటను గాంచి యాతడును నిస్తేజుండై రావణుడున్! 4

మంత్రులతోడను రావణుండునూ మానుగ బలికెను యీ విధమున్
ఈ పుష్పకమును కోరిన విధమున నింపుగ నడుచుట లేదు మతిన్
కారణమేమో తెలియదు నాకును గడు బలవంతుడు జేసినదీ
పర్వతంబుపై నున్న వాడెవడొ బరగజేసె నీ విధముననూ! 5

ఆ దశ గ్రీవుడు నా విధి బలుకగ అలరు బుద్ధి కోవిదుడైనా
మారీచుడు నీ విధముగ బలికెను మానుగ యాలోచన జేసీ
రాక్షసేంద్రవిను! యీ పుష్పకమును రహి యిటు నిలబడి పోవుటకున్
ఏదో కారణ ముండియుండునూ యీ విపరీతము జరుగుటకున్! 6

లేదా1 వినుమా యీ పుష్పకమును లీలగ ధనదుని కంటె మఱిన్
అన్యులకును నీ పుష్పకంబునూ యలరి వాడకము లేదేమో!
ఆ కారణమున ధనాధ్యక్షుడును నటుల లేకుండు కారణమున్
అతనికి దూరంబగుట చేతనే యది యాగుట జరిగిన దేమో! 7

ఇటు మారీచుడు బలుకుచుండగా నింపుగ వాక్యాంతరమందున్
భయంకరుండును కృష్ణ పింగళుడు బన్నుగ వామన నికటుండున్,
ముండుడు మఱియును హ్రస్వభుజంబులు మోదమునను బలవంతుడునూ
భవుని యనుచరుడు, నిత్యానందుడు బన్నుగ నందీశ్వరుడు మఱిన్
ఆ దశగ్రీవుని సమీపంబునకు నశంకితుండై యటకొచ్చీ
ఈ విధమగు వచనములను బలికెను నింపుగ దశగ్రీవుని తోడన్! 8,9

ఓ దశ గ్రీవా! వెనుకకు బొమ్మా వనరగ శైలమునందుననూ!
పరమశివుడు గ్రీడించుచుండెనూ బన్నుగ పార్వతితో గూడన్!
పక్షులు, నాగులు, యక్షులు మఱియును బరగ సురలు, గంధర్వులునూ
రాక్షసులకు మఱి సర్వప్రాణులకు రయమున రాకుండెడి విధమున్
జేయబడినదీ ఓ దుర్బుద్ధీ! స్థిర నిషేధమును జేయబడెన్!
ఆ కారణమున వెనుకకు మఱలుము నలరి రాకు మున్ముందునకున్
అటుగాకున్న నశింప గలవు సుమ! చటుల భయంకర శాపముననన్! 10,11

ఈ విధముననూ నంది వచనములు నింపుగ విని యా రావణుడున్
క్రోధము వలనను నిస్సారముగను కూరిమి కంపిత కుండలముల్
గలవాడగుచును నా రావణుడును కడు నెఱ్ఱని నేత్రంబులతో
పుష్పకమునుదిగి శంకరుడెవ్వడు? పొగరున బలుకుచు వేగముగా
పర్వత మూలంబునకు వచ్చెనూ బాహుబలంబును జూపించీ! 12

ఆ రావణుడును నచ్చట గాంచెను నలరుద్రునకు సమీపమునన్
నందీశ్వరునీ జూచె నచ్చటను వందనమును జేయగలేదూ!
ప్రవేశించు చుండెడి శూలమునను బన్నుగ యుండెను నానుకొనీ
ద్వితీయ శంకరు వోలెనుండెనూ దీప్తి జెందుచును నచ్చటనూ! 13

వానరు వంటీ ముఖమును గలిగిన వనరగ నందీశ్వరుగాంచీ
అవమానించుచు నాగడముననూ యలరి ధూషణము జేయుచునూ
నీటిని నిండిన మేఘంబును వలె నిగిడి హాస్యమును జేయుచునూ
బహు బిగ్గఱగా పకపక నవ్వెను బరులు జూడ నట నందఱునూ! 14

ఆ శంకరు నపరా తనువును నగు నల భగవంతుండగు నందీ
అచట నుపస్థితుడైనయట్టి యా నటు దశగ్రీవుని గాంచుచునూ
పూజ్యుడైన యా నందీశ్వరుడును భుగభుగ మండుచు గ్రుద్ధుండై
అటకొచ్చిన యా దశగ్రీవునితో చటులుండై నీ విధి బలికెన్! 15

ఓ దశ గ్రీవా! లంకాధిప విను! వనరగ యిదె శాపమునీకున్
వానర రూపము వంటిదైన నా వనరగ రూపము గాంచి మదిన్
అవమానించుచు పరిహసించుచును నల పిడుగును వలె హసించుచున్
పకపక నగితివి గాన శాపమును బన్నుగ నిచ్చుచు నుంటి నిదే!
అందుచేత యా కారణంబుచే కందువ గల నా రూపములన్
నాతో సమాన విక్రమమునుగల నాతో సమాన యాయుస్సున్
గలిగిన వారలు నీ కులంబున గమ్మర నశింపజేయుటకున్
నుద్భవించెదరు గుంపులు గుంపులు నురుతర శక్తిని ధర పైనన్! 16,17

ఓరీ! క్రూరుడ! గోళ్లు, కోరలును, వనరగ యాయుధములు గాగన్
మనోగమనమును వంటి వేగమును మానుగ యుద్ధోన్మత్తులునూ!
బలోద్రిక్తులును శైలము వంటీ బన్నుగ నడకలు గలవారున్
అయినటువంటి వానరులందఱు అమాత్య పుత్రుల సహితుడవై
యున్నటువంటి నీదు బలంబును నీ దర్పంబును యణచెదరూ!
అనేక విధముల యౌన్నత్యంబును నలరుచు యణగించెదరు మతిన్! 18, 19

ఓ రాక్షసుడా! ఓ దశగ్రీవుడ! వనరగ యిపుడిప్పుడె నిన్నున్
జంపుటకును మఱి శక్యమైనదీ, చంపుటలేదు సుమా యిపుడున్
చేసిన పాపపు కర్మల చేతను చెడితివి! పూర్వమె జచ్చితివీ
చచ్చిన వానిని జంపు టధర్మము చావుము మరి యొక మాఱు యనిన్! 20

మహాత్ముడగు నా నందీశ్వరుడును మానుగ యీ రీతిని యపుడున్
బలుకు చుండగా దేవదుందుభులు బహు ధ్వనులును జేసెను నపుడున్
పుష్పవర్ష మాకాశమునుండీ పొలుపుగ బడినది వసుమతిపై
అప్సరసలునూ యాడిరి పాడిరి యల గగనంబున శుభధ్వనులున్! 21

ఆ సమయంబున మహాబలుండును నలరుచు దశగ్రీవుండు మఱిన్
నంది వచనముల లెక్కసేయకను పొంది సమీపము బర్వతమున్
ఈ విధముగ గర్వముతో బలికెను నిలపర్వతములు ధ్వనింపగన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 22

ఓ యీశ్వరుడా! దేని మూలమున యొనరగ నే బోవుచునున్నా
వాహనంబు పుష్పక విమానమును వడి వేగము దప్పించినదో
అట్టి నీదు శైలమును శీఘ్రముగ యిట్టె కూల్చి ద్రోసెదనిపుడే!
పెకలించెదనూ బునాది తోడుట పెనుమ్రోతలు ధర మ్రోగునటుల్! 23

ఏ ప్రభావమున జేత యీశ్వరుడు నిటుల రాజువలె నిత్యంబున్
క్రీడలు సలుపుచు నున్నాడో మఱి కిన్నెర లచ్చరలును జూడన్
భయపడవలసిన స్థితియు వచ్చినటు బరగ దెలిసి కొనవలెనన్నా
బరగ దెలిసి కొనుటయునులేదు మఱి బన్నుగ చేయుట లేదు మఱిన్! 24

శ్రీ రఘురామా యా దశగ్రీవుడు స్థిరముగ యా విధమున బలికీ
అటుమీదట తన ఘన భుజంబులను నల పర్వతమున పైవిసిరీ
శీఘ్రముగా నా పర్వతంబునూ జేర్చి కరములను కదలించెన్
ఆ పర్వతమును నతని తాకుడుకు నటునిటు నడగుచు కంపించెన్! 25

పర్వతమును గదిలించుట వలనను ప్రమధ గణంబులు యీశ్వరునీ
చలించిపోయెను పర్వత గుహలును చరించు యక్షుల భామలునూ

పార్వతి కూడను చలించి పోయెను భయమునందుచును మదియందున్
ఆ పరమేశ్వరు గౌగలించుకొనె యాశ్చర్యంబున గాంచుచునూ! 26

శ్రీరఘురామా! యా సమయంబున స్థిర దేవతలను శ్రేష్ఠుండున్
సకల పాప హరుడును దేవుండును శంకరుండు కోపము తోడన్!
కాలి బొటనవ్రేలిని పర్వతమును గడు విలాసమున యణచె మఱిన్
హాహాకారంబులు జెలరేగెను నట గల కిన్నెర యక్షులయున్! 27

అటు బిమ్మట యాశైలంబునకును నధో గతంబున నున్నట్టి
వాని భుజంబులు నణగి పోయినవి వనరగ బీడింపగబడుచున్
అచ్చట గలిగిన యా రాక్షసునీ యలరు సచివులును, సహచరులున్
ఆశ్చర్యంబును బొంది రంతటను నబ్బురపాటును బొందిరటన్! 28

అపుడా రాక్షసు డా దశగ్రీవుడు నలరు క్రోధమును జెందుచునూ
భుజములు నలిగీ పోవుటవలనను భూరి శబ్దమున యత డఱచెన్
ఆ శబ్దమునను మూడు లోకములు నదిరి పోయె బెదిరెను ప్రాణుల్.
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 29

ఆ సమయమున యా దశగ్రీవుని నలరెడి మంత్రులు సహచరులున్
యుగాంతమందున బహు వజ్రములును యోధులు కలబడునట్టులుగా
నలిగినటుల లేదా యుఱుములుగా నయముగ దలచిరి మనసులలో
మార్గంబులలో సంచరించెడీ మానుగ యింద్రుడు మొదలైనా
దేవతలును మఱి యితరగణములును దీరుగ యదిరిరి బెదిరిరటన్! 30

సముద్రములు, గూడను క్షోభించెను సాహసవంతుని యఱపులకున్
పర్వతంబులును చలించిపోయెను బన్నుగ రాక్షసు కేకలకున్
యక్షులు, సిద్ధులు, విద్యాధరులను నక్షయముగ యా కిన్నెరలున్!
ఇది యేమనుచును నాశ్చర్యముగా నిది యబ్బురమని దలచిరటన్! 31

అటుబిమ్మట యా రావణ మంత్రులు నతని సహచరులు గూడ మఱిన్
అఱచుచున్న యా దశకంఠునితో నలరి పలికి రీ విధముననూ!
దశాననా! నల్లని కంఠముగల దగ యుమాపతియు మహదేవున్
సంతోషింపగ జేయుమా యతిని సరస మధురముగు స్తోత్రములన్

ఈ విషయంబున నతడు దప్ప మఱి యింపుగ మఱి యొక దేవుండున్
కంటికి కనిపించుట లేదు గదా! చంటి పాప వలె వెదికిననూ! 32, 33

స్తుతించుచును బహుస్తోత్రంబులతో మదియందున భక్తిని గలిగీ
ఆ మహదేవుని యల యుమాపతిని యలరి శరణు వేడుము వేగన్!
దయాశాలియగు నా యుమాపతియు దగ సంతసమును జెందుచునూ
నీ తప్పిదములను క్షమింపగలుగును నిన్ననుగ్రహింపగ గలడూ! 34

మంత్రుల జేతను నిటుల బలుకబడి మానుగ యా దశగ్రీవుడునూ
నమస్కరించుచు నా రుద్రునకును నయముగ సామ సుగీతములన్
అనేక స్తోత్రంబులతో నాతడు నా పరమేశ్వరు ధ్యానించెన్
ఆ వృషభధ్వజు నంతరంగమున యనేక విధముల ధ్యానించెన్! 35

ఆ రాక్షసు డటు వేడ్చుచుండగా నలరి వేయి సంవత్సరముల్
గడిచిపోయినది శ్రీ రఘురామా కాలము విచిత్రమైనదియున్
అటుపిమ్మట కైలాసమునందున యట నిలిచిన మహదేవుండున్
సంతోషించిన వాడగుచును మఱి వింతగ రావణు భుజములనూ!
పైకి వచ్చునటు జేసి బలికెనూ బన్నుగ యా దశగ్రీవునితో! 36

ఓ దశాననా! వీరుడవైనా వనరగ నీ దర్పంబునకున్
సంతోషించితి రాక్షసరాజా! శైలాక్రాంతము జేత మఱిన్
సుదారుణంబగు ధ్వనిజేసితివీ సురుచిరమగు నా సమయమునన్
ఆ ధ్వనికిని మఱి మూడు లోకములు నల్లడ తల్లడ మందుచునూ
రోదించినవీ సకల ప్రాణులును వేధింపగ నీ యఱపులునూ!
అందువలన నీకును లోకములో అలరు 'రావణుడు' అను పేరున్
ప్రసిద్ధిలోనికి రాగలదు సుమా! ప్రఖ్యాతిని మఱి పొందెదవూ! 37, 38

దేవతలును మఱి మానుషులందఱు యక్షులు మఱి భూతలమందున్
అన్యులునగు యే యితరులు గలరో యందఱు నిను బిలుతురు నిటులన్
లోకంబులు యేడ్పించినట్టి యా లోక రావణుండని యనుచున్
జెప్పి కొందురిల చిరకాలము నిను మెప్పును గూడను జోడించీ! 39

పౌలస్త్యా విను! ఏ మార్గంబున బరగ బోవగా దలచితివో
నామార్గంబున నమ్మకంబుగా నలరుచు బొమ్మిక నిర్భీతిన్
రాక్షస రాజా! లంకాధిప విను! రయముగ బొమ్మిక యిక నీవున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 40

మహేశ్వరుండట స్వయముగ బలికిన మాటలు విని యా రాక్షసుడున్
అంజలి ఘటించి నమస్కరించుచు నలరుచు నీరీతిని బలికెన్!
పరమేశ్వర! నాయందు మిక్కిలిగ యనుగ్రహంబును జూపినచో
యాచించుచు నున్నట్టి నాకు మఱి యతిశయమగు నొక వరమిమ్మా! 41

దేవతలును! మఱి గంధర్వులునూ దీరుగ దానవులును గానీ
రాక్షసులును, యక్షులుగానీ మఱి రయమున నాగులుగాని మఱిన్
బలవంతులునగు నే యితరులచే బాధింపగ బడకుండునటుల్
వరములు బొందితి బ్రహ్మచేత మఱి యరమర మరణము లేకుండన్! 42

ఓ పరమేశ్వర! నేను మానవుల వనరగ లెక్కింపను వారిన్
స్వల్పమైన వారినిగా దలతును అల్పమైన వారనుచు మదిన్
మహా ప్రజాపతి నుండి కూడ మఱి మానుగ నే దీర్ఘాయువునూ!
పొందిన వాడను పొలుపుగ నీవును బొందుగ ఒక వరమును నిమ్మా!
గడిచిపోయినది పోగా మిగిలిన గలిగిన యాయుర్దాయమునూ
దయతో నిమ్మా! ఒక ఆయనమును దగ శత్రువులను మర్దింపన్! 43, 44

ఆ రావణుడును నటుల బలుకగా నా శంకరుడును సంప్రీతిన్
చంద్రహాసమను ప్రసిద్ధమైనా సాంద్ర దీప్తమగు ఖడ్గంబున్
ఆ దశగ్రీవునకును నిచ్చెను మఱి యలరుచు నాయువు శేషంబున్
దయతో నిచ్చెను దశగ్రీవునకును దగ నాతడు కోరిన వరముల్! 45

ఆ ఖడ్గంబును శంకరుడిచ్చుచు నల దశగ్రీవునితో బలికెన్
వత్సా! నీవును నీ ఖడ్గంబును వనరగ యవమానింపకుమా
అవమానించినచో యీ ఖడ్గము నలరి నాదుకడ కేతెంచున్
సందేహము లే దెంత మాత్రమును సాహసుడా! విను నా పలుకుల్! 46

ఈ విధముగ యా శంకరుజేతను నింపుగ జేయగ బడినట్టి
పేరు గలిగినా రావణు డంతట ప్రీతిని యా మహదేవునకున్
అంజలి ఘటించి నమస్కరించీ నటుబిమ్మట యా రావణుడున్
పుష్పక విమాన మధిరోహించీ స్ఫూర్తిని గగన తలంబుననూ
భూలోకంబున సంచరించెనూ! పొలుపుగ వీర విహారంబున్! 47

శ్రీ రఘురామా! విను! నా పలుకులు చిత్తమందు దగు నాసక్తిన్
అటుబిమ్మట యా రావణుండునూ చటుల మహా విక్రమముననూ
అచటచటనుగల పరాక్రవంతుల నచటచటనుగల క్షత్రియులన్!
బాధలు పెట్టుచు వ్యధను గూర్చుచును బన్నుగ భూలోకమునందున్
పరాక్రమించెను, సంచరించెనూ పరగ తన బలము జూపుచునూ! 48

తేజస్సులు గలవారును మఱియును దీరుగ యుద్ధ విశారదులున్
అయిన నక్షత్రియులు కొంత మంది ధర యతని యాజ్ఞపాలింపకనూ!
సపరివారముగ యుద్ధ రంగమున సాహసుడగు రావణు తోడన్!
పోరాడుచు మరణించిరి రణమున బొలుపుగ స్వర్గము నందుచునూ! 49

బుద్ధిమంతులగు వారలు కొందఱు బొలుపుగ కొందఱు క్షత్రియులున్
ఆ రాక్షసునీ జయింపదలచుట యతి కష్టంబని భావించీ
బలముచేత గర్వితుడైనట్టీ బాహుబలుడు రావణు తోడన్
పరాజయంబును మే మందితిమీ! పరగ నీవు విజయంబునిలన్
పొందితి వనుచును బలికిరి రాజులు చింది హృదయ దౌర్బల్యమునన్! 50

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
పదునాఱవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము ప్రథమ సంపుటము

# పదునేడవ సర్గము

(రావణుడు అవమానించుటచే బ్రహ్మర్షికుమార్తె అయిన వేదవతి యతనిని శపించి,
అగ్నిలో ప్రవేశించుట జన్మాంతరమునందు నామెయే సీతగా జన్మించుట)

శ్రీ రఘురామా! యటు పిమ్మటనూ చిత్తము హర్షము నుప్పొంగన్
మహా భుజంబులు గల రావణుడును మానుగ భూతలమందుననూ
సంచరించుచును సకల దేశములు నంచితముగ బహు రాజ్యములున్
హిమవత్పర్వత ప్రాంతారణ్యము క్రమముగ విహరించుచు నతడున్ 1

అట జని దశగ్రీవుండు గాంచెనూ నలరు దేవ కన్యకు వోలెన్
ప్రకాశించు నొక కన్యను గాంచెను బన్నుగ యరణ్య ప్రాంతమునన్
వేద ప్రోక్తమములు నైన నియమములు విధిగా బాటించుచు నతడున్
కృష్ణాజినమును జటలను ధరించి గృశించుచుండెను తపసుననూ 2

అపురూపంబగు సౌందర్యంబును నలరుచు మహా సువ్రతముననూ!
బరుగుచు నుండిన కన్యను గాంచీ బలవంతుండగు రావణుడున్
కామ మోహ పరితాత్ముండగుచును కావర మెక్కిన కన్నులతో
ఆ ముని కన్యను గాంచి రక్కసుడు నతి ప్రతాపమున హసించుచున్ 3

మంగళ ప్రదురాలా! సరోజినీ! సంగతి వివరింపుము వేగన్
ఏమిది? నీదగు యౌవనంబునకు నిటుల బ్రవర్తన జేయుచునూ
ప్రవర్తించుచుంటివి మునికన్యా! బన్నుగ నీ సౌందర్యమునకున్
విరుద్ధమైనా క్రియా ప్రవర్తన వికటము యుక్తము కాదు గదా! 4

భయ స్వభావము గలదానా! విను! బన్నుగ యనుపమ రూపంబున్
కామోన్మాదము గలిగించునదీ! కమనీయంబగు యౌవనమున్
తపసు నందు మఱి నిలిచి యుండుటకు దగ యుక్తంబును గాదుగదా?
లోక ప్రసిద్ధము నీ నిర్ణయమును లోలత వినుమా నా పలుకుల్! 5

భద్రురాల విను! ఎవ్వరి దానవు? పరమసుందరీ! తపమేలా?
భయశీలా! మఱి భర్త యెవ్వరూ? బరగ దెలుపుమా! యంతయునూ

అనుభవింపబడుచుంటివా జగతిని ఆతడు భూలోకమునందున్
పుణ్యాత్ముడు! మఱి యదృష్టవంతుడు! బొలుపుగ ధన్యుడు! ఓ తరుణీ! 6

ఏ కారణమున నీ తపస్సులను నెందు కిటుల జేయుచును మఱిన్
అడిగెడి నాకును ప్రత్యుత్తరమును నలరి దెలుపుమా! పూబోడీ!
రావణుజేతను నటుల బలుకబడి రయమున యట్టి తపస్వినియున్
ఆతనికి యాతిధ్యమును నిచ్చి మఱి యా తపస్వినియు నిటు లనియెన్! 7

అమిత తేజమును గలవాడును మఱి యా బృహస్పతికి! కుమారుడున్
బుద్ధి చేతనూ నా బృహస్పతికి బొలుపుగ సమతుల్యుండు మఱిన్
శోభావంతుడు, పుణ్యాత్ముడు మఱి సురుచిర కుశధ్వజాడను పేరన్!
బరగునతుడు నా తండ్రి సుమా మఱి బన్నుగ నాతడు బ్రహ్మర్షి! 8

నిత్యము వేదాధ్యయనము జేసెడి సత్యాత్ముడు నా మహాత్ముడున్
వేద వాఙ్మయము స్వరూపంబునగు విమల కన్యగా జనియించీ
తపోదీక్షతో నుంటిని నిచ్చట తపము జేయుచుంటిని నేనున్
వేదవతీ యను నామధేయమున వినుతి కెక్కితిని లోకమునన్! 9

అటు పిమ్మటనూ గంధర్వులు మఱి యలరు దేవతలు, యక్షులునూ
రాక్షసులును పన్నగుల్లు గూడనూ రయమున నా పితరుని జేరీ
నను వివాహమును నాడుటకును మఱి నన్ను భార్యగా వరింపగన్!
నను నిమ్మనుచును గోరిరి వారలు నా తండ్రిని బ్రార్థించిరటన్! 10

రాక్షస రాజా! నాదు తండ్రి మఱి రహివారలకును నీలేదూ!
అడిగిన వారికి లేదని బలికెను నటు నిటు జూడక నాతండున్
మహాభుజా! మఱి యటుల దెలుపుటకు మానుగ కారణమును గలదూ!
వినుము దెలిపెదమ యతని మనసునను విమలముగా నున్నది యేమో! 11

నా తండ్రికి యొక కోరికగలదూ! నయముగ సురేశ్వరుం డయినా
మూడు లోకములకును ప్రభువును మఱి మునిగణ సేవితుడైనట్టీ
ఆ విష్ణువు మఱి తన యల్లునిగా మఱి యలరి జేసికొన కోరికయున్
గలదు గావునను వన్నెవరికినీ కల్యాణము జేయుట కొఱకై

అంగీకారము తెలుపలేదు గద! యింగితమును మఱి యీలేదూ!
శంభుడు నను నొక దైత్యరాజునూ శంకించెను బహు కోపమునన్
ఆ పాపాత్ముడు రాత్రియందునను నలరి నిదుర బోయెడి తండ్రిన్
హింసించుచు మఱి చంపినాడు గద! హసించుచును బోయెను వాడున్! 12, 13

అటుబిమ్మట యా మహాభాగయగు నలరు నాదు జననియు నపుడున్
దీనురాలగుచు దిక్కెవ్వరునని దిశల జూచుచును నా తండ్రిన్
అల శరీరమును గౌగలించుకొని యాశ్చర్యంబును బొందకనూ
హవ్యవాహనుని యలరు జ్వాలలను నందు ప్రవేశము నందినదీ! 14

ఆ నారాయణు గూర్చి తండ్రికిని యలరియున్న యా కోరికయున్
సత్యమైన దానినిగా జేయగ సరసత నే యత్నము తోడన్
ఆ నారాయణు హృదయము జేర్చి యలరుచు ధ్యానించుచును మఱిన్
తపసు జేయుచుంటిని నే నిచ్చట తగు భక్తి ప్రపత్తుల తోడన్! 15

ఈ విధముగ నే ప్రతిజ్ఞజేసీ యిట్టి మహారణ్యము నందున్
విపులమైన యా తపస్సు జేయుచు విమల ధ్యానమును జేయుచునూ
గడుపు చుంటినీ భగవద్భక్తిని భవ్యమైన తపసుల తోడన్
రాక్షస శ్రేష్ఠా! విషయము నంతయు రహిజెప్పితినీ విశదముగా! 16

నారాయణుడే! నాదు పతియునూ నలరు నాదు హృదయేశ్వరుడున్
అతడు దప్ప మఱి వేఱొకడెవ్వరు ఆత్మ నాథుడును గాలేడూ!
ఆ నారాయణు నందవలె ననుచు అట్టి మనోరథమును నిలిపీ
భయంకరంబగు నియమము తోడను భవ్య తపము జేయుచు నుంటిన్! 17

పౌలస్త్యుని యా కుమారుడైనా బరగ విశ్రవసు నందనుడున్
ఐన నీవు ఓ రాక్షస రాజా! యంతయు నాకును దెలియునులే!
ఇక దయజేయుము, మూడు లోకములు నింపుగ నాకును దెలియు సుమా!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్ 18

మన్మథ బాణంబుల జేతను మఱి మానుగ బీడింపగబడెడీ
ఆ రావణుడును నా పుష్పకమును నలరు విమానము నుండి దిగీ

సుమహా వ్రతమును నాచరించెడీ సురుచిరమగు నా కన్యకతో
మఱల రావణుండిటులను బలికెను మానుగ సుమధుర వచనములన్! 19

ఓ సుశ్రోణీ! ఎట్టి యోచనయు వనర యిట్టి బుద్ధియును గల నీవున్
బహు గర్వంబున నుంటివి లలనా! బన్నుగ చాలును నీ తపసుల్
మృగ శాబాక్షీ! పుణ్య సంచయము వృద్ధులకే తగి యుండు మఱిన్
నీకుతగదు సుమ నీరజాక్షిరో! నిండు యౌవనము నందుననూ! 20

భయ స్వభావము గల దానా విను! బరగ సమస్త గుణంబులతో
గూడిన దానవు! మూడులోకములు గూరిమి మోహన సుందరివీ!
ఈ దృశ్యమైన పలుకులు బలుకుట యింపుగ నీకును దగదు సుమా!
నీ యౌవనమును దాటుచునున్నది నీ యనుభవమునొకును రాకన్ 21

మంగళ ప్రదురాలా! వినుమా! నే రంగుగ లంకాధిపుడను సూ!
దశగ్రీవుండని నను బిలిచెదరూ దగ త్రిలోకముల యందుననూ
అట్టి నాకు నీవును భార్యవుగా నలరి యుండుమా! వనజాక్షీ!
సుఖముగ బోగము లనుభవింపుమా! సురుచిరముగ లంకాపురినీ! 22

విష్ణువనుచు మఱి బలుకుచుంటివీ విమల స్తుతులను జోడించీ
ఆ విష్ణువు మఱి యెంతవాడు సుమ! నలరి సముడు నాతో కాదూ!
భద్రే! తరుణీ నా మాటలు విను బన్నుగ యే విష్ణువును మఱిన్!
కోరుచుంటివో యాతడు నాతో గూరిమి వీర్యము జేత మఱిన్!
తపస్సు చేతను బోగంబులచే దగ బలమున సముడును గాదూ! 23

ఆ రావణుడును నటుల బలుకగా నా వేదవతియు నిటులనియెన్
"అటుల బలుకుము!" "అటుల బలుకుము!" ననుచు బలికె యా కన్యకయున్
ఆ కన్యకయే రాక్షసు తోడను నలరి పలికె నీ విధముగనూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్ 24

రాక్షస రాజా! నీవు దప్ప మరి రహి బుద్ధిమంతు డెవడైనా
మూడు లోకముల కధిపతియును మఱి ముదముగ లోకంబుల చేతన్
నమస్కరింపగ బడెడి వాడైన యా దైవంబగు విష్ణువునూ
అవమానింపగ బడునా రావణ! యారాధింపగ బడువాడున్! 25

అటుల వేదవతి బలుకుచుండగా నా దశగ్రీవుడు వేవెంటన్
హస్తాగ్రముతో నామె శిరోజము లందుకొనెను బహు శీఘ్రముగన్
పలుకరాదుగా మూర్ఖులతోడను బలు భాషల నాడగరాదూ!
మంచి చెడ్డలను నాలోచింపరు నంచితముగ దుష్టులు జగతిన్! 26

అటుపిమ్మట యా వేదవతియునూ చటుల కోపమున హస్తముచే
తన కేశములను ఛేదించుకొనెను తన హస్తమునను నపుడపుడే
ఆ సమయంబున యామె హస్తమును నసిగా మారెను చిత్రముగా
కేశములును ఛేదింపగ బడినవి దిశలన్నియు నచ్చెరువొందెన్! 27

వేదవతియు నా సమయము నందున విమలాగ్నులు జ్వలియించినటుల్
ఆ రాక్షసునీ కాల్చివేయుచును నటు జూచుచునూ శీఘ్రముగన్
అగ్ని నేర్పఱచి మరణము కొఱకును నతిత్వరితంబును జేయుచునూ
అల రావణుతో నిటులను బలికెను అమల వేదవతియును నిటులన్ 28

ఓ అనార్యుడా! దుష్ట స్వభావుడ! నిటు నీ చేతను నీ రీతిన్
అవమానింపగబడిన నేను మఱి యాలోచింపను బ్రతుకుటకున్
పరుల హస్తమును నంటిన నేమను బ్రతుకగ జాలను నీవసుధన్!
నీవు చూచుచుండగనే యగ్నిని నిలిచెద దహించి పోయెదనూ!
పాపాత్ముడ! ఓ దుష్ట స్వభావా! పన్నుగ యీ వన ముందుననూ
నన్నవమానించితివి రాక్షసా! మన్నన యంతయు లేకయునూ
అవమానించిన కారణమున నే నవతరించి బుట్టెద మఱలన్
నీ వధ కొఱకే నే జన్మించెద నిఖిలమునకు నాదర్శముగా 30

పాప నిశ్చయము గల యా పూరుషు బరగ యబల చంపగలేదూ!
ఎదిరింపగ జాలదుగద పురుషుని చిదిమిన పూవుగ నుండుగదా
పురుషుడెప్పుడును బలవంతుడుగా బొందుగ నిలుచును తరుణియునూ!
తగ నీకును శాపంబు నిచ్చుచో తరిగిపోవు నా తపసు మఱిన్! 31

ఏదైనను నే మంచి పనియునూ యిలలో జేసిన యట్లయినన్
దానముగానీ హోమముగానీ దగజేసిన యట్లయిన మఱిన్

దానికి ఫలితముగా మఱు జన్మను దగ ధర్మాత్మునకును నేనున్
అయోనిజగ నే జనన మందియును నలపతివ్రతగా వర్ధిలుదున్! 32

అటుల బలికియును వేదవతియునూ అలరి జ్వలింపగ జేసిన యా
అగ్నుల యందున ప్రవేశించినది యల రావణుడును కనుగొనగన్
స్వర్గమునుండీ నలు వైపులనూ సరగున దివి దేవత లపుడున్
పూవుల వానలు గురిసె నంతటను బొలుపుగ హర్షధ్వని తోడన్! 33

పద్మముతోని సమానమైన యా బన్నుగ కాంతియు గలుగుచునూ
పద్మమునందున జన్మించినదీ పరగ మఱల కాంతులు జిందన్
ఆ రాక్షసుడగు రావణు డంతట యామెను మఱలను గైకొనియెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 34

కమల గర్భకాంతులు గలిగిన యా కన్యను గ్రహించి రావణుడున్
తన గృహంబునకు విస్మయంబుతో తగ జనె యాతడు శీఘ్రముగన్
తన మంత్రికి జూపెను యా కన్యను దగ నాశ్చర్యముతోని మతిన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 35

లక్షణజ్ఞుడగు నా మంత్రియునూ లలనా మణినీ గాంచియునూ!
ఈ విధముగ బలికెను నాతండును నివ్వెఱ బాటును జెందుచునూ!
'నీవధ కొఱకే యీ సుశ్రోణియు నిశ్చయముగ నీ గృహమునకున్
వచ్చినట్లుగా గనబడుచున్నది మచ్చిక దోచుచు నున్నదిగా!
అనుచు బలికె నా సాముద్రికుడును నా రాక్షసుడును భయమందన్ 36

రఘురామా! శ్రీరామా వినుమా! రహి నాదు సువాక్యంబులనూ
లక్షణజ్ఞుడగు మంత్రి పలుకు విని లావుగ యా రావణుడు మతిన్
ఆ కన్యను మఱి సంద్రములోనికి యలరి విసిరె మృతి పొందగనూ
ఉత్తమురాలగు నామె భూమినీ విత్తనంబువలె జేరికొనీ
జనకుని నాగలి యగ్రభాగమున జనుదెంచెను మఱలను పైకిన్! 37

(34, 35, 36, 37 శ్లోకాలు చాల ప్రతులలో లేవు.
వ్యాఖ్యాతలు గూడ వ్యాఖ్యానింపలేదు)

రఘుపతి రాఘవ రాజారామా! పతితత పావనా సీతారామ్!
మహాబాహు జనకుని కుమార్తెగా మానుగ జనియించిన యట్టీ
ఈమెయె నీ భార్యామణి సీతా! యింపుగ యిది నిక్కంబు సుమా!
సనాతనుండగు విష్ణువు నీవే సకల ధర్మ రక్షకుడవునూ! 38

పర్వత సముడగు శత్రువు రావణు బరగ వేదవతి పూర్వమునన్
తన కోపముచే శాపము జేతను తగ పరాక్రమము హీనునిగా
జేసి వేసినది యామెయె యిప్పుడు శ్రేష్ఠమైన నీ విక్రమమునూ
సహాయంబుతో వీనిని యిపుడును సంహరించినది కనబడకన్ 39

వేదియందునను అగ్ని శిఖోపమ విమల పవిత్ర సుభాగ్యవతీ
నాగలిచేతను దున్ని నట్టి యా నయముగ బాలిక రూపమునన్
మఱల మానవుల యందున బుట్టెను మానుగ రాక్షసు వధియింపన్
అల వేదవతీ యా జనకునిచే వలరి యజ్ఞ క్షేత్రము నందున్ 40

పూర్వమునందున! కృతయుగమందున పొలుపుగ వేదవతీ పేరన్
వర్ధిల్లినదీ త్రేతాయుగమున వనరగ రావణువధింపగన్
మహాత్ముడైనా జనకుని గృహమున మానుగ జన్మించిన దిపుడున్
సీత నుండి జనియించుట చేతను సీత యనిరి యీమెను లోకుల్! 41 - 42

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
పదునేడవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము ప్రథమ సంపుటము

# పదునెనిమిదవ సర్గము

(రావణుడు మరుత్తుని జయించుట - ఇంద్రాది దేవతలు నెమిళ్లు మొదలైన వానికి వరములు ప్రసాదించుట)

అటు బిమ్మట యా వేదవతియునూ అగ్ని ప్రవేశము నొందుటయున్
బలవంతుండగు రావణుండునూ పన్నుగ పుష్పక విమానమున్
అధిరోహించీ, భూతలంబునను నన్ని దిక్కులను విహరించెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 1

అటుబిమ్మట యా రావణుండునూ యటగల యుశీర బీజంబున్
అనెడి పేరుగల క్షేత్రంబునకును నటయాగము జేయుచునున్నా!
మరుత్తు ననెయెడి పేరు గలిగినా మహరాజును గనుగొనెనునటన్!
హవిర్భాగములకును వచ్చిన యా యమరుల దేవతలను గాంచెన్! 2

సాక్షాత్ బృహస్పతికి సోదరుడును సకల ధర్మములు దెలిసిన యా
సంవర్తుండను బ్రహ్మఋషియునూ సకల దేవతాగణములచే!
కూడిన వాడై నామరుత్తుచే కూరిమియాగము జేయించెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 3

వరదానముచే దుర్జయుడైనా భయంకరుండగు రావణునీ
ఎదుటను నిలబడి పోరాడుటకును నెదిరింపగ శక్యముగానీ
దేవతలందఱు భయబడుచును మఱి తిర్యగ్జంతువులందుననూ
ప్రవేశించిరీ రూపు మార్చుకుని ప్రకటిత రూపము దాచుకునీ 4

ఇంద్రుడు మయూరముగను మారెనూ సాంద్రబలుడు నా యముండునూ
దాయసంబుగా మాఱిపోయెనూ వన్నెలు చిన్నెలు మాపుకునీ
ధనాధ్యక్షుడగు కుబేరుండునూ తగ తొండగనూ మారె నటన్
వరుణుడు హంసగ మారిపోయెనూ వనర యుఱుము మెఱుపులు లేకన్! 5

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
ఇతర దేవతల యధిపతులును మఱి యింగీత జ్ఞానము వదులుకొనీ
ఆ యా తిర్యక్ జంతు రూపముల యలరి ధరించిరి యందఱునూ
అట్టి సమయమున యీ రావణుడును నశుచియైన శునకంబువలెన్
యజ్ఞశాలలో ప్రవేశించెనూ యాజ్ఞ బొందకను నెవ్వరినీ! 6

రాక్షసరాజును నైన రావణుడు నయముగ యా రాజునకు మఱిన్
సమీపంబునూ జేరి యతనితో సంభాషించెను నీ రీతిన్
నాతో యుద్ధము రయమున జేయుము నన్నోడింపుము రణమందున్
లేదా 'యోడితి' ననుచు బలుకుమా! లీలగ శిరసును వంచుచునూ! 7

అనుచు బలుకగా నా రావణుడును నల మరుత్త మహరాజు మఱిన్
'నీ వెవ్వడవూ'? నిచటికొచ్చితివి? నీవెట నుందువు? బలుకు మనన్!
అటు బిమ్మట యా రావణుండునూ అట్ట హాసమును జేయుచునూ
ఈ రీతిని బలికెను మరుత్తుతో నింత వినయమును లేకుండన్! 8

ఓ రాజా! నే కుబేరు తమ్ముడ! వనరగ రావణు డను పేరన్
బరగుచుంటినీ నన్ను గూడ మఱి బరగ యెవడవని యడిగితివీ!
నన్ను గూడ మఱి గుర్తింపనిచో నయముగ నీ లోపలయున్నా
తెలియవలసినా విషయంబులనూ తెలిసికొనగ పోవుట యనెడీ
ఆశ్చర్యంబును బడక పోవుటను అలగుణంబు నీలో జూచీ
సంతోషించుచు మన్నాడను నే వింతను గూడను బడుచుంటిన్ 9

సోదరుడైనా యన్నను జయించి సురుచిర విమానమును నేనున్
అపహరించితిని లోకము గనుగొన యట్టి బలాఢ్యుడ నేను మఱిన్
నా బలమును తెలియని వారు మఱిన్ నయముగ త్రిలోకముల యందున్
నీవు దప్ప మఱి యెవ్వడు లేడూ! నిక్కముగా బలుకుచు నుంటిన్! 10

అటు బిమ్మట యా మరుత్తు రాజును అలరావణుతో నిటులనియెన్
యుద్ధమునందున యన్నగారినీ యోధుడ వగుచు జయించితివీ!
ఎంత ధన్యుడవు లోకమునందున సుంత సిగ్గునూ లేదుకదా!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 11

నీ సదృశుడగు శ్లాఘ్యుడు జగతిని నిఖిలలోకముల లేడుకదా!
లోక విరుద్ధమునైన కర్మనూ లోల! అధర్మములగు పనులన్
ఎవరు జేసినా యీ లోకములో నెవరును శ్లాఘింపరు మూఢా!
దురాత్మకమునగు కర్మము జేసీ దోషము మూటను గట్టుకొనీ
సోదరుని నే జయించినానని శూరత దెలుపుచు నుంటివిగా! 12

ఏ ధర్మము నీ వాచరించి మఱి యెట్టి వరములను బొందితివీ?
నీవు స్వయముగా జెప్పుకొనెడి యా నిఖిల ధర్మములు పూర్వమునన్
నే వినలేదూ! పరులు దెలుపగా నీవే బలుకగ వినుచుంటిన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 13

ఓ దుర్మతి! ఓ రాక్షస వినుమా! వనరగ నే దెలుపునది మఱిన్
నిలబడు మిచ్చట ప్రాణంబులతో నీవు తిరిగి పోజాలవుగా!
నిశితమైన నా బాణంబులచే నిన్నెదె యమపురి కంపెదనూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 14

అటు బిమ్మట యా నరాధిపుండును చటుల కోపమున శీఘ్రముగన్
శరాసనంబును సాయకంబులను సరగున గ్రహించి రాక్షసుతో!
యుద్ధము జేయగ బయలుదేరెనూ యుద్ధతుడై తన బలగముతో
సంవర్తుండును నతని మార్గమును సరికాదని యాపెను వేగన్! 15

మహాత్ముడును మఱి మహా ఋషియునగు మానుగ సంవర్తుం డపుడున్
మరుత్తుతోడను నిటుల పలికెనూ మానుగ స్నేహ సుకార్యములన్
మద్వాక్యంబును వినదలచినచో మానుగ విను గారవముననూ!
ఈ సమయంబున యుద్ధము జేయుట నింపుగ దగినది కాదు సుమా! 16

ఆ మహేశ్వరుని సంబంధించిన యలరుచు జేసెడి యజ్ఞంబున్
అసమాప్తంబగుచో మఱి కులమును నలరిదహించును శీఘ్రముగన్!
దీక్షను బూనినవాడు కోపమును దీరుగ జెందగ రాదు సుమా!
యుద్ధము గూడను జేయగరాదూ తద్భితముగ దీక్షయు జెడుసూ! 17

జయమనునది యెల్లపుడును జగతిని సంశయాస్పదముగా నుండున్
రాక్షసుడైనా రావణుండును రహి దుర్జయుడు సుమా నతడున్
అని గురువగు సంవర్తుడు బలుకగ నామరుత్తుడును వేవెంటన్
గురువాజ్ఞను దన శిరమున దాల్చి మఱలిన వాడగుచును మఱియున్
ధనుర్బాణముల వదిలివేసెనూ దగ రథమును దిగి వే వెంటన్
స్వస్థ చిత్తుడై నా మరుత్తుడును శాలకు జనియెను మఖముఖుడై! 18, 19

అటుబిమ్మట యా రావణాసురుడు నట నిర్జతుడైనట్లుగనూ
తలచి శుకుండును నటు చాటించెను దగ సర్వులు వినునట్లుగనూ
సంతోషము వలనను రావణుడును జయించుచున్నాడనుచు మఱిన్
ఘన నాదంబును జేసెను శుకుడును కమ్మని వాద్యంబులతోడన్! 20

యజ్ఞము గూరిచి వచ్చినట్టి యా అచటనున్న ఋషిమునుల మఱిన్
భక్షించుచు వారల రక్తముచే బహు సంతృప్తిని బొందుచునూ
మఱల బోయె నా దశగ్రీవుండును మానుగ భూలోకంబునకున్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 21

మహాబలుడు నా దశగ్రీవుండును మానుగబోయిన పిమ్మటనూ
ఇంద్రుని గూడిన దేవతలందఱు సాంద్రతేజముల తోడుతనూ
తమ రూపంబుల యథా ప్రకారము తాము దాల్చి సంతసముననూ
ఆ జంతువులను నలరి జూచుచును నానందముతో నిటు లనిరీ! 22

అపుడా యింద్రుడు సంతసించుచును అల నల్లని పింఛము గలుగూ
మయూరంబుతో నిండు హృదయము మానుగ యీ విధమున బలికెన్!
ధర్మము దెలిసిన దానా వినుమా! తగ సంతసమును నందితినీ
తగ భుజంగములచేతను నీకును దఱచుగ భయముండదు నీకున్! 23

నాకుండిన యా నేత్ర సహస్రము నయముగ నీ పింఛమునందున్
నుండగలదు సుమ! యంతియకాదూ! ఉరుతర వర్షంబులు నేనున్
కురిపించెడి యా సమయములందున గూర్మి సంతసము గలుగు మఱిన్
ఆనందంబును గలుగు గాత! యని యల సురేశ్వరుడు వరమిచ్చెన్! 24

నరాధిపా! ఓ రామా వినుమా! నయముగ నా ప్రియ వచనములన్
పూర్వకాలమున నెమిలి పింఛములు బొలుపుగ నల్లగ నుండెడివీ
సురాధిపతిచే వరముల నందీ చోద్యము కన్నులుగా నయ్యెన్!
ఇంద్రుని వరమును నంది నెమిళ్లను సాంద్రగతిని వనమున జనియెన్! 25

యజ్ఞశాలయం దున్నటువంటీ యలధ్వజంబుపై నున్నట్టీ
కాకముతోడను కమ్మని మాటల కలిపి యముండును నిటులనియెన్
ఓ కాకమ! నీయందును నేనును వనరగ సుప్రీతుడ నైతిన్
సంతసమున నే పలికెడి పలుకులు నింత వినుము బహు నాసక్తిన్! 26

ఇతరములైనా ప్రాణులు ధరపై యెన్నో రోగంబుల జేతన్
ఏ విధముగ బీడింపగబడుచును నే విధముగ బాధలు నందీ
కృశించుచుండుట నీకు దెలియుగద! క్రూరముగా నా చేత మతిన్
నీ విషయంబున సంతసించితిని నీ కే రోగము నుం దికన్! 27

ఓ విహంగమా! నీకును నేనును వనర వరంబును నిచ్చితినీ
నీకిక మృత్యువు భయము లేదు సుమ! నీ కే రోగ భయంబులునూ
వరులు నిన్ను వధ జేయు వఱకునూ నర్మిలి యుందువు జీవముతో!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 28

నీవు తృప్తిగా భజియించినచో నిక్కముగా నా లోకములో
ఆకలితోడను బాధపడుచునూ యలమటించెడీ మానవులున్
వారి బందువులు గూడను నచ్చట యలరుచు దృప్తాత్ములు నగుచున్
ఆనందంబును బొందుచునుందురు నటుల నీకు వరమిచ్చితినీ! 29

అటుబిమ్మట యావరుణ దేవుడును నలగంగా జలమందుననూ
సంచరించెడీ పక్షిరాజునగు పరమ హంసనూ గాంచుచునూ
ప్రేమ పూర్వకముగా నిటు బలికెను ప్రీతియు పొంగులు వారుచునూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 30

పత్ర రథేశ్వర విను నా మాటలు, చిత్రము గలిగించునవి మతిన్
నేను నీకు వర మిచ్చుచుంటినీ నిర్మల మతితో గూడికానీ

నీ వర్ణము బహు మనోహరమునూ నిండు మనోహర సౌమ్యమునూ
చంద్రమండలము సమముగ నుండీ సాంద్ర శుద్ధ కాంతులతోడన్
ఫేన సమప్రభలను గూడికొనీ ప్రీతిని రాజల్లుదువు సుమా! 31

మచ్ఛరీరమగు జలముల మీదను మానుగ విహరించుచు నెపుడున్
మనోహరముగా గనబడుచుందువు మతి నిను జూచెడి జనములకున్
సంతోషంబును గలిగించెదవూ! సతతము చక్కని బొమ్మ విధిన్!
ఇది నాకును నీ విషయమునందున నింపగు ప్రేమకు లక్షణమూ! 32

రామా! పూర్వము హంసలు బూర్తిగ రమ్య పాండురముగా లేవూ!
వాని రెక్కలును చివరి భాగములు వనర నీలవర్ణము తోడన్!
వక్షస్థలమును పచ్చిగడ్డి యా వనరగ జిగురుల రంగులనూ
నుండుచుండెడివి వరుణ వరంబున నుండె నేడు తెల్లని కాంతిన్! 33

అటుబిమ్మట యా వైశ్రవణుండును నలపర్వతమున గల యట్టీ
కృతలాసమునూ గూర్చి బలికెనూ కిలకిల బారెడి తొండునూ!
నీ విషయంబున సంతసంబునూ నిక్కముగా గలిగెను నాకున్
హిరణ్య వర్ణముగలిగి యుండుమా! వరము నిచ్చితిని గైకొనుమా! 34

నీ శిరస్సు నిత్యము నక్షయముగ నిండియుండునూ ద్రవ్యముతో
నీ సేవలకును సంతసించితిని నిండకుండ వలె నా మదినీ
అందుకనే నే నిచ్చుచుంటినీ చందముగా నొక వరంబునూ
బంగరు వర్ణము కాగలదు సుమా! రంగుగ నీదు శరీరంబున్ 35

ఆ యజ్ఞోత్సవ మందు దేవతలు నలరుచు తిర్యగ్యోనులకున్
వానికి యీ విధి వరములనిచ్చీ వనరగ రాజును గూడి మతిన్
కలసి వెళ్లిరీ వారును మఱలను కమ్మని స్మృతులను దలచుచునూ!
తమ తమ భవనములకును బోయిరీ తమ తమ నివాసములకు మతిన్! 36

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
పదునెనిమిదవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

## పందొమ్మిదవ సర్గము

(రావణుడు అనరణ్యుని వధించుట, మరణానికి ముందు
అతడు రావణుని శపించుట)

రాక్షసుండునగు దశగ్రీవుండును రయమున మరుత్తు నోడించీ
అటు పిమ్మట యా రాక్షసశ్రేష్ఠుడు నలరి యుద్ధ కాంక్షితు డగుచున్
రాజుల యొక్కయు నగరంబులకును రయమున పయనము గావించెన్!
పోరాడుటకును యత్నము సేతురు బొగరుబోతు లెపుడున్ జగతిన్! 1

రాక్షసేంద్రుడగు నా రావణుడును రహి మహేంద్ర వరుణుల వంటీ
రాజేంద్రుల వద్దకును బోయి మఱి రమ్మని బిలిచెను రణమునకున్
పొగరుబోతు మరి వరగర్వితుడును బొందుగ నాతని యెదుర్కొనన్
ఎవరు వచ్చెదరు నాతని తోడను బవరము సేయగ వ్యర్థముగన్! 2

యుద్ధము సేయుడు నాతో, లేదా 'యోడిపోతి' మని బలుక వలెన్
ఇది నా నిశ్చియ మార్గంబు సుమా! యిది నా సుదృఢ నిర్ణయమున్
మఱియొక మార్గాంతరము లేదుకద! మానుగ వినుడో విక్రములూ!
అనుచు బలికె నందఱు రాజులతో నలరుచు నా దశగ్రీవుండున్! 3

అభీరవులునూ, బుద్ధిమంతులును నల భూమికి నధిపతులు మఱిన్
ధర్మనిశ్చయులు సుమహాబలురును దగ రాజులు నందఱు గూడన్
తమలో దామును నాలోచించియు దగ శత్రువులకు గల బలమూ
వరబలంబునూ మదిని దెలిసికొని వనరగ యందఱు గలిసికొనీ
'ఓడిపోయితిమి!' యనుచు నందఱును నొప్పుకొనిరి యందఱి ముందున్! 4

రామా! నాయన! తగ దుష్యంతుడు దగ సురథుడునూ గాధియునూ
గయుడు రాజయినపురూరవుండును గల సమస్తమగు రాజులునూ

జయింపబడినా మనుచు బలికిరీ జయము దశగ్రీవుని దనుచున్
అందటి ముందును నోడినా మనుచు చందముగా బలికిరి రాజుల్! 5

రాక్షసాధిపుండైన రావణుడు రయముగ లోకములన్నిటినీ
యేడిపించినా యా రావణుడును నిమ్మగ యటూ బిమ్మటను మటిన్
దేవేంద్రునిచే నమరావతియును దీరుగ రక్షింపగ బడుచున్
నున్న రీతినీ యన రేణ్యునిచే నురుతరముగ రక్షింపబడూ
ఆ అయోధ్యకును జని రావణుడును నలదేవేంద్రుని సమమైనా
బలముగలిగినా యాక్షత్రియుతో బరగ బలికె నీ విధముగనూ!
నాతో రణమును నైనసేయుమా! నయముగ యాయుధములు దాల్చి
లేదా యోడితినను చు బలుకుమా! వాదములెందుకు నిక మీదన్
ఇది నా శాసనమనుచును బలికెను నింపుగ యరణ్యకుని తోడన్! 6, 7, 8

అయోధ్యాధిపతి యగు యనరణ్యుడు నా పాపాత్ముడు రావణునీ
వచనంబులనూ విని యాతండును వనరగ మిక్కిలి క్రుద్ధుండై
ఈ విధముగ బలికెను నాతనితో నిమ్మగ ప్రత్యర్థిగ నిలిచీ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 9

రాక్షసరాజా! దశగ్రీవా! విను! రయమున నీతోడను నేనున్
ద్వంద్వయుద్ధమును దగజేసెదనూ చందముగా నిలువుము నీవున్
శీఘ్రము నాయత్తుడవును నగుమా! స్థిరముగ నాతో పోరాడన్
నేను గూడ సంసిద్ధుడనైతిని నిలిచిపోరాడ నీతోడన్! 10

ఆ దశగ్రీవుని సమాచారమును నా యనరేణ్యుడు ముందుగనూ
నిశ్చయింపబడినట్టి సైన్యమును నిర్ణయించి నా రీతిగనూ
బహు సైన్యంబును రాజుగూడనూ బరగ రావణుని వధింపగన్
శీఘ్రముగా నట బయలుదేరిరీ చెనటుని రావణు జంపుటకున్! 11

నరోత్తమా! శ్రీరామా వినుమా! నయముగ నాదగు వచనములన్
పదివేలకు మించిన గజములునూ, బరగ లక్ష గుఱ్ఱంబులునూ

ఎన్నో వేల రథంబులతోడను నెంతో మంది సుసైనికులున్
ఆ సైన్యము ధర గప్పివేసినటు నలయుద్ధమునకు జనె వేగన్! 12

యుద్ధ విశారద! రామా వినుమా! యుద్ధము జరిగిన విషయంబున్
అటుబిమ్మట యా యనరణ్యునకును చటుల దశగ్రీవుల మధ్యన్
సుమహాయుద్ధము జరిగిన దపుడును శూరులు వీరులకును మధ్యన్
ఆశ్చర్యంబుగ జరిగెను రణమును నాటుపోటు లన్నట్లుగనూ! 13

అపు డనరణ్యుని సైన్య మంతయును నలరావణు సైన్యంబుననూ
చితికిపోయెనూ జీర్ణంబాయెను చివఱి దశయునూ బ్రాప్తించెన్
అగ్నియందునను హోమముజేసిన యల ద్రవ్యంబుగ నశించెనూ
ఆ సైన్యంబును నటునిటుబోయెను నలరావణునకు భయమందీ! 14

మిగిలిన సైన్యము చాలసేపు మఱి మేలుగ రణమును జేసి మఱిన్
ప్రజ్వలించెడి యా రావణునీ పరగ సమీపించుచు నతనిన్
వ్యాకులంబునై నతలకుతలమై వనరగ యోటమి జెందుచునూ!
అగ్నుల లోపల యామిడతలునూ యలరి ప్రవేశించిన యటులన్
ఆ యనరణ్యుని సైన్యమంతయును నల రావణుని ప్రవేశించెన్! 15,16

ఆ నరేంద్రుడగు యనరణ్యుడునూ యల సంద్రంబున జేరుచునూ
అదృశ్యంబై బోవునట్టులును నలరెడి వందలు నదులు మఱిన్
ఆ విధముగ తన సైన్యమంతయును నదృశ్యంబై బోవుటయున్
నశించి బోవుచునున్న సైన్యమును లావుగ గాంచెను నరేంద్రుడున్! 17

అటుబిమ్మట యా నరేంద్రుడంతట చటుల క్రోధ మూర్ఛితు డగుచున్
ఇంద్ర ధనుస్సును బోలునట్ట తన సాంద్ర ధనుస్సును జేజట్టీ
చఱచుచు దానిని తన భుజబలమున సాంధ్ర దీప్తులును జెలరేగన్
స్వయముగా తానే రావణు మీదికి సాహస యుద్ధంబునకు జనెన్! 18

అమాత్యులైనా ప్రహస్తుతోడను నలరావణునీ మంత్రులునూ
మారీచుడు శుక సారణులందఱూ నల యనరణ్యుని జేతమఱిన్

నోడింపగబడి పారిపోయిరీ పీడింపగ బడి శరములచే
దిక్కులు దిశలకు బరుగులు దీసిరి దీనత్వంబును బొందుచునూ! 19

ఇక్ష్వాకుల కుల నందనుడైనా యింపుగ యనరణ్యుండు మఱిన్
రాక్షసుడైనా యా రావణునీ నయముగ యాతని శిరస్సుపై
ఎనిమిది వందల బాణంబులనూ యినుడు కిరణముల నొదిలినటుల్
పర్జన్యుడు మఱి వర్షధారలను బరగ వదిలినటులన్ వేసెన్! 20

రావణుపై బడుచున్న శరములును రయమున మేఘంబుల నుండీ
పర్వత శిఖరములందు బడెడి యా బన్నుగ జలధారల వోలెన్
అతనికి యే మాత్రము బాధయునూ యలతను గలిగింపగ లేదూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 21

అటు బిమ్మట యా రాక్షసేంద్రుడును నరచేతిని యటు జాచి మఱిన్
ఆ నరేంద్రునీ శిరస్సు మీదను నలరి బలముతో నటు గొట్టెన్
ఆ దెబ్బకు మఱి యనరేణ్యుండును నరదము నుండీ క్రింద బడెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 22

ఆ రాజును యా యరణ్యమందున యలతను గలతను బొందుచునూ
అరణ్యమందున పిడుగుబాటునకు నటు దగ్ధంబై క్రిందబడూ!
సాల వృక్షమునకు వోలె నతండును సత్వరమున భూమిని బడియెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 23

రాక్షసుడగు నా రావణుండునూ రయమున పకపక నవ్వుచునూ
ఇక్ష్వాకుల వంశమున జనించిన కక్షను యనరణ్యునితోడన్
బలికె నిట్టులను బహుగర్వముతో బాహువులతనికి జూపించీ
రణము జేసితివి నన్నెదిరించీ రహి యే ఫలమును బొందితివీ? 24

రాజా! నాతో ద్వంద్వ యుద్ధమును రహి జేయగ గలిగిన వాడున్
మూడు లోకములయందున లేడూ! మూఢుండవునూ నీవు మఱిన్
నీవును భోగాసక్తుండుడవై నిజముగ నా బలమును గూర్చి
వినియుండవనీ, కనియుండవనీ వినిశ్చయంబుగ భావింతున్! 25

ఆ రాక్షసుడును బలికిన పలుకులు నలరి వినుచు నిక్ష్వాకుండున్
ప్రాణ బలంబును దగ్గుచున్న యా ప్రభువును నీ విధమున బలికెన్!
ఈ విషయంబున యేమి చేయుదును విధి నిర్ణయమిది కాలగతిన్
అతి క్రమింపగ జాలము జగతిని మతిమంతులు నగు విక్రములున్! 26

ఓ రాక్షసుడా! వీరుడ ననుచును నొనర దంభములు బలికితివీ!
అటుల బీరములు బలుకబోకుమా! చటుల యుద్ధమున నను నీవున్
జయింపగా లేనే లేదు గదా! జయాపజయములు మిథ్య సుమా!
కాలము యీగతి గల్పించినదీ ఖర్మమె యీ విధి నడిపించెన్!
నిమిత్తమాత్రుడవయితివి నీవును నిర్ణయింప నా మృత్యువునూ! 27

ఓ రాక్షసుడా! మృత్యు సమయమున వనరగ వినుమా! నా పలుకుల్
కాలప్రభావము జేత మృత్యువును గడిగివచ్చినపుడును మఱియున్
ఏమి చేయ గలుగుదును యీ జగతి యెవ్వరేమి జేయుదురు మఱిన్
యుద్ధమునుండీ పందవోలె నే యుద్ధతి విడిపోలేదు గదా!
రణము జేయుచుండగనే నీవును రమ్యముగా జంపితి విపుడున్! 28

ఓ రాక్షసుడా! యిక్ష్వాకులనూ యొనరగ యవమానించితివీ
అందువలన నే శపించుచుంటినీ చందముగా నా పలుకు వినూ!
దానంబులు నే జేసినట్లయిన దగ హోమంబులు జేసినచో
గొప్ప తపసు నే జేసినట్లయిన కూర్మి సుకృతము జేసినచో
చక్కని పాలనతో నే ప్రజలను జక్కగ రక్షించిన జనులన్
నా వచనంబులు సత్యములగు సుమ! నా శాపము నిజమగును సుమా! 29

మహాత్ములగు నిక్ష్వాకు రాజులా మానుగ యీ వంశమునందున్
దశరథు డనియెడి రాజు వర్ధిలును దగ దశరథునకు రాముడునూ
జనియించును పరమాత్మ యంశమున దగ పాపాత్ముల శిక్షింపన్
ఆ రఘురాముడు నీదు ప్రాణముల నలరి దీయగలవాడు సుమా! 30

ఆ యిక్ష్వాకుడు శాపవచనమును నలరుచు బలికెడి సమయమునన్
మేఘంబును వలె గంభీరమునగు మేదుర దుందుభులును మ్రోగెన్
గగనము నుండియు పుష్ప వర్షమును గడు శోభితముగ గురిసెనటన్!
అప్సరసలునూ యాడిరి పాడిరి యీప్సితములు సిద్ధించుననీ! 31

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
అటు బిమ్మట యా యనరణ్యుడునూ యల త్రివిష్టపమునకును జనియెన్
ఆ యనరణ్యుడు స్వర్గంబునకును నలరుచు బోవుచు నుండగనూ
అటు బిమ్మట యా రావణుండునూ యట నుండియు జనె శీఘ్రముగన్! 32

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
పందొమ్మిదవ సర్గము సమాప్తము



### శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఇరువదియవ సర్గము

(నారదుడు రావణునకు బోధించుట అతని ప్రేరణ చేత రావణుడు యుద్ధమునకు యమలోకమునకు బోవుట, ఆ విషయమునందు నారదుడు ఆలోచించుట)

అటు పిమ్మట యా రాక్షసాధిపుడు నలరుచు భూలోకమునందున్
మానవులను భయపెట్టుచుండెనూ మానుగ గొట్టుచు జంపుచునూ!
అట్టి సమయమున యా దశగ్రీవుడు నిట్టె మేఘ మండలమందున్
ముని శ్రేష్ఠుండగు నారద మునినీ మోదంబున కనులను గాంచెన్! 1

నిశాచరుండగు దశగ్రీవుండును నిర్మల మతి యా నారదుకున్
అంజలి ఘటించి నమస్కరించుచు అతని కుశలమును ప్రశ్నించెన్
అతని యాగమనమునకును కారణ మల రావణుడును ప్రశ్నించెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 2

మహా తేజమను గలవాడును మతి మహాకాంతి గలవాడు మతిన్
దేవర్షియగు నారదుండునూ దీరుగ మేఘము పై నుండీ
పుష్పక విమానమున బయనించెడి బొలుపుగ యా రావణుతోడన్
హరికీర్తన బాడుచునాతండును నా రావణుతో నిటులనియెన్! 3

ఓ సౌమ్యుడా! ఓ రాక్షస రాజా! వనర విశ్రవసు కుమారుడా!
నిలు నిలు! నిలువుము! మంచి బంధువులు మంచి స్నేహితులు గలవాడా!
మూడు లోకములు నీ పరాక్రమము మోదముగా స్తుతియించుచునూ!
మండిరి రావణ! నేనును గూడను దండిగ సంతస మందితినీ! 4

దైత్యుల సంహారమును జేసినా దగ విష్ణువు యుద్ధంబులునూ
గంధర్వులును నురగుల మధ్యను గగన మధ్యమున జరిగిన యా
నీవు జేసినా యుద్ధంబులునూ నిశ్చయంబుగా గనుచుంటిన్
సంతసించితిని! ఆనందించితి! సాహస కార్యములను గాంచీ! 5

రాక్షసోత్తమా! ఒక కార్యంబును రమ్యముగా తెలిపెద వినుమా!
ఇష్టమైనచో నా విషయమునూ కష్టముగా నుండిన నీకున్
వినుమా! మీదట కార్యము జేయుము! విమలమైన యాలోచనతో
ఆకారణమున తండ్రీ వినుమా! యలరి సావధానము తోడన్! 6

తండ్రీ! నిను జంపుటకు సురలకును దగ శక్యంబును కాదుగదా!
అందుచేత యీ మర్త్య లోకమును నెందుకు నీ విధి వధించుటన్?
ఈ మనుష్య లోకము నెపుడైతే యిల మృత్యువునకు వశమునునై
యున్నదొ యా కారణము వలననూ యెన్నగ జంపగ బడినట్లే! 7

అట్టి నీవు నతి బలహీనులు నగు నిట్టె మానవుల సమయింపన్
ధర్మముగాదూ! యుక్తముగాదూ! దండించుట న్యాయము గాదూ! 8

నిత్యము శ్రేయస్సులను విషయమున నిరామయముగా నున్నదియున్
మహా వ్యసనముల గూడియున్నదీ మహా వ్యాధులును గలవియునూ
ముసలి తనముతో మోహ జాలమును మునుగుచు దేలుచు నుండునదీ
తా దృశమగు నీ మానవలోకము తగ చంపగలడు క్రూరముగా? 9

అరిష్టములు బ్రాప్తించుట జేతను అనిశము కష్టములను బడుచున్
జీవ యాత్రనూ గడుపు మానవుల జీవంబుల హరియించుటనూ
బుద్ధిమంతుడెవడైనను గూడను తత్థితముగ యుద్ధము జేయన్
ఆసక్తిని మతి గలిగి యుండునూ? ఆర్భాటంబును జేయడుగా! 10

క్షీణించుచు నున్నది దైవముచే స్థిరపీడన గలుగుచు నుండీ
ఆకలి దప్పిక ముసలి తనములను అధ్వాన స్థితి నందుచునూ
దురదృష్టమున బాధను జెందుచు దుఃఖాక్రాంతంబైనట్టీ
మర్త్య లోకమును నశింపజేయకు, మానవులను వధియింపకుమా! 11

మహా బాహు! ఓ రాక్షసరాజా! మానుగ యాలోచింపు మతిన్
ఏమి చేయవలెనో మతి తెలియదు నెందును స్థిరపడి యుండరుగా!
గమ్యంబేమియు దెలిసికొనరుగా కష్టబడుచు నుందురు యెపుడున్
అట్టి మానవుల హీనదశనూ నిట్టె జూడుమా దయతోడన్! 12

కొన్ని చోట్ల కొందఱు సంతసమున కొందఱు నృత్యంబులతోడన్
కొందఱు బహు విధ వాయిద్యములను కొందఱు భక్తి సుగీతములన్
కొందఱు దుఃఖితులై కన్నీటను నుందురు జలజల రాలుపుచున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 13

మనుష్యలోకమునం దీ జనములు మానుగ తలిదండ్రుల యందున్
భార్యాపుత్రులు బంధువులందున పన్నుగ ప్రేమను గలవారై!
మోహము జెందీ పరిపరి విధముల మోదమునందీ యుండియునూ
తమ క్లేశంబును దగ కష్టంబును దగ తెలియకనూ యుండిరిలన్! 14

ఓ సౌమ్యుడ1 ఓ రావణ వినుమా! యీ విధముగ మోహమునందున్
మునిగి తేలుచున్నట్టి లోకమును మూర్ఛను బొందిన జనములనూ
ఇంకను బాధలు పెట్టనేల మఱి? ఏమి ప్రయోజనముండు మఱిన్?
ఈ లోకంబును నీ మానవులను నింపుగ జయించి నటువలెనూ
భావింపుము నీ మనసునందునను బరగ సందియము వలదు సుమా! 15

శత్రుపురములను జయించువాడా! సర్వసమర్థా! దశగ్రీవా
ఈ లోకంబును మానవులందఱు నింపుగ యేదో ఒక నాడున్!
యమలోకము జేరగవలసినదే! యమదర్శనము నందవలెన్!
అందువలన యోజింపుము యమునీ చందముగా యమ ధర్మపురిన్! 16

నీ వా యమధర్ముని జయించుచో నిఖిలము జయించి నట్లుండున్
సంశయమింతయు లేదు సుమా మఱి సందేహంబును లేదు సుమా!
ఈ పలుకులు విని లంకేశ్వరుడును నింపుగ స్వతేజముల తోడన్
ప్రకాశించుచుండిన నారదుగని భవ్య నమస్కృతు లొనరించీ
ఈ విధముగ బలికెను రావణుడును నింపుగ ప్రహాస్యమును జిందన్! 17, 18

దేవ గంధర్వలోకములందున దివ్యముగా విహరించుచునూ
యుద్ధ ప్రియుడవు మహర్షి నారద! తథ్థితముగ నా పలుకు వినూ!
నేను ప్రస్తుతము విజయము కొఱకును నిక్కము రసాతలంబునకున్
పోవుటకును సిద్ధముగా నుంటిని బొచ్చెము లేదు రవంతయునూ! 19

అటు బిమ్మట లోకత్రయంబునూ చటుల విక్రమము దోడుతనూ
జయించి, మఱియును సుర నాగులనూ స్వవశమునందున నుంచుకొనీ
అమృతంబు సాధించుట కొఱకును నల రసాతలమునందున్నా
మహా సంద్రమును మధియించెద నే మానుగ యమరత్వమునందన్! 20

అటు బిమ్మటనూ పూజ్యుడైన యా యల మహర్షి నారదు డపుడున్
దశగ్రీవునితో నీ విధి బలికెను దగ చతురముగా బలుకుచునూ
రసాతలమునకు బోదలచినచో రమ్యముగా నటుకును బొమ్మా!
మఱియొక మార్గము లేదు యెచ్చటికి మానుగ బోవుచు నున్నావూ? 21

అమిత్ర కర్శన! దుర్ధర్షా! విను! అమిత కష్ట మది బయనింపన్
ఈ మార్గము యమలోకంబునకును నింపుగ బోవును గమ్యంబున్
ఈ దారిన బోయినచో గనబడు నింపుగ ప్రేతంబుల పురియున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 22

ఆ రావణుడును బహు బిగ్గఱగా హాసంబును మఱి జేయుచునూ
శరత్కాల మేఘమునకు సాటిది చారుచంద్ర కిరణము వంటీ
కాంతి గలిగినా యా నారదుతో కమనీయముగా నిటు బలికెన్
నీవు జెప్పినా పనియంతయునూ నిశ్చితముగ పూర్తయినట్లే!
అనుచు బలికి యా రావణుండునూ యలరుచు మఱలను నిటు బలికెన్! 23

మహా బ్రాహ్మణా! నారద! వినుమా! మానుగ నాదు సువచనములన్
వైవస్వతునీ వధోత్యుతుడనై వనరగ సూర్యాత్మజుడైనా
ఆ రాజును మఱి యెటనున్నాడో అల దక్షిణ దిశకును నేనున్
త్వరితగతిని బోవుచునున్నాడను! త్వరితముగా జయమందుటకున్! 24

భగవంతుడ! ఓ పూజ్యుడ నారద! బన్నుగ రణమును గోరుచునూ!
అభిలాషయముగల నే క్రుద్ధుడనై యలరుచు ప్రతినను జేసితినీ
ఆ నలుగురి యమలోక పాలురను నలరుచు యుద్ధమునందుననూ
జయింతు ననుచును గద జేకొంటిని బన్నుగ ప్రతిజ్ఞ జేసితినీ! 25

ఆ కారణమున నే నిపుడును మఱి యల యమరాజ పురంబునకున్
ప్రయాణమై నే బోవుచుంటినీ బన్నుగ పుష్పక మందుననూ!
సకల ప్రాణులకు క్లేశము గూర్చెడి కాలయముని నాగద తోడన్
చూర్ణము జేసెద గ్రుక్కిపోవగా సురమునులడ్డము వచ్చిననూ! 26

దశగ్రీవుండును నిటుల బలుకుచును దగ మునీశ్వరుడు నారదుకున్
అంజలి ఘటించి నమస్కరించీ యల దక్షిణ దిశకును వేగన్
బోయి, మంత్రులను వెంట దీసికొని బొలుపుగ సహచరులను గూడన్
అల దక్షిణ దిగ్భాగంబునకును నలరి పోయె జయనాదములన్! 27

బహు తేజుండును ధూమములేనీ పావకునికి వలె యుండిన యా
బ్రాహ్మణ శ్రేష్ఠుండైన నారదుడు బన్నుగ యెక క్షణకాలంబున్
ధ్యానమగ్నుడై తన మదియందున దగ యాలోచించెను వేగన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 28

ఎవనిచేత నాయుర్దాయంబును నింపుగ క్షీణించిన దగుచున్
ఇంద్రునితో గూడిన సచరాచర సాంద్రమైన యీ లోకములున్
ధర్మముజేతను క్లేశ పెట్టబడి తగ తా నుండునా యెల్లపుడున్
అట్టి యముని యీ రావణుండునూ యెట్లు జయింపగ గలడొక్కో? 29

తమచే నివ్వగబడిన వానికిని దగజేయగబడు దానికిని
ఎవ్వడు రెండవ యగ్నికి వోలెను నిలపై సాక్షిగ నుండు మఱిన్
మహాత్ముడగు నెవ్వని యనుజ్ఞచే మానుగ చైతన్యము నందీ
కదులుచున్నవో యెల్లప్పుడునూ కామిత ఫలములు నొందుచునూ
ఎవని భయముచే బీడింపగబడి నింపుగ త్రిలోకములు గూడన్
పరుగులు దీయుచు నున్నవో మఱియు ప్రస్థానంబును నొందుచునూ
అట్టి యముని యా రాక్షసేంద్రుడును నిట్టె యాయుధము జేపట్టీ
యుద్ధము జేయగ యెటుల బోవునో యుద్ధతి నాతని జయింపగన్? 30, 31

లోకంబును సామాన్యరూపమున లోలత విశేష రూపమునన్
సృజియించిన వా డాతడు యముడును సృజనకర్తయును నాతండున్
పాప పుణ్యముల ఫలదాతయునూ బొలుపుగ దండించెడి వాడున్
మూడులోకములు బయింపబడెనూ ముదముగ యాతనిచేత మఱిన్
అట్టి యముని యితడెట్లు జయించును? ఎట్టి ఉపాయము జేత మఱిన్?

ఈ యమ రావణ సంగ్రామంబును నింపుగ జూడగ వలె నంచున్
బహు కుతూహలం బగుచున్నది మఱి బన్నుగ యీ సమయమునందున్
అందుచేత మఱి త్వరితగతిని నే యమలోకమునకు బోయెదనూ!
కన్నులారగా గాంచెద నేనును చిన్నబోవు వాడెవడగునో? 34

శ్రీరామ కథా సుథాలహరి యందు - ఉత్తరకాండలో
ఇఱువదియవ సర్గము సమాప్తము



**శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)**

# ఇరువది యొకటవ సర్గము

(రావణుడు యమలోకము ఆక్రమణము జేసి యముని సైన్యమును సంహరించుట)

అటుపిమ్మట యా విప్రేంద్రులును బటు తరముగ యాలోచించీ
జరిగినదానిని విషయ మంతయును సొంతము యమునకు దెలుపుటకై
యమలోకమునకు శీఘ్రగమనమున యలరి వార్త లందింపగనూ
కలహ భోజుడను నామధేయము గలిగె నిందుకే కాబోలున్! 1

అచ్చట యమలోకాధిపతియునూ చెచ్చర యగ్నిని పూజించీ
ఏ ప్రాణులకును యెట్టి ఫలంబును నెన్నగ నీయగ వలె ననుచున్
అట్టి ఫలంబును నగ్ని సాక్షిగా అట్టి యగ్ని ముందుంచుకునీ
యిచ్చుచుండెనూ అట్టి యముని మఱి మచ్చికతో నారదుడు గనెన్! 2

ధర్మాత్ముండగు యముడు గూడనూ దగ యచ్చటి కొచ్చినయట్టి
మహర్షియగు నా నారదునీ గని మానుగ యర్ఘ్యము గావించీ
అంజలి ఘటించి నమస్కరించుచు నఖిల సపర్యల గావించీ
సుఖాసీనుడై యుండిన మునినీ శుభ చింతనతో నిటులనియెన్! 3

ఓ దేవర్షీ! క్షేమమేగదా! వనరగ భూలోకమునందున్
ధర్మము నశియించుట లేదు కదా! ధార్మికత్వమును జెడదు కదా!
సురగంధర్వుల జేత యెపుడునూ బరగ సేవలను గొనువాడా!
పూజ్యుడ! నీవచ్చిన పని యేమీ? పొలుపుగ దెలుపుము శీఘ్రముగన్! 4

అపుడు పూజ్యుడగు నారదుండునూ యా ధర్ముని మాటలను వినీ
నాతని తోడుత నిటుల బలికెనూ యారని యుద్వేగము తోడన్
ఓ యమరాజా! దెలిపెద వినుమా! వనరగ యొక విషయంబు మఱిన్
విని దానికి దగు నుపాయంబునూ విశదముగా జేయుము మఱియున్ 5

పితృరాజ! వినుమా నా పలుకులు ప్రియముతోని నే బలుకునవీ
దశగ్రీవుండను పేరు గలిగినా నిశాచరుడు గలడును ధరణిన్

జయింప శక్యముగాని వాడు సుమ! సకల రాజులను జయమందెన్!
పరాక్రమముచే నిను జయింపగా బరగ వచ్చు చుండెను నేడున్ 6

ఓ సమర్థుడా! యీ కారణమున యొనరగ యాతురతను జెందీ
నీ యీ లోకమునకు వచ్చితినీ నిజముగ మీ రణమును గాంచన్
దండము నాయుధముగను గలిగినా చండశాసనుడు నీకిపుడున్
ఏమగునోయని దెలియగ వచ్చితి! యేమగునో తుది ఫలితమనీ! 7

ఈ యంతరమున గనబడె వారికి నింపుగ రాక్షసు విమానమున్
ఉదయించిన యా యంశుమంతువలె యురుతర దీప్తి ప్రకాశముతో
వచ్చుచున్న యా విమానంబునూ మచ్చికతో దూరమునుండీ
గాంచిరి వారలు గడు సంభ్రమమునా కడు నాశ్చర్యమునను గూడీ! 8

మహాబలుండగు రావణుండునూ మానుగ యా పుష్పక కాంతిన్
ఆ ప్రదేశ మంతయు గూడను మఱి యాహ్లాదము గలిగించుచునూ
చీకటి తెరలను దొలగించుచు మఱి దీప్తిమంతమును జేయుచునూ
సమీపించెనూ వారల వద్దకు సహజ కాంతులను జిమ్ముచునూ! 9

ప్రసిద్ధుడైనా మహాబాహువును బన్నుగ యా రావణుడు మఱిన్
అచ్చటచ్చటను పుణ్య పాపముల నలరు ఫలంబుల నందుచునూ
బాధలు పొందెడి వారలు మఱియును బహు కష్టంబుల లోనగుచున్
నుండెడి ప్రాణులగాంచె రావణుడు మండెడి జీవుల నట గాంచెన్! 10

ఆ ప్రదేశమున యా రావణుడును నల యమధర్మని విధేయులన్
అతని యనుచరుల గాంచెను నచ్చట యాతని సైనికులను గాంచెన్
ఉగ్రమైన రూపముగలవారును నురుతర భయంకరులు నైనా
కఠిన కర్కశులు నగు వారలతో కసరుచు, గొట్టుచు వేధించీ
బాధలు బెట్టుచు నున్న వారితో భయంకరంబగు ధ్వనితోడన్
అఱచుచున్న ప్రాణులను గాంచెనట! యల రావణుడును గనులారన్! 11, 12

కృముల జేత తిని వేయబడెడి యా కృశించు ప్రాణులను గనియెన్
భయంకరంబగు కుక్కల జేతను బాధనొందెడీ ప్రాణులనూ

బాధలు కొందఱు నొందుచు బొందుచు భయంకరముగా నఱచుచునూ!
అట్టి ప్రాణులను గాంచె రావణుడు నాయమలోకము నందుననూ! 13

అనేక విధములుగా గొందఱినీ యలసట గలిగించుచు వేగన్
శోణితోదకము గల వైతరణిని శోకము గూడిన వారలనూ!
దాటించుచు నుండిరి యమభటులును దయలేకను బహు క్రూరముగన్
వేడిచేయబడు నిసుకలమీదను వేగముగా నటునిటు ద్రిప్పి
కాల్పబడెడి వారలను గాంచెనూ చీల్చుచు నుండిరి కొందఱినీ! 14

కత్తుల వంటీ యాకులు గలిగిన కఠినమైన వనముల యందున్
నడిపించుచు వారల దేహంబులు నలిగిబోవునటు జేయుచునూ
కారపు నీళుల వాగుల యందున కడిగి యీదగా జేయుచునూ
కత్తుల బదునుగ నగ్రభాగముల కఱకున నడిపించెడి వారిన్
అట్టి వారలను గాంచె రావణుడు నా యమలోకము నందుననూ! 15

ఆకలి తోడను దప్పిక తోడను నడలి బాధపడు వారలనూ
దప్పక తోడను దోసిలి బట్టీ దయయాచించెడి వారలనూ
కృశించి కొందఱు దీనులగుచునూ నశింప జూచెడి వారలనూ
కొందఱు రంగును మారిపోయిరీ కొందఱు దిగంబరులు నైరీ
కొందఱు జుట్టును విరియబోసికొని కొందఱు శవములవలె నైరీ
అట్టి వారినీ గాంచె రావణుడు నా యమలోకము నందుననూ! 16

మార్గమునందున యా రావణుడును మల పంకములను గూడికొనీ
నిండినట్టి దేహంబులు గలిగిన బండ వారినా దీనులనూ!
మొరటుగ ధాత్రిని యున్న వారలను మొగమున కన్నులు లేకయునూ!
అటు నిటు పరుగులు దీసెడి వారిని నట వందలు వేలకు మించీ
అల ప్రాణులనూ గాంచె రావణుడు నాయమలోకము నందుననూ! 17

తమ సంబంధితమైన పుణ్యముల దగు ఫలములనూ బొందుచునూ
శ్రేష్ఠమైన గృహములను వసించుచు శ్రీకరమగు గీతంబులతో
గీత వాద్యముల ధ్వనుల తోడనూ కిన్నెర మీటుచు బాడుచునూ!

సంతోషించుచు నున్న వారినీ దగ యా యమలోకమునందున్
వారిని గూడను గాంచె రావణుడు వరుసగ పుణ్యాత్ముల నచటన్! 18

గోదానంబులు జేసిన వారిని గోరసంబులను ద్రావుటనూ
అన్న దానమును జేసిన వారలు యన్నములను భుజియించటనూ
గృహదానంబులు జేసిన వారలు గృహములందు వసియించుటనూ
తమ తమ పుణ్యంబుల ఫలములనూ దగ పొందుటయును గాంచెనటన్! 19

మహాబాహువులు గల రాక్షసుడును మానుగ గాంచెను నచ్చటనూ
బంగారముచే మణులచేతనూ బన్నుగ ముత్యంబుల తోడన్
అలకరింపగబడిన ప్రమదలును నలరి గూడికొను వారలనూ
స్వతేజస్సుతో దీప్తి మానులగు సహజ ప్రకాశులు నగు వారున్
అట్టి ధార్మికుల గొందఱ గాంచెను నల రావణుడును నచ్చటనూ! 20

అటు బిమ్మటనూ బలవంతుండగు నల దశగ్రీవుడు వేగముగన్
తమ పాపములకు ఫలితముగా నట తగ హింసింపగ బడుచున్నా!
ఆ పాపాత్ముల నందఱనూ మఱి యపారమగు తన బలములచే
బలాత్కారముగ భటులను ద్రోసీ పరాక్రమముతో విడిపించెన్! 21

ఆ రాక్షసుడగు దశగ్రీవునిచే నలరి విడుదలను పొందిన యా
ప్రాణులు క్షణకాలంబు పాటునూ పన్నుగ యతర్కితంబైనా
అచింతితం బగు సుఖమును బొందెను నా ప్రాణులు నా సమయంబునన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 22

మహాయశుండగు రావణుడంతట మహా ప్రేతలను శీఘ్రముగన్
మరణించియు, యమలోకమునందున మానుగ నుండిన వారలనూ
విడిపించుచు నుండగ రాక్షసుడును ప్రేతల రక్షించెడి వారున్
సంక్రుద్ధులునై రావణు మీదికి సంగ్రామమునకు బోయిరటన్! 23

ఆ సమయంబున యముని యోధులును నటుల బరుగు లెత్తుచును మఱిన్
వచ్చుచుండగా నన్ని దిక్కులను వసరగ ఘన కోలాహలమున్! 24

వందల కొలదియు వేలకొలదియు చందముగా యమ భటులు మఱిన్
ఆయోధులనూ ప్రాసలు,పరిఘలు నలరు శూలములు, ముసలములున్
శక్తులు, తోమరములను గూడికొని సాహసమున యా రావణునీ
పుష్పకంబుపై వర్షించిరి మఱి పూనికతో నా యమభటులున్ 25

శూరులునైనా యా యమభటులును సురుచిర ఆయుధములతోడన్
తేనెటీగలకు వలెను ముసిరికొని దీరుగ నా పుష్పకమందున్
ఆసనములనూ ప్రాసాదములను నల తోరణములు వేదికలున్
విరుగ గొట్టిరీ పగుల గొట్టిరీ విమలమైన యా విమానమున్! 26

యుద్ధమునందును విఱుగ గొట్టబడు సిద్ధులునగు దేవతలకునూ
స్థానమైన పుష్పక విమానమును చక్కని బ్రహ్మ సతేజముచే
నాశరహితమై వెనుకటి వలెనే నయముగ నుండెను విమానమున్
అల రావణునీ మోయునుండెను యదివఱకటివలె నదియు మఱిన్! 27

మహాత్ముడైనా యముని యొక్కయును మానుగ సేన లసంఖ్యములున్
ఆ సేనయు లెక్కింపరానిదీ అది బహుళ విశాలంబు మఱిన్
అగ్రభాగమున వెడలు సైన్యమున నతి పరాక్రమము గలుగుచునూ!
వందల కొలదియు వేలకొలదియును చందముగా వచ్చుచు నుండెన్! 28

అటుబిమ్మట యా మహావీరులును నల రావణునీ సచివులునూ
వృక్షంబులతో పర్వతములతో విమల స్ఫటిక శిలలను బట్టీ
ప్రాసాదంబుల తోడుత మఱియును ప్రబలమైన యా యుధములతో
యథాకామమును, యథా బలంబును యనుసరించి జేసిరి రణమున్
ఆ రావణుడును యుద్ధము జేసెను నలరి పుష్పకము పై నుండీ! 29, 30

శోణిత దిగ్ధాంగములు గలిగియును శూరులు యమభటులును నచటన్
సకల శస్త్రముల తోడను గొట్టగ సర్వాంగంబుల గాయములున్
నిండినట్టి యా రాక్షసేంద్రునీ మండిత రావణు యమాత్యులున్
భయంకరంబగు యుద్ధము జేసిరి భయము లేక మది సుంతయునూ! 31

శ్రీ రఘురామా! యముని యోధులును స్థిరచిత్తముగల రావణునీ
భాగ్యవంతులగు రావణు మంత్రులు బరగ యాయుధములను గూడీ
పరస్పరము మఱి ద్వంద్వ యుద్ధమును బన్నుగ జేసిరి రణమందున్
గెలుపోటములును నెవరికి గలుగునొ దెలియుట బహు కష్టంబు గదా! 32

మహాబలముగల యమ యోధులునూ మానుగ రావణు మంత్రులనూ
విడిచివేసి శూలంబులు గైకొని కడు ప్రసిద్ధ యాయుధములనూ
వర్షించుచునూ నా రావణుపై వనరగ బోయిరి శీఘ్రముగన్
ఆ రావణుని బలమును దెలియగ యా రావణు సత్తువ దెలియన్! 33

అటు బిమ్మట శోణిత దిగ్ధాంగుడు నల రావణుడును రణమందున్
అంగాంగంబులు శిథిలము లాయెను నటుల రక్తమును గారుచునూ
పుష్పక విమానమందు రావణుడు పుల్లాశోకము వలె నుండెన్
ఎంతటి వారికి యుద్ధమునందున చింత దొలుకుచును నుండుగదా! 34

బలీయుండునగు నారావణుండును బన్నుగ యస్త్ర బలంబుననూ
శూలంబులనూ గదా ప్రాసలను శిలలు, శక్తి తోమరములనూ
బాణంబులనూ ముసలంబులనూ బన్నుగ వృక్షములను మఱియున్
ప్రయోగించెనూ యా యుద్ధంబున బరగ యమభటులు భయమందన్! 35

రావణుండు గురిపించినట్టి యా రహి భయంకరములును నైనా!
వృక్షశిలా శస్త్రంబుల వర్షము వీరులైన యమసేనలపై
భూమి యందునను బడినవి యచ్చట పొగలు జిందుచును రణమందున్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 36

వందల కొలదియు వేల కొలదియును చందముగా నట నున్నట్టి
యను సైన్యంబును వాని నన్నిటిని యలరి యమాత్యుల గొట్టుచునూ!
రావణు నస్త్రము గొట్టివేసి మఱి రయమున భయంకరుడు నైనా
ఒక్క రాక్షసుని చుట్టిముట్టిరీ చిక్కెననుచు సంతసముననూ! 37

ఆ యమ సేనా నాయకులందఱు వాఘన యోధులు నందఱునూ
మేఘంబుల సముదాయము గిరినీ మెరిసి చుట్టుముట్టిన యటులన్

చుట్టుముట్టి యా రావణు పైనీ శూలంబుల జేతను మఱియున్
భిన్ది పాలముల జేతను యాతని బందిగ జేసిరి కుమ్ముచునూ! 38

అట్టి రావణుడు విముక్త కవచుడు నిట్టె రక్తముల ధారలచే
దడిసిన వాడును నా దశగ్రీవుడు దన మదిలో బహు కోపించీ
ఆ పుష్పకమును వీడి రావణుడు నలరి వసుధపై నిలబడెనూ
ధనుర్బాణములు ధరించి యాతడు ధగధగ మెఱయుచు నుండెనటన్! 39

ఆ రావణుడును ధనుర్బాణములు నటు బిమ్మటనూ ధరియించీ
యుద్ధమునందున యుత్సాహముతో యుద్ధతి ముందునను వచ్చెన్
ముహూర్తకాలమునందున యాతడు మోదముతో సంజ్ఞను బొందీ
అల రావణుడును మండిబడుచునూ నట యమునికి వలె నిలబడెనూ! 40

అటు బిమ్మట యా దశగ్రీవుండును చటుల పాశుపద యస్త్రమునూ
ధనుస్సు మీదను సంధించి మఱిన్ దగ 'నిలు' మని నారిని లాగీ!
యముని బటులతో బలుకుచు నాతడు ఘన కార్ముకమును వదిలె నటన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 41

అటు దర్వాతను రణమునందునను చటుల ధనుస్సును లాగి మఱిన్
అల రావణుడును గోపించుచునూ యల త్రిపురంబులపై శివుడున్
అలరి ప్రయోగము జేసినట్లుగా నా సమయంబున రావణుడున్
ఆ బాణమునూ బ్రయోగించె నటు నది మఱి నిప్పులు గ్రక్కుచునూ! 42

ఆ సమయంబున యా శర రూపము నల గ్రీష్మమునందున వోలెన్
వనమును గాల్చుచు వ్యాపించెడి యా వాసిగ దావాగ్నికి వోలెన్
ఆ శర రూపము ధూమము తోడను అల జ్వాలామండలము వలెన్!
కన్నులకును మఱి కన్పించుచునూ కలవర బరుచుచు నుండె నటన్! 43

యుద్ధమునందున బ్రయోగింపబడి యుద్ధతి పాశు పతాస్త్రంబున్
జ్వాలాపఙ్క్తుల నిండిన దగుచును సరగున క్రవ్యాదుల చేతన్
అనుసరింపబడు నా మహాస్త్రమును నగ్నుల పాదలను వృక్షములన్
అఖిలము భస్మంబును జేయుచునూ నలరుచు శీఘ్రము బయనించెన్! 44

ఆ యస్త్రము దేజస్సుల చేతను నాయమసేనల సైన్యంబున్
ఆ మహేంద్రునికి సంబంధించిన నలరెడి ధ్వజంబులను వలెనూ!
అల యమ సైన్యమునందున భటులును నచట బడిరి స్పృహ దప్పుచునూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 45

అట్టి సమయమున మంత్రుల గూడిన యల భయంకరుడు రావణుడున్
ఈ ధాత్రిని కంపింప జేయుచును నల జీవుల భయ పెట్టుచునూ!
నున్నాడా యనునట్లు నాతడును ఉరుతరముగ బిగ్గఱ యఱచీ
సింహనాదమును జేసె రాక్షసుడు జెలగె ధ్వనులు దిక్కులు దిశలున్! 46

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఇరువదియొకటవ సర్గము సమాప్తము



### శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము ప్రథమ సంపుటము

## ఇరువది రెండవ సర్గము

(యమ రావణుల మధ్య యుద్ధము జరుగుట - రావణుని జంపుటకై యెత్తిన యమదండమును యముడు బ్రహ్మదేవుని యాజ్ఞ చేత ఉపసంహరించుట - రావణుడు విజయవంతుడై యమలోకము నుండి తిరిగి వెళ్లుట)

అటుబిమ్మట ప్రభువైన యముండును చటుల రావణుని ధ్వనిని వినీ
అతనికి విజయము గలిగినట్లుగా మతి నిశ్చయమును జేసికొనీ
తన సైన్యము క్షీణించినట్లుగా తగ సంగతినీ దెలిసికొనీ
చింతా క్రాంతుడునై ధర్మ్మండును వంతను గూడెను హృదయమునన్! 1

తన యోధులు నా యుద్ధమునందున దగ నశించుటను తెలిసికొనీ
క్రోధ సంరక్త లోచనుడగుచును కూరిమి సారథితో బలికెన్
'నా రథమును శీఘ్రము గొనిరమ్మా! నయముగ యశ్వంబుల తోడన్
అస్త్రంబులు మఱి యంబుల పొదులును నలరి దెమ్ము వే నిచటికినీ! 2

అటు బిమ్మట యమరాజు! సారథియు నాతడు దెలిపిన విధముననూ
దివ్యమైన యా మహారథంబును దివ్యాస్త్రములను గొనివచ్చెన్!
ఆ సారథియు నరదము ముందఱ యటుల నిలబడెను నిశ్చలతన్
రథమును నెక్కెను వైవస్వతుడును రయమున రణమును సేయుటకున్! 3

ఏ మృత్యువుచే నవ్యయమైనా నింపుగ నిత్యంబైనట్టీ
మూడులోకముల సముదాయంబును ముదముగ నశింప జేయుచునూ
నుండునట్టి యా మృత్యు దేవుడును మెండుగ సంసిద్ధుండై యటకున్
ప్రాస ముద్గరము హస్తంబులలో బన్నుగ ధరించి శీఘ్రముగన్
యముని యెదుట యా మృత్యు దేవుడును కమనీయముగా నిలువబడెన్! 4

తేజస్సులతో ప్రకాశించునది తీరుగ యగ్నుల గూడినదీ
యముని దివ్యమగు నాయుధంబయిన యట్టి కాల దండంబు మఱిన్
ఆకారంబును ధరించి వచ్చి యముని పార్శ్వమున నిలువబడెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 5

అటులే మఱీ యా కాలపాశములు నాతని ప్రక్కల యందుననూ
ఒక్క దాని ప్రక్కను నొక్కటియును మక్కువ ఛిద్రము లేకుండన్
నిలచిన వచ్చట అగ్ని స్పర్శతో విలవిల నిప్పులు రాల్చుచునూ!
ముద్గరంబు ధరియించి శరీరము మోదమునను నిలబడెనచటన్! 6

అటు బిమ్మట బహు క్రుద్ధుండగుచును నఖిల లోకములకును భయమున్
గలుగ జేయు చున్నట్టి కాలునీ కలయజూచి లోకంబులునూ
మృతి జెందినవీ పక్షి మృగంబులు సతతము బాధను జలచరముల్
దేవతలందఱు వణికి పోయిరీ దీరుగ గంధర్వులు నాగుల్! 7

అటు బిమ్మటనూ నా సారధియును నందమైన కాంతులు గలుగూ
అశ్వంబులనూ ప్రేరేపించెను నడుగులు ముందుకు వేయుటకున్
భయంకరంబగు ధ్వనులు గలిగినా బన్నుగ యా రథమును గూడన్
రావణుడెచటను నున్నాడో మఱీ రయమున నచటికి బయనించెన్! 8

ఇంద్రుని యశ్వములకు సమానమును సాంద్ర దీప్తి గలిగినవియు మఱిన్
మహావేగమునకును సాటియునగు మానుగ యా యశ్వము లపుడున్
ముహూర్త కాలమునందు నా రణము ముదముగ జరుగుచు నుండినదో
ఆ ప్రదేశమునకును గొనిపోయెను నా యమధర్ముని వేగముగన్! 9

ఆ సమయంబున రాక్షసేంద్రునీ యలరు మంత్రులును సహచరులున్
ఆ విధంబుగా భయంకరముగా నల మృత్యు సమన్వితమైనా
ఆరథంబునూగాంచి రాక్షసులు నతిశయ భీతిని బొందిరిగా
రావణు మంత్రులు పారిపోయిరీ రయమున దూరము రథమునకున్! 10

ఆ మంత్రులునూ యా సహచరులును నల్పబలము గలవారు మఱిన్
అందులకే యటు నా యని నుండీ చందముగా దీసిరి పరుగుల్!
స్పృహలు దప్పుచును భయపీడితులై సరికాదనుచును రణమునకున్
దిక్కులు బట్టీ పారిపోయిరీ దిశలను వెదుకుచు వేగముగన్! 11

ఆ రావణుడైతే నచ్చటనూ యతిలోక భయంకరమైనా
అట్టి రథంబును గాంచి రక్కసుడు నతిశయ భయమందగ లేదూ!

అట్టి యరదమును గాంచుచు మదిలో నాటుపోటు బొందగలేదూ!
కలత బొందగా లేదు మఱియునూ కంగారును బడగా లేదూ! 12

అల యముండునూ సంక్రుద్ధుండై యా రావణుని సమీపించీ
శుత్తులనూ మఱి తోమరములనూ రక్తిని ముద్గరముల విడిచీ
ప్రావృట్కాలపు వర్షంబును వలె బరగయతనిపై వర్షించెన్!
ఆ రావణుని మర్మ స్థానముల యలరి తీవ్రముగ ఛేదించెన్! 13

అటు బిమ్మట యా రావణుండునూ నలరుచు స్వస్థుండై మిగులన్
అల దైవస్వతు రథము మీదనూ నటు తీవ్రములగు బాణములన్
అంబుదములు మఱి తోయ వర్షములు నటుగిరిపై వర్షించినటుల్
వర్షించెను తన బాణంబులనూ! వరుసను లెక్కకు మిక్కిలిగా! 14

అటు బిమ్మట శరపీడితుడైనా యా రాక్షసుడగు రావణుడున్
విశాలమైనా వక్ష స్థలమున విపులముగా బహు కుప్పలుగా!
బడవేయగ బడుచున్న బాణములు బహుశుత్తుల శరములచేతన్!
ప్రతిక్రియను జేయుట కశక్తుడై పన్నుగ రావణు డపు డుండెన్! 15

అమిత్ర కర్శితుడైన యముండును నల రణరంగము నందుననూ!
అనేక విధముల యాయుధములచే నల శత్రువుడగు రావణునీ!
యుద్ధమునందున సప్తరాత్రములు యుద్ధతి యిట్టి విధంబుననూ
విసంజ్ఞునిగ మఱి జేసెను యాతని విముఖునిగా జేసెను యనికిన్! 16

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
జయమును గోరుచునున్న వారునూ సమరంబున యనివర్తితులున్
అయినట్టీ యమరాక్షసులకు నట యపురూపంబగు యుద్ధంబున్!
జరిగెను గానీ జయ మెవ్వరిదో సరిగా తెలియగ లే దచటన్! 17

అటుబిమ్మట యా సురగంధర్వులు నల సిద్ధులును మహర్షులున్
ప్రజాపతియు మఱి ముందునడువగా బన్నుగ దేవత లందఱునూ
కలిసివచ్చిరీ రణరంగమునకు గాంచగ వారల యుద్ధంబున్
అల రావణ యమ యుద్ధంబును మరి యంతము లేనీ యుద్ధంబున్! 18

అలరాక్షసులకు ముఖ్యుడైన యా యల దశగ్రీవునకును మఱియున్
ప్రేతంబులకును నీశ్వరుడైనా ప్రభువగు యమ ధర్మని తోడన్
జరుగుచుండగా యారణంబునూ సంవర్తంబుగ నుండె నటన్
లోకంబునకును ప్రళయ మొచ్చినటు లోలత జీకటి క్రమ్మకొనెన్! 19

రాక్షసేంద్రుడగు రావణుండునూ రయమున నింద్రుని యాయుధమున్
వజ్రాయుధమును కాంతిని బోలిన వనర కార్ముకము సంధించి
ఆకాశమునందున రవంతయును నవకాశము లేకుండగనూ
జేయుచు బాణంబులను విడిచెనూ స్థిరమగు ధ్వనులును జెలరేగన్! 20

నాల్గు బాణములతో మృత్యువునూ నలుగునటుల జేసెను నతడున్
ఏడు బాణములతో సారధినీ నెగురవేసె శోకము జెందన్
లక్ష లక్ష బాణంబులతోడను లావుగ యమధర్మని గొట్టెన్
మర్మస్థానములందున గొట్టెను మానుగ చతికిల బడునటులన్! 21

అటుబిమ్మట యా యమధర్మండును చటుల గోపమున దపియించెన్
వదనమునుండీ జ్వాలా మాలలు వనర ధూమమును గూడిన యా
నిట్టూర్పులతో గూడినట్టిదియు నిరుప మానమగు వేదనతో
కోపాగ్నులునూ బయలుదేరెనూ కూరిమి యా సమయమునందున్! 22

అటు బిమ్మట యా దేవదానవుల యలరు సన్నిధిని జరిగిన యా
ఆశ్చర్యంబును, వద్భుతంబునూ యనినిగాంచి మృత్యువు కాలుల్
సంతోషించిన వారలగుచునూ సంరబ్ధులు గూడను వగుచున్
తమలో దామిటు సంభాషించిరి తగువులు లేకుండగ వారున్! 23

అటు బిమ్మట యా మృత్యుదేవుడును చటులముగా కోపించి మఱిన్
ఆ వైవస్వతునీ తోడను మృధువుగ నలరుచు నీ విధముగ బలికెన్
యుద్ధములో నను బ్రయోగింపుమా! యుద్ధతి కనుగొను నాదు మఱిన్
పాప రాక్షసుని సంహరించెదను బరగ గనుగొనుము భుజబలమున్! 24

మహారాజ! యిపుడీ రాక్షసుడును మానుగ జీవింపగ రాదూ!
ఇది స్వభావ సిద్ధంబైనదియును, యిది యా యుగ మర్యాద కదా!

శ్రీమంతుండగు హిరణ్యకశిపుడు, నముచి, శంబరుడు, విసంధియున్
అల విరోచుని కుమారుడైనా యాబలి విసంధి, దంభుండున్
మహారాజునగు వృత్రుడు, బాణుడు మానుగ రాజర్షులు మఱియున్
గంధర్వులునూ, మహోరగులునూ, ఋషులు, పన్నగులు, దైత్యులునూ
యక్షలు మఱి యప్సరసలు గూడను అలరు ప్రళయ కాలమునందున్
మహాసంద్రముల తోడను గిరులను మానుగ పర్వతముల తోడన్
నదులతోడనూ వృక్షంబులతో నయముగ యీ భూమియు నాచే
నాశమొందగా జేయబడినదీ నశింపజేయగ బడిరికదా! 25, 26, 27, 28

వీరును మఱియును దురాసదులునూ బలీయులును బలవంతులునూ
అనేకులైనా యితరులు గూడను నలరుచు నా చే జూడబడీ
నశించినారుగదా యమరాజా! నయముగ నీ యుగ మంతమునన్
ఈ నిశాచరుని మాటయింకనూ నింపుగ మఱి జెప్పగ వలెనా? 29

ధర్మజ్ఞా! విను! సాధుమార్గమున దగ విడువుము స్పందించుచునూ!
వీనిని యంతము జేసెద నిపుడును విఱ్ఱవీగువా డెవడైనా
ఎంతటి బలవంతుడును గూడను, యెంతటి సాహసుడైన మఱిన్
నాకంటను బడువాడు నెన్నటికి నయముగ జీవింపడు ధాత్రిన్! 30

ఓ కాలుడ! నా బలమును గూరిచి యెప్పుగ జెప్పుటయును కాదూ!
ఇది స్వభావమున యేర్పడినట్టీ యిల నుండిన మర్యాదకదా!
ఓ యమరాజా! నా చేతను మఱి నాకంటను బడువాడు యిలన్
ముహూర్త మాత్రము బ్రతుకుడు నీధర మోదమునందుము నీవు నికన్! 31

ప్రతాపవంతుండైన యముండును బరగ మృత్యు దేవత పలుకుల్
విని మృత్యువుతో నిటులను బలికెను విమల చతురతయు విరియగనూ!
ఆగు మాగుమా! మృత్యు దేవుడా! యల తొందర బాటును వలదూ!
నేను చంపెదను జూడుము వీనిని నర్ధ్వంద్వముగా నిపుడిపుడే! 32

అటుబిమ్మట యా యమధర్మండును చటులముగా గోపించి మఱిన్
ఎఱ్ఱనైన నేత్రంబుల తోడను యెఱ్ఱనైన పెదవుల తోడన్

వ్యర్థముగానీ కాలదండమును శ్రద్ధగ కరమున జేపట్టెన్
బయలు దేరెనూ బ్రహ్మ దేవువలె బహుజనములు వెంటను రాగా! 33

ఆ యమదండము ప్రక్కలయందున యలరు కాలపాశంబులునూ
అమర్పబడి యుండెను మఱియును నట యగ్నితోని, వజ్రముతోడన్
సమానమైనా శరీరంబునూ చక్కగా దాల్చిన ముద్గరమున్
దాని ప్రక్కనే యుండెను జాడగ దగ సోదరునికి వోలె మఱిన్
దానిని గాంచిన మాత్రంబుననే దగ ప్రాణంబుల హరియించున్
మఱి దానికి స్పృశియింప హస్తమున అలరి మీద సంధించినచో
చెప్పవలయునా దాని ప్రభావము చేటును వివరింపగవలెనా?
అగ్ని జ్వాలలను చుట్టును నిండీ యా రాక్షసునీ గాల్చుచునూ!
యున్నదివోలెను నుండెను కరమున యురుతర కాంతులు జిమ్ముచునూ
ఆ యాయుధమును యమునిచేతనూ యలరి గ్రహింగ బడియుండెన్! 34, 35, 36

అటుబిమ్మట యా యుద్ధ భూమిలో నట యుండెడివా రందఱునూ
ఆ యమ ధర్మని దండము గాంచియు యలరుచు దీసిరి పరుగులునూ!
దండమునెత్తిన యమునిగాంచి మఱి దండి దేవతలు నందఱునూ,
వ్యధ జెందుచునూ నాల్గు దిక్కులకు మధన బడుచు బోయిరి వేగన్! 37

అట్టి సమయమున యమధర్మండును గట్టి గదను జేబట్టుచునూ
ఆ రావణునీ కొట్టదలపగా నంతట ప్రజాపతియు నటకున్!
ప్రత్యక్షంబై యమధర్మునితో బన్నుగ సాంత్వన వచనములన్
బలికెసిట్టులను భావభరితమును బంధురమగు నాప్యాయతతో! 38

మహాబాహు! ఓ యమిత విక్రమా! మానుగ వైవస్వత వినుమా!
నా పలుకులు వినుమా! శాంతముతో నయముగ యోజన చేసి మఱిన్!
రాక్షసుడగు నా రావణాసురుని రయమున దండము తోడుతనూ
చంపగావలదు తొందరబాటున వంపగా వలదు నిపుడిపుడే! 39

త్రిదశ పుంగవా! ఓ యమరాజా! తీరుగ నాచే యీతనికిన్
కోరిన వరమును నివ్వబడినది కూరిమి నాచే యీతనికిన్

నే నీతనికిని యిచ్చిన వరమును నిర్మలమగు నా వాక్యమునూ
అసత్యములుగా జేయగ వలదూ, యలరుచు వీనిని వధియించీ! 40

దేవతా పురుషుడైనను గానీ దీరుగ మానవుడైన మఱిన్
అనృతవాదిగ ననుజేసినచో యలరి వాని చేతను మఱియున్
త్రైలోక్యంబులు నసత్యములుగా దీరుగ జేసిన యట్లగునూ
సందియమిందున లేదు సుమా! మఱి సందేహంబును లేదు గదా! 41

భయంకరంబును లోకత్రయమును భయమును గలిగించెడి దయినా
యీ దండంబును గోపము తోడను నిలలో బ్రయోగమును జేయన్
మంచి చెడ్డలను, యిష్ట లనిష్టలు నంచితముగ భేదము లేకన్
ప్రజలందఱినీ సంహరించునూ పరితాపము నింతయు లేకన్! 42

నేను సృజించిన కాలదండమిల నిఖిలము స్వాహా జేయుగదా
మహత్కాంతులును గలదీ దండము మానుగ నట్టిదియు లేదూ!
సర్వజీవులను చంపివేయునూ సాహసవంతులను గూడన్
ఏ ప్రాణుల విషయంబున గూడను వ్యర్థంబును మఱి కాదుగదా! 43

ఓ సౌమ్యుడ! ఓ యమరాజా విను! వసరగ రావణు శిరస్సుపై
ప్రయోగింపగా వలదు సుమా! మఱి పడవేయగ దగినది కాదూ!
పడినచోట యిది యెవ్వండును మఱి పన్నుగ ముహూర్త మాత్రంబున్
జీవింపడు నీ ధాత్రియందునను గావింపడు నే కార్యంబున్! 44

ఈ దండము నా రాక్షసుపైనీ నింపుగ బడినను నటుమీదన్
ఆ రావణుడును మరణించిననూ నటు మరణము జెందకయున్నన్
అయిననుగూడను రెండు విధములా యల నీ పలుకు యసత్యమగున్
కావున మిక్కిలి యాలోచనతో గడగి చేయవలె కార్యంబున్? 45

ఆ కారణమన నీవు ప్రస్తుతము నలరిలోకముల రక్షింపన్
అభిప్రాయమది యుండినచో మఱి యలరి మెత్తగా బడినట్టీ
కాలదండమును దించివేయునూ! జాలము సేయక వేగముగన్
సత్య వ్రతునిగా జేయుము నన్నును సత్కీర్తిని నిలబెట్టుచునూ! 46

ఆ విధముగ యా పితామహుండును నలరి బలుకగా కాలుడునూ
ధర్మాత్ముండగు యమరాజును మఱి దగబలికెను వినయముతోడన్
'ఇదిగో దండము! మఱల్పబడినది యింపుగ స్వస్థానంబునకున్
మా యందఱిపై యధికారివి గద! మానుగ లోకంబులకు మఱిన్! 47

వర పురస్కృతుండయిన రావణుడు వనరగ యీ రణమందుననూ
జంపగ శక్యముగాని వాడయిన వంపగజాలని మఱి నేనున్
రణరంగంబున నున్న నేను మఱి రయముగ వెనుకకు బోవలెనా?
ఏమి జేయవలెనో శలవీయుడు నెటుల ప్రవర్తింపగ వలెనో? 48

అందువలన నే యీ కారణమున చందముగా నా రావణుకున్
కనబడకుండగ వెళ్లిపోయెదను గడు శీఘ్రముగా నిటనుండీ!
అనుచుబలికి యా యమధర్ముండును నలరి యశ్వరథముల తోడన్
అచ్చట యంతర్ధానము నందెను నందఱు విస్మయ మందగనూ? 49

ఆ విధముగ యా రావణుండునూ యల యమరాజును గెలుపొందీ
తన నామంబును ప్రకటించీ మఱి తన విజయంబును దెలుపుచునూ
మఱల పుష్పకము నధిరోహించీ మానుగ మంత్రులతో గూడీ
నిష్క్రాంతుండై యమలోకంబును నిరుపమాన విజయుండై యతడున్! 50

అటు బిమ్మట యా వైవస్వతుడును నల ప్రజాపతిని గూడికొనీ
ఇతర దేవతల తోని గూడికొని నింపుగ సంతోషించుచునూ!
స్వర్గంబునకును బయలుదేరెనూ సహచరులను మఱి గూడికొనీ
మహామునియునగు నారదుండునూ మానుగ వారలతో జనియెన్! 51

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఇరువది రెండవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఇరువది మూడవ సర్గము

(రావణుడు నివాత కవచులతో స్నేహముజేసికొని కాలకేయులను వధించి వరుణ పుత్రులను ఓడించుట)

దశ కంఠంబులు గలవాడును మఱి దగబడాయి యని జెప్పికొనూ
అట్టి రావణుడు త్రిదశ పుంగవుడు నల యమధర్ముని గెలుపొందీ!
అటుబిమ్మట తన సహచరులను మఱి తన యమాత్యులను గనుగొనియెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 1

అటు బిమ్మట యా రాక్షసులందఱు నలదశగ్రీవుని కనుగొనిరీ
రుధిర సిక్తమగు నంగంబులతో రూఢమైన దెబ్బలజేతన్
శిథిలము జేయగబడినవాడునూ శీఘ్రము దశగ్రీవుని గాంచీ
ఆశ్చర్యంబును బొందిరి వారలు నబ్బురబాటుగ గాంచిరటన్! 2

ఆ సమయంబున మారీచుండును నట గల రాక్షస యోధులునూ
జయజయ ధ్వానములను రాక్షసుని జయ శుభాభివందనములనూ
అభినందించిరి దశగ్రీవుండును నలరి దెలిపె స్థిర ధైర్యంబున్!
వారందఱునూ, సహచరులందఱు వనరగ యెక్కిరి పుష్పకమున్ 3

అటుబిమ్మట యా రావణుండునూ, యలరు వాసుకీ పాలితమున్
భోగవతీ పురమునకును బోయీ భూరి శరీరులు నాగులనూ!
వశము జేసికొని వారలనందఱ వనరగ తన విజయము జాటే
మణిమయపురంబునకును బోయెనూ మానుగ తన విజయమును జాటన్! 4

అటు మీదట యా దశగ్రీవుండును నల రసాతలమునకు బోవన్
దైత్యుల యురగుల సముదాయంబుల దగ యా వాసవు నివాసమున్
వరుణుని చేతను రక్షింపగబడి వన్నెలు చిన్నెలు విరిసిన యా
మహా సంద్రమును బ్రవేశించెనూ మానుగ కల్లోలము జెలగన్! 5

మణిమయ పురమున వసించుచుండిరి మానుగ నివాత కవచులునూ!
వరములు పొందిన వారును మఱియును వర గర్వంబున మిక్కిలిగా
పరులెవ్వరినీ లెక్క సేయకను బరగుచుండిరీ వారపుడున్!
అని సేయగ వారలను బిలిచెనూ అటునిటు జూడక వేగముగన్ 6

అచటనున్న యాదైత్యు లందఱును నలరు పరాక్రమ విక్రములున్
బలశాలురు మఱి బాహు బలాఢ్యులు పది మందికి యొక్కడు చాలున్!
అనేక విధముల యాయుధంబులును నలరుచు గలిగిన వారు మఱిన్
యుద్ధ దుర్మదులు యుద్ధతులును మఱి పద్ధతి తెలిసిన వారు మఱిన్! 7

క్రోధావిష్టులు నైన రాక్షసులు కూరిమి దానవులును మఱియున్
ఒకరినొకరు శూలంబుల తోడను నొప్పుగ త్రిశూలముల చేతన్!
వజ్రాయుధములు, పట్టిసములతో వనర ఖడ్గముల గొడ్డళులన్
అన్యోన్యము దానవులు రాక్షసులు నట పోరాడిరి తీవ్రముగన్! 8

ఆ రాక్షసులును దానవులును మఱి యటుల రణము సేయుచునుండన్
వత్సరకాలము గడిచిపోయినది యొక్కరికిని జయమునులేదూ
పరాజయంబును లేదు గదా మఱి బరగ యట్టి కాలమునందున్
జయ విజయంబులు చిత్రమైనవీ స్థిరముగ వచింప లేము గదా! 9

అటుబిమ్మట త్రైలోక్యంబులకును నలగతియును నగువాడు మఱిన్
అవ్యయుండు మఱి దేవదేవుడును నట్టి పితామహుడును మఱియున్
విమాన వరమును నధిష్ఠించి మఱి విమల సహచరులతో గూడీ
యుద్ధము జరుగుచు నున్న చోటునకు యోధుల మధ్యకు వచ్చి మఱిన్ 10

వృద్ధుడైన యా పితామహుండును యుద్ధము జేయుచు నున్నట్టీ
నివాతకవచుల వారించియునూ నిశ్చిత బుద్ధిని యోజించీ
స్పష్టమైన యర్థముగల వాక్యము సహజముగా నీవిధి బలికెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 11

సురలజేతనూ యసురుల జేతను సురుచిరముగ యుద్ధమునందున్
ఈ రావణునీ జయింప జాలరు యితని జయింప నశక్యంబున్

మీరును గూడను నమర దానవులు మీరిన బలమును గూడికొనీ
వచ్చిన గూడను జయింప మిమ్ముల వనరశక్యమును గాదు గదా! 12

మీరును యా రావణునితో గూడుక మిగుల సఖిత్వము నొందటయున్
కలిసి మెలిసి యుండటయె మంచిదని కనబడుచున్నది నిక్కముగా!
అన్ని భోగములు నవిభక్తముగా ననుభవింపగా వచ్చు మఱిన్
సందియంబునూ లేదు మఱియునూ సందేహింపగ పనిలేదూ! 13

అటుబిమ్మట యా రావణుండునూ యచ్చటి నివాత కవచులతో
అగ్నిసాక్షిగా ప్రతిజ్ఞ జేసెను నలరి వారితో నుండునటుల్!
నివాతకవచులు గూడ జేరితే నిక్కముగా యగ్నులతోనీ
సఖ్యముగా నుండుటకు నందఱును సంతోషించిరి యందఱునూ! 14

యధా న్యాయముగ పూజింపగబడి యాదశాననుడు బిమ్మటనూ
మణిమయ పురంబునందు రావణుడు మానుగ నివాతకవచులతో
ఒక వత్సర కాలమును నచ్చటను నొనరగ నివసించినవాడై
తన పురంబునందున వలెనే దా తగ సంతోషము నందె మఱిన్! 15

ఆ దశగ్రీవుడు మణిమయ పురమున యా నివాత కవచులకు మఱిన్
అనుగుణంబుగా బ్రవర్తించుచును నలరి నూఱు మాయల నేర్చెన్
వరుణుని పురమును యన్వేషించుచు వరుసగ పాతాళమునందున్
అన్ని ప్రదేశములందున వెదికెను యెన్నో జాడలు దీయుచునూ! 16

అటు పిమ్మటనూ కాలకేయులా యావాసంబగు నట్టిదియున్
అశ్మ నగరమును జేరికొనుచునూ యటగల దానవ వీరులనూ
బలోత్కటులునగు కాలకేయులను బన్నుగ వారల జంపి మఱిన్
సోదరి శూర్పణఖా భర్తయునూ సురచిరముగ తన బావయునూ
బలవంతుండును, బలోత్కటుండగు బన్నుగ విద్యుజ్జిహ్వునినీ
ఖడ్గము జేతను ఖండించెను మఱి కానరాకుండ రణమందున్! 17, 18

అటుపిమ్మట యా యుద్ధ రంగమున యలరి నాలుకను జూచి మఱిన్
నాలుక తోడను నాకి వేయుచును నలుమూలల దిరుగుచు నున్నా

ఆ విద్యుజ్జిహ్వుని జయించెనూ నలరుచు ముహూర్త కాలమునన్
నాలుగు వందల దైత్యులనూ మఱి నలిపివేసి యమపురికంపెన్! 19

అటు బిమ్మట యా రాక్షసాధిపుడు యా రావణుడును గనుగొనియెన్
తెల్లని మేఘము వంటి కాంతియును దీరుగ కైలాసము వోలెన్
ప్రకాశించునది దివ్యమైనదియు బరగ గోపురము గలదియునూ
వరుణాలయమును, గాంచె రావణుడు పన్నెలు చిన్నెలు జిందెడిదీ! 20

అచట నుండినా కామధేనువును యలరి క్షీరమును స్రవించుచున్
నున్న దానినీ యా రావణుడును బన్నుగ గాంచెను యాసక్తిన్
ఆ ధేనువు వర్షించినట్టి యా యలరు దుగ్ధముల మూలమునన్
క్షీరసముద్రము జన్మించినదీ క్షితియందున ప్రవహించుచునూ 21

అటు బిమ్మట యా రావణు డచ్చట యలర రుద్రునీ వాహనమున్
మహా వృషభమునకును దల్లియునగు మహా కామధేనువును గనెన్!
కామ ధేనువున నుండి జనించిన కమనీయంబగు సంద్రమునన్
చల్లని కిరణంబులు గలవాడును నల్లని రాత్రిని కల్పించీ
హృదికానందము గలిగించెడి యా సదయు చంద్రుడును జన్మించెన్
అట్టి క్షీర సంద్రంబు నుండియే యాశ్రయించుకొని మహర్షులున్
నురుగునుభుజించు చుందు రెల్లపుడు నురుతరమగు ధ్యానముతోడన్
పితృదేవతలు భుజించునట్టిది పేరిమి స్వధయును జనియించెన్! 22, 23

'సురభీ' యను నామమున లోకమున సుప్రసిద్ధమగు పేరుననూ
ఆశ్చర్యము  గలిగించునట్టిదియు అందమైన రూపము గలదీ
అట్టి కామధేనువునకు నాతడు నలరి ప్రదక్షిణమును జేసీ
అనేక విధముల సైన్యంబులనూ నట రక్షించుచు నుండగనూ
ఆ భవనములో బ్రవేశించెనూ యా రావణుడును శీఘ్రముగన్! 24

ఆ భవనంబున బ్రవేశించియును నలరుచు దశగ్రీవుడు గాంచెన్
వందలకొలదియు జలధారలచే కందువ వ్యాప్తంబైనదియున్
నిత్యానందముతో గూడినదీ నిరుపమానమైనదియు మఱిన్!
అట్టి మహోన్నత గృహోత్తమంబును నా రావణుడును గనుగొనియెన్! 25

అటుబిమ్మట యా రావణుండునూ యలరి యుద్ధరంగమునందున్
బహు సేనాధ్యక్షులను జంపి మఱి వారి ప్రహారములను దినియున్
అటు పిమ్మటనూ యా రావణుడును అల యోధులతో నిటులయెన్!
శీఘ్రముగా జని మీ రాజునును స్థిరముగ తెలుపుడు నీ విధమున్ 26

రణమును గోరుచు నున్నవాడుగా రావణుండు మఱి యిట కొచ్చెన్
ఆతని తోడను రణము సలుపుతూ యలరుచు విక్రమమును జూపీ
రావణుడంటే భయము లేదనుచు రమ్యముగా బలుకుము లేదా
అంజలి ఘటించి జయింపబడినా ననుచు నొప్పకొనుమా యింకన్! 27

ఈ యంతరమున మహాత్ముడైనా యింపుగ వరుణుని పుత్రులునూ
పౌత్రులునూ మఱి బలాధ్యక్షులును బన్నుగ వారల బలవీరుల్
గో పుష్కరులును బహు క్రోధమును గూరిమి యాయుధముల తోడన్
బయలుదేరి వచ్చిరి వేగముగా బైటకు బహువిధ గర్జనలన్! 28

అటు బిమ్మట సలిలేంద్ర పుత్రులకు చటుల ధీమతుడు రావణుకున్
భయంకరంబగు యద్ధము జరగెను బలువిధ యాయుధముల తోడన్
రోమాంచమునూ గలుగజేసెడీ రూక్షమైన యుద్ధము జరిగెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 29

బహు పరాక్రమము విక్రయంబునూ బన్నుగ సద్గుణములు గలుగూ
అలవరుణుని పుత్రులను పౌత్రులను నలరు సైన్యమును సహచరులన్
వెంట బెట్టుకొని వచ్చిరి వారల అంటిబెట్టకొని వధములనూ
భాస్కర వర్చస్సును గలవియునూ భవ్య స్వేచ్ఛగా బోవునవీ
అట్టి రథంబు గూర్చుకొనియునూ యిట్టె బయలు దేరిరి వారున్! 30

అటుపిమ్మట యా రాక్షసుడైనా పటు విక్రముడగు రావణునీ
మంత్రులైన యా మారీచాదులు మానుగ యాతని సహచరులున్
వరుణునిసైన్యము నంతయుగూడను జిఱు నగవులతో జిందుచునూ
క్షణ కాలములో జెదరగొట్టిరీ క్షీణింపగ జేసిరి వారున్! 31

ఆ సమయంబున వరుణ కుమారులు నా రణరంగమునందుననూ
తమ బలములను సమీక్షించుచును తమ స్థితి బరిశీలించుచునూ!

తామును శరజాలంబుల జేతను రగ బీడింపగబడువారై
యుద్ధము జేయుట నుండి మఱలిరీ తద్ధితముగ యోటమి నందీ!

నేలమీద గల వరుణ పుత్రులను నిశ్చల పుష్పకమందున్నా
ఆ రాక్షసుడగు రావణు జూచిరి యలవరుణుని సుపుత్రులునూ
శీఘ్రముగా బయనించు రథములను స్థిరముగ నట గూర్చుండి మఱిన్
ఆకాశమునకు బయలుదేరిరీ యంతరిక్షమున పోరాడన్! 33

అటుబిమ్మట యా రావణుండునూ యల వరుణ కుమారులు గూడన్
సమాన స్థానములను స్థిరగతులై సాహసమున రణమును సలిపీ
దేవదానవుల వలె మఱి వారును దిగ్గజముల వలె భీకరమున్
యుద్ధమును జరిగెను వారలకును మఱి శుద్ధ వైరభావము తోడన్! 34

అటు బిమ్మట నా వరుణ కుమారులు చటులమైన బాణంబులచే
ఆ రావణునీ యుద్ధమునందున నలరి విముఖునిగ నటు జేసీ
సంతోషించుచు వరుణ పుత్రులును నంతరంగమున సుప్రీతిన్
అనేక విధముల శబ్దంబులచే నఱచిరి వారలు విజయధ్వనుల్! 35

అట్టి సమయమున మహా వీరుడును నట్టి మహోదరుడును వేగన్
తమ రాజునకును పరాభవంబును దగ జేయుటయును గాంచి మఱిన్
కోపించుచు మఱి మృత్యుభయంబును కూరిమి విడుచుచు వేగముగన్
యుద్ధంబును మఱి జేయగోరుచును యుద్ధతి తన గద నెత్తి మఱిన్! 36

సమరమునందున వాయువునకు వలె సహజముగా దిరిగెడి వారున్
వరణ పుత్రులను మహోదరుండను వనరగ గదచే గొట్టగనూ
భూతలంబునను నిదురింపగనూ బోయిరి వారలు గాయములన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 37

మహోదరుండును వరుణ పుత్రులను మానుగ యోధుల హతమార్చి
రథాశ్వములనూ జంపి వేగముగ రయమున సారథులను మాపీ
నేలమీదనూ నిలిచినట్టి మఱి నిర్మల వరుణ కుమారులనూ
గాంచి శీఘ్రముగ మహానాదమును గడు తీవ్రము గావించి మఱిన్! 38

మహోదరునిచే గొట్టబడిన యా మానుగ యశ్వంబుల తోడన్
శ్రేష్ఠులైన సారథులతోడుతను, శ్రేష్ఠులైన యా సహచరులున్
వారలతోడను గూడినట్టి యా వరుణ పుత్రులా రథంబులున్
ధరాతలంబున కూలిపోయినవి దగ పోరాటము లేకుండన్! 39

మహాత్ముడగు నా వరుణ దేవునీ మానుగ శూరులు నగు పుత్రుల్
పరాజయంబును నందుచు వారలు మానుగ పరాఙ్ముఖులు నగుచున్
రథములు విడిచీ యాకాశంబున రయమున నిలిచీ భ్రాంతులునై
స్వప్రభావమును గలుగుట చేతను సహజ వ్యథను జేందగలేదూ! 40

వరుణ పుత్రులును నెమ్మదిగా మఱి వనరగ తమ తమ ధనస్సులున్
సిద్ధమైన వానినిగా జేసీ స్థిరముగ కరముల గ్రహియించీ
కోపించిన వారై యందఱును క్రుద్ధులగుచు మఱి శత్రులపై
ఆ దశగ్రీవుని చుట్టుముట్టిరీ యల సంగ్రామమునందుననూ! 41

కోపించిన వారై మేఘములను కూర్మి పర్వతమునకు వోలెన్
ధనుసుల నుండీ బయలు వెడలినా దగ వజ్రాయుధ సమానముల్
సుదారుణములగు సాయకములచే శూరుడునగు నా రావణునీ
వేధించిరి బాధించిరి రణమున వ్యథ పొందించిరి తీవ్రముగన్! 42

అటుబిమ్మట యాదశగ్రీవుండును చటుల కోపమున చెలరేగీ
కాలాగ్నికివలె విజృంభించెను గరినత జూపుచు రణమందున్
వరుణ పుత్రులను బాధించుచునూ వారల మర్మ స్థానములన్
భయంకరంబగు శరవర్షంబును బన్నుగ గురిపించెను నపుడున్! 43

దుర్ధర్షుండగు రావణుండునూ దోర్బలమును యని జూపుచునూ
విష్టితముగ యట నిలిచిన వాడై విచిత్రములునగు సాయుధముల్
ముసలంబులునూ వందల కొలదియు మొరటు భల్ల బాణంబులునూ!
పట్టిసములునూ, శక్తులునూ మఱి బరగ శతఘ్నులను గూడన్
వరుణుని పుత్రులపై రావణుడును వరుసగ ప్రయోగమును జేసెన్! 44, 45

ఆ విధముగనూ చెదర గొట్టబడి యా వరుణుని పుత్రులును మఱిన్
పాదచారులై యా వీరులునూ బన్నుగ రావణుపై బడిరీ
అటు బిమ్మట యా మహారావణుని యాయుధ వర్షమునందుననూ
నడుచుచు రణమును జేయుచున్న యా నయముగ సువరుణ కుమారులున్
మహా పంకమున జిక్కుకున్న యా మానుగ యఱువది వర్షములున్
వయసు గలిగినా కుజరమును వలె వారును జిక్కిరి రణముననూ! 46

మహాబలుండగు దశగ్రీవుండును మానుగ క్షీణించుచునున్నా
విహ్వాలులైనా వరుణ పుత్రులును విలవిల నందుట గాంచుచునూ!
ప్రావృట్కాలపు మేఘంబును వలె బన్నుగ తన కంఠము నెత్తీ
హర్షము జేతను ధ్వనులను జేసెను నల శత్రువులును భయమందన్! 47

అటు బిమ్మట య దశగ్రీవుండును నటుల మహాధ్వనులను జేసీ
నానా ప్రహరణములను గూడికొని నయముగ హస్తములను జాపీ
నల్లని మబ్బులు గగనము నుండీ నయముగ తొలి వర్షము రీతిన్
వరుణ కుమారుల గొట్టె నాతడును వరుసను బహు నాయుధములతో! 48

అటు బిమ్మట యా వరుణ పుత్రులును నని సేయగ విముఖులు నగుచున్
ధరణీతలమున బడిరి యందఱును దగ యని బోరాడగ లేకన్
వసుధాస్థలమున బడిన వారలను వారి మనుష్యులు వేగముగన్
సంగ్రామ స్థలమందు నుండి మఱి సరి గొనిపోయిరి గృహములకున్! 49

అటుబిమ్మట యా దశాననుండును నలరి గర్వమున జెలరేగీ
వరుణుని మంత్రులతోని బలికెనూ వనర పౌరుషముతోని మఱిన్
'మీ ప్రభువునకును వార్త దెలపి మఱి మేదిని యుద్ధము జేయుటకున్
రమ్మని దెలుపుడు!' ననుచు బలుకగా రయమున ప్రహాసుడను మంత్రీ!
ఆ రావణుతో నిటులను బలికెను, నయముగ వినయ విధేయతలన్! 50

ఎవరిని నీవును సంగ్రామమునకు నింపుగ నాహ్వానించుచునూ
పిలుచుచుంటివో నా మహాప్రభువు జలేశ్వరుండగు వరుణుడునూ!

గాంధర్వంబును వినుట కొఱకునై కమనీయంబగు వేడుకతో
బ్రహ్మలోకమును జనినాడుగదా! బాహుబలా! చల మెందులకూ? 51

మహావీరుడా! మహా రాక్షసుడ! మానుగ విను! నా వచనములన్
రాజు లేనపుడు రణమును సేయుట రమ్యావర్తనము కాదుగదా
వ్యర్థ ప్రయత్నంబగును కదా మఱి! శుద్ధ ప్రయోజన హీనంబున్
ఇచ్చట నుండిన వరుణ పుత్రులును యోటమి జెందిరి నీ చేతన్! 52

రాక్షసేంద్రుడును మంత్రి బలికినా రయమున విషయము దెలిసికొనీ
తనకు విజయమును గలిగిన దనుచును రయమున ప్రకటన జాటించీ
సంతోషంబున ధ్వనులు జేయుచును సహచరులును మంత్రుల తోడన్
వరుణ లోకమును నిష్క్రమించెనూ వనరగ జయకేతన మెత్తీ! 53

మహాబలుండగు దశగ్రీవుండును మానుగ తన మంత్రులతోడన్
ఏ మార్గంబున యాగమించెనో యా మార్గంబున మఱలుచునూ
పుష్పక మందున యాసీనుండై పులకరించుచును విజయములన్
అభిముఖుండునై లంకాపురికిని యలరి బోయె జయగీతములన్! 54

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఇరువది మూడవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ప్రక్షిప్తమైన యైదు సర్గలు

(వ్యాఖ్యాతలు నీ యైదు సర్గలకు వ్యాఖ్యలు వ్రాయలేదు)

## ఇది ప్రక్షిప్తమైన ప్రథమ సర్గము

(రావణుడు బలి చక్రవర్తి నివసించు అశ్మ నగరమునకు బోయి
అతనిని గాంచి మాటలాడుట)

అటుబిమ్మట యా యుద్ధ దుర్మదులు చటుల రాక్షసులు శీఘ్రమగన్!
ఆశ్మ నగరమును బ్రవేసించిరీ యల రాక్షసులందఱును మఱిన్
ప్రకాశించు నొక సుందర భవనము బరగ రావణుడు గనుగొనియెన్! 1, 2, 3

వై డూర్య తోరణాకీర్ణమైనదియు ముక్తాజాల విభూషితమున్
బంగరు స్తంభములను నిండినదీ ప్రవేశింప శక్యముగానీ
అన్ని వైపులను నరుగులతోడను నలరుచుండు బహు సుందరతన్
వజ్రస్ఫటిక సోపానము గలదియు వనరగ చిఱుగంటల గూడీ
బహు యాసనములు గలదియు మఱియును భవ్య సుందరం బైనదియున్
ఆ మహేంద్రునీ భవనము తోడను అలరెడి సమానమైనదియున్
ఆ రావణుడును నచట గాంచెనూ యందమైన యా భవనంబున్! 2,3

ప్రతాప వంతుండైన రావణుడు భవ్య సుందరం బైనదియున్
సురుచిర గృహ శ్రేష్ఠంబును గాంచీ శూరుడైన యా ప్రహస్తుతో
ఈ విధముగనూ పలికె రావణుడు నింపుగ యాశ్చర్యము మీరన్
మేఱు మందరా సన్నిభమైనా మిగుల సుందరం బైసదియున్
ఆ భనము మఱి యెవ్వరిదో యిల నే మహాత్మునకు జెందినదో
ప్రహస్తుడా! మఱి వేగముగా జని బన్నుగ యీ భవనము గూర్చి
తెలిసికొనుము వే యామూలాగ్రము దీరుగ యెవ్వరిదైనదియున్
అని యాదేశించెను రావణుడును యా ప్రహస్తునకు శీఘ్రముగన్! 4

ఇటుల పలుకబడి యా ప్రహస్తుడును బటుతరముగ యుత్తమమైనా
గృహమందున దా ప్రవేశించెనూ కూరిమి వెదుకగ లోపలనూ!
ఆ ప్రదేశమంతయు శూన్యంబై అలరుట గాంచె ప్రహస్తుండున్
మఱియొక వాకిలి లోనికి బోయెను మాలిమి యచటను కనుగొనగా! 5

ఏడు వాకిళుల మధ్య భాగమును వేడుక ప్రహస్తుడును గాంచెన్
అంతట శూన్యముగానే గాంచెను నాఱు వాకిళుల యందుననూ
ఏడవ వాకిలి ప్రవేశింపగా వేడుక నటగాంచెను జ్వాలన్
అటుబిమ్మట యొక పురుషుడు గనబడె యాతడు బిగ్గఱగా నవ్వెన్! 6

ఆ పురుషుని హాసమును వినగనే యా ప్రహస్తునకు వే వెంటన్
రోమాంచితమును గలిగెను నతనికి రూఢిగ యాశ్చర్యము గలిగెన్
ఆ ప్రదేశమున జ్వాలల మధ్యను నలరు హేమ మాలయు గలుగూ!
పురుషుడు గనబడె 'నా ప్రహస్తునకు పూర్ణ భయంకర రూపమునన్
సూర్యునివలెనూ గనబడుచుండెను జూడ శక్యమును గాకుండన్
సాక్షాత్ యమునకు వోలె నుండెనూ సహజ భయంకర రూపమునన్ 7,8

ఆ నిశాచరుడు బ్రహస్తుండునూ ఆ వృత్తాంతము గనుగొనుచున్
త్వరమాణుండై నాతడు వేగము దగ వచ్చెను రావణు కడకున్
తాను జూచినది కన్నది విన్నది తగ యా భవనము నందుననూ!
దశగ్రీవునకును తెలియజేసెనూ తగ పూసలు గ్రుచ్చిన యటులన్! 9

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
భిన్నాంజనచయ సమానుండునూ భీకర రూపముగల వాడున్!
దశగ్రీవుండును విమానమును దిగి దగ యా భవనము నందుననూ!
ప్రవేశింపగా బ్రయత్నించెనూ బరగ ప్రహస్తుని పలుకు వినీ! 10

చంద్రుడు శిరమున గలవాడును మఱి సాంద్ర శరీరము గలవాడున్
జ్వాలా జిహ్వుడు భయానకుండును జ్వలిత నేత్రములు గలవాడున్
చారు దశనములు గలవాడును మఱి సహజ దొండపండును వోలెన్!

ఎఱ్ఱని పెదవులు గలవాడును మఱి మఱ్ఱిపండువలె కాంతులునూ
చారు దర్శనంబును గలవాడును చలిత వీక్షణము గలవాడున్
భీషణమగు నాశిక గలవాడును భీతిలేనివాడును మఱియున్
కంబుగ్రీవము గలవాడును మఱి కాంతి కిరణములు గలవాడున్
పెద్ద దౌడలును గలవాడును మఱి పేరిమి యాపురుషుండు మఱిన్
ద్వారంబును మఱి మూసి వేయుచును దగ నిలిచెను రావణు నెదుటన్! 11,12

రూఢ స్మశ్రువులు గలవాడును మఱి నిగూడాస్థికలు గలవాడున్
పెద్దపెద్ద కోరలు గల వాడును పేర్మిని రోమాంచమును మఱిన్
గలిగించెడివాడయిన నాతడును కఠిన యినుప ముసలంబు మఱిన్
కరమున ధరించి ద్వారమునందున గగుర్పాటు కలిగించుచునూ!
నిలిచినాడుగద కాలయమునివలె నిష్ఠురమగు నాకారమునన్! 13

భీతి గొలుపు నాతనిని జూడగను భీమ బలుడు నారావణుడున్
ఒడలంతయునూ గగుర్పొడిచెనూ వొద్దిక యింతయు లేకుండన్
హృదయమంతయును కంపము నొందెను మదిని భీతియను దొలుకాడెన్
ఎచటి నుండియో యద్ధైర్యంబునూ యలరారుచు చుట్టును ముట్టెన్! 14

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
ప్రతికూలముగా నున్న శకునముల బన్నుగ యా దశగ్రీవుడునూ
ఆలోచించుచు నుండెను మదిలో నటుల భయబడుచు నుండగనూ
ముసలము దాలిచి నున్న పురుషుడే మొరటుగ యీ విధమున బలికెన్! 15

ఓ రాక్షసుడా! మనసున నీవును నొనరగ యే యోచన తోడన్
నున్న వాడవో తెలియజేయుమా! సన్నగ నిస్పందేహము తోడన్
వీరుడవగు ఓ రాక్షసుడా! వినుl విమలముగను రణరంగమునన్
యుద్ధ రూపమగు నాతిథ్యమునూ పద్ధతిగా నీ కిచ్చెదనూ! 16

ఆ పురుషుండును నటుల బలికి మఱి యల రావణునితో నిటులనియెన్
బలితో కూడను యుద్ధము జేసీ బాహుబలంబును జూపెదవా?
లేదా మఱియొక విధమున మనసున లీలగనుంటివ యోజనతో?
ఏ విషయంబును విశదము జేయుము లీలగ నాకును దెలియునటుల్ 17

ఆ పురుషుని పలుకులు వినగానే నల రావణునకు వేవెంటన్
మఱల యూర్ధ్వ లోకంబుల గలిగీ మానుగ యలసట జెందుచునూ
అటుబిమ్మట యా దశగ్రీవుండును నటు ధైర్యంబును జెందుచునూ
అల పురుషునితో నిటులను బలికెను ననుమానము లేకుండగనూ! 18

మాటలాడు వారల లోపలనూ మధుర భావములు గలవాడా!
ఈ భవనంబును నున్న వారెవరు నింపుగ దెలుపుము నిక ముందున్
యాతనితో నే యుద్ధము జేసెద నలరుచు రణరంగమునందున్
లేదా మఱి నీ వెటుల దలచెదో లీలగ జేసెద నావిధమున్! 19

ఆ పురుషుండును మఱల బలికెనూ యల దశగ్రీవుని తోడుతనూ
ఈ గృహమందున దానవ ప్రభువును నింపుగ నివసించుచునుండెన్
పరమోదారుడు, శూరుడు, వీరుడు పరమ సున్నితుడు కార్యగతిన్
సత్య పరాక్రమమును గలవాడును సత్య వ్రతుండును లోకమునన్! 20

ఈతడు వీరుడు సుగుణోపేతుడు నింపుగ హస్తమునందుననూ
పాశంబును ధరియించు వాడునూ బన్నుగ యమరాజును వోలెన్!
బాలార్కుని వలె తేజస్సులు గల బల్లిదుండు యుద్ధమునందున్
సంగ్రామములో వెనుకకు దిరుగడు సాటిలేని విక్రముడతడున్! 21

ఈతడు కోపము గలవాడును మఱి నింపుగ దుర్జయు డీతుండున్
బలవంతుడు గుణసాగరు డీతడు భగీరథుని యంతటి వాడున్
గుణసాగరుడును, ప్రియంవదుండును గూఢముగా దానము జేయున్
బ్రాహ్మణులన్నను గురువులన్ననూ బరగ గౌరవము గలవాడున్! 22

కాలాకాంక్షియ మహా సత్త్వుడును కమ్మని సత్యము గలవాడున్
సౌమ్యదర్శనుడు సత్యవాక్కునూ, సర్వ సమర్థుడు కార్యములన్
సత్య గుణోపేతుండును, శూరుడు, స్వాధ్యాయన తత్పరుడు మఱిన్
ఈతడు వెళ్లచునున్నాడును మఱి యీతడు వీచుచునున్నాడన్
ఈతడు జ్వలించుచున్నాడును మఱి యితడు దపించుచున్నాడు! 23

అనగా వాయ్వగ్న్యాదుల శక్తియు యితనికున్నవని దెలియ వలెన్
పరమ దేవతలకు గానీ మఱి పరమభూత సంఘములకునూ
పన్నగములతో, పక్షులతోడను, బరగ భయంబును నెఱుగడుగా
అట్టి వానితో యుద్ధము సేయగ యభిలషించుచున్నావు మఱిన్
పరాభవంబును జెందబోకుమా! బరగ సాహసముతో నీవున్! 24

మహాసత్త్వ! ఓ రాక్షసేశ్వరా! మానుగ బలితో యుద్ధంబున్
జేయుట నీకును నిష్టమైనచో జేయుము లోపలికిని బొమ్మా!
యుద్ధము జేయుము! నాలసింపకము యుద్ధతి జూపుము రణమందున్
భవనమునందున నున్నవాడు బలి బన్నుగ యతనిని కనుగొనుమా! 25

ఆ మాటలు విని దశగ్రీవుండును నల బలియున్న ప్రదేశంబున్
అటు పిమ్మట దహనోపమానుడును నలభానునిలె జూచుటకున్
శక్యంబును మఱి గాని వాడునూ సహజ స్థితి నుండిన వానిన్
ఆ బలియును రావణునిగాంచి మఱి హసించె బిగ్గఱగా నపుడున్ 26, 27

అటు పిమ్మట బలి యల రావణునీ యటు జూచియు మఱి వేవేంటన్
ఆ రావణుని పైకి యెత్తుకొని తన దగ్గఱ మఱి తన యొడిలో
ముద్దు ముచ్చటలు దీర్చు వాని వలె మురిపెముగా నాతని గాంచీ
నిటుల బలికె దశగ్రీవునితోడను చటుల చతుర సంభాషణలన్! 28

మహాబాహు విను! ఓ దశ గ్రీవా! మానుగ నేనును నీ కిపుడున్
ఏ కోరికనూ దీర్పగవలయును? యేమి కావలెను నీకిపుడున్?
రాక్షసరాజా! రయమున దెలుపుము! రహి నీవును నిటువచ్చుటకున్
కారణమేమో దెలుపుము శీఘ్రము కమ్మని కోరిక దీర్చెదనూ! 29

బలి పలికిన యా భాషణలను విని బన్నుగ బలికెను రావణుడున్
పూర్వకాలమున నిన్ను విష్ణువును బొలుపుగ ధాత్రిని బంధించెన్
అని విన్నాడను నా బంధనముల యటు విడిపింపగలవాడన్
సందేహము లే దెంత మాత్రమును సందియంబు లే దింతయునూ! 30

బలి య్యా మాటలు విని నవ్వుచునూ బల్లిదుడగు నారావణుతో
గతమునంతయును మనసున దలచుచు కమ్మని పలుకుల నిటులనియెన్

దశగ్రీవా! విను నీ వడిగిన యా దగు ప్రశ్నకు జెప్పెద వినుమా!
అల్లనాడు జరిగిన వృత్తాంతము కల్లకాదు నిజమును వినుమా! 31

శ్యామ వర్ణమును గల యా పురుషుడు చరించు నిత్యము ద్వారమునన్
మహాబలీయుడు నీతడు మిక్కిలి మానుగ భూతలమందుననూ
దానవేంద్రులను ధరణిని గల యా దగ బలవత్తరులును మఱియున్
నీదు పూర్వులును వీరి పూర్వులను నిక్కముగా రణమందుననూ
పరాజయంబును గలుగజేసి మఱి బన్నుగ వశమును జేసికొనెన్ 32, 33

అట్టి నేను మఱి యాతని జేతను నిటులనుంటి బంధింపబడీ
దైవగతిని మార్చుటకును మనమును దగ వశ్యులమును కాదుగదా!
లోకమునందున యే పురుషుండును లోలత యే మానవుడు మఱిన్
ఈ దైవమునూ జయింపగలడూ? నిల వంచింపగ గలుగు మఱిన్! 34

ద్వారమునందున నిలిచిన పురుషుడు దగ లోకము లన్నింటి మఱిన్
సంహరించువాడును విను రావణ! సర్వ కార్యములు జేయ మఱిన్
సర్వ కర్మములు సకల జీవులను సహజముగా జేయించు మఱిన్
ఈతడు లోకములను బోషించును నీతడు ప్రభు వందఱికి నిలన్! 35

ఈతని మహత్త్వములను గూర్చి మఱి నింపుగ నే నెఱుగను మఱియున్
నీవును నెఱుగవు! నితని ప్రభావము నిఖిలమందు నెఱుగరు నెవరున్!
జరిగిపోయినా, జరుగుచున్నవియు, జరుగబోవు వానికి ప్రభువున్
ఈతడు కలి పురుషుండు మఱియునూ యీతడు కాలంబును గూడన్
సర్వభూత సంహారకు డీతడు సర్వభూత పోషకు డితడున్! 36

సమస్తమైనా లోకత్రయమును సంహరించువాడును నితడున్
అంతియకాదు సుమా! రావణ విను! నఖిలము సృజించువాడు మఱిన్
స్థావరములు మఱి జంగమంబులును సకల ప్రాణులను గూడ మఱిన్
సంహరించుచుండును యీ జగతిని సకలము బోషించుచు నుండున్! 37

ఆది లేని మఱి యంతములేనీ యగమ్య రూపుడు నీశ్వరుడున్
సమస్తంబునూ సంహరించి మఱి సహజముగా మఱలను మఱలన్

సృజించుచుండును లోకమునందున సృజనకర్తయును నితడు సుమా!
యాగ స్వరూపుడు, దాన స్వరూపుడు, హోమ స్వరూపుం డితడు సుమా! 38

సర్వము నితడే! యితడే రావణ! సర్వ లోకముల కీశుండున్
పోషించెడి వాడును రక్షించెడి పురుషోత్తముడును నీతండే!
ఈవిధమైనా మహాభూతమును నీ భువనత్రయ మందుననూ
లేదు సుమా! మఱి లేదు సుమా! విను! లీలగ జూడుము దశగ్రీవా! 39

ఓ పౌలస్త్యా! నీవును నేనును వనరగ యన్యులు గూడ మఱిన్
పూర్వమందు మఱి యెవ్వరుగలరో పొలుపుగ వారలు గూడ మఱిన్
మహాత్ముడగు నీ పావన మూర్తియె మానుగ త్రాడును గట్టి మెడన్
పశువును నిల నడిపించినట్లుగా బన్నుగ నడిపించుచు నుండున్! 40

వృత్రుడు, ధనువు, శుకుడు, శంభుడును, నికుంభుండు, కుంభుడు మఱియున్
కాలనేమి ప్రహ్లాద కుమారుడు! కూటుడు, విరోచనుని సుతుడున్
మృదువు మఱియు యమలార్జునులును మఱి కంసుడు, కైటభుడును, మధువున్
వీరందఱునూ తపించుచుందురు ప్రకాశించుచుందురు మిగులన్
వీచుచుందురూ వ్యోమమునందున వర్షించుచునుందురు యెపుడున్! 42

వారందఱునూ వందల కొలదియ వనరగ జేసిరి యజ్ఞములన్
మహత్తరంబగు తపములు గూడను మానుగ జేసిరి ధ్యానమునన్
వారందఱునూ సుమహాత్ములు సుమ! వారును యోగాభ్యాసకులున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 43

అందఱు వారును యైశ్వర్యంబులు నంది పొందిరీ బహుళముగన్
మహత్తరంబగు లోకంబులనూ మానుగ యనుభవమును బొందీ
దానంబులు మఱి యాగంబులునూ దగ జేసిరి దీక్షను వారున్
అధ్యయనంబును జేసినారు మఱి యలరుచు బాలించిరి ప్రజలన్! 44

వారలందఱును శూరులు, వీరులు వనరగ యుత్తమ వంశములన్
జన్మము గలిగిన వారలందఱును జాగృతి గలిగిన వారు మఱిన్

సకల శాస్త్రముల సారమ దెలిసిన సాధుపురుషులును సజ్జనులున్
సకల విద్యలను దెలిసిన వారును సంగ్రామంబుల యందుననూ!
వెనుకకు దిరుగని వారలు, ధీరులు, వీర పురుషులును వారు సుమా! 45

తమ పక్షంబుల వారినందఱిని దగ రక్షించెడి వారలునూ
శత్రువులను శిక్షించెడి వారును, శాత్రవ సంహారకులు మఱిన్
సకల శాస్త్రముల సారము దెలిసిన సాధు పురుషులును సజ్జనులున్
దేవతలుండెడి లోకములందును దీరుగ సమమును లేదు మఱిన్! 46

మహాత్ములైనా వారందఱునూ మానుగ సురల సురాజ్యములన్
జయించి వారల రాజ్యంబుల మఱి జాగృతి బరిపాలించి రటన్
యుద్ధములందున వేలకొలదియును యుద్ధతులను నణగార్చి మఱిన్
అలరి దేవతా గణములన్నిటిని యలరి జయించిరి ధీరతనూ! 47

దేవతలకు నప్రియమును జేయగ దీరుగ యాసక్తియు గలిగీ
తమ పక్షంబుల పరిపాలించెడి తగ సామర్థ్యము గల వారున్
ప్రమత్తులును మఱి భోగాసక్తులు బాల సూర్యునికి సమానులున్
తేజస్సులునూ గలిగిన వారును దీరుగ యోజస్సులు గలిగీ! 48

సర్వ సమర్థుడు సర్వ వ్యాపకుడు సర్వేశ్వరుడును నైనట్టీ
విష్ణుదేవుడును యా దేవతలను గష్ట పెట్టువారికి వేగన్
ఉపాయ పూర్వకముగ మఱి వారిని యురుతర యత్నము తోడుతనూ!
ఎట్లు నశింపగ జేయవలయునో గట్టిగ తెలిసిన వాడు మఱిన్! 49

దేనిచేత వీరల నాశనమును దీరుగ నగునో యా విధమున్
అట్టి సురూపము నంది బుట్టునూ గట్టిగ వారిని బరిమార్చున్
అవతారంబుల నెత్తుచుండునూ యలరి వారలను వధియింపన్
మఱల తనదు నసలైన రూపమున యటులె యుండిపోవును నచటన్! 50

మహాత్ముడైనా యా దేవునిచే మానుగ బలవంతులు మఱియున్
కామరూపములు గల వారును మఱి కఠినాత్ములు నగు వారలునూ!

అయిన దానవేంద్రాదుల నందఱ యణచి వేసెనూ తన మహిమన్
భూమాతకు భారంబగు వారల బూది జేసె వెనుకాడకనూ! 51

యుద్ధమునందున దురాధర్షులును యుద్ధతులగు వారల మఱియున్
ప్రసిద్ధులైనా పరమ బలాఢ్యుల భంగ బఱచి తా కొనిపోవున్!
దైవ బలమునకు లొంగిపోవునటు దగ యుపాయములు బన్నుచునూ
విష్ణువు తనతో గొనిపోవును గద! కష్టము నష్టము బడుచు మఱిన్! 52

దానవేశ్వరుండగు బలి ప్రభువును దగ యీ విధమున బలుకుచునూ
అటు బిమ్మట రావణు రాక్షసుతో నలరుచు నీ విధమున బలికెన్
మహాబలా! ఓ వీరుడ! రావణ! మానుగ జ్వలించు చుండిన యీ
అగ్నివోలె నున్నట్టి చక్రమును నలరిదెమ్ము! నా వద్దకునూ! 53

అటు బిమ్మట నేనును నీకును మఱి యలరు నాదు ముక్తికిని మఱిన్
వలయు కారణము నుపాయంబునూ వనర దెలిపెదను శీఘ్రముగన్
మహాబాహువులు గలవాడా! విను! మానుగ రావణ! జేయుమదీ!
ఆలస్యంబును జేయకుమా యిక నలసత్వంబును జూపకుమా! 54

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
మహాబలముగల లంకేశ్వరుడును మానుగ విని యీ వచనములన్
పక పక నవ్వుచు దివ్యమైన యీ పన్నుగ కుండల మెటగలదో
అట్టి మహాకుండలము దావునకు నిట్టె జనెను యీ రావణుడున్! 55

బలదర్పితుడగు దశగ్రీవుండును బరగ విలాసముతో గూడీ
విలాసంబుతో నా కుండలమును విదితముగ పైకిని లేపన్
యత్నించెను కానీ రావణుడును యత్నము సఫలము గాకుండెన్
కదలుచునూ నటు శక్తిలేక మఱి కడు నిరాశుండుచు నుండెన్! 56

మహాబలముగల యీ రావణుడును మదిలో సిగ్గును బొందుచునూ
మఱల నెత్తుటకు నా కుండలమును మానుగ ప్రయత్నమును జేసెన్
దివ్యమైన యీ కుండలంబునూ దీరుగ నెత్తుచు నుండగనే
భిన్నమూలమగు సాల వృక్షముగ వన్నె దరిగి నేలను బడెనూ!
రక్త ప్రవాహమునందు మునిగెనూ శక్తినుడిగి యణువణువు మఱిన్! 57, 58

ఇంత లోపలను రావణు సచివులు జింత నొందిరీ మదియందున్
దశగ్రీవుని యా స్థితిని జూచి మఱి దగ విమానమున యందుండీ
'అయ్యో!' 'అయ్యో!' యనుచు నఱచిరీ యతి బిగ్గఱగా ధ్వనితోడన్!
జాలిజూపిరీ, దయను బొందిరీ సరగున రాకుండిరి యటకున్! 59

అటుబిమ్మట యా క్షణమునందునను నలరుచు స్పృహతో గూడికొనీ
సిగ్గుతోని తలవంచు కొనుచునూ శీర్షము నెత్తగ లేక మఱిన్!
అట్టి రావణునితో బలికెను బలి యలరుచు ప్రియవచనము తోడన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్ ! 60

రాక్షస శ్రేష్ఠా! రావణ వినుమా! రమ్యముగా నా పలుకులనూ
ఓ వీరుడ! మణి భూషితంబునగు నొనరగ యేకుండలము మఱిన్
ఎత్తబడినదో నీ చేతను మఱి సత్తువ లేకను వదిలితివో
ఆ కుండలమును నా వంశములో నల పూర్వజుల సుకర్ణములన్
ఆభరణముగా నలంకారముగ యలరి యుండెడిది గనుమింకన్! 61

మహాబలా! ఓ రావణ వినుమా! మానుగ నాదు సువాక్యములన్
పూర్వకాలమున యుద్ధము జేసెడి పూర్వ పితా మహుడైనట్టీ
హిరణ్యకశ్యపు కర్ణము నుండీ యింపుగ జారీ బడెనిటనూ!
మఱియొక్కటి పర్వత సామవునను మానుగ బడినది జారుచునూ
కుండలమును మఱి యనుసరించియును మండిత మకుటము గూడ మఱిన్
వేది సమీపంబున బడినది యదె విమల యజ్ఞశాలకు ముందున్! 62, 63

రాక్షస శ్రేష్ఠా! రావణ వినుమా రహి హిరణ్య కశ్యపునకునూ
కాలముగానీ మృత్యువుగానీ కఠినమైన వ్యాధియు లేదూ!
అతనిని హింసించెడివారును నిల నలరుచు వెదికిన దొరుకరుగా
పగలుగాని మఱి రాత్రియుగానీ పన్నుగ సంధ్యా సమయములన్
మరణము లేదూ దానవేశ్వరా! మానుగ మృత్యువు లేదు సుమా!
ఎండింపగ బడు దాని చేతనూ పండి యెండినా వస్తువులన్
ఏ ఆయుధముల చేతగాని మఱి యే వస్త్రంబుల జేత మఱిన్
లేనే లేదా మరణము గూడను లేనే లేదా మృత్యువునూ! 64, 65
రాక్షస శ్రేష్ఠుడ! రావణ వినుమా! రమ్యముగను నా పలుకులనూ

ఆ హిరణ్య కశ్యపుడు సుతునితో నల ప్రహ్లాదునితో మఱియున్
క్రూరమైన వాదమును జేసెనూ గుర్తెఱుగక శ్రీహరి మహిమన్
అందఱికిని మఱి పూజ్యుండైనా యలరు మహాత్ముడు ధీరుండున్
అల ప్రహ్లాదునకును తండ్రికిని యలరు వివాదము నేర్పడగా
నృసింహావతారమును ధరించీ నరులు దేవతలు భయమందన్
ఒక వీరుడు మఱి యుద్భవించెనూ యొనరగ యాతడె విష్ణువునూ! 66, 67

భయంకరుండును ప్రబలుడైన యా బరగ నృసింహుడు స్తంభమునన్
ప్రభవించెను మఱి జూచిన దెల్లను బన్నుగ చెల్లా చెదురుగనూ!
చేసి వైచెనూ! హిరణ్య కశిపుని చేతులతో బైకెత్తి మఱిన్
గోళ్ళతోని మఱి వధించి వేసెను గూరిమి లోకము సంతసిలన్!
ఇదిగో! యే దోషములు నంటనీ, యీశ్వరుండు, పరమేశ్వరుడున్,
వాసుదేవుడే ద్వారపాలకుగ వనర నిలిచి యున్నాడు సుమా! 68, 69

దేవతలకు మఱి యాది దేవుడును దీరుగ విష్ణువు గుఱించియున్
విశదముగా నే దెలుపుచుంటినీ వినుమా! వీరా! దశగ్రీవా!
నాదుపలుకులను గౌరవభావము నయముగ నీ మది యుండినచో
ఆసక్తిని విను నా వచనములను నలరుచు సద్భావము దొలుకన్ 70

వేల వర్షములు నే విష్ణువు మఱి వేల కొలది మఱి యింద్రులనూ
ఆయుతముల కొలదియు దేవతలను నలరుచు వందల కొలదియునూ!
మునులను ఋషులను దనవశంబునను మోదముగా నుంచెనొ మఱియున్
అట్టి విష్ణువే ద్వారమందునను నిట్టె నిలిచి యున్నాడు సుమా! 71

దానవేంద్రుడగు బలి మాటలు విని దగ రావణుడును నిటు బలికెన్!
ప్రేత ప్రభువునగు యమరాజును మఱి ప్రీతిని మృత్యువు గాంచితినీ!
పాశము హస్తమునను గలవాడును బరగజ్వాలలును గలవాడున్
పైకిలేచినా రోమంబులతో భయంకరంబగు దంష్ట్రలునూ!
గలిగిన వానిని విద్యుజ్జిహ్వుని కఠినమైన కర్కశుని మఱిన్!
సర్పంబులు తేళ్లును రోమములుగ గలిగిన వానిని యమరాజున్
అరుణ నేత్రములు గలవాడును మఱి యనుపమ వేగము గలవాడున్
సకల ప్రాణులను భీతి భయంబుల సరసత గలగించెడి వాడున్

ఆదిత్యుని వలె దు(ప్రేక్షుండునూ నల రణముల మఱలని వాడున్
పాపాత్ములకును శిక్షకుండునూ బరగ యట్టి యమరాజు మఱిన్
నా చేతను మఱి సం(గ్రామంబున నయముగ పరాజితుండయ్యెన్! 72, 73, 74, 75

దానవేశ్వరా! ఓ బలిరాజా! దగ యా విష్ణువునకును మఱిన్
ఏ మా(త్రంబును భయమును జెందను నెంత మా(త్రమును భీతియునూ
కాని నే నతని గుర్తింపను సుమ! గల రూపములను గుర్తెఱిగీ
అందుచేత నీ వాతని గూరిచి చందముగా వివరింపదగున్! 76

అంతంబును మఱి లేనివాడునూ యలరు కపిల వర్ణము వాడున్
జయించువాడును నరసింహుండును సహ(స్ర కాంతులు గలవాడున్
యజ్ఞమునందున వసించు వాడును నలరు సుధాముం డతడు సుమా!
పాశహస్తుడును, భయంకరుండును బరగ యాతడే విష్ణువునూ! 77

పం(డెండుగురగు నాదిత్యులతో బరగ సదృశుం డాతడునూ
పురాణ పురుషోత్తము డాతడునూ బొలుపుగ యాదియు లేదు గదా!
నల్లని మేఘముతో సంకాశుడు నయముగ సురలకు (ప్రభువు మఱిన్
సురలందున మఱి (శ్రేష్ఠుండాతడు సురచిరముగ (ప్రకాశుండున్! 78

మహోబాహు! ఓ రావణ వినుమా! మానుగ యాతని చుట్టుతనూ!
జ్వాలామాలలు దిరుగుచు నుండును సహజముగా యోగీశ్వరుడున్!
భక్తజన (ప్రియు డాతడు వినుమా! భరించు చుండును లోకములన్!
సృజనంబును మఱి జేయుచునుండును శ్రీకరముగ లోకములన్నీ! 79

మహాబలుండగు నీ విష్ణువు సుమ! మానుగ కాలముగా నుండీ
సంహరించు చుండును సకలమునూ చ(క్రాయుధమును ధరించునూ!
ఈతడె హరియును నీతడె యజ్ఞము, నీతడె సర్వము వ్యాపకుడున్
యజ్ఞము చేతను దపసుల జేతను, యాగనాథుడును నీతండే! 80

సకల దేవతా స్వరూపుండునూ, సకల భూతముల స్వరూపుడున్
సకల లోకముల స్వరూపుడీతడు సకల జ్ఞానమయ స్వరూపుడున్
అణువణువుననూ యలరి యుండునూ నంతట యుండును లీనంబై
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 81

ఓ రావణ! నా వచనంబుల వినుమ! వనరగ విష్ణువు మహిమలనూ!
సకల రూపములు గలవాడును మఱి సాక్షి జగములకు నంతటికిన్
మహ ద్రూపమును గలవాడును మఱి మానుగ బలదేవుం డితడే!
మహాభుజములును గలుగువా డితడు మానుగ దుష్టుల హరించునూ
లోకములన్నియు జూచుచునుండును లోకేశ్వరుడును నవ్యయుడున్
పూజ్యుం డీతడు పుడమినంతయును బొలుపుగ గప్పును పాపమునన్! 82

మోక్షముగోరెడి మునులందఱునూ ముదమున ధ్యానింతురు నితనిన్
సకల ప్రాణులను నున్న విష్ణువును సరసముగా మది గనుగొన్నన్
పాపములంటవు, దోషములంటవు, బరగ రావు కష్టంబులునూ
స్మరించి, స్తుతించి, పూజించుటచే సకలము నందగ వచ్చు మఱిన్! 83

మహాబలముగల రావణుడంతట మానుగ బలి వచనముల వినీ
క్రోధము జేతను రక్త నయనుడై కూరిమి పెదవులు గదుపుచునూ!
గదాయుధంబును నెత్తి భుజంబున గదుపుచు బోయెను వెలుపలకున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 84

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
కంటికి కనబడు రూపముతోడను కఠిన ముసలమున ధరియించీ
యుండినట్టి యా మహావిష్ణువును చండ రూపుడగు రావణునీ
కనులగాంచి మఱి యీ పాపాత్ముని కఠినముగా జంపను నిపుడున్
అనుచు మదిని యాలోచన జేసీ యల ప్రజాపతికి ప్రియంబునూ
చేయగా దలచి లోకేశ్వరుడును స్థిర యంతర్ధానము నొందెన్! 85

అటుబిమ్మట యా రావణుండునూ చటులముగా గద ధరించియున్
వెలుపలి ద్వార సమీపంబునకును వేగముగా గనుగొనగ మఱిన్!
కనుగొన లేదా పురుషుడు నచటను గానబడగ లేదెవ్వరునూ!
సంతోషముతో దశగ్రీవుండును పంతముతో ధ్వనులును జేసెన్! 87
విజయము దనకే గలిగిన దనుచును విఱ్ఱవీగుచును తన మదిలో
ఏ మార్గంబున బ్రవేశించెనో యా మార్గంబున వెలుపలకున్
వరుణ లోకమున నుండి వెలుపలికి వేగముగా వచ్చెను నతడున్

శ్రీరామ కథాలహరి యందు - ఉత్తరకాండలో

ప్రథమ నిక్షిప్త సర్గము సమాప్తము

## శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఇది ద్వితీయ నిక్షిప్త సర్గము

(రావణుడు సూర్యుని జయించుటకై సూర్యలోకమునకు బోవుట)

అటుబిమ్మట యా లంకేశ్వరుడును నలరి శ్రేష్ఠమును సుందరమున్
మేరు పర్వతము శిఖరమునందున మేలిమి రాత్రిని యట గడిపీ
ఏ లోకమునకు బోవలయునొ మఱి యెవరి జయింపగ వలె ననుచున్
ఆలోచించియు బయలువెడలెనూ యంతము లేనీ యాత్రకునూ
సూర్యాశ్వములకు సమానమైనా సురుచిర యాకాశమునందున్
విహరించుటకును యోగ్యమైన యా విమల పుష్పకము నెక్కి మఱిన్
అనేక రీతుల యెగురునట్లుగా నా విమానమును జేయుచునూ
సూర్యలోకమునకును బోయెను దా సూర్యుని జయింప మది దలచీ! 1,2

అచ్చోటను మఱి దేవదేవుడును నలరెడి మంగళ ప్రథుండునూ!
సమస్త తేజఃస్వరూపుండునూ వరకాంచన కేయూరములన్
రత్నాంబరముల విభూషితుండును రమ్య సూర్యనారాయణునిన్
ఆ దశగ్రీవుడు గాంచె నచ్చటను నంబర వీధిని ఖగపూషున్! 3

సుందరములు నగు కుండలములతో సురుచిర హాసముతోని మఱిన్
ఆ సూర్యుని ముఖపద్మంబప్పుడు నలరు శోభలను గూడికొనీ
బాహుపురులు కంఠాభరణమును బన్నుగ శోభలతో నుండెన్
ఎఱ్ఱని రంగుల పూలమాలలను మఱ్ఱి యూడలును కదలాడన్!
ఆ దశగ్రీవుడు గాంచె నచ్చటను యంబర వీధిని ఖగపూషున్! 4

రక్తచందనము బూయబడిన యా రమ్య శరీరము గల వాడున్
సహస్ర కిరణములను గూడికొనీ సహజముగా మెఱయుచు నుండెన్!
ఆది దేవుడగు సూర్యుండును మఱి యల నుచ్చైశ్రవమును నెక్కెన్!
అట్టి సూర్యదేవుని దశగ్రీవుడు నంబర వీధిని కనుగొనియెన్! 5

రాక్షస శ్రేష్టుండైన రావణుడు నలరిగాంచె నా మరీచునీ
ఆద్యంతంబులు మధ్యంబును మఱి యంతము లేనీ యాదిత్యున్!
లోకంబున కంతయు మఱి సాక్షియు లోలత జగతికి ప్రభువైనా
శ్రేష్ఠుడైన యా సూర్యదేవుని స్థిర కిరణంబులు ప్రసరింపన్
పీడింపగబడి బ్రహస్తుతోడను ప్రీతివాక్యముల నిటులనియెన్! 6

అమాత్యుడా! ఓ బ్రహస్త! బొమ్మా! అల సూర్యుని దాపునకు, మఱిన్!
నా యాజ్ఞను మఱి శాసనంబునూ నయముగ యతనికి వినిపింపూ!
యుద్ధార్థము రావణుడు వచ్చెనూ యుద్ధము జేయుము రణభూమిన్
లేదా యోటమి జెందినా ననుచు లీలగ దెలుపుము నాతనికిన్!
ఏదోయొక పక్షమును జేయుమా వివరింపు మనుము వేగముగన్! 7,8

రాక్షసుండు నగు బ్రహస్తుండునూ రావణు యాజ్ఞను గైకొనుచున్
సూర్యుని దాపుకు బోయెను నాతడు శుభ్రకాంతులను గనుగొనుచున్!
ప్రహస్తుండు మఱి యచ్చట గాంచెను ప్రవిమల పింగళు దండియునూ
సూర్యదేవునీ ద్వారపాలకుల సుదూరముగ నచ్చట గాంచెన్! 9

ప్రహస్తుండు మఱి దండి పింగళుల బరగ ద్వారపాలుర గాంచీ
రావణు నిశ్చయమును గూర్చియును రయమున వారలకును దెలిపీ
భానుని తేజో కిరణంబులు మఱి బరగ దహించుచు నుండగనూ!
ప్రహస్తుడచ్చట నిలబడి యుండెను బన్నుగ మౌనము గూడికొనీ! 10

ద్వారపాలకుడు దండి యంతటను దగ సూర్యుని దాపుకు జేరీ
నమస్కరించీ యతనికి దెలిపెను నయముగ రావణు విషయంబున్!!
బుద్ధిమంతుడును క్షపాపహుండును బొలుపుగ సూర్యుండు మఱిన్
దండినుండి యా వృత్తాంతము విని ఖండితముగ యోజనజేసీ
ద్వారపాలకునితో నిటు బలికెను దగ సూర్యుండును జతురతతో! 11

దండీ వినుమా! ద్వారపాలకా! దగ నీవును వేగము బోయీ!
'జయింపుమా! లేదా యాతనితో వోడిపోయితిని' అని పలికీ

ఆ రాక్షసునీ విషయమందునను నట కొంచెము కాలము బట్టన్!
ఎటుల జేయ నీ కిష్టమగునొ యిక యటుల జేయుమా నిర్ణయమున్! 12

అట్టి దండి మఱి ద్వారపాలకుడు నిట్టె రావణుని దరిజేరీ
సమస్తమగు సూర్యోక్తవచనమును సరసముగా యా రావణుకున్
పూర్తిగ వివరించియును దెలిపెనూ పొలుపుగ దెలిపిన దంతయునూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 13

దండి వచనములు విని రావణుడును దండిగ సంతసమును జెందన్!
తనకే విజయము గలిగినట్లుగా దగ భావించెను హృదయమునన్
దగ జాటించెను దన విజయంబును దగ రవిలోకము నందుననూ!
ధ్వనులు జేయచును వెడలిపోయెనూ దత్తర బాటును లేకుండన్! 14

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
రెండవ నిక్షిపత్త సర్గము సమాప్తము



## శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఇది తృతీయ ప్రక్షిప్త సర్గము

(రావణుడు చంద్రునితో యుద్ధానికి బయలు దేరి వెళ్ళుచూ దారిలో స్వర్గ లోకాలక వెళ్లుచున్న కొందఱు పుణ్యాత్ములను గాంచుట- మాంధాత కనిపించగా యతనితో యుద్ధము జేయుట పులస్త్యగాలవులు వచ్చి వారి యుద్ధమును నిలుపుట)

మహా పరాక్రమ వంతుడైన యా మానుగ రావణుడటు మీదన్
సుందరమును నగు మేఱుపర్వతము సురుచిర శిఖరము నందుననూ
రాత్రియంతయును గడిపెను మఱియును రమ్యముగా నాలోచన జేసీ
సోమలోకమును బోవుట కొఱకై సురుచిరముగ యోచించె మదిన్
బయలుదేరెనూ పుష్పకమందున బన్నుగ మంత్రులతో గూడన్! 1

అట్టి సయమున నొక పురుషుండును నలరు దివ్యమగు మాలలనూ
ధరించి మఱియును యనులేపనములు దగ యొడలంతయు బూసికొనీ
అందమైన యప్సర స్త్రీలును మఱి చందముగా సేవలజేయన్
రథమున బోవుచునుండె నాతడును రమ్యముగా నెటకో మఱియున్! 2

రతులచేత మఱి యలసినవాడై రమ్యాప్సరసల యంకమునన్
శయనించిన యున్నట్టి వానినీ సరసముగా చుంబనములతో
లేపుచుండుటను గాంచె రావణుడు లేపిత మానసుడగుచు మఱిన్
ఈతడెవ్వడా యనుచు మనస్సున నింపుగ కౌతూహల మయ్యెన్! 3

అటు బిమ్మట యొక ఋషియు గనబడెను బటు రాక్షసుడగు రావణుకున్
ఆతని కనుగొని యా రావణుడును నలరిబలికె యీ విధముగనూ
ఓ దేవ ఋషీ! నీకు స్వాగతము నొనరగ ధన్యుడ! నేను మఱిన్
నీవు తగిన సమయమునందుననూ నిలిచితి విచటను ధన్యుడనూ! 4

అప్సర గణముల సేవితుడైనా యలరు స్యందనము నెక్కి మఱిన్
ఈతడెవ్వడో నిర్లజ్జితుడై యింతయు సిగ్గును లేకుండన్

ఇతరులు జాతురు నని మదిలోపల మతిమాలిన వా డితడెవరో
భయస్థానంబును దెలియుటలేదూ భయము లేక మది యింతయునూ! 5

మహర్షియగు నా పర్వతుండునూ మానుగ రావణు బలుకు వినీ
దశగ్రీవునితో నీ విధి బలికెను దగవాత్సల్యము దొలుకాడన్
మహామతీ! వత్సా! ఓ రావణ! మానుగ నావచనము వినుమా!
ఉన్నది యున్నటు నేనుదెలిపెదను సన్నని మాటలు బలుకుమా! 6

వీనిచేత లోకములన్నియునూ విశదముగను నిర్జింపబడెన్
బ్రహ్మదేవుడును సంతోషించెను బన్నుగ యీతని దపములచే
ప్రస్తుత మీతడు మోక్షము కొఱకై బన్నుగ యుత్తమ స్థానంబున్
సుఖకరమైనా స్థానము గొఱకును సూటిగ బోవుచు నుండె సుమా! 7

రాక్షసాధిపా! రావణ వినుమా! రమ్యమైన నా వచనములన్
నీ చేతను నీ తపస్సు జేతను నిర్జించితివో లోకములన్
ఆ విధముగనే సోమము ద్రాగీ యలరి పుణ్య కర్మంబులనూ
జేసినట్టి యా పుణ్యాత్ముండును బోవును సద్గతులకును మతిన్
ఉత్తమ లోకంబులకును బోవను నుర్విని సుఖ భోగము లందున్
సందేహంబును లేదు సుమా మతి సంశయము లేదింతయునూ! 8

ఓ రాక్షస! శార్దూలుడ వినుమా! వనరగ నాదు సువచనములన్
నీవు శూరుడవు! సత్యపరాక్రమ నీతి మంతుడవు నీవు మతిన్
బలవంతులునగు వారలు యీ దృశ బహు ధర్మాత్ముల విషయమునన్
కోపింపరు గద! మనసు నందునను గ్రోధము జూపరు వారలపై! 9

అటు బిమ్మట నొక మహాకాయమును నలరి మహా కాంతియుగలదీ
గీతవాద్యముల ధ్వనులు గలదియును కిన్నెరాప్సరలను గూడీ
జా జ్వల్యముగా ప్రవేశించునది జగతిని లేదనిపించునదీ
అట్టి రథంబును జూచె రావణుడు నిట్టె బోవుటను వ్యోమమునన్! 10

దేవఋషీ! దెలుపుము నాకును మతి దీరుగ విశదముగా నిపుడున్
భ్రాజమానుడై మహాద్యుతులతో బన్నుగ యీతం డెవ్వడొకో!

మనోహరముగా గానము జేయుచు మఱి కిన్నెరల సునాట్యములన్
ఆనందించుచు  బోవు వాడెవరు నా రథంబునను గూర్చుండీ! 11

ముని శ్రేష్ఠుండగు బర్వతుండునూ మోదముగా నా పలుకు వినీ
ఆ దశగ్రీవునితో నిటు బలికెను నలరుచు ధ్యాన సుయోగమునన్
ఈతడు యోధుడు యుద్ధ రంగమున యింపుగ యని జేసెడివాడున్!
సంగ్రామంబుల వెనుకకు దిరుగని సాహసుండు బలవీరుండున్! 12

ఈతడు యుద్ధము జేయుచుండగా నీతని దేహము దెబ్బలచే
జర్జరీకృతము జేయబడినదీ జాగృతి చైతన్యంబుల చేతన్!
యుద్ధము నందున జయించు వాడును సద్ధర్మ్ముండును శూరుడునూ
కృతకృత్యుండగు నితడు స్వామికై గతించె త్యజించి జీవితమున్! 13

సమరమునందున చాలమందినీ జంపినాడు గద శత్రువులన్
అనిలో నీతడు శత్రులజేతను హతమైపోయెను ధాత్రిబడెన్
దేవేంద్రుని యాతిథ్యము గొనుటకు దీరుగ బోవుచు నున్నాడో!
లేదా మఱి యిక యే లోకమునకు లీలగ బోవుచు నున్నాడో! 14

ఇంత లోపలను గీతనృత్యములు వింతగ జేసెడి వారలతో
మానవులును సేవించుచుండెడీ మహితాత్ముడు నరుడొక్కడునూ
బోవుచుండ యొక యరదము మీదను బొలుపుగ రావణు డిటులడిగెన్!
అర్కసన్నిభుడు నీతడెవ్వడో యరదముపై బోవుచు నుండెన్!
ఈతడెవ్వడని పర్వత ఋషితో నింపుగ ప్రశ్నించెను నతడున్! 15

దశగ్రీవుని యావచనంబులు విని దగ పర్వత ఋషి నిటుబలికెన్!
ఓ రాజా! ఓ రాక్షస శ్రేష్ఠుడ! యొనరగ నా పలుకులు వినుమా!
సర్వము బంగారమును గూడినది సరసాప్సరసల గూడినదీ
విమానమందున విచిత్రమైనా విమలాభరణములును మఱియున్

విచిత్ర వస్త్రములును గలిగియునూ వినుల పూర్ణచంద్రుని తోడన్
సమానమైనా ముఖమును గలిగీ చారుసుందరుడు సువర్ణుడున్
పేరు గలిగినా రాజీతడు సుమ! పెనుతేజస్సులు గలవాడున్
శీఘ్రమైన వాహనమునందునను శ్రీకరముగ వెడలుచునుండెన్! 16,17

పర్వత ఋషి! వచనంబులు విని మఱి బరగ రావణుడు నిటు బలికెన్
ఓ ఋషిసత్తమ! నీవే దెలుపుము! యొనరగ రాజులు నందఱునూ
పోవుచుండిరీ లోకంబులకును బోరున మరణించియు మఱియున్
వీరి లోపలను నెవ్వడైననూ వీరత్వంబున నాతోడన్
పోరు సలుపునా పొలుపుగ నాకును పొందుగ యుద్ధాతిధ్యమునూ
యిచ్చు వాడెవడు? వివరింపుము మఱి నింపుగ తెలుపుము ఋషి వర్యా!
ధర్మము దెలిసిన వాడవు నీవును ధర్మము జేతను మఱి నాకున్
తండ్రి వంటి వాడవు నీవు సుమా! ధాత్రిని సచ్ఛీలుండవునూ! 18, 19

పర్వతుండు రావణుని పలుకు విని బరగ యతనితో నిటు లనియెన్
మహారాజ! యీ రాజులందఱును మానుగ స్వర్గార్థినులు సుమా!
యద్దార్థినులును గాదు సుమా మఱి యుద్ధతి పోరాడరు వీరున్
మహాభాగ! నీతో పోరాడగ మహా యోధు డతడెవ్వండో!
వచించెదను నే నాతని పేరును వనరగ జూపెద నతనిని నే! 20, 21

మాంధాతాయని యభివిఖ్యాతుడు నంతట బహుళ ప్రసిద్ధుండున్
మహా తేజసులు గలవాడాతడు మఱి సప్త ద్వీపంబులకున్
అధిపతి యాతడు మహానుభావుడు నారితేరినా యోధుండున్
నీతో రణమును జేయగలడు సుమ! నీతో సమమగు బలీయుడున్! 22

ఆ పర్వత ఋషి వచనంబుల విని యా రావణుడును నిటు బలికెన్
మంచి వ్రతములును గలవాడా విను! నంచితముగ నా పలుకులనూ!
జన ప్రియుడగు నా మహారాజునూ జాగృత భావముతో గూడీ
ఎచటనుండునో, యే ప్రదేశమో! యింపుగ వివరింపుము నాకున్! 23

ఆ నర శ్రేష్ఠుడు నెటనున్నాడో నటకు నేను బోయెదను సుమా!
ఆ రావణుడును నటుల బలుకగా నది విని మునియును నిటు బలికెన్! 24

యువనాశ్వునికిని కుమారు డాతడు నఖిల రాజులను శ్రేష్ఠుండున్
మాంధాతా యను పేరు గలిగినా మహానీయుం డాతండు సుమా!
సప్త ద్వీపముల జయించి యిచటకు జనుదెంచెను నిటుకును మఱియున్
మహావిక్రమము గలవాడాతడు మానుగ నీతో సముడు మఱిన్ 25

అటు బిమ్మట త్రైలోక్యములందున చటుల పరాక్రమవంతుడునూ
వరదర్పితుడును మహా బాహువును వనరగ యా దశగ్రీవుడునూ
అయోధ్యాధిపతి వీరుండును మఱి యఖిల నరపతుల శ్రేష్ఠుండున్
సప్త ద్వీపములకును ప్రభువును మఱి సరస విరాజితమైనట్టి
ఇంద్ర రథము వలె కాంతులు జిమ్ముచు సాంద్ర భాస్వరము గలిగిన యా
ఉన్నతమగు నరదముపై గూర్చొని సన్నుతుడగు నా మాంధాతన్!
కనుగొనె నంతట దశగ్రీవుండును కాంతి కిరణముల జ్వాల వలెన్! 26, 27

దివ్య గంధముల లేపనములతో దివ్యాంబరములతోని మఱిన్
జాజ్వల్యంబగు దివ్యరూపమున జనుదించిన యా మాంధాతన్
దశగ్రీవుండును బలికె నిట్టులను దగ బహు వర గర్వముతోడన్
నాతో రణమును సేయుము రాజా! నను మెప్పింపుము జతురతనూ! 28
దశగ్రీవుండును నటుల బలుకగా రగ మాంధాతయు నవ్వుచునూ
ఆ రావణుతో నిటులను బలికెను రమ్య ధీర వచనంబులతో
ఓ రాక్షసుడా రావణ వినుమా! వనరగ జీవితమును నీకున్
ఇష్టము కాకుండిన మఱి నీకును గష్టముగా దోచిన యెడలన్
నాతో యుద్ధము సేయుము రాక్షస! నయముగ యిది తుది రణమనుచున్! 29

మాంధాతుని యా వచనములను విని మానుగ రావణు డిటులనియెన్
ఓ రావణుడా! వరుణ దేవునకు నింపుగ కుబేరునకు మఱియున్
అల యమునకునూ భయపడలేదూ! యట్టి మహారావణుడు మఱిన్
మనుష్యమాత్రుడవైన నీకు మఱి మానుగ భయపడునా భీతిన్! 30

రాక్షసేంద్రుడగు రావణుండునూ రయమున యా విధమున బలికీ
క్రోధము వలనను మండిపడుచునూ క్రూర కర్కశతను గాంచుచునూ
యుద్ధ దుర్మదులు దన మంత్రులతో యుద్ధతులగు తన సహచరులన్
ఆజ్ఞాపించెను రణమును సేయగ యల మాంధాతను సమయింపన్! 31

అటుబిమ్మట యా దురాత్ముడైనా యారావణునీ సహచరులున్
రణ విశారదులు రణ శూరులునగు రావణాసురుని యమాత్యులున్

క్రోధము తోడను గూడి యందఱును క్రూరములగు బాణంబులనూ
ప్రావృట్కాలము వర్షము రీతిని బరగ గురిసి రా నరేంద్రు పై! 32

అటు బిమ్మట యా మాంధాతయునూ చటుల గ్రద్ద రెక్కల తోడన్
గట్టినట్టి మఱి కఠిన శిలలవలె యిట్టె వాడి గల బాణములన్
ప్రహస్త శుక సారణులను మఱియును బరగ మహోదరులను వేగన్!
విరూపాక్ష మారీచాదులనూ వికట యకంపన రాక్షసులన్
వారలపై శరవర్షము గురిసెను వనరగ మాంధాతయును మఱిన్! 33, 34

అటుబిమ్మట యా ప్రహస్తుండునూ చటుల బాణ వర్షము జేతన్
అలమాంధాతకు పైని గురియగా యత్నించెను బహు విధములుగా
మాంధాతయు నా బాణ వర్షమును మానుగ తనపై రానుండన్
మధ్యలోనె వానిని ఖండించెను మిధ్యలుగా వానిని జేసెన్! 35

అటు మీదట యా నృపవరుండునూ యలరి కోపమున క్రుద్ధుండై
వానివన్నిటిని కుమారస్వామియు వనరగ క్రౌంచ సుపర్వతమున్
ఛేదించిన యటు నా ప్రహస్తునీ ఛేదించెను తన బాణములన్
వేగము గలిగిన తోమరములనూ శీఘ్రము నైదింటిని వేసెన్! 36

అటు పిమ్మట యా మాంధాతయునూ యల యమ సన్నిభ ముద్గరమున్
మాటి మాటికిని త్రిప్పి త్రిప్పి మఱి మానుగ రావణు నరదముపై
ప్రయోగించెనూ బహువేగముగా బన్నుగ యతి ధ్వనితో గూడీ
ఆ రావణునీ యరదముపైకిని యతి త్వరితముగా బయనించెన్! 37

వజ్ర సన్నిభంబగు ముద్గరమును వనరగ బహు వేగము తోడన్
రావణాసురుని రథము పై బడెను రయమున కార్చిచ్చుల తోడన్
రావణు రథమున బడి ముద్గరమున రమ్యమైన రథకేతనమున్
ఇంద్ర ధ్వజమును బడగొట్టెను మఱి సాంద్ర దీపికల మాపి మఱిన్! 38

హర్షోద్గత బలుడగు నా రాజును నట్టి సమయమున నాతండున్
పరిపూర్ణుండగు చంద్ర కిరణముల బరగ స్పృశించుట జేత మఱిన్

లవణ సముద్రము నలల జిమ్ముచును నమిత హర్షమును జిందునటుల్
ఆ సమయంబున నలమాంధాతకు నల యుత్సాహము బులకించెన్ 39

అటుపిమ్మట మఱి సమస్తమైనా చటులమైన రక్షో బలమున్
హాహా కారములను జేయుచును యటుబిమ్మట యా రాక్షసులున్
చైతన్యంబును లేని రావణుని చెంత జేరిరీ నిస్పృహతో
రాతి బొమ్మలకు వలె నిలుచుండిరి రమ్యముగా రావణు చుట్టున్! 40

అటు బిమ్మట యా లోక రావణుడు నల లంకేశుడు రావణుడున్
చాల సేపటికి స్పృహను దెచ్చుకుని చైతన్యంబును గూడి మఱిన్
ధనుర్బాణములతో మాంధాతను దగ శరవర్షము జరిపించీ
నొవ్వగ జేసెను నా నరేంద్రునూ నవ్వడితోడను రావణుడున్! 41

మహాబలులునగు నానిశాచరులు మాంధాతయు రణమందుననూ
మూర్ఛనందుటను గాంచి వారలును మోదముతో హర్షమునందీ
చేసిరి వారలు సింహనాదములు జెలగిరి యుత్సాహము తోడన్!
రాక్షసులకు విజయము గూడినగతి రమ్య ధ్వనులు జేసిరి వారున్! 42

దురాధర్షుడును చంద్రార్కుల సమ దోరపు కాంతులు గలవాడున్
అయోధ్యాధి పతి యా సమయంబున యలరుచు ముహూర్త కాలమునన్
లబ్ద సంజ్ఞుడై మంత్రులజేతను లాలిత సహచరులును మఱియున్
ఆ దశగ్రీవుని కీర్తించుటగని యతని గాంచి బహు క్రోధమునన్!
రాక్షస సంబంధిత సైన్యంబును రయమున శర వర్షము జేతన్
బడగొట్టెను మఱి బాధపెట్టెనూ పలాయనంబును గావించెన్! 43

అటు బిమ్మటనూ యా నరేంద్రునీ చటుల ధనుష్టంకారముచే
ధ్వనుల చేతనూ బాణ రవముచే బన్నుగ రాక్షస సైన్యంబున్
తుపాను గాలిని యెగుర గొట్టబడు దోరపు సంద్రపు టలల వలెన్
తూనీగలవలె చెదిరిపోయిరీ దోరముగా నలు వైపులకున్! 44, 45

నర రాక్షసులకు నట్టి సమయమున నయముగ సయుల సమరంబున్
భయంకరముగా జరిగెనప్పుడును బహు పటుతర యాయుధములతో!
అటు బిమ్మట యా మహాత్ములైనా చటుల ధనుస్సులు ఖడ్గములున్
ధరించినట్టీ వీరపుంగవులు దగ వీరాసనమును బొందీ
వీరులైన మాంధాతృ రావణులు వికట క్రోధమును బొంది రటన్! 46

మాంధాతయు నా రావణుపై నీ రావణుడును యా నరేంద్రుపై
మహాకోపమును జెందిన వారై మహాక్రోధమును బొందుచునూ
శరవర్షంబును గురిసిరి వారలు సహజ వైరమును గూడికొనీ
పరస్పరము బీడించుకొనిరి మతి బరగ యిద్దఱును దెబ్బలచే
నలిగిపోయిరీ గాయంబులచే నయముగ శరీర మంతయునూ! 47, 48

రావణుండు మతి కార్ముక మందున రౌద్రాస్త్రంబును సంధించీ
ఆ నరేంద్రుపై విడిచె నప్పుడును నట నిప్పులు జెలరేగు నటుల్
మాంధాతయు నాగ్నేయాస్త్రంబున మానుగ ప్రయోగమును జేసీ
రౌద్రాస్త్రంబును నివారించెనూ రయమున నాగ్నేయాస్త్రముతో! 49

రావణుడంతట గాంధర్వాస్త్రము రయమున ప్రయోగమున జేయన్
మాంధాతయునూ వారుణాస్త్రమున మానుగ దానిని సమయించెన్
రావణుడంతట సకల ప్రాణులను రహి భయమను గలిగించునదీ
బ్రహ్మాస్త్రంబును బ్రయోగింపగా బన్నుగ మాంధాతయు నపుడున్
మహనీయంబును దివ్యమైనదియు మానుగ పాశుపతము విడిచెన్! 50

తపస్సు చేతను రుద్రుని వరమున తగ యధిగతమైనదియు మతిన్
మహనీయంబును ఘోర రూపమును మానుగ త్రైలోక్యంబులకున్
భయవర్ధనమగు నా యస్త్రంబును బన్నుగ కనుగొని ప్రాణులునూ
స్థావరములు, జంగమములు గూడనూ సహింపజాలక భయమందెన్. 51, 52

అట్టి సమయమున స్థావరంబులును నలరు జంగమాత్మకములు మఱిన్
మూడులోకములు గంపించినవీ ముని గణములు మఱి దేవతలున్
యణగిపోయిరీ యాతుర జెందరి యలనాగులు వణుకుచు మఱియున్
తమ తమ స్థానములకును బోయిరీ తత్తరబాటును జెందుచునూ! 53

అటు బిమ్మట యా మునిశ్రేష్ఠులునూ యల పులస్త్యుడును గాలవుడున్
ధ్యాన యోగమున గనుగొని రంతయు దగ వచ్చిన యా యాపదనూ
ఆమాంధాతను నివారించిరీ యా పోరాటము మానుమనీ
నిందా పూర్వకమైన వచనముల కందువ నాపిరి రావణునీ 54

ఆ మునులును యా మాంధాతకునూ యల దశగ్రీవునకును మధ్యన్
ప్రీతి స్నేహములు గలుగునట్లుగా ప్రియమగు వాతావరణంబున్!
గలుగజేసి మఱి సంతోషించుచు కదలిపోయిరీ యటనుండీ!
ఏ మార్గంబున వచ్చిరొ వారలు నా దారిని బోయిరి వారల్! 55

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
తృతీయ నిక్షిప్త సర్గము సమాప్తము



## శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

## ఇది నాల్గవ నిక్షిప్త సర్గము

(రావణుడు చంద్ర లోకమునకు బోయి చంద్రునితో యుద్ధము జేయుటకు
ప్రారంభింపగా, బ్రహ్మదేవుడు వారిని వారించి, రావణునకు
పారమేశ్వర మంత్రమును నుపదేశించుట)

రఘుపతి రాఘవ రాజారామ్! పతిత పావనా సీతారామ్!
మునులిద్దఱునూ బోయిన పిమ్మట ముదమున యా లంకేశ్వరుడున్
మహా తేజమును మహా బలంబును మానుగ గల యా రావణుడున్
సర్వ గుణాన్వితమైన హంసలును సరసత నిత్యము వసియించూ
దశ సహస్ర యోజన దూరముగల దగమరుత్పథము దాటి మఱిన్
పుష్పకంబుపై యారూఢుండై బొలుపుగ పోయెను రాక్షసుడున్ 1,2

అంతకంటెనూ యూర్ధ్వంబును గల యల శ్రేష్ఠంబగు మరుత్పథం
దశ యోజన సాహస్ర దూరమున దగ గలిగిన చోటను బోయెన్
ద్వితీయమును నగు వాయుమార్గమని తీరుగ బలుకుదురు దానిన్
పుష్పకమందున యారూఢుండై బోయెను దశగ్రీవుండటకున్! 3

అట్టి వాయుపథమందు నిత్యమును నలరు త్రివిధములు నైనట్టీ
మేఘంబులు వసియించుచుండునూ మెఱుపు దీవెలసు గూడికొనీ
ఆగ్నేయంబులు పక్షులు మఱియును అల బ్రహ్మము లను బేరులతో
మూడు విధములగు మేఘము లుండును మోదముతో విహరించుచునూ! 4

అటు బిమ్మట యాదశగ్రీవుండును నల యత్తమమును శ్రేష్ఠంబున్
మూడవదైనా వాయు మార్గమును మోదముతో నటకును జేరెన్!
సిద్ధులు మఱియును తేజో వంతులు శ్రీకరముగ యట చారణులున్!
వసించుచుందురు వాయు మార్గమున వనరగ సుమధుర గీతములన్! 5

శ్రీ రఘురామా! నా పలుకులు విను! చిత్తమునందున హర్షమునన్
అచటకి మఱి పదివేల యోజనము లలరును నాల్గవ మరుత్పథం

భూతంబులు మఱి వినాయకుండును భూరిగణంబులు వసియించున్
అచటికి జేరెను దశగ్రీవుండును నల పుష్పక మధి రోహించి! 6

అటు బిమ్మట యా రావణుండునూ నటు పదివేల సుయోజనముల్
దూరమునందున పంచమమైనా వాయు మార్గమును గనుగొనెనూ
అట్టి వాయు మార్గమునందుననూ యలరి యుండు గంగానదియున్
కుముదము నెనెడీ దిగ్గజంబునూ కూరిమి యనేక దిగ్గజముల్
ఆ దిగ్గజములు నల గంగానది నలక్రీడలు సలుపుచు నుండున్
పుణ్యాజలంబును నన్ని వైపులను బొలుపుగ వర్షించుచునుండున్ 7,8,9

శ్రీ రఘురామా! యా దిగ్గజముల శ్రీకరమగు దుంపురులు మఱిన్
రవికర భ్రష్టములై వాయువుచే రయమున పేశలమగుచు నటన్
పుణ్య ప్రదమగు నదీ జలంబులు బొలుపుగ బహుదూరము వఱకున్
జలములుగానూ మంచువోలెను నలరి క్రింద బడుచుండె నటన్! 10

మహాద్యుతే! ఓ రఘురామా! విను! మానుగ నా వచనంబులనూ!
ఆ దశగ్రీవుడు మంత్రుల గూడీ! యా ప్రదేశమున నుండి మఱిన్
దశ సహస్ర యోజనముల దూరమున దగ యుండిన యా ప్రదేశమున్
షష్టమమైనా వాయు మార్గమును దగజేసెను పుష్పకమందున్
జ్ఞాతి బాంధవుల సత్కృతు డగుచును యలరుచు నుండును గరుడుండున్
వివిధ పక్షులను గూడియుండునూ వినువీధిని విహరించుచునూ! 11

అటులే బోవుచు నా దశగ్రీవుడు నలరి పుష్పకము నందుననూ
పదివేల్ యోజన దూరమునందున బన్నుగ సప్తమ మరుత్పథం
అచ్చట నుందురు ఋషులును మునులును నలరుచు యోగులు సత్పురుషుల్
సప్తఋషులు గూడను నుందురు నట సతీ యరుంధతి దోడుతనూ! 12

దానిపైనిపదివేల యోజనము దగ గలిగిన దూరమునందున్
అష్టమమైనా మరుత్పథంబును నట గాంచెను మఱి రావణుడున్
ప్రసిద్ధమైనా గగన గంగయును బన్నుగ నున్నది యిచ్చటనే

ఈ గంగయు నాదిత్య మార్గమున యింపుగ నున్నది ముచ్చటగన్!
మహావేగమగు ధ్వనితో నుండును మనోజ్ఞ సుందరముగ నుండున్
వాయువు జేతను భరింపబడుచును వనరగ ప్రవహించుచు నుండన్
అట్టి యెనిమిదవ వాయు మార్గమును నిట్టె రావణుడు మెట్టె నటన్! 13,14

ప్రమాణంబునూ దీనికంటెనూ పన్నుగ యెనుబది వేలకుపై
యోజనంబులా దూరమునందున భాజనమున చంద్రుడు గలడూ!
ఆ స్థానంబును గూర్చి దెలిపెదను నలరి వినుము! శ్రీరఘురామా!
రఘుపతి రాఘవ రాజా రామా! పతిత పావనా సీతారామ్! 15

నక్షత్రములను గ్రహములతోడను రమ్యముగా చంద్రుడు నుండున్
చంద్రమండలము నుండి వెడలినా సాంద్ర లక్షలా కిరణంబుల్
సకల ప్రాణులకు శీతభయంబును సహజముగా గలగించుచునూ!
ప్రకాశింప జేయుచు నుండును మఱి స్ఫటిక కాంతులను లోకమునన్
అష్టమమైనా వాయు మార్గమును నలరి బలుకుదురు విజ్ఞానుల్! 16, 17

అటు పిమ్మట యా చంద్రుండను మఱి చటుల రాక్షసుని దశకంఠున్
కాల్చి భస్మమును జేయుచున్నటుల గనిపించెను నా సమయమునన్
అంతట చంద్రుడు శీతాగ్నులచే నల దశగ్రీవుని కోపముతో
గాల్చివేసెనూ యగ్నులు లేకను గఱకు జ్వాలలును లేకుండన్
చల్లదనమనే యగ్నుల చేతను మెల్లగ చల్లగ దహియించెన్! 18

ఆ రావణునీ మంత్రులందఱును నల శీతాగ్నుల భయంబుచే
చల్లదనముచే బీడింపగబడి సహింపజాలక బోయిరటన్
అటుబిమ్మట నా బ్రహస్తుండునూ యల దశగ్రీవుని గాంచి మఱిన్
జయ శబ్దంబును బలుకుచు నిట్లనె సహజ రీతి బహు వినయమునన్! 19

ఓ రాజా! యీ శీతాగ్నులునూ వనరగ బాధించుచు నుండెన్
చంపి వేయుచున్నవి సుమ మనలను వంపుచున్నవా కిరణంబుల్
చంద్ర కిరణముల బడబాగ్నులచే సాంద్రశీత మృదు బాణములన్
ఆవహించె రాక్షసులకు భయమును హాహా రవములు జెలరేగెన్! 20

రాజేంద్రా! ఓ లంకాధిప విను! రమ్యమైన నా వచనములన్
చల్లని కిరణములును గల చంద్రుడు కల్లగాదు దహనాత్మకుడున్
అగ్ని స్వరూపుడు చంద్రుడు నిజముగ యది యాతని నిజస్వభావమున్
అని పలుకగ యా ప్రహస్తుండునూ అది విని రావణుడును వేగన్
క్రోధమూర్ఛితుండై వేగముగా కూర్మి ధనుస్సును గ్రహియించీ
చఱచి వేగ నారాచ బాణముల చారు చంద్రునీ జోడించెన్! 21

అటు బిమ్మట యా బ్రహ్మదేవుడును నలరి త్వరాన్వితుడై వేగన్
చంద్రలోకమునకును వచ్చెను మఱి సాంద్రదీధితులు వెలయంగన్!
మహా బాహువులు గలవాడా! మఱి మహా విశ్రవసు కుమారుడా!
సౌమ్యుడవగు ఓ దశగ్రీవా విను! సరసత శీఘ్రము నిటనుండీ
వెడలి పొమ్ము! యా చల్లని చంద్రుని వికటముగా పీడింపకుమా! 22, 23

మహాద్యుతియుగలవాడు చంద్రుడును మఱి లోకమునకు హితంబునూ
జేయ కోరికయు గలవాడను మఱి చింతను ముంపకు యాతనినీ!
నీకొక మంత్రము నిచ్చెద గొనుమా! నిశ్చిత బుద్ధిని గైకొనుమా!
ప్రాణాపాయ స్థితి యందున మఱి బన్నుగ యెవ్వడు జపించునో
అంటదు ముట్టదు మృత్యువు నాతని యలరి దూరమున నుండు సుమా! 24

బ్రహ్మదేవునీ యామాటలు విని బన్నుగ రావణుడును నపుడున్
ప్రాంజలి తోడను నమస్కరించుచు బద్మ సంభవునితో ననియెన్
లోకనాథ! ఓ మహానుభావా! లోకేశ్వర! ఓ దయానిధీ!
నాపై నీకును దయగలిగినచో నయముగ సంతోషించినచో
నా కా మంత్రము నివ్వదగినదని నయముగ యోచన గలిగినచో
నా కా మంత్రము దయసేయుమ మఱి నయముగ జపింతు నెల్లపుడున్
మహాభాగ! ఓ దేవతా ప్రభూ! మానుగ యా మంత్రము నేమున్
జపించి నీదు యనుగ్రహంబుచే సకల దేవతల వలన మఱిన్
అసురులచే దానవుల చేతనూ అల పక్షుల వలనను గానీ
త్వత్ప్రసాదమున నిర్భయుండనై దగ జయింప శక్యముగానీ
మహా బలీయుడ నగుదును దేవా! మానుగ సంశయమును లేదూ! 25, 26, 27

దశగ్రీవుని యా వచనంబులు విని దగ వాణీపతి యిటులనియెన్
రాక్షస రాజా రావణ వినుమా! రహి నా వచనములును వినుమా
ప్రాణాపాయము లందు మాత్రమే బన్నుగ యీ మంత్రంబు మఱిన్
జపింప వలెనూ శ్రద్ధాభక్తిని జపింప రాదెల్లప్పుడునూ! 28

మంగళ ప్రదమగు నీ మంత్రంబును రంగుగ జపమాలలతోడన్
జపింపవలయును ఓ రాక్షసపతి జపించి నీవును లోకమునన్
జయింప శక్యముగాని వాడవును, జయశ్రీ నందెద వెల్లపుడున్!
ఓ రాక్షసపతి! యీ మంత్రంబును వనరగ జపింపకుండగనూ!
సిద్ధి లభింపదు. ఫలము లభింపదు! చెదిరిపోవునూ సంపదలున్! 29,30

రాక్షసపుంగవ! తెలిపెద వినుమా! రమ్యమైన యీ మంత్రమునూ!
ఉచ్చరించు మాత్రముననను మంత్రము సచ్చరిత్రుడగు జీవుడునూ!
యుద్ధమునందున జయమును గలుగును నిద్ధరిత్రి కీర్తిని బొందున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 31

దేవదేవ పరమేశ్వర శంభూ! తీరుగ సురాసురల చేతన్
నమస్కరింపగ బడువాడా మఱి నయముగ పూజింపగ బడుచున్
భూతభవ్య మహాదేవ స్వరూపా భూత పాపములు దొలగించూ
పచ్చని నేత్రములను గలవాడా! భవ్య నీ కివే నమస్కృతుల్! 32

వ్యాఘ్ర చర్మ వసనంబున గలిగీ వనరగ సుఫాల నేత్రుడవున్
బాల రూపమున గనిపించెదవూ! బరగ వృద్ధ రూపమున మఱిన్
పొలుపుగ యందఱి చేతను గూడను బూజల నందెడి వాడవునూ
త్రైలోక్యంబుల ప్రభుడవు నీవును దీరుగ సర్వ సమర్థుడవున్! 33

మహా భుజంబులు గలవాడవునూ మామగ పాపహరుండవునూ
దిక్కులు హద్దులు గలవాడవునూ దీరుగ యంతట వ్యాపించీ
యుండెడివాడవు! యుగాంతమందున యూహకు నందని యగ్నివియున్
గణంబులకు మఱి యీశ్వరుండవును గణుతికెక్కినా ప్రభుడవునూ
లోక రక్షుడ వీవు సుమా మఱి లోక సౌఖ్యముల కరణుడవున్! 34

మహా శూలమును ధరించు వాడవు! మహాభాగ్యశాలవి నీవున్
మహా దంష్ట్రలును గలవాడవునూ మహేశ్వరుండవు నీవు మఱిన్
కాలరూపుడవు! బలరూపుండవు కపాలమును గలిగినవాడా!
నల్లని కంఠము గలవాడవునూ నయముగ మహారవంబు మఱిన్
గలవాడవు! ప్రభుడవును నీవును మఱి కామితార్థ ప్రదుడవు నీవున్! 35

దేవతలందఱు నశించినను మఱి తీరుగ నిలిచెడి వాడవునూ!
తపసుకు లక్ష్యంబైన వాడవును దగ జీవులకును పతి నీవున్
శూలము కరమున యున్న వాడవును శుభకరుడవు శుచిమంతుడవున్
నాశరహితుడవు! రమ్య ప్రభావా! నయముగ ధర్మ స్వరూపుడవూ!
ధ్వజము వంటి వాడవును నీవును ధ్వజమునందు వృషభంబు మఱిన్
హరి రూపుండవు! హర రూపుండవు! అఖిల దేవతల రూపుడవున్
గలవాడవునూ, నాయకుండవును గడిమి రక్షకుడవు నీవున్! 36, 37

సంచరించువాడవును నంతటా సంహరించువాడవు నీవున్
సర్వంబును సృజియించు వాడవును సహజ సృష్టికర్తవు నీవున్
పూజ్యుండవు మఱి నాశరహితుడవు! పొలుపుగ కమండలము జేతన్
ధరించువాడవు సహజ ప్రకాశము దగ గలిగినవాడవు నీవున్
పినాకమనియెడి ధనుస్సు కరమున ప్రీతిని ధరించువాడవునూ!
జటల యందు గంగను ధరించియును జటాభరముగలవాడవునూ! 38

మాననీయుడవు! వరిష్ఠుండవూ! మానుగ ఓంకారము నీవున్
సామవేదమును బొందిన వాడవు! సరసత మృత్యువు నీవు సుమా!
మృత్యు దూతవును మోక్ష ప్రదుడవు సర్వసంగ వర్జితుడవునూ
సువ్రతుండవును సుభాషితుండవు సూరి జనప్రియుడవు నీవున్! 39

బ్రహ్మచారివియు గృహస్థుండవును బరగ మరణ రహితుండవునూ!
వీణ, పణవమును, తూణములనియెడి విమల వాద్యములు మ్రోగించూ
వాద్యనిపుణుడవును, దర్శనీయుడవు వనర శీల గుణముల తోడన్
వర్ధిలువాడవు బాల సూర్యుతో వనర సమానుడ వీవు ప్రభూ! 40

స్మశాన వాసివి! భగవంతుడవును విశాల హృదయము గలవాడా!
ఉమాపతివి మఱి యనిందితుండవు! యురుతర శాంతిని గలిగించూ!
చిక్కని హృదయము గలవాడవునూ జిక్కుచు నుందువు హృదయమునన్
భగుని నేత్రముల బడగొట్టియు మఱి భవ్యప్రభావము జూపితివీ!
పూషుని దంతంబుల యన్నింటిని బూనిరాల్చితివి ధర యందున్! 41

జ్వరహర్తవు మఱి పాశ హస్తుడవు! ప్రళయ కాల నేత్రుండవునూ!
ఉల్కా ముఖుడవు! మునివి! నీవు మఱియురుతర ప్రకాశమును గలిగీ
అగ్ని కేతనముగా గలవాడవు అల మనుష్యులకు నధిపతివీ!
తీయని మనస్సు గలవాడవునూ దీరుగ వరముల నిచ్చెదవూ! 42

ఉన్మాదంబును, కంపంబును మరి యురుతరముగ కల్పించెదవూ!
సమర్థుండవును లోక శ్రేష్ఠుడవు సరసత వామన రూపుడవున్
వాయుదేవుడవు కృత్తి వాసుడవు వనరగ సర్వమయుండవునూ
మృత్యుంజయుడవు! సూక్ష్మతనుండవు త్రిపురాంతకుడవు నీవు మఱిన్!
ప్రాగ్జ్యోత్యుండను పేరుగలిగినా ప్రబలుండవు మఱి నీవు సుమా! 43

భిక్షు రూపమును గలవాడవునూ భిక్షుండవును నీవు మఱిన్
మూడు జటలు గలవాడవు నీవును మోదముగా జటిలుడ నీవున్
దేవేంద్రుని హస్తంబును నీవును దీరుగ స్తంభింపగ జేసీ
అష్ట వసువులను నడ్డుబడుచునూ యలరి స్తంభనము జేసితివీ! 44

ఋుత స్వరూపుడ వీవు కదా మఱి ఋుతువుల జేసెడి వాడవునూ
కాలంబును మఱి వసంతంబునూ కనికరించు వాడవు నీవున్!
మధుర లోచనములును గలవాడవు మానుగ వాచస్పత్యుడవున్
ఐశ్వర్యంబును, నిచ్చువాడవును నాశ్రిత పూజితుడవు నీవున్! 45

జగతిని పోషించెడివాడవును జగతిని సృజించువాడవునూ
పురుషుండవు మఱి శాశ్వతుండవు బొలుపుగ శాశ్వతుడవు నీవున్
నిత్యుండవు! మఱి ధర్మసాక్షివీ నిఖిలము గాంచెడి వాడవునూ!
మూడు కన్నులును గలవాడవునూ మూడు మార్గముల గలిగి మఱిన్! 46

మూడు నేత్రములు గలవాడవునూ మోదముగా బహు రూపములన్
ధరించువాడవు! సాత్వికుండవును దగ సామ ప్రియుడవు నీవున్!
సూర్యాయుత సమప్రభుండ వీవును సురుచిర యతి దేవుండవునూ!
చక్రాంకిత జటలును గలవాడవు సర్వజ్ఞుడవును దేవేశా! 47

నృత్యము జేసెడి వాడవునూ మఱి లాస్యము జేసెడి వాడవునూ!
పూర్ణశశాయుని సమానమైనా పొలుపుగ పూర్ణేందుని తోడన్
సమానమైనా ముఖమును గలిగీ శరణాగత రక్షకుడవునూ
బ్రహ్మవేత్తవును  సర్వమయుండవు! భక్త వత్సలుడవు నీవు మఱిన్! 48

సర్వకావ్యముల ధ్వనిగలవాడవు! సర్వ బంధ మోచనుడవునూ!
మోహంబును గలిగించు వాడవును మానుగ బంధక రూపుడవున్!
సమస్తమును ధరియించువాడవును సమస్త వరముల నిచ్చుచునూ!
భక్తుల కనురెప్పలకు వోలెను బన్నుగ బ్రోచెడి వాడవునూ! 49

పుష్పవంతుడవు, విభాడవునూ బొలుపుగ ముఖ్యుడవు నీవున్
సర్వంబును హరియించు వాడవును సరసత సింహమునకు వోలెన్!
పచ్చని మీసంబులు గలవాడవునూ బరగ ధనుస్సును ధరియించీ
బరుగు వాడవును, భయంకరుండవు ప్రబల విక్రమము గలిగి మఱిన్! 50

నాచే దెలుపగబడిన యట్టి యీ నయముగ పుణ్య ప్రదమైనా
నామాష్ట శతంబును బఠింపగా నయముగ పాపహరంబునిలన్
పుణ్య ప్రదమును యుత్తమమైనది బొలుపుగ శరణార్థులకు మఱిన్
శరణు నిచ్చునది దశగ్రీవా విను! సరసత జపమును జేసినచో
శత్రు వినాశము జేయును రావణ! సకల సిద్ధులును గలుగు విలన్! 51

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
చతుర్ద. ప్రక్షిప్త సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

## ఇది పంచమ నిక్షిప్త సర్గము

(రావణుడు పశ్చిమ సముద్రములో నున్న ఒక ద్వీపమునకు బోవుట
అచ్చటనున్న కపిలుని చేతిలో పరిభవమును బొందుట తిరిగి వచ్చుట)

కమలోద్భవుడగు బ్రహ్మ దేవుడును కనికరించి దశగ్రీవునకున్
ఆ విధముగ వరమిచ్చి శీఘ్రముగ యలరి బ్రహ్మలోకము బోయెన్! 1

రావణు డంతట వరమును బొందీ రయమున బితామహుని జేతన్
ఆనందించుచు దనపురి లంకకు నలరి తిరిగి పోయెను నతడున్
కొంత కాలమటు గడిచిన పిమ్మట చింతలు బాసిన తరువాతన్
లోకంబుల నేడ్పించు రావణుడు లోలత తన మంత్రులు గూడీ
పశ్చిమ సముద్రమునకును బోయెను బన్నుగ విహారమును సలుపన్! 2

ఆ ప్రదేశమున పావక ప్రభయును నలరుచు బంగారము వన్నెన్
ఒంటరిగా యా ద్వీపమునందున జంట యెవ్వరును లేకయునూ
ఒకానొక్క పురుషుడు గనబడెనూ యొనరగ రావణునకు మఱియున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 3

భయంకరంబగు నాకారముతో ప్రళయ కాలమున యగ్నికినీ
సమానమైనా యా పురుషుండును సరసత యట గనబడుచుండెన్
దేవతలందున దేవేంద్రుని వలె దీరుగ గ్రహముల సూర్యువలెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 4

దశగ్రీవుండును ద్వీప మధ్యమున దగ యుండిన యా పురుషుగనీ
గర్వముతో నా పురుషుని తోడను ఘన ధ్వనితో నీ విధి బలికెన్
నాతో సంగ్రామమును జేయుమా! నయముగ యీ ద్వీపమునందున్
లేదా యోటమి జెందినాననుచు లీలగ బలుకుము నా యెదుటన్! 5

ఆ రావణునీ ఘనమగు దృష్టియు నలరెడి గ్రహ పంక్తికి వోలెన్
వ్యాకులంబుగా నుండెను నపుడును నా కులతను బొందెను కనులున్

గొఱుకుచున్న యా దంత శబ్దమును బిద్యుతమగు యంత్రము వోలెన్
ఘనశబ్దంబును గలుగుచు నుండెను గగనమునందున యుఱుము వలెన్
మహా బలీయుడు దశగ్రీవుండును మంత్రులతోడను గూడికొనీ
బహు బిగ్గఱగా గర్జించెను మఱి బాహువులను మఱి పైకెత్తీ! 7,8

రాక్షసపతి మఱి యనేక విధముల రయమున కేకలు వేయుచును
దీర్ఘములైనా భుజముల తోడను దీరుగ భయంకరుడు మఱియున్
ఘన దంష్ట్రలతో గూడిన వాడును గడు వికటమునగు రూపమునన్
కంబుగ్రీవము గలవాడును మఱి ఘనవక్షంబును గలవాడున్
కప్ప కడుపులా గర్భము గలిగియు ఘన సింహములా ముఖంబునూ
కైలాసపు శిఖరోపమానుడును పద్మపాద తలముల తోడన్
రక్త తాలుకము కరాంబుజంబును రమ్య నాదమును గలవాడున్
మహాకాయమును, మహానాదమున మానుగ గనిపించుచును మఱిన్
జ్వాలామాలా పరిక్షిప్తుండును జిఱుగంటల ధ్వని గలవాడున్
నడుమున యంబుల పొదులు గట్టుకొని నయముగ కనబడు వాడు మఱిన్
కంఠమందు బంగారు పద్మముల ఘనమాలయు గలవాడు మఱిన్
ఋగ్వేదము వలె శోభలు జిందుచు ఋషి వోలెను గనబడు వాడున్
పద్మమాలలను విభూషితుండను బన్నుగ వలువలు గూడికొనీ
అంజనా చలముతో సమానుడును కాంచనాచలము సన్నిభుడున్
అట్టి పురుషునీ దశగ్రీవుండును నిట్టె శూలముల శుత్తులతో
బుష్టుల తోడను, బట్టిసములతో రూఢిగ బ్రయోగమును జేసీ
ఆ పురుషుండును వ్యాఘ్రంబునొకును నలరు సింహమునొకును వోలెన్
వృషభంబునొకును కుంజరంబువలె వనరగ నాగేంద్రంబులకున్
మేఱు పర్వతంబునొకును వోలెను మిగుల స్థిరంబుగ నిలుచుచునూ
నది వేగములకు సంద్రము వోలెను నయముగ యా పురుషుండు మఱిన్
కనిపింపక మఱి చలింపకుండను కమనీయముగా రావణుతో
ఈ విధముగ పలికెను రావణుతో నింపుగ తీవ్ర ధ్వని తోడన్! 9, 10,11,12,13

ఓరీ! దుర్మతి! రాక్షసుడా విను! వనరగ నీ కుండిన యట్టీ
యుద్ధాసక్తిని బోగొట్టెదనూ యుద్ధతి మానుము ఒక క్షణమున్! 14, 15

సకల లోకముల భయంకరుండగు సాహసుడగు రావణునందున్
ఏ వేగము మఱి యెట్టి విక్రమము నింపుగ గలదో యా పెంపున్
వేల కొలది వేగములు మఱియునూ విక్రమములు యా తెగింపులున్
ఆ పురుషుని యందున నిరూఢమై యలరి యున్నవీ గూఢముగాన్ 16

ఈ జగత్తులో సిద్ధి హేతువులు నింపుగ ధర్మము తపస్సులున్
ఆ పురుషుని దగ యూరువులందున యాశ్రయించి యున్నవి మఱియున్
ఆ మన్మధుడును శిశ్నమునందున యలరి యున్న వాడును మఱియున్
విశ్వదేవతలు కటి ప్రదేశము వేడుక నుండిరి యాతనికిన్!
మరుత్తులును బస్తిని పార్శ్వములను మానుక యాశ్రమమును నందీ
నిలిచి యుండిరీ నిగూఢ రక్తిని నిర్మల సుక్షేత్రము లందున్! 17, 18

ఆ పురుషునకును మధ్య ప్రదేశము అష్ట వసువులును రూఢులునై
కుక్షియందునను సముద్రంబులును గూరిమి నిశ్చలముగ నుండెన్
పార్శ్వమునందున సర్వ దిక్కులును బన్నుగ స్థిరముగ నున్నవియున్
సకల సంధులను వాయువు నుండెను సతతము చలనము నందుచునూ! 19

భగవంతుడగు రుద్రదేవుడును బరగ పితృదేవతలు మఱిన్
పృష్ట భాగమును నాశ్రయించిరీ ప్రీతిగ యా పురుషుని గనుచున్
బ్రహ్మదేవుడగు పితామహుండును బన్నుగ హృదయంబున మఱియున్
ఆశ్రయించుకొని యుండినారు గద! నతి వాత్సల్యము జూపుచునూ! 20

పవిత్రంబులగు గోదానంబులు బరగ భూమి దానంబులునూ
శ్రేష్ఠములైనా స్వర్ణ దానములు శ్రీకరముగ మఱి యుండినచో
అవి యన్నియునూ నా పూరుషునీ యలరి చంక రోమంబులలో
ఆశ్రయించి యున్నవి యవియన్నియు నలరి కాన రాకుండగనూ! 21

హిమవత్పర్వతమును సుందరమగు హేమకూట పర్వతము మఱిన్
మందర పర్వతము గూడను మఱి సుందర సుమేరు పర్వతమున్
ఆ పురుషునిలో యెముకలుగానై యాశ్రయించుకొవి మఱి యుండీ
అలరుచుండెనూ యగుపడకుండగ యభిమానించుచు నాతనిలో! 22

వజ్రాయుధముగ నవని హస్తముగ వనరగ యా(శ్రమమును బొందెన్!
అతని శరీరమందున గగనము నా(శ్రయించుకొని యుండె మఱిన్
కంఠమునందలి వెనుక భాగమున కమనీయంబగు సంధ్యయునూ
మేఘంబులనూ యా(శ్రయించుకొని మెలఁకువగా నుండెను నచటన్! 23

ధాత విధాతయు, విధ్యాధరులును దగ వారలు బాహువులు మఱిన్!
ఆ(శ్రయించియుండిరి శేషుండును నల వాసుకియును నలరుచునూ!
విశాలాక్షుడును నైరావతుడును విమల కంబలుడు నశ్వితుడున్
కర్కోటకుడును ధనుంజయుండును కఱకు ఘోరమగు విషంబునూ!
తక్షకుడును మఱి యుపతక్షకుడును కాంతులు గలిగిన నా పురుషున్
గోళ్లను మఱి యా(శ్రమమును బొందీ కూరిమి విషమును విడుచుటకున్
సిద్ధముగా నుండిరి యగ్నియునూ జేరెను నాతని ముఖమందున్
రుద్రులచేతను నతని భుజములను రూఢిగ నుండిరి స్థిరులగుచున్! 24, 25, 26,

పక్షములును, మాసములు, ఋతువులును బన్నుగ యాతని యుభయములే
కోరలయందును యా(శ్రయించి మఱి కూరిమితో నటనుండునదీ
ఆతని నాశికయందున కుహువును ఆతని శరీర రంధ్రములన్
వాయువులును మఱి ప్రవేశముండీ వనరగ యలరుచు నట నుండెన్! 27

దేవి సరస్వతి యొక్క వీణయును దీరుగ కంఠం బాయెనటన్
ఉభయులైన యాయశ్వని దేవులు శ్రవణము లాయెను నాతనికిన్!
చంద్రసూర్యులును నేత్రంబులుగా సాంద్ర దీధితులు గురియుచునూ!
అతని శరీరమునందు లీనమై యాతని బులకించుచు నుండెన్ 28
వేదాంగంబులు యజ్ఞంబులునూ విమలమైన నక్షత్రంబులునూ
మంచి వృత్తములు, వాక్యంబులునూ మానుగ తేజస్సులు మఱియున్
తపస్సులును మఱి తత్త్వ శాస్త్రములు దగ యా పురుషుని దేహంబున్
ఆ(శ్రయించుకొని యుండినవీ మఱి యలరుచు దిరుగుచు నుండినవీ! 29

ఆ పురుషునిచే స్వల్ప మాత్రమున యల ముష్ఠి ప్రహారము జేతన్
జేతినెత్తి బిడికిలి బిగించియును శీఘ్రము మెలమెల్లగ గొట్టన్
ఆ రాక్షసుడును దశగ్రీవుండును అచట దప్పి స్పృహ బడిపోయెన్!
రఘుపతి రాఘవ రాజారామ్! పతిత పావనా సీతారామ్! 30

పర్వతంబుతో సమానుండునూ పద్మమాలలను గూడికొనీ
ఋగ్వేదముతో సమానుడైనా రూఢిని యా పురుషుండు మఱిన్
రావణుండు పడిపోయినాడనుచు రమ్య వీక్షణము గావించీ!
రాక్షసులను మఱి తరిమి వేసెనూ రయమున దిక్కులకును మఱియున్
నిజనివాసమగు పాతాలమునకు నిండు మనస్సున బోయె మఱిన్! 31,32

రావణుండు మఱి లేచి స్వయముగా రయమున యమాత్యులను బిలిచీ
ఓ ప్రహస్త శుకసారణులారా! వసరగ నా మాటలు వినుడూ!
'ఆ పురుషుడు మఱి యెచటికి బోయెను నలరుచు యెచటను దాగె మఱిన్
వేగము దెలుపుడు ననుచు బలికెనూ, వికటముగా బెను కేకలతో! 33

ఆ రాక్షసుడగు రావణు బలుకులు నలరి వినుచు నా యమాత్యులున్
ఈ రీతిని బలికిరి వారలునూ నింపుగ విమల స్వభావమునన్
దేవదానవుల దర్పంబును మఱి దగ యణచిన యా పురుషుండున్
ఇచ్చటనే మఱి యీ బిలమందే నింపుగ ప్రవిష్టమైనాడూ! 34

ఆ సమయంబున దుష్ట బుద్ధిగల యా రావణుడును నిర్భయతన్
అటు పిమ్మట వేగముగా నాతడు చటుల గరుత్మంతుని వోలెన్!
సర్వంబును మఱి గ్రహించినట్టుల సాహసవంతుడు రావణుడున్
శీఘ్రముగా బిల ద్వారము జేరీ నింతభయము మఱి లేకుండన్
బిల ద్వారంబున నిలిచె రావణుడు బిర బిర యాతని బిలుచుచునూ! 35

రావణుండు బిల ప్రవేశంబునూ రయమున జేసియు నటగాంచెన్
నీలాంజన చయోపమానులును నిర్భర కేయూరములు మఱిన్
ధారణ జేసిన వారును మఱియును దగ మెట్టిన పూమాలలునూ
అనులేపనములు గల వారును మఱి మందములును మఱి శ్రేష్ఠములున్
బంగారము రత్నములను గూడిన బహు విధ భూషణముల తోడన్
అలంకరింపగ బడిన వారలను నట గాంచెను దశగ్రీవుండున్! 36, 37

ఆ సమయమున యచ్చోటను మఱి యలరు నాట్య నృత్యోత్సవమున్
వీత భయంబును గలవారును మఱి విమలమైన వ్రత దీక్షితులున్

పావక ప్రభలును గల వారలునూ బరగ మహాత్ములు నైనట్టి
మూడు కోట్ల మందచట నృత్యమును మోదముగా జేయుచు నుండెన్
ఆ రావణుడును గాంచె నచ్చటను నపురూపమునగు నృత్యములన్! 38

భయంకరంబగు బరాక్రమము గల బన్నుగ రావణ డట గాంచెన్!
క్రీడించెడి యా నృత్యకారులను గ్రీగంటను మది దిలకించెన్
అల రావణుడును కోట్ల మందినీ యటగాంచియు మఱి భయపడకన్!
ద్వారమనందున నిలిచె నాతడును భారమింతయును లేకుండన్! 39

ఒకే రంగునూ, ఒకే వేషమును ఒకే రూపమును గలవాడున్
మహా తేజమును గల యా పురుషులు మానుగ తానిదివఅలోనన్
అన్ని విధములా వెనుక జూచినా యా పురుషుని వలె నుండి రటన్
నాలుగు భుజములు గల వారును మఱి రయమున యుత్సాహము తోడన్
యుండినట్టి యా పురుషుని జూడగ యూహకందనీ విధముననూ
ఆ రావణునీ యొడలంతయునూ యలరి గగుర్పొడిచెను నపుడున్! 40, 41

బ్రహ్మ నుండి వరములు బొందిన యా బరగ రావణుండును మఱియున్
అచ్చట నుండీ మహా విలువగల యలరెడి దెల్లని వసనములన్
ఆసనములుగల గృహంబు ద్వారా నట శీఘ్రముగా నా దారిన్
ముందుకు బోయీ నచ్చట గాంచెను నందముగా శయనముపైనీ
సుందరుడగు నొక యుత్తమ పురుషుని చూడ్కికి నింపును గలిగింపన్! 42

ఆ పురుషుండును నగ్నుల జేతను నవగుంఠితుడై యచ్చటనూ
శేషశయనుడై యున్నాడచటను శ్రీ విలస్లిలగ పాదములన్
దివ్య మాలలును యనులేవనములు దివ్యాభరణ విభూషితమై
మహాసాధ్వి త్రైలోక్యంబులకును మానుగ యేక సుభూషణమున్
మహా దేవి వింజామరంబునూ మానుగ హస్తము నందుననూ
ధరించి యచట వ్యవస్థితురాలై దగ లోకములను సుందరియున్
లక్ష్మీదేవియు పద్మంబులతో లలి ప్రభావితము నగుచుండెన్! 43, 44, 45

రాక్షసేంద్రుడగు రావణుండునూ రయమున కామోద్రేకుండై
సింహాసనమును గూర్చొని యున్నా జిఱు నగవులుగల యా సాధ్వీన్

కనులగాంచి యామెను గ్రహింపగా కండకావరము గలవాడున్
ఆ రావణుడును నీతిరహితుడై యలరి నిశ్చయించెను మదిలో 46

దుర్మతియును మఱి లోకంబులకును దుఃఖము గూర్చిన రావణుడున్
ఆ సమయంబున మంత్రులు తనతో నచ్చట లేకుండిన గూడన్
కాలచోదితుండై యాతండును కాముని వశీకృతుండగుచున్
నిదురించెడి సర్పంబునకును వలె నిరుపమ సాధ్వి సుహస్తంబున్
గ్రహించుటకు మఱి నిశ్చయించెనూ కాలగతిని మఱి రావణుడున్! 47

అటుబిమ్మట నిదురించినట్టి యా యల ఘన బాహువులును గలుగూ!
దేవదేవుడును నా దశగ్రీవుని దీరుగ గ్రహింప కోరికయున్
గలవానినిగా మదిని దెలిసికొని కండ కావరము గలిగింపన్
గప్పుకొనిన యా వస్త్రంబును మఱి చొప్పడ దొలగించియు మఱియున్
ఆ రావణునీ గనుల జూచుచును నలరుచు హసించె బిగ్గఱగన్! 48, 49

తేజస్సులతో జీల్చబడిన యా దీరుగ లోకంబులును మఱిన్
రోదింపగ జేసిన రావణుడును దోషముడిగి యావెనువెంటన్!
కృత్త మూలమగు వృక్షంబునువలె చిత్తము దహింప యగ్నులునూ
మహీతలంబున బడిపోయెను మఱి మానుగ స్మృతి హీనుండగుచున్! 50

ఆ రావణు డిటు బడిపోవుటయును నలరి గాంచి యా పురుషుండున్
ఈ విధముగ బలికెను నాతనితో నింపుగ మధుర సువాక్యములన్
రాక్షస శ్రేష్ఠా! లెమ్ము లెమ్మికను రయమున యీ సమయనందున్
నీకు మరణమును లేదు సుమా! మఱి నీకు మృత్యువును లేదుగదా! 51

ఓ రాక్షస విను! నీకిది వఱకును వనర పితామహు డిచ్చిన యా
వరమును రక్షణ సేయగావలయు వనరగ యా కారణములచే
బ్రదికిపోయితివి పొమ్ము! రావణా! బరగ నిర్భయముగా నుండూ
మరణము లేదూ! నీకిప్పుడునూ మానుగ గలుగును మునుముందున్! 52

ముహూర్త కాలమునందు రావణుడు మోదముగా స్పృహ దెచ్చుకొనీ
ఆ రావణుడును భయమును బొందెను భగ్గున సురలను బీడించూ

లోక కంటకుండైన రావణుడు లోలత యా పురుషుని బలుకున్!
విని బహు చింతను జెంధి రావణుడు విమల తేజాతో నిటు పలికెన్! 53

యుగాంతానలా సన్నిభుండవును యుద్ధత విక్రమ వంతుడవునూ
నీ వెవ్వరివో దెలియ గోరెదను నిర్మల భావముతో దెలుపూ!
ఏ ప్రదేశమున నీవుండెదవూ! యెవరు నీకు మఱి బంధువులున్
ఎందువలన నీవిచట నుంటివీ? పొందుగ దెలుపుము వివరముగన్! 54

దేవదేవుడును, పరాత్పరుండును, దీరుగ దుష్టుండైనట్టి
యా రావణునీ వచనములను విని యలరి నవ్వి మేఘ ధ్వనితో
గంభీరంబగు బలుకులతోడను గడగి యీ విధముగను బలికెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 55

రావణ! నే నెవరైతే నేమీ రహి నీ కేమి ప్రయోజనమూ?
అచిరకాలమున నిన్ను జంపెదను నది మాత్రము మఱి నిజము సుమా!
ఆ మాటలు విని దశ గ్రీవుండును నంజలి ఘటించి యిటులనియెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 56

అల పితామహుని వచనము వలనను నల మరణము నాకును లేదూ!
మృత్యుమార్గమును లేనే లేదూ మృత్యువు దూరము నుండు సుమా!
నాతో సమానమైనవాడు మఱియును నయముగ జన్మింపగ లేదూ!
భవిష్యత్తునందున గూడను మఱి బన్నుగ జన్మింపగ బోడూ! 57

ఎవడు విక్రమము నాశ్రయించుకుని యిల పితామహుని వరంబునూ
లంఘింపగ గలవాడు లోకమున, నలి జన్మించియు లేదు సుమా!
భవిష్యత్తులో పుట్టబోడూ పన్నుగ యాపర విషయమునన్
పరిహారంబును లేదు సుమా మఱి పరిష్కారమును కనబడదూ
ప్రయత్నంబు మఱి జేసిన గూడను బన్నుగ దుర్బలమే యగునూ! 58

పితామహుడు నా కిచ్చిన వరమును బ్రిదుల గొట్టు వా డిల లేదూ!
అట్టి వానిని త్రైలోక్యంబుల నిట్టె కనుగొనను నిక్కముగా

ఓ సురశ్రేష్ఠుడ! దేవతా విభుడ వసరగ నే నమరుడను సుమా!
నాకు మరణమును లేనే లేదూ! నయముగ భయమును లేదు సుమా! 59

ప్రభూ! నాకు మరణము గలిగినచో బన్నుగ నీ హస్తము వలనన్
గలుగగ వలయును నితరుల జేతను గలగగ గూడదు! నిక్కముగన్!
నీచే మరణము గలిగినచో నది నిజముగ శ్లాఘింపగ దగునూ!
యశస్కరంబును గూడ నగును సుమ! వశమగు స్వర్గము గూడ మఱిన్! 60

అటుబిమ్మట యా భీమ విక్రముడు నల రావణుడును నేత్రములన్
ఆ దేవుని నిజ శరీరమందున యల సమస్తమగు ప్రాణులనూ
సచరాచరములతో గూడను మఱి సరసత త్రైలోక్యంబులనూ
కనుగొనె నాతడు కమనీయముగా కాంతివంతమగు రేఖలనూ! 61

పంద్రెడుగురగు నా దిత్యులునూ బరగ మరుత్తులు నేడుగురున్
సాధ్యులు మఱి యునష్ట వసువులును నేకాదశ రుద్రులును మఱియున్
పితృదేవతలు యముడు మఱియునూ వైశ్రవణుండును గనబడెనూ
సముద్రములు మఱి పర్వతంబులును, నదులు, వేదములు, విద్యలునూ
మూడగ్నులును గ్రహంబులును మఱి మోదమునను తారాగణముల్
ఆకాశము, సిద్ధులు, గంధర్వులు నలరు చారణులు గనబడిరీ
వేద విదులునగు మహా ఋషులునూ, విమలుడైన గరుత్మంతుడునూ
సర్పంబులు మఱి దేవగణంబులు సరసత మిగిలిన వారు మఱిన్!
దైత్యులు మఱియును రాక్షస గణములు దీరుగ సూక్ష్మ సురూపములన్
శయనించిన యా మహాపూరుషుని సహజ శరీర సుభాగములన్
అల రావణునకును నగుపించెను మఱి యలరు సహజ రూపంబులతో 62,63,64,65

అటుబిమ్మట యా సర్వాత్ముండగు నలరు రామచంద్రుడు నపుడున్
అగస్త్యమునితో బలికె నిట్టులను నలరుచు ప్రశ్నాపూర్వమునన్
ద్వీపమునందున యున్న పురుషుడును ధీరత యాతం డెవరు మఱిన్?
మూడుకోట్ల యా నృత్యకారులును మోదమునను మఱి యెవరచటన్?
దైత్య దానవుల దర్పమునణచీ దగ శయనించిన పురుషుండున్
ఎవ్వం డాతడు జవరాలును మఱి యింపుగ వివరింపుము నాకున్! 66

రామచంద్రునీ వచనములను విని రమ్యముగా నా యగస్త్యుడున్
మధురముగా నీ విధమున బలికెను మధురాక్షరముల గూడికొనీ
'రామచంద్ర! నే దెలిపెద వినుమా! రమ్యమైన వృత్తాంతంబున్
ద్వీపమునందున యున్నపురుషుడును దేవ దేవుడును నిత్యుడునూ
అల భగవంతుడు కపిల దేవుడని యలరి బలికెదరు మహితాత్ముల్! 67,68

ఆ ప్రదేశమున నృత్యవాద్యములు నలరుచు బలికెడివారు మఱిన్
ధీమతుడైనా యతని సహచరులు దీరుగ సంబంధీకులునూ!
వారు దేవతలు కపిలుని సమమగు వనరగ తేజంబు ప్రభావన్
గలిగిన వారును వినుము రాఘవా! కామితార్థ ప్రదులును వారున్! 69

శ్రీ రఘురామా! దశరథ రామా! శ్రితజన పాలన సీతారామ్!
పాప నిశ్చయము గల రావణునీ బన్నుగ యా కపిలుడు మఱియున్
కోప దృష్టితో జూడగలేదూ! క్రోధము తోడను గనలేదూ!
అందుచేతనే యా రాక్షసుడును కందువ భస్మము కాలేదూ! 70

నగ ప్రఖ్యుండగు రావణు డంతట నయముగ శరీరమంతటనూ
జమటలు బట్టిన వాడగుచును మఱి శీఘ్రము ధరణివి బడిపోయెన్
చాడీలను జెప్పెడి వాడును మఱి సరసత దాగిన రహస్యమున్
ఛేదించిన యటు ఛేదించె నతని భీతివాక్కులను బాణములన్! 71

అటుబిమ్మట యా మహాతేజుడును చటుల రాక్షసుడు రావణుడున్
చాలసేపటికి లబ్ధ సంజ్ఞుడై సరసత లేచిన వాడగుచున్
తూలుచు బొరలుచు బయనించెను తన దీరుగ ప్రస్థానంబునకున్!
ఎచట మంత్రులను వదిలి వచ్చెనో యచటికి బోయెను వేగముగన్! 72

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండములో
పంచమ ప్రక్షిప్త సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఇరువది నాల్గవ సర్గము

(రావణుడు నపహరించిన దేవతా కన్యాదులు స్త్రీలు విలపించుట వారు-
రావణునకు శాపము నిచ్చుట రావణుడు శూర్పణఖను ఓదార్చుట -
ఆమెను ఖరునితో గూడ దండ కారణ్యమునకు బంపుట)

సంహృష్టుండై దిరిగి వచ్చుచును సహజముగా దుర్బుద్ధియునూ
రావణుం డపుడు మార్గమునందున రయమున కంటికి కనబడినా
రాజకన్యలను ఋషి కన్యకలను రహి దివి కన్యకలను గూడన్
దానవ కన్యల నపహరించెనూ దగ నిర్బంధముగా వారిన్! 1

మహారాక్షసుండైన రావణుడు మానుగ మార్గము నందుననూ!
ఏ సుందరి యే కన్యను గానీ నింపుగా గాంచిన యాతండున్
ఆమె బంధు జనములను జంపీ యామెను జెఱబట్టుచును మఱిన్
తన విమానమున నిర్బంధించెను దగ కిరాతుని వలె నతడున్! 2

ఈ విధముగ యా దశగ్రీవుండును నింపుగ బన్నుగ కన్యలనూ
రాక్షస కన్యల మనుష్య స్త్రీలను రయమున యక్షుల కన్యలనూ!
దానవ కన్యల దగని రీతిగా దగ తన విమానమందుననూ
యధిరోహింపగ జేసి యాతడును నయముగ తనతో గొనిపోయెన్! 3

ఆ స్త్రీలందఱు నప్పుడచట మఱి యలరెడి బహు దుఃఖము వలనన్
అగ్ని జ్వాలలకు సమానమైనా యల శోకంబున భయంబునన్
పుట్టినట్టి భాష్పాంబుజ జలమును బొలుపుగ విడిచిరి సమముగనూ!
క్రూరమైన యా దారుణమునకును కుమిలి కుమిలి రోదించిరటన్! 4

దోష రహితలగు నా కన్యకలునూ దుఃఖ భరితలై భయంబుచే
అమంగళ ప్రదమైనటువంటీ యల దుఃఖాశ్రువులను గూడీ
నదులచేత మఱి సముద్రంబునూ నయముగ నిండిన యటుల మఱిన్
ఆ విమానమును నా పూరితముగ యల కన్యలతో నింపబడెన్ 5

ఆ విమానమును నధిరోహించిన యలవందల కన్యకలు మఱిన్
నాగ గంధర్వ కన్యకలును మఱి నయముగ ఋషి ముని కన్యకలున్
దైత్య దానవుల కన్యలు గూడను దగరోదించిరి తీవ్రముగన్
దుశ్శీలుండగు నా దశగ్రీవుని దూషించిరి మనసులయందున్! 6

దీర్ఘ కేశములు గల వారును మఱి సుచార్వంగములు గలవారున్
పూర్ణచంద్రునీ కాంతులు గలిగిన బొలుపుగ ముఖములు గలవారున్
బలిసిన స్తనములు గలవారును మఱి వజ్రవేది సమకాంతులునూ
రథకూబర సంకాశములైనా రమ్యములగు పిరుదులను గూడీ
మనోహరలు మఱి సురాంగనలతో మూనుగ సమానులగు వారున్
నిష్టిప్తకమగు కనక ప్రభలనూ నిండిన వారును సుమధ్యలున్
ఆ స్త్రీలును మఱి శోక భయంబులు నమితాతురతను జెందుచునూ,
వ్యాకుల భరితులుగా నుండిరి యట వనలతలకు వలె పెనుగాలిన్! 7,8

అట్టి కన్యకల నిశ్వాసంబుల యలరు వాయువుల నంతటనూ
సంప్రదీపితంబగు బుష్పకమును సంరుద్ధాగ్నులతోని మఱిన్
అగ్ని కుండముగ యా విమానమును నలరుచు నుండె ప్రకాశముగా
మగువల రోదన ధ్వనులపుడుండెను మరణ మృదంగము ధ్వనివోలెన్! 9

దశగ్రీవునకును జిక్కినట్టి యా దగ యౌవన మధ్యమునందున్
నున్న స్త్రీలు మఱి సింహంబునకును బన్నుగ వశమైపోయిన యా
ఆడలేళ్ల వలె దీన వక్త్రముల నల దైన్యపు ముఖములతోడన్
శోకాకుల నేత్రముల నుండిరీ శోచనీయమగు స్థితియందున్! 10

వారి లోపలను ఒక స్త్రీ తనలో వనరగ చింతించుచు నుండెన్
ఈతడు నను భక్షించివేయునో నింపుగ తన ఘన దంష్ట్రలతో
మఱియొక స్త్రీయును నాలోచించును మానుగ తన మది యందుననూ
ఈతడు మఱి నను జంపివేయునో యిలలో నన్నిక నుంపకనూ! 11

ఈ విధముగ యా స్త్రీలందఱునూ యిటునటు గాంచుచు రోదనలన్
తల్లుల దండ్రుల భర్తలనూ మఱి దగ సోదరులను స్మరించుచున్

దుఃఖ శ్లోకముల గూడిన వారై కుమిలి కుమిలి యేడ్చిరి యచటన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 12

నే లేకుండగ నా కుమారుడును నయముగ యెటులుండును హా! హా!
తల్లి యింక యెటులుండగలదు మఱి దగ సోదరుడును నెటులుండున్ ?
అని దలచుచునూ యా స్త్రీలును మఱి శోక సంద్రమున మునిగి రటన్
ఓదార్చెడి వారును లేరు కదా! వనరగ యెవరచటను లేరూ! 13

అయ్యో! నేమను బతి లేకుండగ యలరి యేమి జేయుదు నింకన్
మృత్యు దేవతా! కాళ్లకు మ్రొక్కుచు మతి బ్రతిమాలుచు నుంటిని నే
అనుభవింపగా వలయ దుఃఖమును అందుకు నను వే గొనిపొమ్మా!
పూర్వజన్మమున యెట్టి పాపమును బొందుగ జేసియు నున్నానో? 14, 15

దుఃఖించుచు నుండిన యందఱమును దుఃఖ సముద్రమునందుననూ
మునుగుచు తేలుచు నుంటి మిప్పుడును మోదముగను మము దరిజేర్చి
రక్షించెడి వాడెవ్వడైననూ రయమున కనిపింపడు మాకున్
ఈ శోకమునకును యంతము దరియును నింపుగ కనబడుటయు లేదూ! 16

ఛీ! ఛీ! ఛీ! యీ మనుష్యలోకము జీకు జింతలను నుండుగదా!
దీనికంటె మఱి యధమ లోకమును దీరుగ కనుపింపదు యెచటన్!
బలవంతుండగు రావణు గాంచి బలహీనులునగు మన భర్తల్!
ఉదయించెడి సూర్యుని గాంచుచునూ యురుతర గ్రహములు గూడ మఱిన్
మాసిబోయినటు మణగి పోయిరి మఱల గాన రాకను వారున్! 17

ఏ మాశ్చర్యము! ఏ మాశ్చర్యము! యీ బలీయ రాక్షసుడు మఱిన్
ఇతరుల వధించు యుపాయములచే నింపుగ సంతసమున నుండెన్!
ఏ మాశ్చర్యము చెడు నడవడికను ఇల దుశ్చర్యలు జేయుచునున్నా!
తనను గుఱించియు నీషణ్మాత్రము దగ జుగుప్స బొందుట లేదూ! 18

ఈ దురాత్ముని పరాక్రమంబును యీ దుష్టుని విజయంబులునూ
ఈతని ఘోర తపస్సును మఱియును నీతని బంధు సుప్రీతియునూ

అన్ని విధములా తగియే యున్నది సున్నితముగ పరిశీలింపన్
పరదారాభిమర్శనంబు మఱి పాపము నీతనిలో గలదూ!
ఈ పాపమె మఱి చుట్టుముట్టునూ యిల లేకుండగ జేయునికన్! 19

దుర్మతియగు నీ రాక్షసాధముడు దుర్మదాంధుడై పరస్త్రీలన్
బలవంతముగా వశము జేసికొని బాధలు బెట్టుచు నున్నాడో
ఆ కారణమున స్త్రీ మూలముననూ నలరి మృత్యువును బొంది మఱిన్
చరిత్రలో చిరస్థాయిని నుండును చరిత్రహీనునిగా జగతిన్! 20

పవిత్రలగు నుత్తమ వనితలచే బన్నుగ శాపము వలె వారున్
బలుకు చుండగా గగనమునందున బన్నుగ దుందుభులును మ్రోగెన్!
చల్లని గాలులు వీచెను జగమున శాంతి వచనములు వినబడియెన్!
దేవతలందఱు బుష్ప వృష్టియును దీరుగ గురిసిరి దివి నుండీ! 21

పతివ్రతలునగు నుత్తమ స్త్రీలును బన్నుగ యందఱు గలిసి మఱిన్
ఒక్క మారుగా నొకే విధముగా నొనరగ శాపము నీయగనూ
ఆ రావణునీ తేజస్సంతయు యణచి వేయ బడినట్లయ్యెన్
కాంతి విహీనుండయ్యెను మనసును గలతను బొందిన యట్లయ్యెన్! 22

రాక్షస పుంగవుడైన రావణుడు రయమున వారి విలాసమునూ
వినుచు గనుచు మఱి విహ్వాలుడగుచును విను వీధిని పుష్పకమందున్,
రాక్షసీయులా రమ్య పూజలను రమ్యమైన జయ ధ్వని వినుచున్,
లంకేశ్వరుడును లంకాపురమును శంక లేక ప్రవివేశించెన్! 23

అటుబిమ్మట మఱి యింత లోపలను నల రావణునీ సోదరియున్
భయంకరంబగు రూపము గలదియు బరగ కామ రూపిణియు మఱిన్
అయినటువంటీ శూర్పణఖా మఱి నటు చరచర బిరబిర వచ్చీ
అలరావణునీ పాదంబులపై బలబల యేడ్చుచు బిగ్గఱగన్! 24

రావణు డంతట తన సోదరినీ రయమున యోదార్చుచును మఱిన్
లేవదీసి మంగళ ప్రదురాలా! లీలగ నాతో నేదేదో!
దెలుపదలచుచున్నట్లు నుంటివీ! దీరుగ దెలుపుము! నదియేమో!

అటు బిమ్మట నాతని సోదరియును నలరు భాష్ప పరి రుద్ధాక్షీ!
రక్షాక్షియునగు శూర్పణఖాయును రయమున బలికెను నా రీతిన్! 25, 26

బలవంతుడవగు నీ జేతను మఱి బలోత్కారముగ విధవనుగా
జేయగబడితిని విధి విలాసమును ఛీ యని లోకులు దలపగనూ!
ఓ రాజా! మఱి కాలకేయులను నొప్పుగ ప్రసిద్ధుడైనట్టి
పదునాలుగు వేల్ దైత్యులనూ మఱి బన్నుగ రణమందున నీవున్
సంహరించితివి విక్రమంబుచే సంహరించితిని నా భర్తన్ 27

నాయన! నా ప్రాణంబులకంటెను నయముగ గరీయసుండైనా
మహాబలుడు నా భర్తయు యుండెను, మానుగ యా సైన్యమునందున్
సోదరుడను యా పేరుతోడ మఱి సురుచిరముగ నా శత్రువునై
నీ చేతను మఱి చంపబడెను గద! నిక్కముగా నా భర్తయునూ! 28

ఓ రాజా! నీ నాత్మబంధుడవు! నొనరగ నీ చేతను నేనున్
స్వయముగ నే బాధింపబడితినీ సార్వభౌమ విను! నా పలుకుల్
తత్కృతమగు వైధవ్య శబ్దమును దగయనుభవమును నొందుచునూ
విధి విలాసమును దప్పించుటకును పథికులెవ్వరును రారుగదా! 29

రణముల యందున యింటియల్లునీ రయమున రక్షింపగ వలయున్
ఇట్టి ధర్మమును లోకమునందున యింపుగ గలదు సుమా! జూడన్!
అట్టి యల్లునీ నీవే స్వయముగ యిట్టె జంపితిని నిర్దయతన్
నీవే స్వయముగ జంపినావు గద! నిర్లజ్జను నుంటివి నీవున్! 30

క్రోశమానయగు నా శూర్పణఖయును క్రోధముతో నీ విధి పలుకన్
దశగ్రీవుండును దన సోదరినీ దగ యోదార్చుచు దగు రీతిన్
బ్రతి మాలుచు నీ విధముగ బలికెను మఱి మంతుం డా రావణుడున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 31

ఓ వత్సా! ఓ సోదరి వినుమా! యొనరగ నాదు సువచనములన్
ఏడ్పునదంతయు చాలు! చాలు లే! యేడ్వబోకుమా! శూర్పణఖా!

ఏ విధముగనూ భయపడవలసిన యెట్టి కార్యమును లేదు సుమా!
దాన మాన ప్రాసాదంబులచే దగు ప్రయత్న పూర్వకముగనూ!
సంతోషంబును గలుగజేసెదను చింతమాను సోదరి మఱియున్! 32

రణమునందు విజయమును గోరుచును రయమున శరముల విడుచుచునూ
మనసు చెదిరినది మదిలో యేదో మానసికంబగు తెరలు బడెన్!
యుద్ధమునందున పొరబడితిని నే యుద్ధతితో పోరాడితినీ
తన వారెవరో యితరులెవ్వరో తగ తెలియగనూ లేదుగదా! 33

ఓ సోదరి విను! యుద్ధమునందున వనరగ దుర్మదుడను నగుచున్
నున్న నేను కొట్టే సమయమునను యున్న యల్లు గుర్తింపకనూ
అందువలన నీ భర్త యుద్ధమున చందముగా మరణించె సుమా!
బాణంబును నే ప్రయోగించితిని బన్నుగ యల్లునిపైని మఱిన్! 34

నీ తల్లికి సోదరి కుమారుడును నీకు సోదరుడు నైనట్టీ
ఆ నిశాచరుడు ఖరుడు సుమా మఱి యాతడు నీ యాజ్ఞకు లోనై
వర్తిలుచుండును నీవు జెప్పినటు నొనరగ కార్యములన్నియునూ!
జేయుచుండునూ నీవే రాణివి! నీవే సర్వము దండకకున్! 35

ఈ వీరుడు ఖరుడును దండకకు నింపుగ మఱి రక్షించుటకున్
వెడలుగాక! యా వీరుని తోడను వెడలు దూషణుడు గూడ మఱిన్,
బలాధ్యక్షునిగ నుండును నచ్చట బలవీర్యంబులు జూపుచునూ!
నీవు గూడ వెడలుము వారలతో నిఖిలము బరివేక్షించుటకై! 36

శూరుడైన యా ఖరుడు దండకను సురుచిరముగ నీ వచనములన్
అనుసరించి జేయుచునుండును సుమ! యలరి సర్వకార్యంబులనూ
ఇతడు భావిలో కామరూపములు నింపుగ ధరింపగలిగిన యా
రాక్షసులకునూ నాయకుండునై రమ్యముగా నుండును నచటన్! 37

ఆ రావణుడును నటుల బలుకుచును నలరుచు ఖరునకు సైన్యముగా
పదియునాలుగూ వేలమందినీ పరాక్రమము గల వీరులనూ!

ఉండవలసినదిగా రాక్షసులకు ఖండితముగ యాజ్ఞాపించెన్!
ఆ సైన్యంబును నాయుధములతో నలదండుకును వెడలె మఱిన్! 38

ఘోర దర్పనుండగు ఖరుడును మఱి ఘోర రాక్షసుల గూడికొనీ
అందఱి తోడను గూడిన వాడై చందముగా నిర్భయు డగుచున్
పదునాలుగు వేల్ రాక్షస సేనయు బన్నుగ ఖరుతో బయనింపన్
దండక యరణ్యమునకును వచ్చెను దగ దూషణుతో గూడికొనీ! 39

రాక్షసుడైనా యాఖరుండునూ రయమున దండక వనముననూ
నిహిత కంటకంబైన రాజ్యమును నిర్మాణము జేసెను నతడున్
ఆ శూర్పణఖయు దండక వనమున యలరు సుయాజ్ఞాకారిణీగా
ఆ దండకలో వసియించెను మఱి యలరుచు స్వేచ్ఛా రూపమునన్! 40

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఇరువది నాల్గవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఇరువది యైదవ సర్గము

(మేఘనాథుడు యజ్ఞములు జేసి సఫలత్వమును బొందుట, విభీషణుడు పరస్త్రీ హరణము మంచిదికాదని రావణునకు బోధించుట -రావణుడు కుంభీనసిని ఓదార్చి మధువుతో కలిసి దేవలోకమును ఆక్రమించుటకు బోవుట)

ప్రసిద్ధుడైనా దశగ్రీవుండును బన్నుగ యా ఖరునకు వేగన్
భయంకరంబగు సైన్యము నిచ్చీ బరగ దండకకు బంపించీ
సోదరియైన శూర్పణఖను మఱి సురుచిరంబుగను నోదార్చీ
సంతోషించుచు నా రావణుడును స్వస్థ చిత్తుడాయెను నచటన్! 1

అటుపిమ్మట బలవంతుడైన యా చటుల రాక్షసుడు రావణుడున్
తన మంత్రులనూ, తన యనుచరులను తగిన విధముగా గూడికొనీ
నికుంభిలా యను నుత్తమమైనా నిరుపమానమగు వనమునకున్
లంకకు దగ్గఱ నున్నదియును మరి లావగు శోభల గలదియునూ! 2

బహు శోభలతో ప్రజ్వరిల్లుచును భగభగ మండుచునున్నాడా
యనునట్లుండిన రావణుండునూ యట జరిగెడి యజ్ఞము గాంచెన్
యూ పశతాకీర్ణంబును మఱియును సౌమ్య చైత్యోపశోభితమున్
అందమైన దేవాలయంబులను నలరి ప్రకాశించుచు నుండన్
ఒక యజ్ఞంబును జరుగుచుండెనూ యొనరగ రావణుడును గాంచెన్! 3

అటు బిమ్మట యా ప్రదేశమందున చటుల రావణుడు దర్శించెన్
కృష్ణాజినము ధరించిన వాడును, కమండలము, శిఖ, దండంబున్
గలవాడును మఱి తన కుమారుడును గగనంబున దిరిగెడి వానిన్
భయంకరుండగు మేఘనాథునీ భవ్య మనస్సును గలవానిన్! 4

లంకేశుండగు రావణుండునూ లాలితముగ నతనిని జేరీ
బాహువులను మఱి జాచి యాతనిని బన్నుగ కౌగిలి జేర్చికొనీ
ఇటులను బలికెను మేఘనాథుతో నింపగు వచనంబుల తోడన్

వత్సా! యిచటను యే కార్యంబును నొనరగ జేయుచు నుంటివిగా
యధార్థముగనూ తెలియజేయుమా! యది సంతసమున నే వినెదన్! 5

ఆ సమయంబున ద్విజ శ్రేష్ఠుండును నల మహా తపసు గలవాడున్
అయిన శుక్రుడును నల రావణుతో నలరి బలికె నీ విధముననూ
యజ్ఞమునకు యజమానుడైన యా నలరు మేఘనాధుండు మఱిన్
మౌన వ్రతము బాటించుచుండెనూ మానుగ మాటాడక యుండీ!
మాటాడినచో యా యజ్ఞంబును మానుగ యసమృద్ధంబగునూ
యజ్ఞ సిద్ధి పరిపూర్ణమగుటకై యా శుక్రుడు పలికెను నిటులన్! 6

ఓ రాజా! వినుమా! నే దెలిపెద! విశదముగా వృత్తాంతంబున్
నీ కుమారుడును మేఘనాథుడును నిక్కము ఘన కార్యము జేసెన్!
ఎవ్వరు జేయని ఘన యజ్ఞంబులు నింపుగ నీ కొమరుడు జేసెన్
అతి విస్తృతములు నైన యజ్ఞములు నలరి జేసె యాలు న్నొకటిన్! 7

అగ్నిష్టోమము, బహు సువర్ణకము అశ్వమేధ యజ్ఞమును మఱిన్
అశ్వమేధ యజ్ఞంబును జేసెను నలరి  రాజ సూయయాగము జేసెన్
గోమేధము మఱి వైష్ణవ యజ్ఞము కూర్మి పూర్తి చేయగబడియెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 8

అధికముగా బంగారు దానమును నలరి జేయవలసిన యట్టీ
ఇతరు లెవ్వరును జేయగజాలని నిందుధరుని యా యజ్ఞంబున్
నీ కుమారుడును పూర్తి జేసెనూ నిర్మల మగు దీక్షను బట్టి
సాక్షాత్తుగ యా పరమేశ్వరుడే సరుగున నిచ్చటికిని వచ్చీ
నీ కుమారునికి వరముల నిచ్చీ నిండు హృదయమున జనె నతడున్! 9

నీ కుమారుడును కామగమైనది నిఖిలము నంతయు దిరుగునదీ
యాకాశంబున సంచరించెడు యా స్థిర దృఢమగు రథంబునూ
కాఱు చీకటిని సృష్టించెడి యా కఠినమైన తామసి యనెడీ
మాయనుగూడను వరములుగా మఱి మహి దుర్లభమైనవి బొందెన్! 10

రాక్షసేశ్వరా! యుద్ధమునందున రహి ప్రయోక్తమును నైనట్టీ
ఈ మాయా సంచారము జగతిని నింపుగ తెలియగ జాలరుగా
సురలజేత మఱి యసురుల జేతను సురుచిరముగ దేవేఱులచే
తెలియగ శక్యము కాదుగదా మఱి తేటతెల్లముగ విషయంబున్! 11

ఓ రాజా! బాణంబుల కూడిన యొనరగ యక్షయములు నైనా,
అంబుల పొదలును సుదుర్జయంబగు నలరు ధనుస్సును మఱి పొందెన్!
యుద్ధమునందున శత్రు ధ్వంసనము యుద్ధతి గల వస్త్రంబులనూ!
నీ కుమారుడును యజ్ఞ ఫలంబుల నింపుగ సంపాదించె మఱిన్! 12

ఓ లంకేశ్వర! నీ కుమారుడును వనరగ సకల సువరములనూ
లబ్ధిని బొందీ యీ దినంబునను లాలితముగ నిను గాంచగనూ!
యజ్ఞ సమాప్తము దినమునందునను నలరుచు నిను దర్శింపగనూ
కోరికతో నున్నాడు సుమా మఱి కూర్మి సంతనముతో నుండెన్! 13

అటు బిమ్మట యా దశగ్రీవుండును నలరి బలికె యీ విధముననూ
'ఈ జేసిన పని మంచిదికాదూ' యింపుగ నే దలచుచునుంటిన్
ఎందుచేతనన మన శత్రువులగు ఇంద్రాదులు మఱి వరణుండున్
ఆయా ద్రవ్యములను యర్పించీ యలరి జేసి రా యజ్ఞములన్! 14

ఓ సౌమ్యుడ! యిక రమ్ము! పోవుదుము! నొనరగ జేయునది లేదూ!
జరిగిపోయినా దానిని మఱలను జరుపలేము గద! మఱల నికన్!
శక్యము కాదుగదా మనకును నిక సాధ్యము కాదుగదా విజ్ఞా!
రండి పోవుదుము! మన గృహమునకును దండయాత్ర గూరిచి చెబుదున్! 15

అటి పిమ్మట యా దశగ్రీవుండను నలరు సుతునితో దమ్మునితో
కలిసివెళ్లి కన్నీటి తోడనూ గద్గద స్వరంబుతో నున్నా
అందమైన యా స్త్రీల నందఱిని యపురూపముగా జూచుచునూ!
విమానమున నుండియును దింపెనూ వికలమైన యా వనితలనూ! 16

ధర్మాత్ముండగు విభీషణుండును దగ యుత్తమ లక్షణములనూ
గలవారును మఱి దేవదానవుల కఱకు రాక్షసుల యందుననూ

రత్నములయినా స్త్రీలను గాంచి రయమున వారల విషయంబుల్!
అతని మనస్సున యభిప్రాయమును నలరి దెలిసికొని విభీషణుడున్
దశగ్రీవునితో నిటులను బలికెను దగ భ్రాతృత్వము దొలుకంగన్! 17

అన్నియు దెలిసియు గూడను నీవును అలరి యిటుల వర్తించుటయున్
సర్వనాశనము గలుగగ జేయును శాంతిని భంగము జేయుగదా!
పేరు ప్రతిష్టలు, ధనము కులంబును పెద్దఱికము నశియించుగదా!
ప్రాణుల హింసను జేయుచుంటివీ పన్నుగ యిష్టము వచ్చినటుల్! 18

రాజా! రావణ! వీరి బంధువుల రయమున బీడించియు మఱియున్
ఈ స్త్రీలందఱ దెచ్చినాడవును నిల బలవంతముగా మఱియున్
నిన్ను గణింపక లెక్క సేయకను నీతి విడిచి యా మధువు మఱిన్
కుంభీనసినీ హరించినాడూ! కుల మర్యా.దలు లేకుండన్! 19

రావణుడైతే యీ విధి బలికిన రయమున తమ్ముని పలుకు వినీ
ఏమి జరిగినదొ తెలియదు నాకును నెటుల జరిగినదొ తెలియదుగా!
నీవు దెలుపు నా మధువెవ్వడొ మఱి నిక్కము నర్థము కాలేదూ!
కుంభీనసియును స్మృతిని లేదు మఱి కూరిమి యంతయు దెలుపు మఱిన్! 20

విభీషణుండును సంక్రుద్ధుండై విపుల బలుండగు సోదరుతో
పరుష వాక్యముల నీ విధి బలికెను బరగ సూదులుగ గ్రుచ్చుకొనన్!
నీ పాపపు కర్మలకు ఫలితము నెట్టి ఫలము ప్రాప్తించినదో!
కనులు దెఱచి కనుగొనుము రావణా! కానబడును నీకంతయునూ! 21

మన మాతా మహుడైన సుమాలికి మామగ యన్నయు, మన తల్లీ,
పెదతండ్రియు మఱి మనకు పూజ్యుడును బ్రీతిగలిగినా·వాడు మఱిన్
మాల్యవంతుడను ప్రసిద్ధి జెందిన మహిత బుద్ధి శాలియు మఱియున్
ఆ రాక్షసునీ కుమార్తెకును మఱి అలరు కుమార్తెయు యైనదియున్
దౌహిత్రీ యన వలసియున్నదీ దగ కుంభీనసి యను పేరున్!
మధువను రాక్షసు డామెను జెఱగొని మానుగ గొని పోయెను వేగన్!

మనము జేయు పాపములకు ఫలితము మన సంతతి యనుభవ మందున్
అద్దమందు ముఖమును గనినట్టుల యనుభవింతు మంతయు మనమున్! 22, 23

మన తల్లికి సోదరియునైన యా మానుగ యనలయు గలదు గదా!
ఆమె కుమార్తెయె కుంభీనస సుమ! యలరు సుందరియు మధుమతియున్
అన్నదమ్ములము మనకందఱికిని బన్నుగ ముద్దుల సోదరియున్
వరుసకు చెల్లెలు నగును గదా! మఱి వైవాహికమును జేయవలెన్!
అట్టి సోదరుని ఎత్తుకబోయెను నిట్టె మధువు యను రాక్షసుడున్! 24

రాజా! రావణ! విను నా పలుకులు రమ్యమైన వృత్తాంతబున్
ఆ సయమంబున మేఘనాథుడును నలరి యజ్ఞమును జేయుచునూ
నుండెను నేనును తపస్సునందున నుంటిని నీటను వసించుచున్!
అట్టి సమయమున బలవంతముగా నిట్టె మధువు ఎత్తుకుపోయెన్! 25

మహారాజ! యా సమయమునందున మానుగ సుకుంభకర్ణుండున్
నిద్రననుభవించుచు నుండెను మఱి నిదుర లేపినను లేవడుగా
రాక్షస శ్రేష్ఠుల యమాత్యులను మఱి రయమున జంపి యా మధువున్
అంత పురమున నున్న సోదరిని యపహరించె బలవంతముగా! 26

మహారాజ! మా కీ విషయంబును మానుగ తెలిపినను గూడన్
క్షమించి యతనిని వదిలి వేసితిమి! చంపలేదు మఱి యాతనినీ
సోదరు లేనాటికి గూడను మరి సురుచిరముగ తమ కన్యకనూ
భర్తకు నివ్వగ వలసినదే కద! బాగోగులనూ జూచి మఱిన్! 27

చెడ్డ బుద్ధి గల సోదర వినుమా! చెడును జేయు చున్నాడవునూ!
అట్టి పాపములకును ఫలితమునిదె! యీ లోకంబున జరిగినదీ
ఈ జన్మంబున వచ్చినదీ మఱి యిపుడె వచ్చినది ప్రస్తుతమున్!
అను విషయంబును నాలోచింపుము! అన్ని విషయములు దెలియు మఱిన్! 28

రాక్షసేంద్రుడగు రావణుండునూ రయమున తమ్ముని పలుకు వినీ
తాను జేసిన చెడ్డ పనులచే తగ దుష్టత్వము జేత మఱిన్
ఉద్ధూతుండై వ్యాకుల మందీ నురుతరమగు చింతను గూడీ!
తస్త్రాంభాసాగరమును బోలెనూ తపన జెందె నా రాక్షసుడున్! 29

అటు బిమ్మట రావణుడు క్రుద్ధుడై యలరి రక్త లోచనుడగుచున్
అలరి మంత్రులను బలికె నిట్టులను బలబల పలుకులు బలుకుచునూ!
శీఘ్రముగా నా రథమును వేగము సిద్ధము జేయుడు భటులారా!
మనరాక్షస ఘనశూరులందఱును మానుగ సిద్ధము గావలయున్! 30

నా సోదరుడగు కుంభకర్ణుడును నయముగ ముఖ్య నిశాచరులున్
ఎవరున్నారో వారందఱునూ యింపుగ భయంకరాయుధముల్
గ్రహించి వారల వాహనంబులను ఘనముగ యధిరోహించి మఱిన్
దండయాత్రకై బయలుదేరవలె దగ దేవతలను నోడింపన్! 31

రావణుడంటే భయములేని యా రయమున మధువును రణమందున్
జంపి స్నేహితుల గూడి శీఘ్రముగ సరసత యుద్ధము గోరుచునూ
సుర లోకమునకు బోయెద నిప్పుడు చొప్పడ సురలను మర్దింపన్
జైత్రయాత్ర నిక బూర్తి జేసెదను జనులందఱు నను గీర్తింపన్! 32

యుద్ధంబును మఱి గోరుచున్న మా యుద్ధతి రాక్షస బలము మఱిన్
నాలుగు వేలా యక్షౌహిణులును నయముగ రాక్షస సైన్యంబున్
అనేక విధముల యాయుధంబులును నలరి ధరించియు శీఘ్రముగన్
సంగ్రామమునకు బయలుదేరినవి సార్వభౌముని యాజ్ఞలచే! 33

ఇంద్రజిత్తు కొందఱు సైనికులను సాంద్రత పరిగ్రహించి మఱిన్
సైన్యంబునకును ముందు నడిచెనూ సరసత శూరత్వముతోడన్
రావణుండు మఱి మధ్య బాగమును రమ్యమైన పుష్పకమందున్
కుంభకర్ణుడును సైన్యంబునకును గూరిమి వెనుకను బయనించెన్! 34

ధర్మాత్ముండగు విభీషణుండును దగ లంకా నగరము నందే
ధర్మంబును తా నాచరించుచును దగ దెలుపుచు పరులకును మఱిన్
మహాభాగులగు మిగిలిన వారలు మధువు వసించెడి పురమునకున్
వెడలిరి వారలు తమ తమ పనులకు నెక్కసక్కెమును విడనాడీ! 35

సమస్తమైనా యా రాక్షసులును సకలాకాశము గ్రహియించీ
అవకాశంబును లేనిదానిగా నటుల జేసి రా సమయమునన్

గార్దభములతో, ఒంటెలతో మఱి కడు తేజములగు నశ్వములన్
ప్రవేశించెడీ శింశుమారములు బరగ మహా సర్పంబులనూ
పయనించిరి వారందఱు గూడను బన్నుగ యడుగులు వేయుచునూ! 36

సురలతొ వైరము బెట్టుకొనిన యా శూరులు వందల కొలది భటుల్
దైత్యులు గూడను రణమును గాంచీ దగ రావణునీ గాంచి మఱిన్!
ఆతని వెనుకను బోయిరి వారలు నలరి రణంబును సేయుటకై
పాత కక్షలను దీర్చుకొనుటకై పగ సాధించుటకును మఱియున్! 37

మహాబలుండగు రావణుండునూ మధువు వసించెడి నగరంబున్
మార్గ మధ్యమున గనుగొనె నాతడు మందలింప బోయెను పురికిన్!
మధు రాక్షసుడట కనబడలేదూ మఱిగుండెను దన పడకగదిన్
తన సోదరి కుంభీనస మాత్రము దగ కనిపించెను నాతనికిన్! 38

ఆ సమయంబున కుంభీనసయును నలరి భయబడుచు వేగముగన్
వంగిన దోసిలి గలదై యామెయు చెంగున నమస్కృతుల జేసీ
రాక్షసుడైనా యా రావణునీ యలరు పాదముల శిరస్సుతో
స్పృశించి మఱలను నమస్కరించెను గూరిమి వినయంబును జూపెన్! 39

లంకేశ్వరుడగు రావణాసురుడు శంక లేక తన సోదరితో
'భయపడకమ్మా! భయపడకమ్మా!' బలుకుచు నామెను రాక్షసుడున్
లేవదీసి శిరసును ముద్దాడీ లీలగ యామెను బ్రశ్నించెన్
'ఇపుడు నీకు నే నేమి సేయవలె?' నింపుగ సంతసమును జెందన్? 40

మానవతియు నగు నా కుంభీనస మహాభుజునితో నిటు లనియెన్
'మానంబును రక్షించు వాడవును మహా భుజుడవగు ఓ రాజా!
ప్రసన్నుండ వగుచో నా యందున బరగ నాదుపతి దేవునకున్
అపకారంబును సేయకుమా మఱి యలరి ప్రాణమును దీయకుమా!
సోదరినైనా నా కోరిక యిది! శూరుడ! మఱి యొకటియును లేదూ! 41

కులస్త్రీలకు నీ లోకమునందున కూరిమి యెన్నో భయంబులున్
దుఃఖంబులు మఱి యుండును గానీ దుఃఖంబది పెనుభూతంబున్!
వైధవ్యం బది గొప్ప వ్యసనమూ వనరగ యిట్టి భయంబు మఱిన్!
మఱి యొక్కటి యిల కనబడ దనుచును మానుగ విజ్ఞులు బలుకుదురా! 42

ఓ రాజేంద్రా! అన్నా! గనుమా వనరగ నాదు బరిస్థితినీ
యాచించెడి నను గనుము సోదరా! యాలోచింపుము మది యందున్
మహా బాగ! భయపడకు మటంచును మానుగ నీవే బలికితివీ!
నీ మాటను నిలబెట్టుకొనుము మఱి నిలకడగలవాడను ననుచున్! 43

మహాబలుండగు రావణుండునూ మది సంతసమును జెందుచునూ
అచట నిలిచినా తన సోదరితో నలరుచు నీ విధముగ బలికెన్!
నీ భర్తయునగు మధు వెచ్చటనో నిఖిలము నాకును దెలియునటుల్
నివేదింపుమా! చెల్లీ వేగము నిశ్చయముగ జూతును నతనిన్! 44

అల సురలోకము జయింపగా మఱి యలరి బోయెదను నిపు డిపుడే
అల మధువును నే గూడిపోయెదను! యల దేవతలను నొంపగనూ
నీ మీదను గల కరుణ జేతనూ, నిండు ప్రేమతో గూడికొనీ
మధువును జంపగ విరమించితినీ మానుగ నీ ప్రార్థన వలనన్
సోదరి మాటను జెల్లింపగవలె శూరుడైన చోరుడునైనన్! 45

ఆ రాక్షసియునగు కుంభీనసయును అల రావణుడును బలికిన యా
మాటలకును మఱి సంతోషించుచు మధువును లేపుటకును బోయెన్
ప్రసుప్తుండునగు భర్తను లేపీ బన్నుగ యీ విధమున బలికెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 46

మహాబలుండును లంకేశ్వరుడును మానుగ నా సోదరుడు మఱిన్
అల దశగ్రీవుడు నిన్ను గాంచగను నలరి వచ్చినా డది గదిగో!
సురలోకంబును జయింప గోరుచు సురుచిరముగ నీ సహాయమున్
గోరుచు మదిలో నిను గొనిపోవగ గోరుచుండె విజ్ఞానముగా! 47

అందువలన ఓ రాక్షస వినుమా! చందముగా బరివారముతో
బోయి యతనికిని సాయము జేయుము! పులకిత గాత్రుడనై నీవున్!
కోరినపుడు స్నేహము గల వారల కోరిక దీర్చుట యుక్తమనీ
ప్రయోజనంబును దీర్పగావలయు బన్నుగ యవసరముల యందున్! 48

మధువును యా మాటలు విని శీఘ్రము మానుగ యటు జేసెద ననుచున్
అతుల బలికి న్యాయానుసారముగ చటుల రావణుని గాంచె నటన్
కలిసికొనుచు యా రాక్షస రాజును కమనీయముగా పూజించీ
యథావిదిని సత్కారంబులనూ నింపుగ జేసెను నాతండున్! 49, 50

వీర్యవంతుడగు! దశగ్రీవుండును విలసిత మధువు గృహంబుననూ
పూజను సత్కారములు బొంది మఱి పొలుపుగ ఒక రాత్రియు నచటన్!
గడిపి మఱల దా బయలుదేరెనూ గగనములో బుష్పక మందున్
మంత్రులతో, సహచరుల తోడనూ మానుగ మధువను రాక్షసుతో! 51

మహేంద్రాభగల రాక్షసేంద్రుడును మానుగ యా రావణుడు మఱిన్
కుబేరునకు మఱి నివాసమైనా కూరిమి వైశ్రవణాలయమున్
ఆ కైలాసపు పర్వతంబునను నలరి జేరి తన సైన్యముతో
విడిది జేయించి విమల దృశ్యములు వేమఱు గాంచెను హృష్టుండై!

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఇరువది యైదవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము ప్రథమ సంపుటము

# ఇరువది యాఱవ సర్గము

(రావణుడు రంభను బలాత్కరించుట - నలకూబరుడు రావణుని శపించుట)

దినకరుండు హస్త్రాద్రివి బొందగ దిశలు సంధ్యలును వ్యాపింపన్
మహావీర్యవంతుడును రాక్షసుడు మానుగ దశగ్రీవుండు మఱిన్
సహచరులును, మంత్రులతోడను మఱి సాహసలగు శూరులతోడన్
అచట వసింపగ నిశ్చయించెనా యందమైన ప్రకృతి మధ్యన్! 1

తుల్య పర్వతపు వర్చస్సును గల విమల స్వచ్ఛుడగు చంద్రుండున్
ఉదయింపగనే యురుతరమైనా యున్నతమగు నాయుధములనూ
ధరించినట్టీ ఘన సైన్యంబును దగ యచ్చట నిద్రించినదీ
సుఖ మెఱుగదు మఱి కష్ట మెఱుగదూ చోద్యమైన యా నిద్రయునూ! 2

పర్వత పైభాగమున గూర్చొనిన బరగ పరాక్రమ వంతుండున్
మహావీర్యుడును లంకేశ్వరుడును మానుగ రాక్షస రావణుడున్
చంద్ర కిరణములు బ్రకాశింపగా సాంద్రచారు శుభ శోభలలో
పర్వత మందలి భోగ్య వస్తువుల బన్నుగ గాంచెను రావణుడున్! 3

ఆ కైలాసపు పర్వతమందున! యా వన ప్రాంతము లందుననూ
కర్ణికారముల తోడను మఱియును కదంబ పుష్పలంబుల తోడన్
వికసించిన యా పద్మలతలతో విమల మందాకిని జలములతో
చంపక యశోక వృక్షంబులతో చారు పుష్పల వృక్షంబులతో
మందారము మఱి చూతంబులతో మానుగ లోధ్ర ప్రియంగులతో
అర్జున కేతక తగరంబులతో నారికేళ పాటలములతో
ప్రియాల మఱియును బవస వృక్షములు ప్రియమగు తదితర వృక్షములన్
ప్రకాశించుచుండెను యా ప్రాంతము పక్రృతి మాత బులకించుచునూ!

అట్టి రమ్య వన ప్రాంతమునందున నిట్టె మధుర కంఠంబులతో
బాడుచున్న యనురాగ వంతులగు బన్నుగ యా కిన్నర లపుడున్

మన్మథ పీడితలై తమ సఖియల మనసున కానందము గలుగన్
0మధుర గానమును జేయుచుండిరీ మంజుల సుప్రియ గీతములన్! 4, 5, 6, 7

ఆ ఉద్భాసిత వనాంతరంబున యల విద్యాధరులును వపుడున్
మదముచేత రక్తాంతలోచనులు మానుగ గలవారును నగుచున్
స్త్రీలను గూడను కలిసినవారై చిగురుబోడులను బులకించీ
తమ వనితల గలిసియు క్రీడించిరి దగ బొందిరి యానందంబున్! 8

ధనదాలయమున గానము జేసెడి దగ యప్సర గణ సంఘములున్
వారు బాడెడీ మధుర గీతములు వనరగ సుస్వర నాదములున్
ఘంటల ధ్వనివలె వినబడుచుండెను కమనీయంబగు సుస్వరముల్
వేయికోకిలలు వేయి హంసలును విమల ధ్వనులను జేసినటుల్! 9

వాయువు జేతను గొట్టబడినదై వనరగ పుష్ప సువర్షములన్
విడుచుచున్న మధుమాధవ గన్దిత విమలమైన యా వృక్షములున్
ఆ కైలాస సుపర్వతంబునూ యలరి సుగంధము గలిగించీ
వర్ధిల జేయుచు నున్నట్లుండెను వనరగ యా వృక్షంబులునూ! 10

సుఖకరమగు వాయువు తోడను మఱి సురుచిరమగు మకరందముతో
పరిమళమునుగల పుప్పొడితోడను బన్నుగ పుష్కల గంధంబుల్
గ్రహించి దోసిలి యా దశగ్రీవుని కామోద్రేకము గలిగించీ
వీచుచునుండెను మధుర పవనములు వింజామరలుగ పూలతలున్! 11

ఆ రావణుడును గానము వలనను నల పుష్ప సమృద్ధుల చేతన్
చల్లని మెల్లని గాలి వలననూ చల్లని ఋతుపవనంబులనూ
ఆ పర్వత సౌందర్య గుణమునను అల చంద్రోదయ సమరమునన్
కామమునకు మఱి వశుడైపోయెను కలత నలత మఱి జెందుచునూ
మహావీర్యుడగు రావణుడంతట మఱిగిపోయె కామంబునకున్
మాటిమాటికిని నిట్టూర్పులతో మానుగ చంద్రుని గనుచుండెన్! 12,13

ఆ సమయమున నల దివ్యాప్సర నలరు రంభయును నేతెంచెన్
దివ్యమైన యాభరణంబులతో దీరుగ యలంకరింపబడీ

పూర్ణచంద్రునీ సమానమైనా పొలుపగ ముఖమును గలిగియునూ
దివ్య చందనపు లిప్తాంగియునూ భవ్యములగు మందారములన్
శిరస్సునందున ధరించినదియును దివ్యసురత యుత్సవమునకై
ఆరంభంబును గలదియు మఱియును నలరు చూపులును గలదియునూ!

దివ్యపుష్ప భూషితురాలును మఱి దీప్యమానమగు శోభలతో
అలరు నేత్రములు, మనస్సునకునూ యానందము గలిగించుచునూ
మేఖల తోడను గూడినట్టి యా మేలిమి బంగరు బొమ్మవలెన్
ఆ సమయంబున యల దివ్యాప్సర యలరు రంభయును నేతెంచెన్!

ఉత్తమ రతికిని కానుకయైనా యురుజఘనంబును గలిగినదీ
అపుడపుడే యేర్పఱచిన తిలకము నలరి ధరించినది మఱియున్
ఆఱు ఋతువులకు సంబంధించిన యలరు పుష్పములతోని మఱిన్
నిర్మించిన యా యలంకారములు నిర్భరముగ ధరియించినదీ
కాంతిచేత మఱి శోభచేతనూ శాంత లలిత లావణ్యముతో
కీర్తిచేత రెండవ లక్ష్మికి వలె కాంతి ప్రకాశించుచు నుండెన్! 14,15,16, 17

చంద్రుని వంటీ ముఖము గలదియును సాంద్రమైన కనుబొమ్మలునూ
ఏనుగు తొండము వంటి యూరువులు ఇంపగు అల చిగురులబోలెన్
కోమలమగు హస్తములు గలదియును కూరిమి చకచక నడుచుచునూ
సతోయ మేఘము కాంతి గలిగి మఱి సనీలి వస్త్రము గప్పికొనీ
సైన్యము మధ్యను బోవుచుండెనూ చారుకాంతులను నొలుకుచునూ
అట్టి రంభనూ గాంచె రావణుడు నిట్టె కామునకు వశమగుచున్! 18, 19

మన్మథ శరముల వశమైపోయిన మానుగ రావణుడంతటనూ
ఒక్కసారిగా లేచి రాక్షసుడు చక్కని బంగరు బొమ్మవలెన్
పోవుచున్న యా రంభను గాంచుచు స్ఫురితుడయ్యె మన్మథు వలనన్
సిగ్గుబడెడి యా రంభను గాంచీ చేయి బట్టుకొని రాక్షసుడున్
నవ్వులు జిఱునవ్వులు విరబూయుచు బువ్వులు రాల్చుచు బలికె నిటుల్! 20

సుందరమగు కటి ప్రదేశంబుతో జూడ ముచ్చటగ యుంటి వహ!
ఎచటికి బోవుచు నుంటివి చెలియా? యెవరి కోసమో దెలియదుగా?

నీవే స్వయముగ బోవుచుంటివీ నిఖిల బోగ సిద్ధిని గూర్పన్
అట్టి వాడెవడు? అదృష్ట వంతుడు? నిట్టె యనుభవించునో నిన్నున్
అట్టి వానికిది యభ్యుదయము సుమ! యలరెడి యీ సమయంబు మఱిన్! 21

పద్మోత్పల శుభ గంధము గలదియు బన్నుగ యమృతము బోలె మఱిన్
ఉన్నదియును నగు నధరామృతమును జెన్నుగ యాస్వాదించి మఱిన్
ఎవడు తృప్తి సంతృప్తి జెందునో యెఱుగను గద! నే నో చెలియా!
తెలియజేయుమూ యాత డెవ్వడో తేటతెల్లముగ యా పురుషున్! 22

భయ స్వభావము గలదానా! మఱి బంగరు కుంభములను బోలన్
బలిసినట్టి మఱి యెడమును లేనీ బన్నుగ నీ కుచములును మఱిన్
ఏ పురుషుని వక్షస్థలంబునూ యింపుగ స్పృశింప నున్నవియో!
తెలియజేయుమా! యాతెడెవ్వడో! తేటతెల్లముగ యా పురుషున్! 23

బంగరు చక్రముతో సమానమును బంగరు త్రాడును గూడినదీ
బహు విశాలమును స్వర్గతుల్యమును బన్నుగ నీ జఘనంబు మఱిన్
అట్టి జఘనమును నారోహించును నిట్టె యెవ్వడో తెలుపు మఱిన్
అట్టి వానికిని యభ్యుదయంబును నలరెడి యీ సమయంబు మఱిన్! 24

నీ కంటెను మఱి శ్రేష్ఠుడైన యా నయముగ పురుషుం డెవరు సఖీ?
ఇంద్రుడ? లేకను చంద్రుడా? మఱియు నింపుగ యశ్విని దేవతలా?
భయస్వభావము గలదానా! నను బరగ దాటి పోవుట నీవున్
అంత మంచి పనికాదు సుమా యది యలరు శోభనము గాదు మఱిన్! 25

విశాలమైనా కటి ప్రదేశము విమల యూరువులు గలదానా!
సుందరమగు నా శిలాఫలకమున సురుచిరముగ జేరుము మఱియున్
విశ్రమింపుమా! సుదతీ మణిరో! విమల భావములతోని మఱిన్!
సర్వసమర్థుడ! ప్రభుడను నే కద! సరసత యన్యుడు నాకంటెన్!
లేదు గదా త్రైలోక్యములందున లేడు లేడు మఱి లేడు సుమా! 26

త్రైలోక్యంబుల ప్రభువుకు ప్రభువును దీరుగ త్రైలోక్యంబులకున్
పాలకుండనగు రావణుండనూ బన్నుగ వంగిన వాడనునై

ప్రాంజలి తోడను నమస్కరించుచు బ్రార్థన సేయుచు నుండె సుమా!
నన్ను బొందుమా! నా మాటను విని! నను మన్నింపుము కౌగిలితో! 27

అల రావణునీ యా మాటలు విని యారంభము బహు శీఘ్రముగన్
గడగడ వణకుచు నంజలి తోడను కమ్మని మాటల నిటు లనియెన్
ఈ దృశ వచనంబులు బలుకుట మఱి యింపుగ నీకును దగదు సుమా!
అనుగ్రహింపుము! నన్ను నీవు మఱి యలరి నాకు పూజ్యుడవు గదా! 28

ధర్మము వలనను నీకు కోడలిని! తగ నీ పుత్రుని భార్యను నే!
నిజము దెలుపుచుంటిని రాజా! విను! సదయ విచారింపుము దయతో
యన్యు లెవరైన యవమానించిన నాదు కొనగవలె మఱి నన్నున్!
నీవే నన్నిటు లవమానించిన నిన్నేమందును యోచింపు! 29

అటుబిమ్మట యా దశగ్రీవుండును నలరి రంభ గాంచియు తననూ!
భయమును మఱియును రోమాంచమునూ బన్నుగ చరణాధోముఖమున్
గలిగినట్టి యా సుదతిని గాంచుచు కామ దృష్టితో బలికె నిటుల్!
'నీవు నా సుతుని సతివైతే కద! నీ వగుదువు నా కోడలివీ!' 30

కాముకుండు మఱి తెలియలేదుగద! గ్రక్కున వచ్చెడి యాపదలన్!
ఆరంభయునూ బలికె నిట్టులను నల రావణుతో సూటిగనూ!
'తప్పక! తప్పక! కోడలినే సుమ! దగ యోచింపుము మదియందున్!
అని రావణుతో బదులు బలికెనూ యా రంభయు నతి శీఘ్రముగన్! 31

రాక్షస పుంగవ! వినుమా! దెలిపెద! రయమున నా పలుకులు వినుమా!
ధర్మము వలనను నీ కుమారునికి దగ భార్యను నే వసుధేశా!
నీ సోదరుడా కుబేరునకునూ నిజ ప్రాణంబుల కంటె మఱిన్
ప్రియతరమైనా పుత్రుడైన యా ప్రియ భాషియు నలకూబరుడున్!
మూడు లోకములలో ప్రఖ్యాతుడు మూడు లోకముల ప్రసిద్ధుడున్! 32

లోకపాలుడగు కుబేరు సుతుతో ల్లోలత నల కూబరుతోడన్
సంకేతంబును జేసికొంటిమీ సఖ్యత చిరకాలంబునకున్

అల నలకూబరుడును వినుమా మఱి యలరు ధర్మమున బ్రాహ్మణుడున్
పరాక్రమంబున క్షత్రియుండు సుమ! బన్నుగ కోసము వచ్చినచో
అగ్నిహోత్రునీ సమానుండునూ అలరు సహనమున ధాత్రి వలెన్! 33, 34

ఈ అందము చందము లన్నియునూ యీ యలంకరణ యంతయునూ
అతని కోసమే జేసికొంటినీ యలరుచు నాతని మెప్పింపన్
అతనికి యనురాగము ప్రేమయునూ నలరి నాపైని యున్నటులన్
ఆతని మీదను నా యనురాగము నలరియున్నదీ యా రీతిన్!
యీ సత్యంబును గ్రహించి వేగము నింపుగ విడువుము నను నింకన్! 35

ధర్మాత్ముండగు నలకూబరుడును దగ సముత్సుకత గలవాడై
ఎదురు జూచుచుండును నా కొఱకై బదు లాడక నను బంపు మఱిన్
ఈ విషయంబున నతనికి విఘ్నము నీసుజెందునటు జేయకుమా!
నన్ను విడువు మిక! రాక్షసేంద్ర విను! నా వచనములను మన్నింపూ! 36

రాక్షస పుంగవ! వినుమా దయతో రయమున నాదు సువచనములన్
సత్పురుషులు నడిచెడి మార్గంబున సాహసుడా! పయనింపు మికన్!
గౌరవింప దగు వాడవు నీవును గత బంధుడవును నీవు సుమా!
అటులే నీకును పాలనీయనూ యలరు ముద్దు కోడలిని సుమా! 37

ఆరంభయు మఱి వినయ పూర్వకము నా విధమగు బలుకులను వినీ
అల రావణుడును నిటులను బలికెను నలరుచు బరుసములగు బలుకుల్
నేను నీదు కోడలిని యంటివీ! నీవును నిజముగ కోడలివా?
ఈ నియమము నొక్కనికి మాత్రమే నింపుగ సతిగా జీవించీ
యుండు వారికే వర్తించు సుమా! యొనరగ నీ సములకు లేదూ
కోడలినంచును జెప్పుకొనుటకును గూరిమి యర్హతయును లేదూ! 38

అప్సరసలకును బతియను వాడును నలరి యుండడూ దివియందున్
ఒక తరుణిని మఱి వివాహమాడుట యొనరగ పురుషులకు మఱి లేదూ!
దేవలోకమున దివిదేవతలా దివ్యమైన యాచార మిదీ!
శాశ్వతమైనా కట్టుబాటుకదా! కలికీ! నీకిది దెలియుగదా! 39

ఆ రాక్షసుడును నటుల బలుకుచుమ నలరంభను నా రావణుడున్
కామ భోగమును ననుభవింపగా గడు నాసక్తిని గలవాడై

ఆరంభను నొక శిలాఫలకమున యలరి బరుండగ బెట్టి మఱిన్
మైధునంబునకు ప్రారంభించెను మదమున మై మఱచియును మఱిన్! 40

అటుబిమ్మట మైధునానంతరము నలరి విడువ నా తరుణియునూ
భ్రష్టమాల్యముల విభూషణంబులు బన్నుగ విడివడి జారగనూ!
మహా గజము క్రీడించుట జేతను మానుగ కలగిన నది వోలెన్
వ్యాకులత్వమును బొందెను రంభయు వన్నెలు జిన్నెలు జారగనూ! 41

ఆమె కేశములు నలిగిపోయి మఱి యలరి జిక్కుబడి పోయెనటన్
చిగుళ్ల వంటీ యామె హస్తములు చెదిరి చెదిరి వణుకుచు నుండెన్!
ఆమె భయముతో గాలికి కదలుచు నలరెడి సుందర పుష్పములన్
నిండిన లతవలె వణికి బోవుచును పండిన ద్రాక్షా గుత్తి వలెన్!
వణికి బోవుచును సిగ్గును జెందీ వనరగ యంజలి ఘటియించీ
నలకూబరునీ సమీపంబునకు నయముగ బలబల రోదనలన్
ఆతని పాద సుకమలంబులపై యలరి వ్రాలె యా రంభయునూ! 42, 43

మహాత్ముడగు నా నల కూబరుడును మానుగ యట్టి యవస్థయునూ
గలిగినట్టి యారంభను గాంచీ కలత జెంది మానసమందున్
ఆమె తోని యీవిధముగ బలికెను నమ్రతాక్షరములు జారగనూ!
మంగళ ప్రదురాలా! యిది యేమీ! శృంగారము మఱి యెటు బోయెన్!
నా పాదంబులపై బడినావూ? నయముగ యెందులకని యనియెన్! 44

ఆ రంభయు నిట్టూర్చుచున్నదై యలరి వణుకుచును భయంబుతో
చేయబడిన యంజలిగలదగుచును జేరి నమస్కృతి జేయుచునూ
జరిగిన దంతయు నల గూబరునకు పొంతము దెలుపగ దలచి మఱిన్
ఉపక్రమించెను జరిగిన దానిని యురుతర రోదనలను గూడీ! 45

దేవా! ఓ నలమాబర వినుమా! దీరుగ నా వచనంబులనూ
ఆ రాక్షసుడగు రావణుండునూ నలరుచు స్వర్గము జయింపగా
బోవుచు దారిని యిటకువచ్చెనూ పొలుపుగ సుమార్గ మధ్యమునన్
సైన్యము తోడను నిట బసచేసెను సరసమైన రాత్రిని యిచటన్! 46

అరిందమా! ఓ నలకూబరుడా! యలరి త్వత్ప్రదేశంబునకున్
వచ్చుచున్న నను యాతడు గాంచెను దనర దుష్టమగు కాముకతన్
రాక్షసుడగు నా రావణుడంతట రయమున నన్నతడును నిలిపెన్!
ఎవరి దానవని నను ప్రశ్నించెను నేపుగ దుష్టత చెలరేగన్! 47

దేవా! యతనికి నేను సర్వమును దీరుగ సత్యము దెలిపితినీ
విషయమంతయును విప్పి జెప్పితిని విమలమైన వాక్యంబులనూ!
ప్రభూ! నేను నీ కోడలి నంచును బన్నుగ ప్రార్ధన జేసిననూ
కామ మోహములు నావరించినా కఠినుడు నా వచనంబులనూ
మనసుతోని నా వినయ ప్రార్థనను మానుగ కఠినత వినలేదు! 48, 49

మంచి నియమములు గలవాడా! విను యంచితముగ నా పలుకులనూ!
ఓ సౌమ్యుడ నే జెప్పిన దంతయు వనరగ వెనుకకు నెట్టి మఱిన్
వాని చేత నే బలాత్కారముగ వనరగ యవమానింపబడీ
భంగపడితినీ యీ యపరాధము బన్నుగ క్షమింప వలయు సుమా!
స్త్రీబలంబు పురుషుని బలంబుతో స్థిర సమానమును గాదుకదా! 50

ఆ సమయంబున వైశ్రవణాత్మజుడైన యట్టి నలకూబరుడున్
రంభ దెలిపినా వృత్తాంతము విని స్తంభము వలె నిశ్చలుడగుచున్
మఱి కోపించియు క్రూరమైన యా కూర్మి దర్శనము విని మఱియున్
ధ్యానయోగమున ప్రవేశించెనూ దగ విషాదమున గూడికొనీ! 51

ఆ సమయంబున వైశ్రవణాత్మజుడైన యట్టి నలకూబరుడున్
రావణుండు జేసిన దుష్కర్మము రయమున ముహూర్త కాలములో
దెలిసి క్రోధ తామ్రాక్ష నేత్రుడై తీరుగ జలముల మంత్రముతో
హస్తమునందున గ్రహించి మఱలను నాకాశంబును గాంచుచునూ! 52

ఆ సమయంబున నలకూబరుడును నలరు సలిలమును గ్రహియించీ
సమస్తమును మఱి యధావిధముగా సమ్యత యాచమనము జేసీ
రాక్షసుడైనా యా రావణునకు రయమున భయంకరమునైనా
శాపము నిచ్చీ జలముల నొదిలెను సరసత నీ విధి బలుకుచునూ! 53

మంగళ ప్రదురాలా! వినుమా! నా సంగతి నీ శాపంబు మఱిన్
ఏ కారణమున వాని చేత మఱి యే కరణంబును లేని నినున్

బలాత్కారముగ సధర్షితవునై బాధ నొందితివి కావుననూ!
కామముతోనీ మఱి యొక స్త్రీనీ కాంక్ష సేయడూ యిక ముందున్! 54

కామ పీడితుండైన యాతడును కామములేనీ యోషితనూ
బలాత్కరించీ యవమానించునొ బన్నుగ యా సమయంబుననూ
రాక్షసుడగు దశగ్రీవుని శిరమును రయమున సప్త విభాగములన్
శకలీకృతమగు గాక! యనుచునూ శాపమిచ్చె నలకూబరుడున్! 55

ప్రజ్వలించు నగ్నికి సమానమగు బరగ తీవ్రమగు శాపంబున్
ఆ శాపంబును నుచ్చరింపగనె యలరు దేవ దుంధుభులు మఱిన్
మ్రోగెను నా సమయము నందుననూ యలరు పుష్ప వృష్టియు గురిసెన్
కిన్నెరలును నృత్యంబులు జేసిరి బన్నుగ బాడిరి గంధర్వుల్! 56

సర్వమైన యా లోక ప్రవృత్తిని సరసత రాక్షసు మృత్యువునూ
తెలిసికొనియు మఱి పితామహుండును దీరుగ సమస్త దేవతలున్
హర్షామోదంబులను దెలిపిరీ అల పితృదేవతలు గూడన్
అనుత్తమమునగు సంతోషంబును నలరి పొందిరా సమయమునన్! 57, 58

ఆ దశగ్రీవుడు రోమ హర్షణము నగు శాపంబును విని తనపై
కామములేనీ స్త్రీలయందునను కాంక్షలేని యా ప్రమదలనూ
మైధునమునకును నిష్టపడడుగద మానుగ దూరముగా నుండున్
నలకూబరునీ శాపమెప్పుడును నలుగుచుండు హృదయము నందున్! 59

ఆ రావణుడును హరించి దెచ్చిన యగణిత పతివ్రతా స్త్రీలున్
అల నలకూబరు శాపంబును విని యనంత సంతసమును బొందీ
సంతోషించిరి తన్మయమందిరి శాంతిని బొందిరి హృదయములన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 60

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఇరువది యాఱవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఇరువది యేడవ సర్గము

(రావణుడు సైన్యముతో నింద్రుని లోకమును ముట్టడించుట - ఇంద్రుడు సహాయము కొఱకు విష్ణువును నర్థింపగా 'భవిష్యత్తులో రావణుని జంపెదను.' అని జె ఇంద్రుని వెనుకకు బంపుట - దేవతలకును రాక్షసులకును యుద్ధము జరుగుట - వసువు సుమాలిని సంహరించుట)

మహాతేజమును గలవాడును మఱి మానుగ రావణుండును వేగన్
సైన్యంబులతో, వాహనములతో సరసత గూడిన వాడగుచున్!
కైలాసంబును దాటి మఱియునూ కమ్మని విలాస లోకంబున్
ఇంద్రుడు బరిపాలించునట్టి యా యింద్ర లోకమును జేరుకొనెన్! 1

అని వైపులను వచ్చుచున్న యా యఖండ రాక్షస సైన్యంబున్
దేవలోకమున నడుగిడుచుండగ దిశలన్నియు ధ్వనులును జెలగెన్
సముద్రంబు బ్రద్దలు కొట్టిన విధి సాంద్ర ధ్వని గలిగెను నపుడున్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 2

రావణుండు మఱి దేవలోకమును రయమున వచ్చిన విధము వినీ
శుక్రుడు తన యాసనము నుండియును చలియించిన వాడగుచు మఱిన్
అప్పుడటకు వచ్చిన దేవతలను యందఱినీ యుద్బోధించెన్
ఆదిత్యులనూ, వసువుల, రుద్రుల, సాధ్యుల మఱియు మరుత్తులనూ
జూచి యీ విధము నాజ్ఞాపించెను శూరత ధీరత వెలయగనూ
దురాత్ముడైనా రావణు తోడను దోరముగా రణ మొచ్చినదీ!
అందులకై మఱి సిద్ధముకండీ! చందముగా నెదిరింపగనూ! 3,4

యుద్ధమునందున యింద్రుని తోడను యుద్ధతి సమానులును మఱియున్
బలవంతులునగు దేవతలందఱు బన్నుగ సంసిద్ధులునైరీ
ఇంద్రుని మాటలు విని దేవతలును సాంద్ర యుద్ధ శ్రద్ధయు గలిగీ
సంగ్రామమునకు సిద్ధమైరి మఱి సాంద్రాయుధములతో గూడీ! 5

ఆ దశ గ్రీవునకు భయపడినా నలరు మహేంద్రుడు దీనుండై
మహావిష్ణువును సమీపించి మఱి మానుగ యీ విధమున బలికెన్! 6

ఓ విష్ణూ! అఖిలేశ్వరా! వినుము! వనరగ మా ప్రార్థనల మఱిన్
ఆ రావణుడును వచ్చుచు నుండెను నలరి రణంబును సేయుటకై!
దేవతలను నోడించుట కొఱకై దివిని యాక్రమించుట కొఱకై!
ఆ రావణునీ విషయంబున నే వలరి యేమి చేయగ వలెనూ? 7

వరములు బొందీ యుండుట చేతను వనరగ బలవంతుడు నయ్యెన్
అన్య కారణము కాదు సుమా మే మతనికి భయపడి యుండుటయున్
బ్రహ్మదేవుడును నిచ్చిన వరమును బరగ జెప్పినా వచనంబున్
సత్యము జేయగవలెను గదా మఱి గత్యంతరమును లేదు గదా! 8

ఆ కారణమున నీ బలంబునూ యటు యూతముగా గైకొనుచున్
ఏ విధంబుగా నముచి వృత్ర బలి యిల నరకుని శంబరుని మఱిన్
నశింప జేసితినో యావిధముగ నయముగ యీతని విషయమునన్
అటుల జేయుమా! యంతరించునటు చటుల రాక్షసుని రావణునీ! 9

దేవతలకు ప్రభువైన వాడవును దేవదేవ! యఖిలేశ్వరుడా!
చరాచరములను కూడినట్టి యా సకల లోకముల కంతటికిన్
నీవు దప్ప మఱి వేరొక గతియును నిక్కము లేదు గదా మఱియున్!
మఱియొక యుత్తమ స్థానముగూడను మఱి లేదు గదా! లోకములన్! 10

నీవే నారాయణుడవు, శ్రీమాన్, నీవు బద్మనాభుడవు సుమా!
సనాతనుండవు! సర్వలోకములు స్థాపింపగబడె నీ చేతన్!
నన్నుగూడ మఱి సరేశ్వరునిగా న న్నిలిపితివి దివియందున్
నీవే యఖిలము! నీవే నిఖలము! నీవే సర్వము పరమాత్మా! 11

సచరాచరముల గూడినట్టి యీ సర్వ ప్రపంచము నీవేగా
త్రైలోక్యంబుల సముదాయంబును దీరుగ నీవె సృజించితివీ!
ఓ భగవానుడ యుగక్షయమందున వనరగ నీయందున మఱలన్
అందఱు నిన్నే ప్రవేశించుచును చందముగా లయ మందుదురూ! 12

దేవ దేవ! యా కారణముననూ తీరుగ యధార్థముగ నీవున్
నాకును దెలుపుము చక్ర సహాయము నయముగ గలిగీ రావణుతో!
యుద్ధము జేసెదవా! లేదా మఱి యుద్ధతి రావణు గర్వమునూ
యణగించెదవా? లేదా? దెలుపుము నాలకించెదను యధార్థమున్! 13

ప్రభువగు శ్రీ మన్నారాయణుడును బన్నుగ శక్రుని పలుకు వినీ
ఈ విధముగ యోదార్చుచు బలికెను నింపుగ సమధుర వచనములన్
భయపడవలసిన పనిలేదూ మఱి బాగ నొందగా పని లేదూ!
ఆ రాక్షసునీ బరిమార్చెద నే నలరి శుభంబగు జగములకున్! 14

వరదానముచే గర్వితుడైనా వనరగ యీ రాక్షసుడు మఱిన్
సురలచేత మఱి యసురులజేతను సూటిగ చంపగ బడడు సుమా!
ఎదిరింపగనూ జాల రెవ్వరును నెవ్వరు జంపగ జాల రిలన్
బ్రహ్మ వరములే నింత చేసినవి పన్నుగ యీ రాక్షసుకు మఱిన్! 15

బలోత్కటుండును బుత్ర సహితుడును బన్నుగ యీ రాక్షసుడు మఱిన్
అన్ని విధములను మహత్కార్యముల బన్నుగ జేయుగ గలుగు సుమా!
ఇదియు యాతనీ స్వభావంబుచే నింపుగ కనబడు చున్నదిగా!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 16

దివిజేంద్రా! విను! యుద్ధము జేయుము! దీరుగ బలికితి విపుడు మఱిన్
దానికి నే ప్రత్యుత్తరంబును దగ దెలుపుచు నుంటిని నిదిగో
రాక్షసుడైనా యీ రావణునీ రయమున యుద్ధము నందుననూ
ఎదిరించుచు నే యుద్ధము జేయను! పదిమందికినీ బలుచవగా! 17

సంగ్రామంబున శత్రువులను మఱి జంపకుండగా విష్ణువునూ!
వెనుకకు మఱలడు నిది తెలియునుగా వికలత జెందడు మనసుననూ
బ్రహ్మ వరము రక్షించుచున్నదీ బరగ రావణుని ప్రాణములన్
అందుచేత నీ కోరిన కోరిక చందముగా సిద్ధింపదు సూ! 18

నూఱు యజ్ఞములు జేసిన వాడా! నోరారగ బలుకుచు నుంటిన్!
రక్కసుడగు నీ రావణాసురుని రయమున బంపుదు యమపురికిన్

ఓర్పు వహింపుము దేవేంద్రా! మఱి యోరిమి విజయంబును గూర్చున్
ప్రతిజ్ఞ జేయుచు నున్నాడను నే పన్నుగ మీ యందఱి ముందున్! 19

ఉపాగతంబగు కాలంబున వే యురుతరముగ నే దెలిసికొనీ
నేనే సహచర పరివారముతో నిక్కముగా నా దశగ్రీవున్!
చంపి వేసెదను దేవతలకు మఱి సొంపుగ యా గంధర్వులకున్
ఆనందంబును గలుగజేసెదను అలరు గలుగు శుభములు మీకున్! 20

శచీపతే! ఓ దేవరాజ విను! సర్వము యథార్థమును నీకున్
తెలుపబడినదీ భయము విడిచి మఱి భవ్య దేవతల గూడికొనీ
యుద్ధము జేయుము! వీర పురుష! నీ యుద్ధతి రణమున జాపు మికన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 21

అటుపిమ్మట రుద్రులు, ఆదిత్యులు, చటుల వసువులును, మరుత్తులున్
అల యశ్విని దేవతలు గూడనా యారణమునకును సిద్ధులునై
ఆయుధములతో పురమునుండి మఱి యల రాక్షసులను నోడింపన్
భట తురగములను గజములతోడను, భవ్యమైన రథముల తోడన్! 22

ఇంత లోపలను నర్ధరాత్రియును గొంత గడిచినా పిమ్మటనూ
రణమును సేయుచు నున్నయట్టి యా రావణు సైన్యము నుండి మఱిన్
నయముగ నింగియు మీద బడి నటుల నలుమూలల ధ్వని వినవచ్చెన్
ప్రావృట్కాలపు ప్రథమ వర్షమున పగిలి నటుల మేఘంబులునూ! 23

మహా పరాక్రమవంతులైన యా మానుగ దేవతలపుడు మఱిన్
పరస్పరము వీక్షించు కొనుచునూ బాహువులను జఱచుచు వారున్
యుద్ధోన్ముఖులై సంతోషించుచు యుద్ధతి యభిముఖులై వారున్!
బయలుదేరి పోయిరి రణభూమికి బహ్వాయుధములతోడ మఱిన్! 24

యుద్ధాగ్రమునందున యక్షయమగు యుద్ధత రాక్షస సైన్యంబున్
కనులగాంచి యా సురసైన్యంబును గలత జెంది మది భయభీతిన్
సంక్షోభము వ్యాపించె సేనలో సాహసంబునూ విడనాడెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 25

దేవతలకు రాక్షస దానవులకు దీరుగ భయంకరము నైనా
తుముల ధ్వనియును గలిగెను బిమ్మట దోరపు నాయుధముల చేతన్
ఘోరమైన యుద్ధంబును జరిగెను ఘోర రక్తపాతము జరిగెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 26

అంత లోపలను యా రావణునీ యంతరంగికులు మంత్రులునూ
శూరులు, వీరులు, ఘోర దర్పనులు జేరిరి యారణమందుననూ!
మారీచుండును, ప్రహస్తుండునూ మహా పార్శ్వుడును మహోదరుల్
అకంపనుండును, నికుంభుండునూ యల సంహ్రాదుడు నట జేరెన్!
ధూమ కేతువును, మహా దంష్ట్రుడును త్వరితము ఘటోదరుడు నచ్చెన్!

జంబు మాలియును, మహాహ్రాదుడును విరూపాక్షుడును జేరె మతిన్!
సుప్తఘ్నుండును యజ్ఞ కోపుడును, దుర్ముఖుండు దూషణుడు మతిన్
ఖరుడు త్రిశిరసును కర వీరాక్షుడు సూర్య శత్రువును బాల్గొనియెన్!
మహా కాయుడును, అతి కాయుండును దేవాంతకుడు నరాంతకుడున్,
అను రాక్షసులును వచ్చి జేరిరీ యట్టి మహా యుద్ధము నందున్! 27,28,29,30

మహా వీర్యుడును సమస్తమైనా మహా వీరులను గూడికొనీ
మాతామహునీ సోదరుడైనా మానుగ సుమాలియనువాడున్
సైన్యమునందున ప్రవేశించెనూ చరచర ముందుకు నడుచుచునూ
సురసైన్యంబును ఛేదించుచునూ సూటిగ బోయెను ముందునకున్! 31

ఆ సుమాలియును గోపించుచునూ యలరు వాడి బాణంబులచే
అనేక విధముల యాయుధములచే నల సమస్త సురగణములనూ!
ఒక్కసారిగా వాయువు వీచీ యొనరగ మేఘము లన్నిటినీ
చెదర గొట్టినటు జేయుచు నాతడు జేసెను యుద్ధము సమరమునన్! 32

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
నిశాచరులచే హన్యమానమగు నిఖిల దేవతా సైన్యంబున్
పారద్రోలబడి సింహముజేతను బరుగులు దీసెడి లేళ్లవలెన్
పారిపోవుచుండిరి దేవతలును బరగ నాల్గుమూలలకు మతిన్! 33

ఇంతలోపలను సావిత్రుడు అను మంతనంబు గలవాడు మఱిన్
శూరుడు వీరుడు వసువుల యందున సురుచిరముగ యష్టముడు మఱిన్
అట్టి వసువు రణరంగమునందున యలరి ప్రవేశించెను నపుడున్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 34

సంతోషించిన వారును మఱియును సహజ పరాక్రమవంతులునూ
ఎత్తబడిన యాయుధములు గలిగిన మత్త వీరులను గూడికొనీ!
శత్రు సైన్యముల భయపెట్టుచు మఱి శాత్రవ సంహారము జేయన్,
ఆ సావిత్రుడు యుద్ధమునందున అలరి ప్రవేశించెను నపుడున్! 35

మహావీరులగు త్వష్టయు, పూషయు, మానుగ నామంబులు గలుగా
ఆదిత్యులునూ నిర్భయంబుగా నలరి తమదు సేనల గూడీ
ఒక్కసారిగా సంగ్రామంబున యొనర ప్రవేశించిరి యపుడున్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 36

అటు బిమ్మట రాక్షసుల యశస్సును నలరి దినుచు కోపించిన యా
యుద్ధములందున యనివర్తితులగు యుద్ధతి యా సురలకు గూడన్
భయంకరంబగు సంగ్రామంబును బరగ జరిగె యా సమయమునన్
రక్తపాతమును రణగొణ ధ్వనియును రయమున నంతయు వ్యాపించెన్! 37

అపుడచటను గల రాక్షసులందఱు నల సమరంబున నిలిచిన యా
దేవతలను వందల కొలదియునూ దీరుగ వేలకు పై బడినా
యాయుధములనూ చేత ధరించీ యలరి ధ్వనులనూ జేయుచునూ,
అల దేవతలా పైని విసిరిరీ చటులాయుధముల నన్నిటినీ! 38

అల దేవతలును గూడ సమరమున యమిత వీర్యమును గలవారున్
బహు పరాక్రమము గలిగిన వారిని భయంకరులునగు రాక్షసులున్!
వికటములైనా యాయుధములతో వెఱపు భయంబును గలిగించీ
యమపురంబునకు నంపిరి యసురుల యమరాజును దర్శింపగనూ! 39

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
అంత లోపలను సుమాలి యనియెడి వింత రాక్షసుడు కోపించీ

అనేక విధముల యాయుధములతో నతుల సహజ విక్రమముననూ
అలరు దేవతా సైన్యమునందున నాతడు జొరబడె చతురతతోన్! 40

అతడు మిక్కిలి క్రుద్ధుండగుచును ననేక విధముల యాయుధముల్
ప్రయోగించుచును సురసైన్యంబును బన్నుగ వాయువు జలధరమున్
చిందర వందర జేసినట్లుగా జేసె సుమాలియు బరుషముగన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 41

బాణవర్షముల తోడను మఱియును భయంకరంబగు శూలములన్
ప్రాసలతోడను గొట్టబడుచునూ బన్నుగ యా సురలును గూడన్
ఒక్క చోట మఱి నిలువగ జాలక వెక్కసముగ నలుదిక్కులకున్
ఎగిరిపోయిరీ యెండిన యాకులు నెగిరి నేలబడు రీతిగనూ! 42

అటు బిమ్మట యా సుమాలిచేతను యా దేవతలును వేగముగన్
పారద్రోలబడు చుండగ జూచీ ప్రబలుడైన యా వసువు మఱిన్
అష్టమ వసువగు సావిత్రుండును నలరి నిలిచె యాతనికి మఱిన్
ఆ సుమాలినీ యద్దగించెనూ యలరుచు దన విక్రమముననూ! 43

అటు బిమ్మట యా మహాతేజుడును చటుల పరాక్రమ శాలియునూ
ఆ సావిత్రుడు సైన్యముతోడను నలరుచు నిలిచిన వాడగుచున్
సంయుగమందున గొట్టుచున్న యా సంహిత పరాక్రమము జేతన్
ఆ సుమాలినీ యద్దగించెనూ యలరు విక్రమముచేత మఱిన్! 44

అటుబిమ్మట యా సమరమునందున యనివర్తితులగు వారలకున్
ఆ సుమాలికిని, యష్టమ వసువుకు నలరు భయంకర యుద్ధంబున్
కనిన వారికిని రోమాంచంబును గాఢముగా గలిగిన దపుడున్
ఎవరు గెలుతురో యను శంకయునూ యెవరు నోటమిని బొందెదరో! 45

అటు బిమ్మట యా మహాత్ముడైనా చటుల బలీయుడు నగునట్టి
అష్టముడైనా వసువుజేత మఱి యల ఘన శరముల జేత మఱిన్
ఆ సుమాలి పన్నుగ రథంబునూ యపురూపంబగు బాణములన్
కొట్టబడినదై క్షణకాలంబున కూర్మినేల బడగొట్టబడెన్! 46

సంయుగమందున యా వసువును మఱి సంధించి నారినీ శీఘ్రముగన్
వందల కొలదియు బాణంబులనూ చిందగ జేసియు వేగముగన్!
బన్నుగ రథమును గూల్చివేసి మఱి బరగ సుమాలీ వధ కొఱకున్
గదను హస్తమున గ్రహించె శీఘ్రము గాండీవము నట నుంచి మఱిన్! 47

అటుబిమ్మట యా సావిత్రుండును నలరుచు దీప్తాగ్రంబైనా
కోదండంబును బోలునట్టి తన గదహస్తంబున గ్రహియించీ,
ఆ సుమాలి మూర్ధనిపై వేసెను నసురు లందఱును భయమందన్!
అష్టమ వసువుకు జయజయ మనుచును నిష్ఠను బలికిరి దేవతలున్! 48

ఆ సుమాలి మీదను బడుచుండిన యలరు కొఱవి వలె కాంతులతో
ఆగద యాసమయంబున యింద్రుడు నలరు పర్వతము పైని మఱిన్
ప్రయోగింప మఱి గర్జించుచునూ యలరి జ్వలించెడి పిడుగువలెన్
ఆ గదయును మఱి ప్రవేశించెనూ యాసుమాలి మూర్ధని పైనీ! 49

అ సమయంబున రణరంగంబున యటుల భస్మమై పోయిన యా
గదా ఘాతమున యా సుమాలియును గడు చూర్ణంబై పోయెనహా!
ఎముకలు, శిరస్సు, మాంసము నచటను నెన్నగ కనబడలేదు మఱిన్
గదచే భస్మత్వంబును బొందెను గానబడవు నవశేషంబుల్! 50

యుద్ధమునందున సుమాలి రాక్షసు దుద్ధతి హతమై పోవుటనూ
గాంచియు రాక్షసు లందఱు గూడను గలిసినవారై యేకముగా
అఱచుచున్న వారందఱు గూడను నటునిటు నలువైపులకు మఱిన్
పారిపోయిరీ పాముల వలెనూ బరగ ముంగిసయు వచ్చినటుల్
ఆ వసువును మఱి తరుముచుండగా నటునిలువక పోయిరి వారున్! 51

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఇరువది యేడవ సర్గము సమాప్తము



### శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

## ఇరువది యెనిమిదవ సర్గము

(మేఘనాథ - జయంతులు యుద్ధము జేయుట - పులోముడు జయంతుని మఱియొక చోటునకు దీసికొనిపోవుట - ఇంద్రుడు యుద్ధ రంగములో ప్రవేశించుట - రుద్రులు, మరుత్తులు రాక్షస సైన్యమును సంహరించుట)

అటుబిమ్మట బహు బలవంతుడు నగు నల దశగ్రీవుని సుతుడైనా
మేఘనాధుడును నా సమయంబున యా సుమాలియును హతమగుటన్!!
వసువుచేత మఱి యా సుమాలియును వనరగ భస్మంబగుటయునూ
గాంచి యాతడును సురల చేత మఱి కడు దైన్యమునందిన వాడై
తన సైన్యంబును బాఱిపోవుటయు దగ జూచియు కోపించి మఱిన్
పాఱిపోయెడీ సేన నంతయును బన్నుగ వెనుకకు మఱల్చియున్
యుద్ధభూమి యందున నిలబడెనూ యుద్ధ విరమణను సేయగనూ! 1, 2

మహారథుండగు మేఘనాధుడును మానుగ యగ్నుల వర్ణమునన్
ఇచ్చు ప్రకారము నడుచు నట్టి యా నింపగు నరదముతో గూడీ
ధగధగ మండెడి యగ్ని శీఘ్రముగ దగ వనములకును బోయినటుల్
దేవసేనలకు నభిముఖంబుగా దీరుగబోయెను నింద్రజితూ! 3

ఆ సమయంబున యనేక విధముల నాయుధంబులను ధరియించీ
ప్రవేశించెడీ మేఘనాథునీ ప్రవిమల తేజము గాంచి మఱిన్
వాని యొక్క దర్శనము జేతనూ వనరగ భయమందుచు వారున్
దేవతలందఱు బయపడి పోయిరి దిక్కులందు నక్కిరి వారున్! 4

ఆ సమయంబున యుద్ధము సేయగ యలరి వచ్చినా యింద్రజితున్
ఎదుట యెవ్వరును నిలువకపోయిరి కదిలి యుద్ధమును జేయుటకున్
అటు బిమ్మట సురరాజా నింద్రుడును నల దేవతలను జూచి మఱిన్
మాటలతోడను గొట్టి వారలను మఱల బలికె నీవిధముగనూ! 5

దేవతలారా! భయము జెందకుడు దీరుగ మఱలగ రాదు సుమా!
యుద్ధము జేయగ మఱలి రండికను యుద్ధతి యాయుధముల తోడన్,
పరాజయంబును నందనట్టి యా పన్నుగ నాదు కుమారుండున్
యుద్ధమునకు మఱి వచ్చుచునుండెను యుద్ధతి గనుడిక జయంతునీ! 6

ఆ సమయంబున జయంతుండునూ యలరు ప్రసిద్ధుడు శక్రునకున్
ముద్దు కుమారుడు రణప్రవీణుడు మోదమలర బలవంతుడునూ!
ఆ కుమారుడును నద్భుతమైనా యలరు రథముతో గూడికొనీ
యుద్ధ రంగమున కాతడు వచ్చెను యుద్ధతి రాక్షసులను గెలువన్! 7

అటు బిమ్మటనూ దేవతలందఱు నల జయంతు చుట్టును జేరీ
రణరంగమునకు బోయి రందఱును రావణు సుతునీ మర్దింపన్
మేఘనాధునీ జూచుచు వారలు మెఱుపులు మెఱసిన యట్టులనూ
ఉఱుములిరిమినటు దేవత లప్పుడు యురుతర రణమును జేసిరటన్! 8

అట్టి దేవ రాక్షసుల కపుడు మఱి యలరి యుద్ధమును జరిగెనటన్,
ఇంద్ర సుతుడు మఱి జయంతునకునూ సాంద్ర దీధితుడు రావణునీ
కుమారునకునూ జరిగెను యుద్ధము గూరిమి జరుగని విధముగనూ!
దివి గంధర్వులు నచ్చెరు వందిరి దీరుగ జేరిరి జూచుటకున్! 9

అటు పిమ్మట యా మేఘనాథుడును నల జయంతుని సారధిగా
నున్న వానినీ మాతలి పుత్రుడు బన్నుగ గోముఖుడను వానిన్
వానిపైన మఱి కనక భూషలును వనర కూర్చబడి నట్టిదియున్
బాణంబులనూ ప్రయోగించెనూ బన్నుగ వర్షము గురిసినటుల్! 10

ఆ విధముగనే శచీ సుతుండును నలరి యింద్రజితు సారధినీ
నానా విధముల బాణంబులతో నయముగ గొట్టెను తీవ్రముగన్
మేఘనాథుడును నలరి క్రోధమున మేదుర మగు బాణంబులచే
ఇంద్రసుతుండగు జయంతు నంతట సాంద్రశరములను వేధించెన్! 11

బలవంతుడగు రావణ సుతుడును బన్నుగ క్రోధ సమావిష్టుం
డగుచును విస్ఫారిత నేత్రుండై యలరుచు యింద్రుని తనయునిపై

శరవర్షంబును గురిపించెను మఱి చలన మొందగను ధాత్రియునూ
దిక్కులన్నియును జిక్కువడెను గద! దీరుగ బాణంబుల జేతన్! 12

అటుబిమ్మట యా మేఘనాథుడును నలరి క్రోధ నేత్రుండగచున్
వాడియైన యంచులు గలిగిన యా వనరగ వందలు వేలు మఱిన్
అనేక విధముల యా యుధములునూ యల సుర సైన్యము పైని మఱిన్
సూటిగ నాతడు బ్రయోగించెను సురసైన్యము నబ్బుర నుందన్! 13

అల రావణునీ పుత్రుడైన యా యలరు మేఘనాధుండపుడున్
శతఘ్నులను మఱి ముసలంబులనూ, ప్రాసములను, గదలను మఱియున్
ఖడ్గంబులనూ పశ్వధములను మహోన్నగిరి శృంగంబులనూ!
పరగదేవతా సైన్యంబులపై ప్రయోగించె యా సమయమునన్! 14

అల దశగ్రీవుని కుమారుడైనా యలరు మేఘనాథుం డపుడున్
శత్రు సైన్యముల గొట్టుచుండగా సంహరించుచుండగ నపుడున్
లోకములన్నియు సంతాపంబున లోలత ప్రవ్యధితము లయ్యేన్!
మహా తమస్సును వ్యాపించినదీ మానుగ దివి భువి యంతయునూ! 15

ఆ సమయంబున జయంతు చుట్టును నలరియున్న సురసైన్యంబున్
బలవంతులునగు రాక్షసబలమున బహు విధి యాయుధముల చేతన్
బాణంబులచే బీడింపగబడి బహువిధముల వ్యధలను జెందీ
అశ్వస్థతనూ చెందినదియు మఱి యలసిపోయె రణరంగమునన్! 16

ఆ సైన్యంబుల లోనివారు మఱి యలరు దేవతలు రాక్షసులున్
రాక్షసుడా మఱి దేవతయా యని రయమున గుర్తింపగ లేకన్
అల సైన్యంబంతయుగూడను అలరి విపర్యాసము నందీ
అన్ని వేపులను బరుగులు దీసెను నయోమయముగా గనిపించెన్! 17

తమస్సు జేతను గప్పు బడుచునూ దగ సమ్మూఢాత్ములు నగుచున్
దేవతలను దేవతలే గొట్టిరి దీరుగ యసురులు యసురులనూ!
చావబాదుకొనుచుండిరి వారలు దగవు దీర్చువారును లేరూ!
మఱి కొందఱు నటు పారిపోయిరీ మానుగ రణరంగము విడిచీ! 18

ఈ లోపున మఱి పులోము డనియెడి యింపుగ విక్రమవంతుడునూ
వీరుడైన యా దైత్యేంద్రుండును విమల దృష్టితో నటకొచ్చి!
ఇంద్రసుతుండగు నా జయంతునీ సాంద్ర రక్షితునిగా జేసి
రణభూమికినీ బహు దూరముగా రయమున గొనిపోయెను నతనిన్! 19

ఇంద్రుని సతియగు శచీ దేవికిని తండ్రి పులోముడు గద మఱియున్
ఆ జయంతునికి మాతామహుడును నలరి యాతడును రణమందున్
అలసిపోయినా యా జయంతునీ యలరి దీసికొని పోయి మఱిన్
సంద్రమునందున ప్రవేశించెనూ సరసత యాతని రక్షించెన్! 20

ఆ సమయంబున దేవతలందఱు నల జయంతుడును గనబడకన్
పోవుటయును మఱి గ్రహించి మదిలో గుందుచు మదిలో వ్యధ జెందీ
సంతోషంబును లేనివారలై చలించి యందఱు చెదురుచునూ
రణరంగంబును విడిచి పోయిరీ రయమున నలుదిక్కులకు మఱిన్! 21

అటుబిమ్మట మఱి మేఘనాధుడును చటుల కోపమున రుద్రుండై!
తన సంబంధిత సేనలతోడను మఱి దగ పరివృతుడై వేగముగన్
అలరి దేవతలపై బరుగెత్తెను నపహసించుచును వారలనూ!
మహా ధ్వనియు నాతడు జేసెను మఱి మానుగ విజయోత్సాహమునన్! 22

తన పుత్రండగు జయంతుండునూ తగ కనిపింపక పోవుటయున్
యుద్ధ రంగమున దేవతలందఱు యుద్ధతి విడి పోవుట గనుచున్
ఆ దేవేంద్రుడు నాజ్ఞాపించెను నల మాతలినీ బిలిచి మఱిన్
నా రథంబు గొని తెమ్మా వేగము! రయమున బోదము రణమునకున్! 23

సిద్ధముగానే యున్నదియును మఱి శ్రీకరముగ నట నున్నదియున్
దివ్యమైన యా విమానంబునూ దీరుగ మాతలి గొనిరాగా!
ఆ మహేంద్రుని యొద్దకు వచ్చి యలరి యచటనూ నిలబడెనూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 24

మెఱుపులతోడను గూడినట్టిదియును మేదుర బలమును గలదియునూ,
అధికమైన ధ్వని గలిగినదియును మఱి యల గాలికి కదిలెడిదియునూ,

మేఘంబులు మఱి యా రథంబునకు మిగుల ముందు భాగమునందున్
ధ్వనులు జేసినవి మెఱుపులు మెఱిసెను ఢణఢణ దుంధుభులును మ్రోగెన్! 25

త్రిదశేశ్వరుడును నైన యింద్రుడును దీరుగ నిర్యాతుం డగుచున్
అట్టి సమయమున గంధర్వులునూ నిట్టె సావధానులు నగుచున్
అనేక విధముల వాద్యంబులనూ నలరుచు మ్రోగించిరి యపుడున్
అప్సరసల సంఘంబులు గూడను నలరుచు నృత్యములను జేసీ
విజయసిద్ధి గలుగగవలె నంచును విమల వచనముల బలికి రటన్! 26

త్రిదశాధిపుడగు నింద్రుడంతటను దీరుగ యనేక విధములనూ
ఆయుధములుగల రుద్రులతోడను, నల వసువుల తోడను మఱియున్
అశ్విని దేవతలను గూడికొనీ యలరుచు మరుద్గణంబులతో
కలిసి బయలుదేరెను నింద్రుండును కలకల శుభ నాదంబులతో! 27

శక్రుండును నిర్గతుడగు చుండగ సంగ్రామమునకు వేగముగన్
ఆ సమయంబున వాయువునూ మఱి యలరి పరుషముగ వీచెనటన్
సూర్యుని కాంతియు దగ్గెను నపుడును సోలుచు చీకటి వ్యాపించెన్!
కొఱవుల వంటీ నిప్పు ముద్దలును గూరిమి నటబడె వేగముగన్! 28

ఈ లోపలనూ శూరుండును మఱి నింపుగ బ్రతాపవంతుడునూ!
ఆ దశగ్రీవుడు విశ్వకర్మచే నద్భుతముగ నిర్మింపబడీ,
బహూకరించిన దివ్య రథంబును బన్నుగ యా దశగ్రీవుడునూ,
యధిరోహించెను నధికాసక్తిని యా రణంబునకు బోవుటకున్! 29

సుమహాకాయంబును గలిగియునూ, సురుచిర రోమాంచమును మఱిన్
గలిగించెడి పన్నగముల చేతనూ బన్నుగ పరివేష్టితమైనా
వేని యొక్క నిశ్వాసంబులచే విపుల రణమునందున మఱియున్
మండుచున్నటుల గనపడుచుండెనో యుండెనో భీభత్సముగ నటన్
అట్టి రథంబును నధిరోహించెను నిట్టె శక్రుడును వేగముగన్! 30

అల దేవేంద్రుడు రణమునందునను నటు నిలువగ మఱి రాక్షసులున్
దైత్యులునూ మఱి చుట్టిముట్టిరీ దగ యాయుధముల తోడన్!

ఆ రాక్షసుడగు మేఘనాథుడును నభిముఖుడై యుద్ధంబునకున్
మహేంద్రునకు మఱి యెదురుగ బోయెను మానుగ యాతని యెదిరింపన్! 31

అలపుత్రుండగు మేఘనాధునీ యలరి నివారించియు మఱియున్
స్వయముగనే నిలిచెను యుద్ధంబున సాహసుడగు రావణుడపుడున్
మేఘనాథుడును యుద్ధమునుండీ మేదుర విశ్రాంతిని గొనగా
విని(ష్క్రమ్యుడై ప్రక్కకు దొలగీ విశ్రాంతిని గొనుచుండె నటన్! 32

అటుబిమ్మట యా సంయుగ మందున యలరు మేఘములకును బోలెన్
యుద్ధమందునను శస్త్రంబులనూ యుద్ధతి వర్షించుచునున్నా
దేవతలకునూ మఱి రాక్షసులకు దీరుగ యుద్ధము జరిగెనటన్
భయంకరముగా భీభత్సముగా బలు విధ యాయుధముల తోడన్! 33

రఘురామా! ఆ సమయమునందున రహి యనేక విధములునైనా
ఆయుధములనూ ధరించినట్టే యల దుష్టాత్ముడు దురాత్ముడున్
అట్టి కుంభకర్ణుండు రణమునకు నిట్టె రణము జేసెనా లేదో
ఎవరితోని దలపడి పోరాడెనా యెవరికి దెలియదు అని యందున్! 34

సంక్రుద్ధుండై కుంభకర్ణుడును సాహసుండు రణరంగమునన్
దంతములచేతను పాదంబుల భుజముల హస్తంబుల చేతన్
శక్తుల చేతన్ తోమరములచే సాహసమగు ముద్గరములచే
ఏది దొరికితే దాని చేత మఱి యెగసి యెగసి సురలను గొట్టెన్! 35

అటుబిమ్మట యుద్ధతితో యుద్ధము నలరిజేసెడీ రాక్షసుని
రణమున మిక్కిలి భయంకరులునగు రయమున రుద్రులు గలసి మఱిన్
అట్టి కుంభకర్ణుని రుద్రులునూ నిట్టి సందు లేకుండగనూ!
ఆయుధములచే కొట్టిరి మొట్టిరి యవకాశంబును లేకుండన్! 36

శస్త్రాంచిత తనువును గలవారును శరీరమంతయు రక్తమునూ!
స్రవించుచున్నా కుంభకర్ణుడును సకల దిక్కులను మెఱుపులనూ
పిడుగులతో గూడిన మేఘమువలె ప్రిదిలి ప్రకాశించుచునుండెన్!
జయాపజయములు దెలియరానివీ సంగ్రామము నందున నిజమున్! 37

అటుబిమ్మటనూ మరుద్గణంబుల నటు గూడిన రుద్రుల జేతన్,
సంగ్రామంబును జేయుచున్న యా సమస్తమైనా రాక్షసులా,
సంబంధించిన సైన్యమంతయును సకలమైన యాయుధములచే,
పారిపోవు నట్లుగ జేసిరి మఱి పరాజితంబగు నట్లుగనూ! 38

కొట్టబడిన యా రాక్షసులందున కొందఱు ఛేదింపగ బడుచున్
భూతలంబుపై గొట్టుకొనుచునూ భువిపైబడియుండిరి మఱియున్
మఱి కొందఱు వీరులు శూరులు మఱి మానుగ వాహనములపైనన్,
తగుల్కొనియు మఱి యట్లే నిలిచిరి తగ ప్రాణంబులు లేకుండన్! 39

దేహంబులు మఱి బిగిసిపోయినా దీరుగ కొందఱు రాక్షసులున్,
బాహువులను నాధారముగా గొని ప్రక్కనున్న యా యరదములన్,
తురగములను మఱి శింసుమారముల దోరముగా నొంటెలును మఱిన్
దిశాచ వదనములను నుండిన యా ప్రేమ మీర యా జంతువులన్
బాహువులను మఱి కౌగిలించుకుని బన్నుగ లేచిన వారగుచున్
నుండగా సురల యాయుధములచే దండిగ బ్రద్దలు కొట్టుబడీ!
ఎచట నుండిరో వారట నుండిరి యించుక సందడి లేకుండన్! 40, 41

ఆ రాక్షసు లందఱు రణంబునను నచట చచ్చిపడి యున్నట్టీ
వారలచేతను యా రణరంగము వనరగ మౌనముగా నుండెన్,
యుద్ధభూమి యా సమయమునందున తత్థితముగ చిత్తరువు వలెన్
చూచువారలకు గనబడుచుండెను జూడ నచ్చెరువుగా నుండెన్! 42

ఆ రణ రంగమునందు రక్తమను నల జల ప్రవాహముల చేతన్
ఆయుధంబులను మొసళ్లతోడను నల కాకులతో గ్రద్దలతో
అలరి నిండినా నదిగా గనపడె అలరక్తపు ధారలతోడన్,
త్రుళ్లి త్రుళ్లి మఱి ప్రవహించినదీ దూలుచు రక్తపు దుంపురులున్! 43

ఈ యంతరమున దశగ్రీవుండును నిల తన సైన్యమునంతయునూ
సురలచేత బడగొట్టట జూచియు జూడ్కుల యరుణిమ దులకింపన్,
కోపించియు మఱి పెరుగుచున్న యా కూరిమి సురసైన్యంబుల వే

సముద్రంబునను బ్రవేశించి మఱి సరగున సురలను గొట్టుచునూ
ఇంద్రుని పైకిని బోయె రావణుడు సాంద్రమైన యాయుధములతో! 44,45

దేవతాధిపతి యగు దేవేంద్రుడు దీరుగ మహా ధ్వనియు గలుగూ
మహా ధనుస్సును జఱచుచు ముందుకు మానుగ వచ్చెను రణమునకున్!
ఆ ధనుస్సునూ చఱచుట వలనను నట్టి ధ్వనికి పది దిక్కులునూ
మారు మ్రోగుచుండెను మఱి దిశలను మఱి భూమియు నాకాశంబున్! 46

ఆ యింద్రుండును మహా ధనస్సును నలరి లాగుచును శీఘ్రముగన్
అగ్నివంటి మఱి సూర్యుని వంటీ యలరు తేజమును గలవానిన్,
దశగ్రీవుని యా శిరస్సునందున దగ బడవేసెను శీఘ్రముగన్,
సయుల సమరము జరిగిన దప్పుడు సాహసులగు వారిరువురికిన్! 47

అ విధముగవే మహాబాహువగు నల రాక్షసుడగు రావణుడున్,
కార్ముక విభ్రష్టంబులునగు నా కఱకు బాణ వర్షంబులచే,
ఆ యింద్రునిపై జల్లెను నాతడు నటు నిటు గానక తీవ్రముగన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 48

అటుపిమ్మట వారలు నిరువురునూ చటుల బాణ వర్షంబులునూ,
గురిపించుచు అని సేయుచుండగను కూరిమి చీకటులాయె మఱిన్
అంధకారమును నిండుటచే మఱి యలరి యేమి కనబడలేదూ!
ఆ చీకటిలోనే యా వీరులు నలరి రణంబును జేసి రటన్! 49

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఇరువది యెనిమిదవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఇరువది తొమ్మిదవ సర్గము

(రావణుడు దేవతల సైన్యము నుండి బైటకు పోవుట - అతనిని బట్టుకొనుటకై దేవతలు ప్రయత్నించుట - ఇంతలో మేఘనాధుడు మాయా ప్రయోగము చేత యింద్రుని బంధించి విజయవంతుడై సైన్యముతో లంకకు ప్రయాణమగుట)

అటుబిమ్మట యా కాలు జీకటులు జటులత బుట్టిన వగుచుండన్,
ఆ సమయంబున సురలు రాక్షసులు నల బలమున యున్మత్తులునై
పరస్పరము మఱి కొట్టుకొనుచునూ బరస్పరము జంపుచునుండీ
ఆ చీకటియందున వారును మఱి యలరి జేసిరీ యుద్ధంబునన్! 1

అటుబిమ్మట సురసైన్యము జేతను నల రాక్షస సైన్యంబునకున్
దశాంశంబు మాత్రము మిగిలినది దగ శేషం బంతయు నపుడున్
యమక్షయమునకు బంపబడినదీ నల రణంబునను శీఘ్రమునన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 2

తామసంబునకు సంబంధించిన తగ యా యుద్ధమునందుననూ,
ఆ దేవతలును రాక్షసులును మఱి యలరి యుద్ధమును జేయుచునూ,
ఒకరి నొకరు గుర్తింపగలేరూ ఒకరి నొకరు మఱి గనలేదూ!
అంధులవలె యుద్ధంబును జేసిరి నలరు నాయుధంబుల తోడన్! 3

తమోజాలయుతమగు యుద్ధంబున దగ రణరంగమునందుననూ
ఇంద్రుడు దశగ్రీవుండును మఱియును సాంద్రబలుండగు నింద్రజితూ!
ఈ ముప్వురు మాత్రము రణంబునను నింపుగ మోహము జెందకనూ!
సహజశక్తితో యుద్ధము జేసిరి సాహసమున వర్తిల్లిరటన్! 4

ఆ దశగ్రీవుడు క్షణకాలంబున అల జంపగ బడినట్టియునూ
సమస్తమైనా రాక్షస బలమును సరిజూచియు బహు తీవ్రముగన్
క్రోధంబును మఱి జెందె నాతడును క్రోధవహ్నిలో మునుగుచునూ,
సింహ గర్జనము జేసెను నాతడు జింతాక్రాంతుం డగుచు మఱిన్! 5

దుర్ధర్షుండగు రావణు డంతట! తేరము నరదము పైనున్నా
సూతుని తోడను నిటుల బలికెనూ, శూరత్వంబును నుట్టిపడన్
శత్రువులందఱు వశించు వఱకును సాహసముగ పోరాడెదనూ!
వారల మధ్యకు నను గొని పొమ్మిక వరుసగ వారల గూల్చెదనూ! 6

సారధి విను! నే నిపుడే స్వయముగ సకల దేవతల నందఱినీ
నా పరాక్రమము జేతను మఱియును నానా శస్త్రాయుధములచే
వర్షంబును గురిపించి వారలను వరుసగ యమక్షయంబునకున్
బంపెద సురలను నందఱినీ మఱి జంపెద బాహు బలంబుననూ! 7

నేను నింద్రునీ వధించెదను మఱి నిక్కముగా ధనదుని గూడన్
యమ వరుణులనూ సంహరించెదను నల దేవతలను శీఘ్రముగా
సంహరించి మఱి యటు బిమ్మటనూ సహజముగా నేనే యుందున్
జంపెద సురలను నందఱినీ మఱి జంపెద బాహు బలంబు ననూ! 8

ఓ సారధి విను! నా పలుకులనూ వనర విషాదము వలదు సుమా!
నా యరదంబును శీఘ్రము నడుపుము! నయముగ రణ మధ్యంబునకున్
రెండు మారులును దెలుపుచుంటినీ నిండిన ధీరతతో గూడీ
దేవత లంతము జెందువఱకునూ దీరుగ నడుపుము రణమందున్
దిగ్విజయము సమకూరు వఱకునూ దిరుగబోను వెనుకకును మఱిన్! 9

మన మిపుడును మఱి యెచట నుంటిమో మానుగ నందనవన మిదియున్
ఈ ప్రాంతమున నుండి పోవలెను నింపుగ తూర్పునకును మఱియున్
ఉదయ పర్వతము నెచటనున్నదో సదయ నన్ను గొని పొమ్మటకున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 10

ఆ సారధియును నతని వచనములు నలరి వినుచు బహు శీఘ్రముగా
మహా వేగమును గల యశ్వంబులు మానుగ నడుపుచు నాతండున్
శత్రువులకు మధ్యమునను నడిపెను సాహసమున యా యరదమునూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 11

ఆ సమయంబున దేవేశ్వరుడగు నల దేవేంద్రుడు నరదముపై
నున్నవాడగుచు లంకేశ్వరునికి నున్న నిశ్చయము దెలిసికొనీ

సురలతోని నీ విధముగ బలికెను శూరత్వము దొరణికిస లాడన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 12

దేవతలారా! నా కభిమతమగు దీరుగ యిష్టమునగు పలుకుల్
తెలుపుచు నున్నాడను వినుడో మఱి! దీరుగ జేయుడు నా పలుకుల్
ఆ దశగ్రీవుని బ్రతికుండగనే యలరి మీరు బట్టగ వలయున్,
అల రావణు డదె వచ్చుచుండెనూ యలరి మనల సేనల ద్రుంపన్! 13

అతి బలంబుగల యా దశగ్రీవుడు నలరి పర్వదిన మందుననూ
ప్రవృద్ధోర్మిగల సముద్రంబువలె వాయు వేగమును గలయట్టీ,
రథంబుతోడను సైన్య మధ్యమున రయమున బోవుచున్నాడున్
పట్టి వాని బంధింపగ వలయును బన్నుగ జంపగ లే మతనిన్! 14

వరదానంబున సునిర్భయంబుగ వనరగ యీతని జంపుటయున్,
శక్యంబును మఱి కాదుగదా యిక చాలు నితని బంధించెదనూ!
సైనికులారా! మీ రందఱునూ సాహసమున సిద్ధము కండీ
ఆ రాక్షసునీ బట్టుకొనుటకును నలరి ప్రయత్నము జేయుడికన్! 15

బలి బంధింపగ బడిన వాడగుచు బన్నుగ యేవిధమున నాచే
త్రైలోక్యంబుల సముదాయంబును దీరుగ భోజ్యంబగు నటులన్
ఈ పాపాత్ముడు రావణాసురుని నింపుగ బంధనమున గూడన్
నాకు నిష్టమగుచున్నది వినుడో నయముగ దీర్పుడు నాకాంక్షన్! 16

మహారాజ! ఓ రామా వినుమా! మానుగ పిమ్మట శక్రుండున్
ఆ దశగ్రీవుని విడిచి పెట్టుచును నష్టమైన యొక ప్రదేశమున్
అధిష్ఠించి మఱి యుద్ధమునందును యలరి రాక్షసుల వేధించీ
యుద్ధము జేయగ ప్రారంభించెను యుద్ధతి నానా విధములనూ! 17

ఆ దశగ్రీవుడు రణరంగంబున యనివర్తనుడై వేగముగన్
ఉత్తర పార్శ్వము నందున నాతడు నుధృతముగను ప్రవేశించెన్!
దేవేంద్రుండును నా సమయంబున దీరుగ దక్షిణ పార్శ్వమునన్
రణరంగంబున ప్రవేశించెనూ నయముగ శత్రులు భయనుందన్! 18

అటుబిమ్మట శత యోజనంబులా యలదూరము వఱకును మఱియున్
ప్రవేశించి యా రాక్షసాధిపుడు బన్నుగ సమస్త మైనట్టి
సురసైన్యముపై బాణవర్షమును సూటిగ గురిసెను నట్టి యెడన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 19

అటుబిమ్మట యా దేవేంద్రుండును నలరి తనకు జెందిన యట్టి
సురసైన్యంబును నశించినట్లుగ సూటిగ సంభావించి మఱిన్
అటు బిమ్మట మఱి తిరిగి వచ్చియును యా దశాననుని వెనువెంటన్
వెనుకకు మరలింపగ జేసెను మఱి విమలాయుధముల తోడుతనూ! 20

ఈ యంతరమున శత్రుని జేతను నిల యాక్రమింప బడినట్టి
యా దశగ్రీవుని గాంచి వెంటనే యలరు దానవులు, రాక్షసులున్,
'హా హతాస్మ!' అయ్యో చచ్చితి మని యఱచిరి పెనుకేకల తోడన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 21

అటుపిమ్మటనూ క్రోధమూర్ఛితుడు నల రావణియును వేగముగన్
మహారథంబును నధిష్ఠించియును మానుగ సంక్రుద్ధుం డగుచున్
భయంకరంబును సుదారుణంబగు బన్నుగ సురసైన్యము నందున్
ప్రవేశించుచును మేఘనాథుడును ప్రబల మాయ మంత్రంబులతో! 22

పూర్వము బశుపతి చేత బొందినా పొలుపుగ మాయ సహాయముతో
ప్రవేశించె నా సురస్సైంబున బహు తొందర బడుచును నతడున్
అతని ధాటికిని నిలువలేక మఱి యల సురసైన్యంబంతయునూ
దిక్కుల దిశలకు బారిపోయెనూ దీనాలాపంబుల తోడన్! 23

రణరంగంబున మేఘనాథుడును రయమున దేవతలందఱినూ
విడిచిపెట్టి యా యింద్రుని మీదకు వేగముగా బరుగులు దీసెన్
మహా తేజమును గల దేవేంద్రుడు మానుగ శత్రువు సుతుడైనా
యింద్రజితును మఱి గానకపోయెను సాంద్ర మాయజాలము జేతన్! 24

విముక్త కవచుండైనప్పటికిని వీరయోధుడగు నింద్రజితూ!
మహావీర్యుడగు సురలచేత నటు మానుగ కొట్టగ బడుచున్నన్

వారి నేమి మఱి జేయగలేదూ యొనరగ భయపడలేదచటన్
ఇంద్రుని మీదను యాతని లక్ష్యము నింద్ర రథముపైనే చూపున్! 25

మహా వీర్యుడగు మేఘనాథుడును మహా యుధంబులు ధరియించీ
సమాయుతుండై వచ్చుచున్న యా సారధియును నగు మాతలిపై
శ్రేష్ఠములైనా బాణంబులచే స్థిర ప్రయోగములు జేసి మఱిన్,
మఱల శత్రుపై ప్రయోగించెనూ మానుగ శర వర్షంబు మఱిన్! 26

అటుబిమ్మట యా దేవేంద్రుండును యట మహారథంబును విడిచీ
సారధియగు మాతలిని గూడనూ సరగున పొమ్మనె ప్రక్కకునూ
ఐరావతమును నధిరోహించెను నల యింద్రుండును వేగముగన్
మేఘనాధునీ కొఱకును వెదికెను మెఱుపు దీవెవలె యంతటనూ! 27

మాయాబలమును గలవాడును మఱి మానుగ రావణు పుత్రుండున్,
మేఘనాథుడును గనబడకుండగ మిగుల నింగిపై నుండి మఱిన్
అల యింద్రుని తన మాయజేతనూ యలరి కప్పి వేయుచు నతనిన్
బాణంబులనూ బ్రయోగించుచును బరగ పోయె శత్రుని పైకిన్! 28

ఆ రావణియగు మేఘనాథుడును నా యింద్రునిగని మదియందున్
పరిశ్రాంతుగా దెలిసికొనియు మఱి బన్నుగ యాతని వేగముగన్!
మాయచేతనూ బంధించియు మఱి మాటాడక జేసియు మఱియున్
తన సైన్యంబును నున్న చోటికిని దగదెచ్చెను నా శచీపతిన్! 29

మేఘనాధుచే రణ రంగంబున మేదుర బలశాలియునైనా
యా శత్రుని బలవంతముగా మఱి యలరి గైకొనియు బోవుటయున్
ఆ దృశ్యంబును జూచి దేవతలు నలరి భయబడుచు మదియందున్!
ముందేమగునో యనుచు సురలునూ సందేహించిరి తీవ్రముగన్! 30

అసురుల మాయలను జయించెడీ యలరు విద్యలును గలవాడున్
అట్టి యింద్రునీ బలవంతముగా నిట్టె దీసికొని పోయిన యా
మాయావియు మఱి యద్దంబులతో మఱి విజయము బొందెడి వాడున్!
అట్టి మేఘనాథుం డెచ్చటనూ నిట్టె కనబడుటలేదు మఱిన్
అనుకొని రప్పుడు దేవతలును మఱి యదురుచు బెదురుచు తమస్సునన్! 31

అట్టి మధ్యకాలమునందుననూ యల సురగణములు నన్నియునూ,
కోపించియు మఱి క్రోధము తోడుత కూరిమి రణరంగమునందున్
యుద్ధమునుండీ విముఖీ కృతముగ కత్థితముగ రావణుజేసీ!
బాణ వర్షమును గురిపించినవీ బన్నుగ యా సురగణములునూ! 32

రావణు డంతట యుద్ధ రంగమున రహి యాదిత్యుల వసువులనూ
ఎదిరించియు నెదిరింపలేక మఱి పదుగురిచే పీడింపబడీ!
యుద్ధము జేయగ జాలకపోయెను యుద్ధతి తగ్గు ముఖమును బట్టెన్!
రణరంగంబున విజయమెప్పుడును రహి తనదే యనుకొనరాదూ! 33

కదన రంగమున దెబ్బల చేతను కదిలి వాడిపోయిన వాడై
జర్జరీ కృతము జేయగబడినా జారిన తండ్రిని గనుగొనుచున్
ఇంద్రజిత్తు తన మాయను విడిచీ సాంద్రముగా గనబడుచు నటన్
తండ్రియైన రావణుతో బలికెను నింద్రజిత్తు బహు వినయముగన్! 34

తండ్రీ! రమ్మా! మనము బోవుదము! దగ విడువుము యుద్ధము నింకన్
మనకు విజయమును సిద్ధించినదీ మానుగ విషయము దెలిసికొనూ
మనసు నందుగల మనోవ్యధను మఱి మానుగ దొలగగ జేసికొనీ
స్వస్థ చిత్తుడవు నగుమా యింకను సరసత విజయము గలిగినదీ! 35

సురసైన్యమునను త్రైలోక్యంబుల సురుచిరముగ ప్రభవునునైనా
అల దేవేంద్రుని దేవబలంబున యలరి పట్టుకొన గలిగితినీ
పట్టుకొనుటయే కాదు సుమా మఱి బంధించితి నే కఠినముగా
అంతియ కాదు సుమా తండ్రీ! మఱి యలరు దేవతల దర్పంబున్
భగ్నము జేసితి తండ్రీ! వినుమా! బల్లిదమైన బలంబుననూ! 36

నీ శత్రువులను నీ తేజస్సున నిగ్రహించి బహు శీఘ్రముగన్
మూడు లోకముల ననుభవింపుమా మోదముతో నిచ్ఛా రీతిన్
ఇపుడిచ్చటనూ వ్యర్థమైన శ్రమ యింపుగ యెందులకో జెపుమా?
రణము వలననూ ప్రయోజనంబును రమ్యముగా లేదిపుడు మఱిన్! 37

ఇంద్రజిత్తు మాటలు విని సురలును నింపుగ సురగణములు వేగన్
గుణకర్మంబును విడిచిపెట్టిరీ రయమున మఱలిరి వెనుకకునూ

ఇంద్రుడు లేనీ యల దేవతలును సాంద్రముగా వెనుకకు మఱలీ
తమ తమ గృహములకును బోయిరి మఱి దగ జేయుగ యేమియు లేకన్! 38

అటుబిమ్మట యా రణ విగతుండును నలరెడి తేజము గలవాడున్
అలరు త్రిదశులకు శత్రువునూ మఱి యల ప్రసిద్ధుడును నగువాడున్
అట్టి రాక్షసుల రాజగునట్టీ యల రావణుడును ప్రియమైనా
తన పుత్రుని వచనములను వినుచును దగ యాధృతమును గలవాడై
ఆదర పూర్వకముగ నాతండును నలరు నింద్రజితుతో ననియెన్! 39

అతి బలంబునూ, సామర్థ్యంబును నలరు నట్టి నా సుపుత్రుడా!
మన వంశమునకు తగిన విక్రమము మానుగ పరాక్రమంబులచే
నా వంశంబును, కులము, శాఖలను నయముగ వృద్ధిని గావించీ
కీర్తి దెచ్చినాడవు నీవును మఱి యార్తి బాసితివి కులమునకున్!
ఎందువలన నన మహాబలముగల చందముగా శక్రుని మఱియున్
దేవతలను మఱి జయించినాడవు తేజమొప్ప త్రైలోక్యంబుల్! 40

నీవును శక్రుని రథమునందునను నిశ్చయముగ యెక్కించుకునీ
ఇచటి నుండి సేనా సమేతముగ యింపుగ లంకాపురికి మఱిన్
బయలుదేరు మిక నేనును గూడను బన్నుగ సంతోషము తోడన్
మంత్రుల తోడను కలిసి వెంటనే మానుగ వచ్చుచునున్నాడన్! 41

అటుబిమ్మట యా విక్రమవంతుడు నలరు మేఘనాధుడు గూడన్
ఆ యింద్రుని మఱి వెంటదీసికొని యల సైన్యంబును గూడికొనీ
వాహనములతో గూడిన వాడై వనరగ తన గృహమును జేరీ
రణమును జేసిన యా రాక్షసులను రయమున బొమ్మనె గృహములకున్!

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ఇరువది తొమ్మిదవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

## ముప్పదియవ సర్గము

(బ్రహ్మదేవుడు నింద్రజితుకు వరమునిచ్చి దేవేంద్రుని బంధనము నుండి విడిపించుట- ఇంద్రుడు పూర్వము జేసిన పాపకృత్యమును అతనికి గుర్తుచేసి వైష్ణవ యాగము జేయుటకు సమ్మతినిచ్చుట- యజ్ఞమును పూర్తిజేసి యింద్రుడు స్వర్గమునకు బోవుట)

అటుబిమ్మట బహు బలము గలిగినా యల దేవేంద్రుడు రణమందున్
మేఘనాధుచే నోడింపగబడి మేదురముగ బందీ యగుచున్
లంకానగరము నందు నుండగా శంక లేక సురలందఱునూ
బ్రహ్మదేవునీ ముందు నుంచుకొని బన్నుగ బోయిరి లంకకునూ! 1

పితామహుండును లంకయందునను ప్రియముగ పుత్రుల తోడుతనూ
అలసోదరులను కలిసియున్న యా యలరుచు రావణు నొద్దకునూ
పోయి గగనమున నిలిచియుండి మఱి పొలుపుగ బ్రతిమాలుచు నతనిన్
ఈ విధముగ యాతనితో బలికెను నింపుగ మధురాక్షరములతో! 2

నాయన రావణ! యుద్ధమునందున నయముగ నీ సుతు విక్రయమున్
జూచితి! యానందించితి గదరా! చూడ్కులు ఎ ద్రిప్పక నలువంకల్!
వీనియొక్క విక్రమ మౌదార్యము వినుతి సేయవలయును సుమ్మా!
బహునాశ్చర్యము గలిగించునదీ బన్నుగ యీతని సాహసమున్
ఆతడు నీతో సమాన తుల్యుడు నతడు నీకంటె ఘనుడు సుమా! 3

నీవు నీదు తేజస్సుల చేతను నిక్కముగా త్రైలోక్యంబుల్
జయించినాడవు! నీప్రతిజ్ఞ మఱి జగమున స్థిరమును జేసితివీ!
నీదు విషయమున నా కుమారునీ నిఖిల విజయముల యందుననూ
సంతోషించుచు నుంటిని తండ్రీ! యెంతో మది పులకింపగనూ! 4

ఓ దశగ్రీవా! నా వచనంబును నొనరగ వీనుల కింపుగనూ!
అతి బలవంతుడు, వీర్యవంతుడును నగు నీ పుత్రుడు లోకములో

'ఇంద్రజిత్తు' అను ప్రసిద్ధ నామము సాంద్రముగా బొందును నింకన్
ఇంద్రుని జయించినాడనుచును మఱి సుందర నామము నొందు నికన్! 5

ఎవని సహాయముచేత నీవు మఱి నింపుగ యలదేవతలను మఱిన్
స్వాధీనమునందుంచుకొంటివో సహజముగా నీ రాక్షసుడున్
మహాబలీయుడుగా నుండును మఱి మానుగ దుర్జయుడై యుండున్
తండ్రిపేరు నిలబెట్టగలడు సుమ! దైవారాధనతో నిలనూ! 6

మహా బాహువులు గలవాడా! విను! మానుగ యాకారణముననూ
పాక శాసనుండైన మహేంద్రుడు బరగ విడువబడును గాతన్
అల దేవేంద్రుని విడుచుట కొఱకై యలరి దివౌకసులును నీకున్
ఏమి యివ్వవలెనో దెలుపుము మఱి నింపుగ యర్పింతురు నీకున్! 7

అటు బిమ్మట యామహాతేజుడును నలరుచు సమితింజయుడు మఱిన్
మేఘనాథుడీ విధముగ బలికెను మేదుర వినయ విధేయతనూ
పితామహా! యా దేవతాధిపతి విడువగబడు నిక సందియమున్
లేదు సుమా! మఱి నా కొక వరమును లీలగ యివ్వగ వలయు సుమా!
అమరత్వంబును గోరుచుంటినీ యల మరణము లేకుండగనూ! 8

చతుష్పాద జంతువులయందనూ జతురత యాకాశము నందున్
సంచరించెడీ వానియందునూ సరసత ఘన తేజస్సులునూ
గలిగిన యితరుల యందును మఱియును వృక్షంబులు బొదలును మఱియున్
చిన్న మొక్కలును లతలు వృక్షములు చిన్ని శిలలు, పర్వతములునూ
సమస్తమైనా జంతువులందును సాఱెు భయపడు సమయమునన్
అన్యోన్యంబును భయపడచుందురు నది సహజముగద లోకమునన్
అందువలన యీ లోకమునందున యందఱికిని యందఱి యందున్
భయమునుండునూ బాధయుండునూ పలుభంగుల యీ లోకమునన్! 9,10

అటుబిమ్మట యా మహా తేజుడును నల ప్రజాపతియు, బ్రహ్మయునూ
మేఘనాథునీ గాంచి పలికెనూ మేదుర యాప్యాయత తోడన్
తండ్రీ! యీ భూలోకమునందున డగ యే ప్రాణికి గూడ మఱిన్
మరణము లేకను పోవుటన్నదీ మానుగ లేనే లేదుగదా! 11

నాల్గు పాదముల జంతువులకునూ నయముగ పక్షులకును గానీ
మహా తేజమును గలిగినట్టి యా మానుగ భూతంబులకు మతిన్
అమరత్వంబును లేనే లేదూ, యరయగ యీ భూతల మందున్!
అని బలికిన యా బ్రహ్మదేవునీ పలుకులు విని నటుబిమ్మటనూ
మేఘ నాథుడును బ్రహ్మదేవుతో మేదుర వినయము నుట్టిపడన్
నీ విధమగు వరమును గోరెను మతి యింపుగ మధురాక్షరములతో! 12

శతక్రతు విడుదల కావలెననుచును సొకు కోరిక యుండినచో
నాకును మతి యే సిద్ధి కావలెనొ నాకే మిష్టమొ వినుము మతిన్!
శత్రువుపై విజయమును గోరుచును నిత్యము హవ్యంబుల చేతన్
మంత్రంబులచే నగ్నిని హోమము నలరి జేసి నే యుద్ధములో
ప్రవేశింపగానే మతి నాకై పరగ యగ్నిలో నుండి మతిన్
గుఱ్ఱంబులతో గూడిన రథమును కూర్మి పైకి వచ్చును గాతన్! 13, 14

ఓ దేవా! ఓ పితామహా వినుI వొనరగ నా యీ పలుకులనూ
నే నా రథమున యుండిన వఱకును నే మృత్యువును బడరాదూ!
ఇదియే నా నిశ్చితమైనదియును నిజముగ కోరిన వరము నిదే!
అగ్నియందునను సమంత్రంబుగను అలరి జేయు నా యజ్ఞంబున్
పూర్తి చేయకను నేను యుద్ధమును బొందుగ జేసినచో నపుడున్!
నాకు వినాశము గలుగగ వచ్చును నాకు మరణమును గలుగునిటన్! 15, 16

పితామహా! యీ లోకమునందున ప్రీతిని ప్రతి పురుషుండు నిటన్
తపస్సు జేసీ యమరత్వంబును దగ వరంబుగను గోరుగదా!
నేను మాత్రమటుగాదు, పితామహా! నేను పరాక్రమమును జూపీ
అమరత్వంబును సంపాదింపగ యలరి కోరుకొను చున్నాడన్! 17

దేవుడైన యా పితామహుండును దీరుగ 'యట్లేయగు గాతన్!'
అనుచు బలికెనూ యాహ్లాదముతో యానందంబును విరియగనూ!
దేవేంద్రుండును విడిచి పెట్టబడె దీరుగ యా రాక్షసు జేతన్
దేవతలందఱు వెడలిపోయిరీ తీరుగ స్వర్గంబునకు మతిన్! 18

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
ఇంతలోపలను నంతర మందున చింతాకులదీనుడవచున్
భ్రష్టామరద్యుతి గల వాడగుచును బరిచింతాత్ముండగుచు మఱిన్
ఏదో యాలోచించుచునుండెను నేదో భావించుచు నుండెన్! 19

తథా భూతముగ యున్న యింద్రునీ దగనిఁగాంచియు నా బ్రహ్మయునూ
ఈ విధముగ బలికెను యింద్రునితో నింపుగ ప్రశ్నా పూర్వకమున్
స్వర్గాధిప! ఓ దేవేంద్రా విను! సరసత సుపూర్వకాలమునన్
దుష్కృతమగు కార్యమును జేసితివి ఘోరముగా యటు లెందులకున్? 20
సమర్థుండవగు దేవేంద్రా విను! సరసత యాలోచించి మఱిన్
అన్ని విధములా ఒక వర్ణముగల ఒకే బాషగల వారలనూ
ఒకే రూపమును గలవారలనూ యొనరగ ప్రజల సృజించితినీ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 21

చూచుటయందునను మఱియునూ సురుచిర లక్షణముల యందున్
సృజించినట్టీ ప్రజల యందునను సూక్ష్మ భేదమేమియు లేదూ!
అపుడు నేను నా సమయమునందున యల యేకాగ్రతదో గూడీ
సృజించినట్టీ ప్రజలను గూర్చి సూటిగ యాలోచించితినీ! 22

అట్టి నేను ఆ సమయము నందున నిట్టె యా ప్రజల యందుననూ
విశేషార్థముగ యొక్క స్త్రీని నే విమలముగా నిర్మించితినీ!
సృజించినట్టీ ప్రజల యొక్కయును ప్రత్యంగంబును గైకొంటిన్
ఏది విశిష్టంబో మఱి దానిని విదితముగా గైకొనబడియెన్! 23

అపుడు నేను రూపముతోడను మఱి యలరు గుణంబులతోడుతన్
అహల్య యనియెడి స్త్రీని సృజించితి యలరెడి బంగరు బొమ్మవలెన్!
హల్య మనగ దా నర్థము వినుమా! నల రూపంబున వికారమున్
అట్టి హల్యమును లేని దానికిని అహల్య యనియు ప్రసిద్ధియునూ!
నే నా స్త్రీకిని గూడ 'అహల్యా' అనియే నామము బెట్టితినీ! 24

సురశ్రేష్ఠుడవగు దేవేంద్రా విను! సురుచిరముగ యాస్త్రీని మఱిన్
ఆ వనితను సృజియించిన బిమ్మట యాలోచించితి గాఢముగన్

ఈ సుందరి యెవనికి మఱి భార్యగ యింపుగ నుండిన బాగుండున్?
అనుచు నేను ప్రశ్నించితి మనసున యాటుపోటులును గలుగంగన్! 26

సమర్థుండవగు పురంధరావిను! సరసత నా పలుకులు వినుమా!
నీ నా సమయమునందు గోరితివి! నేనున్నత స్థానమునుంటిన్!
గాన యీామె నా భార్యగావలెను గ్రక్కున! యని మది దలచితివీ!
కానీ నీవును యడుగ లేదు నను, నేనును నీ కీయగ లేదూ! 27

నే నామెను బహు వర్షంబులునూ నిర్మలుడు మఱి మహాత్ముడున్
గౌతమ ముని వద్దను న్యాసముగా గారవమున నే నుంచితినీ!
ఆ మహామునియు న్యాసరూపముగ యటనుంచియు యా యహల్యనూ
తిరిగి యప్పగించెను నాకును మఱి దీర్ఘకాలమునకును మునియున్! 28

అటు బిమ్మట యా మహర్షియందున యలరు స్థిరత్వము ధైర్యంబున్
తెలిసికొంటినీ తపస్సునందున దీరుగ సిద్ధిని గ్రహియించీ
అప్పు డతనికిని యలరు భార్యగా నల శుశ్రూషలు జేయుటకై
అప్పగింపబడె నాచేతను మఱి నొప్పుగ స్పృశింప జేయబడెన్! 29

మహామతియునూ ధర్మాత్ముండును మానుగ గౌతముడును మఱియున్
ఆ యహల్యతో శుశ్రూషలుగొని యానందించుచు నుండె మదిన్
ఆ సుందరి యగు నహల్య నంతట నల గౌతమునకు గూర్చుటచే
దేవతలందఱు నిరాశు లైరీ దీరుగ చింతాక్రాంతులునై! 30

కామస్వభావుడవైన నీవు మఱి కల్మషుండ వగచును నీవున్
ముని యాశ్రమమునకు బోయితివీ వప్పుడు ముదిత యహల్యను గాంచగనూ!
ఆశ్రమంబునను యామెను గాంచీ యగ్నిశిఖకు వలె నున్నట్టీ
ఆ యహల్యనూ గాంచితి వప్పుడు నలరి కామ మోహితుడవునై! 31

ఆమె లభింపగ లేదను కోపము నలరి బాధ బడుచుండి మఱిన్
కామార్తుడవై నీ వామెను మఱి కనలి యాశ్రమము నందు మఱిన్
బలవంతముగా ధర్షించితివీ పరువు ప్రతిష్ఠల దిగవిడిచీ
అట్టి నీవు నాశ్రమమునందునను నలరి చూడబడితివి ఋషిచే! 32

దేవేంద్రా! మఱి యుటు బిమ్మటనూ దివ్య తేజమును గలవాడున్
అల గౌతమముని నిను శపించెనూ నలరి క్రోధమున గూడికొనీ
అందుచేతనే నీ వీ దుస్థితి యవస్థలో విపరీతంబున్
అనుభవించితివి పాపకర్మముల నలరు ఫలితమును నీ విపుడున్! 33

ఓ దేవేంద్రా నిర్భయంబుగా నొనరగ నీతిని దిగవిడిచీ
ధర్మపత్నియగు నా యహల్యనూ ధర్షించితివీ నీవపుడున్
ఆ కారణమున నీవు సమరమున యలశత్రుని హస్తమునందున్
జిక్కెదవూ! బంధింప బడెదవు! స్థిరముగ బోవ ప్రతిష్ఠయునూ! 34

దుర్బుద్ధీ విను! యే భావము మఱి దోరముగా నిచ్చుటను మఱిన్
ప్రారంభింపగబడినదో నదియు బన్నుగ మానుషలోకమున్!
పుట్టగలదు! మఱి వృద్ధి జెందునూ పొలుపుగ సందేహము లేదూ!
పశ్చాత్తాపము జెందుమా యికను పాప కర్మలను జేయకుమా! 35

ఇతర మానవులు నిట్టి చెడ్డపని యిల జేసినచో నట్లుయినన్
జేసినవానికి సగము పాపమును జెన్నుగ నీకును సగము మఱిన్
పాపము జెందుచునుండును నింద్రా! బరగ యింద్ర పదవియును గూడన్
స్థిరముగ నుండదు మారుచుండునూ చెన్నుగ సందేహము లేదూ! 36

ఎవ్వడెవడు నా యింద్ర పదవినీ యింపుగ సింహాసన మెక్కున్
స్థిరముగ నుండదు నా పదవిని మఱి దిగుచుండును కొన్నాళ్ళకునూ
ఈ శాపంబును నిచ్చు చుంటినీ యిల జ్ఞానమునతో మెసలు మికన్
అని గౌతమముని మృదు కోపంబున యలరుచు బలికెను ఆ నాడున్! 37

మహాతపస్సును గలవాడను మఱి సుమహాతేజము గలవాడున్
నా గౌతముడును నా యహల్యనూ యలరి కోపమున గనుగొనుచున్
చెడ్డనడవడిక గలదానా! మఱి చెడు సాంగత్యము గలదానా!
నా యాశ్రమ ప్రాంతంబును విడిచీ నయముగ దూరముగా బొమ్మా! 38

రూప యౌవనములను గూడికొనీ రూఢిగ చపలత్వము తోడన్
ఏ కారణమున నీ విటులైతివా! యే యందము ఒక కారణమో!

రూపవతిని యను గర్వంబుననూ రూఢిగ జేసితి వీ పనినీ
రూపవతివి నీ వాకతెవు గాకను రూఢిగ నుందురు కొల్లలుగా! 39

ఏ రూపము మూలముునను ప్రస్తుతము నీ పొరపాటును జరిగినదో
అట్టి రూపమును ప్రజలందఱునూ నిట్టె బొందుదురు నిక మీదన్
నే నే రూపము గలదానిని యను నిండు గర్వమును వలదుసుమా!
సందేహంబును వలదు సుమా! మరి సంశయింప పని లే దికనూ! 40

అది మొదలుకొనీ చాల వఱకు ప్రజ యల రూప సమన్విత నుగుగున్
అందచందములతోని గూడికొని యపురూపంబును బొంది రిలన్!
మహా మునియనగు నా దేవముని మానుగ యట్టి యహల్యయనూ!
అనుగ్రహింపగ జేసి కొనెను మఱి యాగ్రహంబు విడనాడగనూ! 41

ఓ బ్రాహ్మణుడా! త్వద్రూపముతో వనరగ వచ్చిన యింద్రునిచే
తెలియక పోవుట చేతను నేనును దీరుగ ధర్షింపగ బడితిన్
నాకు దెలిసి యిది జరుగగలేదూ! నయముగ మోసము జరిగె నిటుల్
అందుచేత నన్ననుగ్రహింపుము బొందుగ మన్నింపుము నన్నున్! 42

అహల్య మాటలు విని గౌతముడను నలరి బలికె నీ విధముగనూ
ఇక్ష్వాకుల వంశీయుల లోపల యింపుగ తేజము గలవాడున్
మహారథుండును జన్మించును సుమ! మానుగ మానుష రూపమునన్!
రాముం డనియెడి పేరు గలిగినా రమ్యముగా లోకమునందున్
ప్రసిద్ధుడై మానుష రూపముతో బరగ విష్ణు వాతండు సుమా!
మహాబాహువులు గల యాతండును మానుగ బ్రాహ్మణు నిమిత్తమై
ఈ వనంబునకు రాగలడు సుమా! యిటు నిన్నును కనుగొన గలడూ! 43, 44

మంగళ ప్రదురాలా! మఱి వినుమా! రంగుగ నా వచనముల మఱిన్
ఎపు డా రాముని కనుగొందువొ మఱి యపుడె పవిత్రము గాగలవూ!
నీ చేతను యే దుష్కృత్యంబును నిక్కముగా జేయగ బడెనో
ఆ దుష్కృత్యము హరింపజేయగ యాతడు సర్వ సమర్థుండున్ 45

ఓ వరవర్ణిని! వచ్చినట్టి యా యొనరగ శ్రీ రఘురామునికిన్!
ఆతిథ్యంబును జేయుమా! మఱియు నలరు సేవలును జేసి మఱిన్

మత్సమీపమును జేరగలవు సుమ మానిత శుశ్రూషలు జేయన్
అపుడు నీవు నాతో గూడను మఱి యలరి వసింపగ గలవు సుమా! 46

ఆ మహర్షియును నటుల బలికి మఱి యల వన సంబంధితమైనా
ఆశ్రమంబునకు వచ్చెను నతడును నలరి తపంబును జేయగనూ!
బ్రహ్మవేత్తయగు నాతని భార్యయు బన్నుగ యహల్యయునుగూడన్
మహాతపంబును జేయసాగెనూ మానుగ మఱి యొక వనమందున్! 47

ఆ మునీశ్వరుని శాపము వలననె యలరి నీ కిటుల యాపదయున్
వచ్చిబడినదీ మహేంద్రుడా! విను! చెచ్చెఱ యీ నిర్బంధంబున్
పరాజయంబును సంప్రాప్తించెను బన్నుగ యీ రాక్షసుజేతన్
మహా బాహు! పూర్వమున జేసినా మానుగ దుష్కర్మమును మఱిన్
స్మరింపుమా పశ్చాత్తాపంబున స్మరింపు! నల వృత్తాంతంబున్! 48

దేవేంద్రా! విను సమాహితుడవై దీరుగ నాదు సువచనములన్,
ఆ దుష్కర్మము జేతనే కదా! యలరి శత్రువుల జేత మఱిన్
బంధింపగ బడితివి కద యింద్రా! పరాజయంబును బొందితివీ!
సావధాన చిత్తుడవై శీఘ్రము సర్వేశ్వరుడగు విష్ణువుకున్!
వైష్ణవ యజ్ఞము నాచరింపుమా! వనర పవిత్రుడవై నీవున్! 49

దేవేంద్రా! నీవా యజ్ఞంబును దీరుగ జేయుటవలన మఱిన్
పవిత్రుండవై యటు బిమ్మటనూ బన్నుగ స్వర్గము బోగలవు
నీ పుత్రుండగు జయంతుండునూ నిజముగ సంగ్రామంబుననూ
మరణింపగనూ లేదు సుమా మఱి! మానుగ జీవముతో గలడూ!
ఆతని మాతామహుడు గ్రహించీ యలరి దాచె సంద్రము నందున్! 50

అటు బిమ్మట యా మహేంద్రుండునూ యది విని వైష్ణవ యజ్ఞంబున్
యజ్ఞంబును మఱి పూర్తి జేసియును నటు బిమ్మట స్వర్గంబునకున్
ఆక్రమించి సురలను విదానముగ యమరుల బాలించెను ప్రభువై!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 51

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
ఇంద్రజిత్తు బలమును గీర్తించితి సాంద్రతరముగా నే నిపుడున్

ఇంద్రజిత్తు తన బలంబు చేతను నింద్రు జయింపగ గలిగెనుగా!
ఇతరుల గూరిచి జెప్పవలయునా? నింపుగ వివరించుచు మఱియున్! 52

ఆ సమయంబున యగస్త్యు వచనము నటు విని రాముడు వేవెంటన్
ఇది యాశ్చర్యము నను చును బలికెను నింపుగ లక్ష్మణుడును మఱియున్
వానరులును రాక్షసులును గూడను వనరగ మనసున స్పందించీ
'ఇది యెంతయు నాశ్చర్యము!' యనుచును నింపుగ విస్మయమును దొలుకన్! 53

రాముని ప్రక్కను గూర్చొని యున్నా రహ విభీషణుడు నిటు బలికెన్
పూర్వమెన్నడో నేనుగాంచినా పొలుపగు విస్మయమగున్నట్టీ
విషయంబును నా కీ సమయంబున విశదము జ్ఞప్తికి తేబడియెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 54

రామచంద్రుడును నగస్త్యు తోడను రమ్యముగా నీవిధి బలికెన్
మీరు చెప్పినది యంతయు సత్యము మేమును వింటిమి యిది వఱకే
విభీషణాదులు జెప్పగా వినియు విమలానందము నొందితిమీ!
అనుచు బలుకగా రామచంద్రుడును నగస్త్య డీ విధమున బలికెన్!

రామా! రణరంగంబున బలమున రయమున పుత్రునితో గూడీ!
ఇంద్రుని జయించి లోకంబులనూ సాంద్రముగా బీడించిన యా
రావణాసురుని వృత్తాంతంబును రమ్యముగా నిట్టిది సుమ్మా!
అనుచు బలికె నా యగస్త్యుండునూ నట గూడిన ముఖ్యులతోడన్! 55, 56

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ముప్పదియవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ముప్పది యొకటవ సర్గము

(రావణుడు మాహిష్మతికి బోవుట - అచ్చట కార్త వీర్యార్జునుని గానక
మంత్రులతో గలిసి వింధ్యగిరి ప్రాంతమునందున్న నర్మదా నదిలో
స్నానము జేసి శివుని యారాధించుట)

అటుబిమ్మట యా మహా తేజుడును నలరి రామచంద్రుండు మఱిన్
నమస్కరించుచు నున్న వాడగుచు నయముగ ఋషి శ్రేష్ఠుల యందున్
శ్రేష్ఠుడైన యా యగస్త్యు తోడను శీఘ్రము విస్మయములతోడన్
మఱల నీ విధిని బలికెను రాముడు మధుర వచనముల తోని మఱిన్! 1

పూజ్యుడవగు ఓ బ్రాహ్మణ శ్రేష్ఠుడ పొలుపుగ క్రూరుడు రావణుడున్
సంచరించు నా కాలము నందున సహజముగా లోకమునందున్,
శూరుడెవ్వడును లేకపోయిరా సురుచిరమ్ముగ త్రైలోక్యములన్?
ఎదిరించెడి వాడే లేడా మఱి? యిదేమి యుపవాడే లేడా? 2

ఆ సమయంబున రాక్షసుడైనా అల రావణుడును యెదిరింపన్
గలిగినట్టి క్షత్రియుడుగాని మఱి క్షత్రియుండు గానటువంటి,
రాజ్యపాలకుడు లేనే లేడా? రమణీయముగా ధరయందున్?
బలవంతుండును లేనే లేడా? బల్లిదులును లేరా ధాత్రిన్? 3

లేదా పృథివీ పతులందఱునూ లీలగ విక్రమ హీనులునై
పరాక్రమంబును లేని వారగుచు పౌరుషంబులను గోల్పోయి!
చాల మంది యా రాజులలో మఱి సరియగు వస్త్ర జ్ఞానంబున్
లేక పరాజయ మందిరా ధరను లీలగ దెలుపుము మునివర్యా! 4

పూజ్యుడైన యా యగస్త్యుండునూ బొలుపుగ రాముని వచనములన్
విని నవ్వుచునూ బ్రహ్మదేవుడును నీశ్వరుతోడను బలికి నిటుల్
సహజ చతురతను బలికె నిట్టులను స్వాతి వర్షమును గురిసి నటుల్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 5

పృథివీపతి! ఓ రామచంద్ర విను! బొలుపుగ నాదు సువచములన్
ఈ విధముగ యా దశగ్రీవుండును నింపుగ క్షత్రియ రాజలనూ
పీడించుచునూ ధాత్రీతలమున బ్రిదిలి సంచరించుచు నుండెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 6

అటుబిమ్మట యా రావణుండునూ యమరావతి పట్టణమునకున్
సమానమైనా మహిష్మతీపురి సంప్రాప్తంబును బొంది మఱిన్
అగ్ని దేవుడచ్చట యెల్లపుడును సన్నిహితుండై యుండు మఱిన్
యజ్ఞయాగములు జరుగుచునుండును నలరి యెల్లకాలములందున్! 7

పగవారల బాధా నివృత్తికై బన్నుగ జేసెడి హోమములన్
అభిచారంబుల ప్రయోగంబులకు ఆ నగరములో నిత్యంబున్
రెల్లుగడ్డి చుట్టును కప్పిన యా మెల్లగ యగ్నుల కుండములో
అగ్నులెప్పుడును వర్ధిలుచుండును యారకయుండును నెల్లపుడున్!
ఆ పురియందున యగ్ని సమానము నలరి ప్రభావము గలిగిన యా
కార్త్యవీర్యుడను రాజును గలడూ కమ్మని పరిపాలన తోడన్! 8

అటుబిమ్మట మఱి బలీయుండునూ హైహయాధిపతి శీఘ్రముగన్
ఆ దినముననే నర్మదానదిని యట విహారమును సలుపుటకై
తన భార్యలతో కలిసి పోయెనూ దగ శృంగారపు క్రీడలకున్
కలువ తామరల వాసన గలిగిన కమ్మని జలముల సేవింపన్! 9

అటుబిమ్మట యా రావణుండునూ యా మహిష్మతీ పురమునకున్
ఆగమించి యా యమాత్యులందఱ యడిగె యర్జునుడు యెచ్చటనీ!
ఎచట నుండె మఱి యెచ్చటి కేగెను నే దారిని యని ప్రశ్నించెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 54

మీ రాజైనా కార్త్యవీర్యుడును మీకడనుండీ యెటు బోయెన్?
ఎచ్చట నుండెను దెలుపుడు వేగము నే కార్యంబును జేయుటకై?
నేను రావణుడ! లంక కధిపతిని! నే త్రిలోకముల జయించితిన్
కార్త్యవీర్యుతో యుద్ధము జేయగ కదిలి వచ్చితిని నే నిపుడున్! 11

'నా యాగమునకు మీ రాజునకును నయముగ దెలుపుడు వేగముగన్!
అనుచు బలుక యా రావణుండునూ యల యమాత్యులును శీఘ్రముగన్
అర్జునుండు మఱి యింటలేడనీ అరి నర్మదలో క్రీడలకున్
బోయినాడనుచు జెప్పిరి మంత్రులు బొలుపుగ దశగ్రీవుని తోడన్! 12

విశ్రవసువు పుత్రుడు రావణుడును నర్జునుండు మరి యెచ్చటికో!
వెళ్లినట్లుగా పౌరుల వలనను వేగ దెలిసికొని యాతండున్
అచ్చటి నుండీ వెడలి బోవుచును నా హిమవత్ పర్వతమునకున్
సమానమైనా వింధ్య పర్వతము సమీపమునకును బయసించెన్! 13

ఆ రావణుడును నభ్రంబునుమఱి యలరి ప్రవేశించినది వలెన్
భూమినంతయును చుట్టికొనియునూ పుట్టినట్లుగా నున్నదియున్
ఆకాశంబును నొరయుచున్నటుల యలరి యున్నదియు వోలె మఱిన్
సహస్ర శిఖరములను నున్నదియును సింహాధ్యుషితము లైనట్టి
గుహలు గలదియును వింధ్య పర్వతము కూరిమి భక్తిని గాంచెనటన్! 14, 15

ఎత్తు ప్రదేశమునుండి శీఘ్రముగ వేగము గలిగిన యుదకములన్
క్రిందికి జారగ జేయుచున్నదియు యందమైన యప్సరసలతో,
కూడినట్టిదియు స్వస్త్రీలను మఱి కూరిమి క్రీడలు సలుపునదీ,
దేవదానవుల గంధర్వులతో స్వర్గముగా గనిపించునదీ,
మహోచ్ఛ్రయంబును గలదియునూ మఱి మాసుగ స్ఫటిక సుప్రతిమంబున్
జలమును స్రవించుచున్నదియును మఱి నదులును చంచలములునైనా
నాల్కలతోడుత పడగలగూడిన నయముగ శేషుని మాదిరిగా
నిలిచియున్నదియు పైకి లేచుచును నున్నదియును వలె కనిపించూ
గుహలు గలదియు హిమవత్ సన్నిభ కూరిమి సమానమైనదియున్
అట్టి వింధ్య పర్వతమును గాంచుచు నిట్టె రావణుడు నాదారిన్,
నర్మదానదీ సమీపంబునకు నయముగ బోయెను నాతురతన్! 16,17,18

కదులుచున్న రాళ్లను గలదియునూ కాంచన శోభిత మైనదియున్
పరమ పవిత్రంబైనదియును మఱి పశ్చిమోదధికి బోయెడిదీ,
వేడిమిచే తపియింపజేయబడి పేరిమి దప్పిక గొనియున్నా
మహిషంబులచే మానుగ సృమర మృగంబులచే సింహంబులచే

శార్దూలంబులచేతను మఱియునూ భల్లూకంబుల జేత మఱిన్
గజేంద్రములచే సంక్షోభితమై గల జల స్థానంబులు గలదీ
చక్రవాకములు కారండవములు, సారస పక్షులు, హంసలునూ
నీటికోళ్ళునూ మున్నగు పక్షులు నిర్మల జలముల నీదుచునూ,
మదించి కూయుచునున్న పక్షులను నావరించినది యంతటనూ,
నున్నవియును మఱి తీరమునందున వికసించిన పూవులతోడన్,
వృక్షములే మఱి శిరోభూషలుగ విమల దీరములు ధరియించీ,
చక్రవాకములు ననియెడి స్తనములు చారు సుశీలత దోడుతనూ!
విశాలమైనా యిసుక తిన్నెలును ననియెడి పిరుదుల గూడికొనీ
హంసావళియను వడ్డాణముతో నలరు పుప్పొడులు యనునట్టీ
అంగరాగమును బూసికొనీ మఱి యలరు శోభితము నైనట్టీ
నీటి మరుగునను తెల్లని వస్త్రము నెమ్మిగ ధరియించియు మఱియున్!

వికసించిన నల్లని కలువలు అను విమలములగు నేత్రంబులతో
ఆ నర్మద యొక సుందరి వోలెను నట దర్శనమిచ్చుచునుండెన్
జలముల యందున మునుగుట యనియెడి చారుసుందరము లగునట్టీ
స్పర్శయు గలదియు యా నర్మద యొక సుందరి వోలెను గనిపించెన్!

కనుల యందునను సుందరమైనా కాంచన నర్మద గాంచి మఱిన్
ఆ రావణుడును పుష్పక విమాన మందు నుండి దిగి హర్షముతో,
ఇష్టమైన ఒక వరవర్ణినినీ నిచ్చతోని గూడినవాడై
ప్రవేశించి రాక్షస పుంగవుడును బన్నుగ మంత్రుల గూడికొనీ
ఆ నది సుందర తీరమునందున అనేక మునిగడాణ సేవితమై
ఉన్న యట్టి యా యిసుక తిన్నెపై చెన్నుగ యాతడు గూర్చుండెన్! 19 నుండి 25

ఇటు బిమ్మట యా రావణుండునూ 'ఇది గంగానది' యనుచు మదిన్
నర్మదానదిని కీర్తించుచునూ నర్మదానదీ దర్శనమున్
సంతోషంబును బొందినాడతడు సంతసమున మది నుప్పొంగెన్!
ఆ రావణుడును నచట నున్న యా యల శుకసారణులను గూడీ
విలాస పూర్వకముగ నిటు బలికెను విమల వచనముల తోని యిటుల్! 26

ఈ సూర్యుండును ఇదిగో జూడుడు! నిల రస్మి సహస్రంబులతో
జగత్తునంతను బంగారముగా చారు సుందరము జేసి మఱిన్

తీక్షణ తాపంబును జేయుచునూ దీరుగ సభ మధ్యస్థమునన్
అధిష్ఠించి యున్నాడు కనుగొనుడు నందముగా తన కిరణములన్
ఆ రవి నే నట గూర్చున్నానని యలరి తెలిసికొనియే మారెన్
చంద్రునివలె నయినాడు గనుగొనుడు! చేతో మోదంబున నతడున్
తాను ధన్యుడను నైతినటంచును దగ దృష్టిని బొందెను నతడున్! 27, 28

గాలి కూడ నాకును భయపడి మఱి కమ్మని నర్మద జలములచే
చల్లబడినదీ సుగంధములచే శ్రమ దొలగించుచు నున్నదియున్,
సావధానముగ వీచుచున్నదీ సద్భావము గలిగించుచునూ,
వాయు దేవుడే వీచెనో యనగ నొనరగ యనిపించుచు నుండెన్! 29

మొసళ్ల చేతను మీనంబులచే మోదముగను పక్షులతోడన్
తరంగములచే గూడినట్టి యా తగ సుఖమును వృద్ధిని జేసీ
నదుల లోపలను శ్రేష్ఠమైన యా నర్మదా నదియు గూడ మఱిన్
భయపడుచుండిన యంగన వోలెను బరగ కనబడుచు నున్నదియున్! 30

ఇంద్రుని తోడను సమానులైనా నింపుగ రాజులు యుద్ధమునన్
ఆయుధములచే గొట్టబడుచునూ యలరెడి గాయంబుల మీదన్
ఎఱ్ఱని చందన రసము వంటిదగు ఎఱ్ఱని రక్తము బూయబడీ!
అరుణారుణ కాంతులతోడను మఱి నలరు చుండిరీ మీరిపుడున్! 31

అందుచేత మఱి యాకారణమున చందము నీ తరుణము నందున్
సార్వభౌమమూ మొదలగునట్టీ సరసత దిగ్గజములకు వలెన్
పవిత్రమైనా గంగకు వలెనూ పరగ సుఖము పావిత్రతనూ
యిచ్చునట్టి యీ నర్మద నదినీ నింపుగ స్నానము జేయుడికన్! 32

ఈ మహానదిని స్నానము జేసీ యింపుగ పాపమునుండి మఱిన్
విప్రమోక్ష్యధను నొందుడు మీరలు విమల మతులు మఱి గండికనూ
నేను గూడ నీ సమయము నందే నిర్మల శారద చంద్రికలన్
సమానమైనా కాంతి గలిగినా సరసత పులినము నందుననూ,
వెమ్మదిగా నా పరమశివునకును నిర్మల పుష్ప సమర్పణనూ
పూజలు జేసెద కపర్దినునకును పుష్ప మాలలను నర్పింతున్! 33

ఆ లంకేశుడు రావణుండునూ యటుల దెలుపగా వినియు మఱిన్
చటుల ప్రహస్తుడు శుక సారణులును చటుల మహోదర ధూమ్రాక్షుల్,
నర్మదానదిని ప్రవేశించిరీ నయముగ స్నానము జేయుటకై
భక్తితోని యా పరమశివునకును బన్నుగ పూజలు సేయగనూ! 34

మహనీయంబగు నర్మదానదిని మానుగ వామన యంజనమూ
పద్మము మొదలగు దిగ్గజంబులును బన్నుగ గంగానది వోలెన్
రాక్షసేంద్రులను గజములు గూడను రయమున నర్మద నది యపుడున్
క్షోభింపగనూ జేయబడినదీ శోభలు జిందగ బడెనపుడున్! 35

అటుబిమ్మట యా మహాబలీయులు చటుల రాక్షసులు వేగముగన్
నర్మదానదిని స్నానము జేసీ నయముగ తీరము జనుదెంచీ
ఆ దశగ్రీవుడు బూజసేయుటకు నలరెడి పుష్పంబులను మఱిన్
నదీతీర వృక్షబుల నుండియు నయముగ దెచ్చిరి దోసిళ్లన్! 36

తెల్లని మేఘమువంటి కాంతిగల చల్లని గాలులతో గూడీ
మనోహరంబగు నర్మదానదిని మానుగ యిసుకల తిన్నెలపై
ఆ రాక్షసులను ముహూర్తమందున యలరు పుష్పముల బర్వతమున్
అట యేర్పఱచిరి యా రావణునీ యల పరమేశ్వరు బూజకునై! 37

ఈ విధముగ యా మంత్రులందఱును నింపుగ పుష్పములను దెచ్చీ
ఇసుక తిన్నెపై నుంచిరి వారలు నింపుగ శివపూజల కొఱకై
అటుబిమ్మట యా రాక్షస ప్రభువగు రావణుండు కడు వేగముగన్
మహాగజము గంగను జొరబడినటు స్నానము జేయుట కొఱకతడున్
నర్మదానదిని ప్రవేశించెనూ నయముగ సుభక్తి మంత్రములన్! 38

దశగ్రీవుండును నర్మదానదిని దగ స్నానంబును జేసి మఱిన్
శ్రేష్ఠమైన మఱి జపింపదగినా శ్రీకరమగు మంత్రంబు మఱిన్
యధావిధిని జపమాచరించియును యధావిధిని మఱి ధ్యానంబున్
ఆచరించి మఱి నర్మద జలముల యలరిలేచె భక్తియు దొలుకన్! 39

అటుబిమ్మట యా రావణుండునూ యట తడిసిన వస్త్రము విడిచీ,
తెల్లని వస్త్రము దరించి మఱియును దీరుగ యంజలి ఘటియించీ,
బోవుచున్న యా రాక్షసేశ్వరుని బూలుపుగ రాక్షసు లందఱునూ
తద్గతీవశంబగుచు పొందినా తగమూర్తి ధరించిన యట్టీ,
పర్వతముల వలె ననుసరించిరీ భక్తి ప్రపత్తుల గూడికొనీ! 41

రాక్షసేశ్వరుండైన రావణుడు రయమున యే యే స్థలములకున్
దిరుగుచుండెనో యా స్థలంబులను దీరుగ యారాక్షసులు మఱిన్,
జమ్బూనద మయమగు శివలింగము సరసన గైకొని వారలునూ,
పోవుచుండిరీ రావణు కొఱకై పూజలు సలుపగ నాతండున్! 42

రావణుండునూ యా లింగంబును నయముగ యిసుకను గూడిన యా
వేదిక మధ్యను యుంచి భక్తితో విమల చందనాదుల తోడన్,
అమృత గంధములు గలిగినట్టి యా యలరు పుష్పములచేత మఱిన్,
పూజలు జేసెను పుణ్య ప్రదమగు బొలుపుగ మంత్రంబుల తోడన్! 43

అటుబిమ్మట యా నిశాచరుండును నగు రావణుడును శీఘ్రముగన్,
ఆర్తిహరుండను సర్వోత్తముడును యలరి వరము నిచ్చెడి వాడున్
చంద్ర కిరణములు భూషణములుగా సాంద్రముగా గలిగిన వాడున్
అట్టి శివుని బూజించి యాతడును నిట్టె సామగానము జేసెన్
శివుని యెదుట మఱి నిలిచి రావణుడు శ్రీకరముగ తన హస్తములన్
బాడినాడతడు జేసె నృత్యమును సామగాన స్తోత్రంబులతో! 44

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ముప్పదియవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ముప్పది రెండవ సర్గము

(కార్త వీర్యార్జునుడు భుజములచేత నర్మదానది ప్రవాహమును నిలిపివేయగా రావణుడు శివలింగముపై పూజించిన పుష్పములన్నీ కొట్టుకొని పోవుట- రావణాదులతో కార్త వీర్యార్జునుడు యుద్ధము జేయుట - రావణుని బంధించి అతడు తన నగరమునకు బయలుదేరి వెళ్ళుట)

భయంకరుండగు రావణుండునూ బన్నుగ నర్మద తిన్నెలపై
ఎచ్చట పుష్పోపహారములనూ యింపుగ జేయుచు నున్నాడో
ఆ ప్రదేశమున యలతి దూరమున యలరు విజయవంతుల యందున్
శ్రేష్ఠుండును మఱి మహిష్మతీపుర ప్రభువును సమర్థుడును నైనా
అర్జునుండు మఱి నర్మద జలముల యాశ్రయించినా వాడగుచున్,
తన ప్రమదలతో కలిసి మెలసి మఱి తగ జల క్రీడలు సలుపుచునూ
ఆనందించుచు నుండె నచ్చటను నపురూపమునగు నదియందున్! 1,2

అట్టి సమయమున తన ప్రమదలతో నిట్టె క్రీడలను సలుపుచునూ,
రాజగునట్టి కార్త వీర్యుడును రమ్య కరేణువులకు మధ్యన్
నున్నటువంటీ గజేంద్రమును వలె నుండె ప్రవేశించుచును మఱిన్!
నున్నటువంటీ గజేంద్రమును వలె నుండె ప్రకాశించుచును మఱిన్!
ఆటలందు మఱి మఱచి పోవుదురు నాటు పోటులా యలల మఱిన్! 3

ఆవేకములునగు బాహువులును మఱి యలరుచు గలిగిన యర్జునుడున్
తనదు వేయి కరముల సత్తువనూ తగ తెలిసియు నా జిజ్ఞాసన్
నర్మదానదీ వేగంబును మఱి నయముగ యడ్డుగ నిలిచి మఱిన్
వేయి బాహువులతో నతడాపెను విమలమైన యా ప్రవాహమున్! 4

కార్తవీర్యునీ భుజాసక్తమగు కమ్మని నదీ జలంబులునూ
కూలమునందున పుష్ప సమర్పణ కూరిమి జేయుచునున్నట్టీ
ఆ రావణునీ సమీపించుచును నా శివ పూజను నాపుచునూ
ప్రవాహంబునకు నెదురు నెదురుగా ప్రవహింపగ మొదలిడెనపుడున్! 5

ఆ నర్మదనది జల ప్రవాహము నందున మీనంబులు నుఱియున్
నక్రంబులతో మీనంబులతో నయముగ పుష్పంబులతోడన్,
దర్భాస్తరణంబులును మఱియునూ దగ నదీ జలంబుల గూడుకొనీ
కొట్టుకొనీ పోవుచునుండగ నది ప్రావృట్ కాలపు వర్షములా
కనిపించుచునూ నుండెనపుడు మఱి ఘన మేఘంబున చీకటిలో! 6

కార్తవీర్యునీ చేత బంప బడె కమ్మని నర్మద ప్రవాహమున్
అనునట్లుగనూ జల సంవేగము నలరెడి బహు జలధారలునూ,
ఆ జల ప్రవాహమందు రావణుడు నలరుచు జేసిన యర్చనలున్
పుష్ప పూజయును కొట్టుకబోయెను బొలుపుగ గంధము కుంకుమలున్! 7

అపుడు రావణుడు నర్ధ సమాప్తము నైన నియమమును విడిచి మఱిన్
ప్రతికూలంబగు ప్రియురాలుకు వలె ప్రవాహమునకును నెదునెదురై,
వచ్చుచున్న యా నర్మదానదిని వనరగ గాంచెను రావణుడున్
ఆశ్చర్యంబుగ జూచె నచట మఱి యలజడి లేనీ కొలనువలెన్! 8

రావణుండు మఱి పశ్చిమ తీరము రయమున సముద్ర పోటునకున్
సమానమైనా వృద్ధిని బొందెడి జలముల యా వేగము గాంచీ
అటు పిమ్మటనూ తూర్పు దిక్కునకు నలరి ప్రవేశము గావించీ
విస్తృతమైనా యాకారములో విమలనదీ జలములు నుండెన్
పక్షులు గూడను బెదురులేకనూ ప్రశాంత చిత్తముతోనుండెన్
ఆ విధమున యా ప్రదేశమందున యలరి వికారము లేనట్టీ
స్త్రీ వలెనున్నా నదిని గాంచెనూ చిత్తము వికారమును నందన్! 9,10

ఆ దశగ్రీవుడు మాటాడకనూ! యలరి మౌనమున కుడిచేతన్
వ్రేలితోని మఱి సంజ్ఞ జేయుచును విమలమైన జలధారలకున్
వేగంబునకును కారణమేమో విమలముగా దెలియుట కొఱకై
శుక సారణులను యాదేశించెను చూడ్కులతోడను రావణుడున్! 11

రావణుడంతట యాజ్ఞాపింపగ రయమున వీరులు నైనట్టీ
ఆ శుక సారణులిరువురు గూడను నాకాశము మధ్యము నందీ,

పశ్చిమాభి ముఖమున పయనించిరి బరగ కారణము దెలియగనూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 12

ఆ రాక్షసులును నిరువురు గూడను నర్ధయోజనము దూరంబున్
బోయి గాంచిరట స్త్రీ సమేతుడై పొలుపుగ జల క్రీడలను మఱిన్
జేయుచున్న ఒక పురుషుని గాంచిరి శ్రీకరమగు నానదియందున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 13

పెద్ద సాల వృక్షము సమానుడును పేరిమి యుదకంబుల చేతన్
వ్యాకులంబులగు కేశంబులునూ వనరగ గలవాడును మఱియున్
మద రక్తాంతములైన నేత్రములు మానుగ గలవాడును మఱియున్
మదముచేత వ్యాకులమైనట్టి మానుగ చిత్తము గలవాడున్
అట్టి పురుషునీ జూచిరి వారలు నాశ్చర్యము బొందిన వారై! 14

వేయిబాహువుల చేతను నదినీ విపులముగా మఱి యొడ్డుచునూ
నున్నవాడునూ యరి మర్దనుడును జెన్నుగ పాద సహస్రములున్
భూమినంతనూ యాక్రమించినా పొలుపుగ పర్వతమును బోలెన్!
నున్న యట్టి యొక పురుషుని గాంచిరి జెన్నుగ నర్మద నదియందున్! 15

యువతులైన మఱి వేయిమందియును కవయిత్రులవలె శ్రేష్ఠులునూ
చుట్టును నున్నా యా పురుషుండును సురుచిరముగ నదమంతుడునై
వేయి కరేణువులకు మధ్యమునను విమల కుంజరము వలెనున్నా
ఆశ్చర్యంబును గలుగ జేసెడీ యా పురుషుని కనులను గాంచీ
శుక సారణులును వెనుకకు మఱలీ చోద్యముగా రావణు జేరీ
ఆశ్చర్యముగను నిటుల బలికిరీ నాతడు విస్మయ మందగను! 16, 17

రాక్షసాధిపా! లంకేశ్వర విను! రయమున విను మా వచనములన్
బృహత్ సాల వృక్షంబుతోడనూ బలుడు సమానుడునైనట్టీ
యాత డెవ్వడో యెఱుగను గానీ నలరుచు నర్మద నది నతడున్!
ఆనకట్టవలె నడ్డుకొనెను మఱి యల నర్మద నది ప్రవాహమున్!
అందమైన ప్రమదలతో గూడీ చందము క్రీడించుచు నుండెన్! 18

వేయి బాహువులతో నాతండును విపులముగా నీటిని నచటన్,
ఆపి వేయబడచుండుట చేతను నలరి యీ నదియు సంద్రములా!
ఎదురు తన్ని నీటిని బహువిధముల నది వ్యాపింపగ జేయునటుల్,
నీటిని వ్యాపింపగ జేయుచునూ నిలకడలేకను యున్నదియున్! 19

శుక సారణులా పలుకులు వినియును సురుచిరముగ యా రావణుడున్
'ఇతడే యర్జును' డనుచును మదిలో నింపుగ నిశ్చయమును జేసీ
యుద్ధము జేయుటకై రావణుడును యుద్ధతి యాసక్తిని గూడీ,
శుక సారణులను జెప్పిన చోటికి సురుచిరముగ నాతం డేగెన్! 20

రాక్షసరాజగు నా రావణుడును నయముగ వీర్యార్జునుని మఱిన్
ఎదిరించుటకును వెడలుచుండగా నెదిరి వాయువును తీవ్రమునై
ధ్వనిజేయుచునూ పరాగంబుతో బన్నుగ నిండియు వీచె నటన్!
అపశునంబులు గానబడియెనూ యల రావణునకు నంతటనూ! 21

మేఘంబులచే నొక్క మారుగా మేదుర రక్తపు బిందువులున్
కురియుచునే మఱి యుఱుము లురుముచును కూరిమితో యా రావణుడున్!
మహోదరుండును, మహా పార్శ్వుడును మానుగ ధూమ్రాక్షుండు మఱిన్,
శుక సారణులను గూడినవాడై సురుచిరముగ బోయెను నతడున్
అర్జునుడెచ్చట నుండెనో తెలిసి నటకు బోయె నా రాక్షసుడున్! 22

బలవంతుండును అంజన ప్రభయును బన్నుగ కాంతులు గలవాడున్,
అట్టి రావణుడు కొద్దిసేపటికి యలరుచు భయంకరంబైనా
అలనర్మదచే యేర్పడినట్టీ యట్టి హ్రదంబును జేరుకొనెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 23

ఆ సమయంబున రాక్షస రాజగు నారావణుడును నటగాంచెన్
ఆడయేనుగుల చేత ద్వీపంబును నలరినట్లుగా ప్రమదలచే
పరివృతమైనట్టులుగా నాతడు బరగ యర్జునుని గాంచె నటన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 24

కోపము వలనను రక్తనయనుడై కూరిమి బలమున దృప్తుండై
రాక్షసేంద్రుడగు రావణు డంతట రోషా యర్జునుని యమాత్యులతో

గంభీరములగు వచనంబులతో గడగి యీ విధమునను బలికెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 25

అమాత్యులారా! మంత్రులార మఱి యలరి వినుడు నా వచనములన్
హైహయ వంశమునందు జనించిన యలయర్జునునకు వేగముగన్
నా మాటలనూ విన్నవింపుడూ! నయముగ నా వచనంబులనూ!
యుద్ధము జేయుటకై రావణుడును నుద్ధతి వచ్చిన వాడనుచున్
శీఘ్రము మీ రాజునకు దెలుపుడూ స్థిరమగు వచనములను నిపుడున్! 26

అటుబిమ్మట యర్జునుని మంత్రులును చటుల రావణుని పలుకు వినీ
ఆయుధములతో గూడినవాడై యటుల లేచి పలికిరి యిటులన్! 27

ఓ లంకేశ్వర! రావణా వినుము! వనరగ తెలియని వాడవునూ
మత్తున మునిగిన రాజుతోడనూ మానుగ స్త్రీలను గూడిన యా
రాజును యుద్ధము గోరుచుంటివీ! రయమున యీ సమయమునందే!
సరియైనట్టీ యుద్ధ సమయమున సామముగా గోరితి విపుడున్
బాగు! బాగు! యిక పొమ్ము రావణా! పోకాలము నీకును వచ్చెన్! 28

ఆడ యేనుగుల మధ్య నున్న యా యలరుచు మదించి యుండిన యా
కుంజరంబుతో శార్దూలంబును కూరిమి రణమును సేయంగన్
వచ్చినటుల నీవును వచ్చితివీ! యొనరగ స్త్రీల సమక్షమునన్!
రాజును యుద్ధము సేయుట కొఱకై రయమున బిలుచుచు నుంటివిగా! 29

లంకేశ్వర! ఓ రావణ వినుమా! శంకలేక సహనముతోడన్!
ఈ రాత్రికి మఱి యాగు మాగమా! యింపుగ విశ్రాంతిని బొందీ
నీ కాసక్తియు గలిగినచో మఱి నిక్కముగా రేపునః రమ్మా!
అర్జునుతోడను యుద్ధము సేయుము వలరు విక్రమము జూపు మఱిన్! 30

యుద్ధమునందున యాసక్తియునూ, యుద్ధతి గల వాడా వినుమా!
నీకును వీరత్వము గలిగినచో వికట రణమునను మమ్ములనూ
పరాజయంబును సమ గూర్చియునూ బన్నుగ బడగొట్టియు మమ్మున్
తరువాతను మఱి యర్జును తోడను బరగ జేయవచ్చును రణమున్! 31

అటు బిమ్మట రావణుని యమాత్యులు చటుల యుద్ధమును జేసి మఱిన్,
యర్జును మంత్రుల జంపి వేసిరీ యలరుచు యుద్ధమునందుననూ,
ఆకలిగొనినా వారందఱునూ యలరుచు జంపిన వారలనూ
బక్షించిరి మఱి యాకలిదీరగ బన్నుగ యుల్లాసము తోడన్! 32

అట్టి సమయమున యా యర్జునునీ యనుచరులును జేసిరి ధ్వనులన్
అల రావణునీ మంత్రులు జేసిన యలకోలాహల ధ్వనులు మఱిన్
నర్మదానదీ తీరమునందున నయముగ యుంతట వ్యాపించెన్!
తీరమంతయును నా యుధములచే దీటుగ నిండెను భూతలమున్! 33

అంతట యా యర్జునుని యనుచరులు నలరు బాణముల తోని మఱిన్
తోమరములతో, ప్రాసలతోడను, దోరవు త్రిశూలముల తోడన్
వజ్రంబుల తోడను రావణునీ యొనరగ యాతని యనుచరులన్
బీడించుచు నలు వైపుల నుండీ ప్రిదులుచు వచ్చిరి శీఘ్రముగన్! 34

హైహయాధిపతి యోధుల యొక్కయు నా వేగము నపుడటులుండెన్
నక్ర మీన మకరంబులతోడను నయముగ సముద్ర ఘోషవలెన్
బహు భయంకరముగా నుండెను నట ప్రబలమైన ధ్వని చెలరేగన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 35

ఆ రావణునీ యమాత్యులైనా యల ప్రహస్త శుక సారణులున్
కోపించియు తమ తేజస్సులతో కూడిన సహచరులను గూడీ
కార్తవీర్యునీ సైన్యము నంతయు కఠినమైన యాయుధములతో
యమపురి కంపిరి యారణంబునను యారని విక్రమమును జూపీ 36

భయ విహ్వలులై కొందఱు పురుషులు బన్నుగ బరుగెత్తుచు వారున్
మంత్రులతో కూడిన రావణుడును మామగ జేసిన కర్మమునూ
క్రీడించెడి యా కార్తమీర్యునకు వడివడి దెలిపిరి యా వార్తన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 37

ఆ పురుషులునూ యటుల దెలుపగా నలరు కార్త వీర్యార్జునుడున్
'భయపడదగినది లేదు సుమా! యని బరగ స్త్రీలతో బలుకుచునూ!

గంగాజలముల నుండి లేచినా యంజనమను దిగ్గజము వలెన్
ఆ జలములలో నుండి లేచెనూ యా యర్జునుడును వేగముగన్! 38

క్రోధదూషితము నేత్రంబులచే కూరిమి యర్జునుడును మఱిన్
మహాభయంకరమైన యగ్ని వలె మానుగ కాలాగ్నికి వోలెన్
మండిపడుచు నా రావణు చర్యను ఖండింపగ పయనంబయ్యెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 39

వర హేమాంగదములు గలిగిన యా వనరగ వీర్యార్జునుడు మఱిన్
హస్తమునందున గదను ధరించీ యటునిటు జూడక వేగముగన్
కాఱు జీకటుల దొలగింపగ మఱి కదులు దివాకరునికి వోలెన్
ఆ రాక్షసులను నెదిరించుటకును నల యర్జునుడును బయనించెన్! 40

యర్జునుండు బాహువుల జేత మఱి యలద్రిప్పగ బడుచున్నట్టీ
మహాగదను భుజమున ధరియించీ, మానుగ గరుడుని వేగమునన్
నిలిచె నచ్చటను బర్వతంబువలె నిండుకుండకును బోలె నటన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 41

ముసలము నాయుధముగ గలిగిన యా మోదమునను నా ప్రహస్తుడున్
వింధ్య పర్వతము యర్జును మార్గము నడ్డుకొనిన యా రీతిగనూ!
అర్జును మార్గము నడ్డుకొనుచునూ యా ప్రహస్తుడును వేగముగన్
నిలిచె నచ్చటను బర్వతంబు వలె నిండుకుండకును బోలె నటన్! 42

అటుబిమ్మట యా మదోద్ధతుండగు చటుల రాక్షసుడు బ్రహస్తుండున్
కోపించియు మఱి లోహబద్ధమగు కూరిమి భయంకరంబైనా
ముసలంబును యా కార్త వీర్యుపై మోదంబున విసురుచు నతడున్
కాలయముని వలె కనబడుచుండెను కఠిన రూపమున బ్రహస్తుండున్! 43

అప్రహస్తుడును విడిచినట్టి యా యల ముసలాగ్రమునందుననూ,
యశోక పుష్పపు గుత్తికి వోలెను నరుణారుణములు జిమ్ముచునూ,
దలించుచుండెడి యగ్నులు పుట్టెను దగ యాశ్చర్యము జెందగనూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 44

అట్టి సమయమున కార్తవీర్యుడును నిట్టె వచ్చి బడు చున్నట్టీ
ముసలంబును మఱి నిరోధించుచును ముడివిడు దిగులును గలవాడై,
భయంకరంబగు దన గద చేతను బహు చతురతనూ గన బఱచీ
నేర్పుతోసి తప్పించు కొనుచునూ నీతికి నిలబడి రంగమునన్! 45

ఆ సమయంబున గదతో గూడిన హైహయాధిపుడు వేగముగన్,
ఐదు వందలా చేతుల పొడవును నలరి యుండినా ఘనమైనా
గదను త్రిప్పుచును ప్రహస్తుపైకిని కదనమందునను బరుగెత్తెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 46

అటుపిమ్మట యాకార్త వీర్యుడును నలరుచు గదచే గొట్టగనూ,
ఆ ప్రహస్తుడును నా సమయంబున యలరుచు నిలుచుని యున్నట్టీ
ఇంద్రుని వజ్రము చేత కొట్టబడి సాంద్ర దీధితిని పోనాడీ
పర్వతంబువలె నేలను గూలెను బ్రహస్తుండు నా దెబ్బకునూ! 47

ప్రహస్తుండు నా రణరంగంబున బడిపోవుటయును గాంచి మఱిన్
మారీచుండును శుక పారణులును, మహోదరుడు ధూమ్రాక్షుడునూ,
రణరంగంబును దొలగిపోయిరీ రయమున బరుగెత్తిరి దిశలన్!
రావణుడొకడును మిగిలి యుండెనూ రయమున రణమును సేయుటకున్! 48

ప్రహస్తుండు పడిపోయిన పిమ్మట పన్నుగ రణరంగమునందున్
అమాత్యులును మఱి యటునిటు పోగా నలరి రావణుం డటు మిగిలెన్!
అల రావణుడును గర్జించుచునూ యల రాజశ్రేష్ఠుండైనా
కార్తవీర్యునీ మీదికి బోయెను కయ్యము సేయుటకై యనిలో! 49

సహస్ర బాహువులును గలవానికి సరసత వింశతి బాహువులున్
గలవానికినీ రాజ రాక్షసులు యల వీరిద్దఱికిని యచటన్
దారుణంబు మఱి రోమ హర్షణము దగ గలిగించెడి దయినట్టీ
అయిన యుద్ధమును మొదలాయెను మఱి యాశ్చర్యము గలుగగ యచటన్! 50

క్రోధా వేశముతోడ నున్న యా కుదురుగ రావణ - యర్జునులున్
క్షోభను జెందిన రెండు సంద్రములు గూడిన యట్లుగ నారలునూ

కదిలిన మొదళ్లు గలిగినట్టి యా కదులు రెండు పర్వతములుగా
తేజో మూర్తులు నైన సూర్యులును దీరుగ యిద్దఱి కలయికలా!
కాల్చుకొనెడి రెండగ్నుల వలెనూ కలిసి జ్వలించెడి యగ్నులుగా!
ఆడ యేనుగును బొందుట కొఱకై యలరుచు బలోద్ధతములైనా
రెండు యేనుగుల సంగ్రామములా దండి యేనుగుల పోరువలెన్!
రెండాబోతుల పోరాటము వలె రెండు మేఘముల యుఱుమువలెన్
బలోత్కటంబగు రెండు సింహములు బన్నుగ పోరాడిన రీతిన్
కోపించిన యా రుద్ర యములవలె కోపించిన వారలు నపుడున్
ఆ రావణుడును కార్తవీర్యుడును నలరుచు గదలు ధరించియునూ
పరస్పరంబును గొట్టుకొనిరి మఱి పగ చల్లారగ వారపుడున్! 51, 52, 53

పర్వతములు బహు ఘోరములైనా పన్నుగ వజ్రప్రహారములన్
ఏ విధముగ నని సహించి యుండెనొ యా విధముగనే యచ్చోటన్
ఆ యర్జున రావణులు గూడనూ యచట జరిగినా యుద్ధమునన్
గదా ప్రహరములు సహియించిరి మఱి కడు ఘాతములగు దెబ్బలనూ! 54

ఉఱుముల వలనను, బిడుగుల వలనను నూహ కందనీ విధముననూ
ప్రతిధ్వనులు మఱి పుట్టిన రీతిని పన్నుగ వారల గదాధ్వనుల్,
కుమ్ములాటలను దిక్కులన్నియును గూరిమి ప్రతిధ్వనించినవీ
గదల యొక్క రాపిడులజేత మఱి గగనమంతయును దెలుపాయెన్! 55

పన్నుగ శత్రువు వక్షస్థలమున బడలేదుగ బడుచున్నట్టే
కార్తవీర్యునీ గదయైతే మఱి కదిలి ప్రకాశించుచునున్నా
సౌదామిని వలె గగనమంతయును కాంచన వర్ణము గలదానిన్!
చేసివైచెనూ చెన్నుగ నభమును జెన్నుగ బంగరు కాంతులనూ! 56

ఆ విధముగనే రావణుచేతను నలరి ప్రయోగించెడి గదయున్,
మాటి మాటికిని యా యర్జునునీ యలరెడి వక్షస్థలముననూ,
బడవేయుగ బడుచున్న గదయునూ పర్వత శిఖరము నందుననూ
పడెడి యుల్కవలె ప్రకాశించెనూ పన్నుగ యందఱు భీతిలగన్! 57

అర్జునుండు మఱి తన మానసమున యలఖేదము నొందుట లేదూ!
రాక్షస గణేశ్వరుండును గూడను రహి యలసట పొందగలేదూ!
వారల యుద్ధము పూర్వమునందున యల బలీంద్రులకు బోలెనటన్
హెచ్చు తగ్గులును లేక యుండెనూ మచ్చికగా సమముగ నుండెన్! 58

రెండాబోతులు శృంగంబులతో మెండుగ పోరాడెడి రీతిన్
రెండు గజములును దంతాగ్రంబుల మెండుగ ధర్షించిన విధమున్
అల యర్జునుడును రావణుండునూ యలరుచు బోరాడుచు వారున్
యుద్ధ రంగమున రణమున జేసిరి యుద్ధతితో నా యుధములతో 59

అటుపిమ్మటనూ కోపించిన యా చటుల కార్తవీర్యుని చేతన్
పూర్తిగ ప్రాణ బలంబు చేతనూ బొలుపుగ యుపయోగించి మఱిన్,
తన గదాయుధము యా రావణునీ తగ విశాల వక్షము నందున్
బడవేసెనుగానీ ప్రభావమున బన్నుగ బడలే దాతనిపైనీ! 60

ఆ గద వరదానము చేతను మఱి యల రక్షింపగ బడుచున్నా
ఆ రావణునీ వక్షస్థలమున వనరగ బలహీనంబునునై
యధావేగముగ నేలమీద బడె విపులమైన శబ్దంబుననూ!
రెండు ముక్కలై పోయెనప్పుడును బెండుగ మారెను నా గదయున్! 61

ఆ రావణుడును నర్జును జేతను నలరు ప్రయుక్తము నైనట్టీ
గదా ప్రహారముజేత నాతడును కదిలి ధనుర్మాత్రము జేతన్!
బారెడు దూరము వెనుకకు బోయీ యఱచుచు నేలను బడిపోయెన్
ఎంతటి వారలకైనను తప్పదు క్రింది మీదులగుటయు భువిలో 62

ఆ సమయంబున నర్జునుండునూ యలరి మోద సంతుష్టుండై
ఆ రావణుడును వ్యాకులత్వమున యలరి నేలబడి యుండుటయున్
గాంచి వెంటనే యెగిరి మీదబడు గరుత్మంతు డల సర్పంబున్
బట్టునట్లు రావణుని బట్టుకొనె బాహుబలంబును దొలుకగనూ! 63

బలవంతుండగు కార్తవీర్యుడును బన్నుగ బాహు సహస్రముతో
ఆ రావణునీ బట్టుకొనెను మఱి యటునిటు కదలక యుండగనూ!

నారాయణుడును బలి దానవునీ బంధన జేసిన యట్లుగనూ
ఆ యర్జునుడును నా రావణునీ యటబంధించెను శీఘ్రముగన్! 64

దశగ్రీవుడు బంధింపబడగనూ బహు ముఖములతో దేవతలున్
సిద్దులు, చారణు లందఱు గూడను శ్రీకరముగ గొంతెత్తి మఱిన్
'బాగుబాగు' అని ప్రస్తుతిజేసిరి ప్రవిమల ధ్వనులను జేసిరటన్
కార్తవీర్యునీ శిరస్సుపైనీ కరమున జల్లిరి పుష్పములన్! 65

పెద్ద పులియు లేడిని బట్టినటుల్ పెనుగర్జనలను సింహంబున్
కుంజరమును బట్టిన రీతిగనూ కూరిమి జూలును గదుపుచునూ!
ఆ రీతిని యాకార్తవీర్యుడును నల రావణునీ బంధించెన్
మాటి మాటికిని గర్జన సేయుచు మఱల మఱల రావణుగాంచీ! 66

ప్రహస్తుండు మఱి దెప్పరిల్లుచును బ్రతికి బయటపడి యాతండున్
రావణుండు బంధింపబడుటయును రయమున గాంచియు శీఘ్రముగన్
క్రోధ మూర్ఛితుండై యాతండును కూర్మి యాయుధంబులతోడన్
కార్త్య వీర్యునీ మిదికి బోయెను కడిమి వీర్యమున పోరాడన్! 67

వచ్చి బడుచు నున్నట్టి రాక్షసుల వనరగ యావేగము మఱియున్
వర్షాకాలమునందు వేగముగ యొనరగ సంద్రమునందుననూ
ఏర్పడినట్టీ మేఘములకు వలె నేర్పడు వేగమువలె నుండెన్
ఉసిళ్ల గుంపుల వలెను వచ్చిరీ యురుతర రాక్షస సంఘములున్! 68

విడువుము! విడువుము! ఆగుము! ఆగుము! విపరీతపు వచనంబులతో
ఆ రాక్షసులును నఱచుచు కేకలు నటుకు వచ్చిరీ రణమునకున్
ప్రహస్తుండు నా సమయమునందున పన్నుగ సంగ్రామము నందున్
ముసలంబులు మఱి శూలంబులనూ మాసుగ గుంపించెను! యనిలో! 69

శత్రు వినాశుడైన యర్జునుడు శాంత మనస్కుండై యతడున్,
అసురాదుల యా యాయుధంబులును నల రాకుండగ దగ్గఱకున్,
తన మీదకు రాకుండగ నాతడు దగ కంగారును బడకుండన్,
హస్తంబులతో బట్టుకొనెను మఱి నందఱు జూడగ చతురతతో! 70

అటుబిమ్మట యా కార్తవీర్యుడును నలవిగాని శ్రేష్టములైనా
ఆయుధముల చేతను రాక్షసులను యలరి ఛేదించి శీఘ్రముగన్
ఘన మేఘములను బిల్ల వాయువులు గగనమునందున జేరుకొనీ
ఎగురగొట్టినటు నెగుర గొట్టెనూ నేపుగ వారల యాయుధముల్! 71

అట్టి సమయమున కార్తవీర్యుడును నిట్టె రాక్షసుల భయ పెట్టీ
బంధించిన యా రావణాసురుని బన్నుగ తనతో దీసికొనీ
మంత్రులతోడను, మిత్రులతోడను మానుగ సైన్యముతో గూడీ
నగరమునందున ప్రవేశించెనూ నయముగ విజయోత్సాహమునన్! 72

అటు బిమ్మట యా దేవేంద్రునితో నలరు సమానుండైనట్టీ
అట్టి కార్తవీర్యార్జునుండునూ నిట్టె రావణుని యోడించీ
కడిమి బలిమినీ బలిని జయించీ గారవమున దేవేంద్రువలెన్
ద్విజాలు, పౌరులును కుసుమాక్షతలను దీరుగ జల్లుచు నుండగనూ
పట్టణమందున ప్రవేశించెనూ బన్నుగ రావణుతో గూడన్! 73

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ముప్పది రెండవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ముప్పది మూడవ సర్గము

(పులస్త్యుడు వచ్చి రావణుని బంధనము నుండి విడిపించుట)

అటుబిమ్మట యా పులస్త్యుండునూ యలరి వినెను స్వర్గమునందున్
అలవాయువునూ బంధించుట మఱి యలరి యెంత యాశ్చర్యంబో
ఆ రావణునీ బంధించుటయును నంతే యాశ్చర్యము పృథివిన్
అని యా సురలును దెలియ జెప్పగా విని పులస్త్యుడును వేగముగన్! 1

అటు బిమ్మట నూ మహాధృతియునూ మానుగ మహాత్ముడైనట్టీ
మహా ఋషియునగు నా పులస్త్యుడును మానుగ పౌత్రుని స్నేహమునన్
కంపింపగ చేయగబడువాడై కలతను బొందిన వాడగుచున్
మాహిష్మతి ప్రభువును గాంచగనూ మానగ వచ్చెను నచ్చటికిన్! 2

వాయు తుల్యమగు గమనము గలిగిన వనరగ యా బ్రాహ్మణుడు మఱిన్
వాయు మార్గమును నధిష్ఠించియును వనర మనోగమనముతోడన్
మాహిష్మతి నగరంబును జేరెను మానుగ జనులును దిలకింపన్
వందనములు మఱి సేయుచుండగా వనర మహా ఋషులందఱునూ! 3

అమరావతితో సమానమైనా యలరు హృష్ట పుష్టులునైనా
గలిగినట్టి యా జనులను గూడీ విలసిత యా నగరంబు మఱిన్
బ్రహ్మదేవుడును నింద్రుని నగరము బన్నుగ యమరావతి వోలెన్
ఆ పులస్త్యుడును నడుగు బెట్టెనూ వల మాహిష్మతి నగరంబున్! 4

అట్టి సమయమున యచటి జనంబులు విట్టె కాలి నడకల తోడన్
ఆదిత్యుని వలె నున్న వాడునూ యలరి వచ్చుచున్నట్టియునూ
చూచుటకును మఱి శక్యముగాని సుడులు దిరిగెడీ యగ్నివలెన్!
నున్నవానినీ యాపులస్త్యునీ యలరి గాంచి గుర్తించియునూ
అల యర్జునునకు తెలియజెప్పిరీ యల పులస్త్యుడొచ్చిన వార్తన్! 5

హైహయాధిపుడు వారి మాటలకు అల పులస్త్యుడని తెలిసికొనీ
శిరస్సునం... యంజలి ఘటించి స్థిరమగు భక్తిని గూడికొనీ

మునీశ్వరుండగు నా పులస్త్యునకు మోదముగా మఱి యెదురేగెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 6

కార్తవీర్యునీ పురోహితుండును కరమున యర్ఘ్యంబున మఱియున్
మధు పర్కంబును గైకొనుచును దా మానుగ ఫలపుష్పంబులనూ
ఆ బృహస్పతియు నల శచీపతికి నలరుచు ముందుగ బోయినటుల్
అల పురోహితుడు ముందు నడచెనూ అల యర్జునుడును తరలంగన్! 7

అటుబిమ్మట యా యర్జునుండునూ యల యుదయించెడి సూర్యు వలెన్
వచ్చుచున్న యా పులస్త్య ఋషినీ యలరి జూచి యా యర్జునుడున్
తొందర బడుచును నున్నవాడునై తోరముగా దేవేంద్రుండున్
శివునకు నమస్కరించినట్లుగా శిరమున జేసెను వందనముల్! 8

ఆ రాజేంద్రుడు పులస్త్యునకునూ యలరుచు మధు పర్కంబు మఱిన్
గోవును మఱియును నర్ఘ్య పాద్యములు కూరిమి తోడను యర్పించీ
సంతోషముతో గద్గదమైనా సరసవచనముల గూడికొనీ
అల పులస్త్యుతో యా యర్జునుడును నలరుచు నీ విధముగ బలికెన్! 9

బ్రాహ్మణపుంగవ! పులస్త్య మహర్షీ! పన్నుగ యే కారణముననూ
చూడ శక్యమునుగాని నిన్నిపుడు జూడగలుగుచును నున్నానో
ధన్యుడనైతిని! మాహిష్మతియును దగ యమరావతి పురితోడన్
సమానమైనదిగా జేయగబడె సకల పవిత్రత జేకూరెన్! 10

దేవా! నేనిదె దేవతా గణము దీరుగ నమస్కృతియు మఱిన్
జేయదగిన నీ పాదంబులకును జేయుచుంటినిదె వందనముల్
అందుచేత నా జీవితమంతయు చందముగా కుశలంబయ్యెన్
నా వ్రతంబునూ కుశలమైనదీ నాదు జన్మ సఫలంబయ్యెన్!
నా తపస్సునూ ధన్యమైనదీ నయముగ నీ యాగమనముచే! 11

బ్రాహ్మణోత్తమా! యిదిగో రాజ్యము నిదిగో పుత్రులు దారయునూ
మే మందఱమును నిచట నుంటిమీ! మే మందఱమును నీకు మఱిన్
ఏమి చేయగా వలెనో దెలుపుము! నే కార్యము జేయగ వలెనో!
ఆజ్ఞాపింపుము బ్రాహ్మణోత్తమా! యలరి జేయుదుము తలవంచీ! 12

అల పులస్త్యుడును హైహయ రాజును నలరి పలికె నీ విధముగనూ
నీ ధర్మము నిర్విఘ్నముగా నిట నిరతము సాగుచు నున్నదిగా,
పుత్రులు కుశలముగా నున్నారా? పొలుపుగ యగ్నులు నిత్యంబున్
చక్కగ జరుగుచు నున్నవా? యనుచు దగ ప్రశ్నించియు తదుపరినీ,
మఱల నిటుల ప్రశ్నించెను ఋషియును మానుగ హైహయ ప్రభుతోడన్! 13

అంబుజ పత్రంబుల వంటివియును నలరు నేత్రములు గలవాడా!
పూర్ణచంద్రుతో సమానమైనా పొలుపగు ముఖమును గలవాడా!
నరేంద్ర! యే నీ చేత రావణుడు నింపుగ జయింపబడినాడో
అట్టి నీ బలము నమల మైనదీ యిట్టె సాటిలేనిది మఱియున్! 14

ఎవని భయంబున చలింపకుండగ సముద్రంబు వాయువు లిలనూ,
నిశ్చలంబులై నిరంతరంబును నిత్యము సేవలు జేసెడినో,
అట్టివాని మఱి యతి దుర్జయుడును నలరు నాదు పౌత్రుని యనిలో,
జయించినాడవు రణ విజయుండవు! సాటిలేని వాడవు నీవున్! 15

నాయన! అర్జున! విను నా పలుకులు నలరు నాదు పుత్రుని మఱిన్
కీర్తనంతనూ త్రాగివేసితివి కిమ్మనకుండగ నాతనినీ
'రావణ విజేత యనుచు లోకమున రయమున ప్రకటించితివి గదా!
నేను నిన్ను యాచించుచుంటినీ నిను బ్రతిమాలుచు నుంటినిదే!
నాదు మాట విని రావణాసురుని నయముగ విడువుము మహిపాలా! 16

అటుబిమ్మట యా కార్తవీర్యుడును నలరి పులస్త్యాజ్ఞను నతడున్
గ్రహించి యాతడు మాటాడకనూ కమ్మని మౌనము ధరియించీ
పార్థివేంద్రుడును పులస్త్యుగాంచీ బన్నుగ సంతన మందుచునూ
రాక్షసరాజగు రావణాసురుని నయముగ వదిలెను నతిప్రీతిన్! 17

అర్జునుండు మఱి దేవ శత్రువును నలరి విడుదలను జేసి మఱిన్
దివ్యములైనా యా భరణంబుల దివ్య వస్త్ర మాల్యంబులచే
సత్కరించి మఱి సఖ్యము జేసిరి సాగ్నితముగ వారిరువురునూ
కలకాలంబును బరస్పరంబును కలిసి మెలిసి మనముందుదమూ! 18

పరస్పరము కలహింప కూడదూ పన్నుగ హింసయు వలదికనూ,
అగ్ని సాక్షిగా స్నేహము జేసిరి యలరుచు వారిరువురు నపుడున్
అటుబిమ్మట యా యర్జునుండునూ యల బ్రహ్మకు బుత్రుడునైనా,
పురస్త్యబ్రహ్మకు పూజలుజేసీ పొలుపుగ తన గృహమును జేరెన్! 19

అర్జునుజేత జయింపబడుచునూ యలరి సిగ్గు జెందుచుమన్నా,
ప్రతాపవంతుండగు రావణునకు బన్నుగ స్నేహము జేత మఱిన్
ఆతిథ్యము జేసిన వాడగుచును నర్జునుడును నా రావణునీ,
కౌగలించుకొని పంపివేసెనూ కమ్మని స్నేహము బొంగారన్
పులస్త్యుండునూ యనుమతి నిచ్చెను బొలుపుగ లంకకు బోవుటకున్! 20

బ్రహ్మదేవునీ కుమారుడైనా బన్నుగ యాముని పులస్త్యుడున్
ఆల రావణునీ విడిపించియు మఱి యలయర్జునునీ దీవించీ
బ్రహ్మ లోకమును తరలిపోయెనూ తాపసులను మఱి గూడికొనీ
వచ్చిన కార్యము సఫలమాయెనని సచ్ఛీలము గల యాతండున్! 21

ఓ రఘు నందన! రామా వినుమా! యొనర మహా బలశాలియునూ
ఆ రావణుడును నీ విధముగనూ యలరు కార్త వీర్యుని జేతన్
ప్రదర్షణంబును జెందినాడుగద! బన్నుగ విధి నిర్ణయమునమా!
పులస్త్య వచనంబుల చేతను మఱి పొందుగ విడువగ బడెనపుడున్! 22

అటుబిమ్మట యా రాక్షస రాజును నల యర్జునునీ స్నేహంబున్
నందిపొంది మఱలను యాతండును జింది శత్రు సంహారంబున్
జేయుచు హింసించుచు నాతండును శ్రీ విలసిల్లగ లోకమునన్
గర్వముదోడుత పృధివి యంతటను సర్వము సంచారము జేసెన్! 23

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ముప్పది మూడవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ముప్పది నాల్గవ సర్గము

(రావణుడు వాలి నుండి పరాభవముబొంది యతనితో మైత్రి జేసికొనుట)

అర్జును జేతను విముక్తుండునై రాక్షసాధిపుడు రావణుడున్
అతుల నిర్భయుడుగా జేయగబడి యనిర్విణ్ణుడై యాతండున్,
సమస్తమైనా ధాత్రియంతటను సమస్త రాజుల నోడించీ
తానే బలవంతుండ ననుచునూ తగ గర్వముతో నటనుండెన్! 1

మదము చేత మఱి గర్వితుడైనా మానుగ యా రావణుడు మఱిన్
రాక్షసునైనా మనుష్యునైనా రయమున యెవరైనను గానీ
ఎవడు మహాబలవంతుడ ననుచును నింపుగ వినునో శీఘ్రముగన్
ఆతని యొద్దకును బోయి పిలుచునూ యలరి యుద్ధమును సేయంగన్! 2

అటు బిమ్మట ఒకనాటి దినమునను నలరి రావణుడు వేగముగన్
వాలి పాలనము సేయునట్టి యా వరకిష్కింధా నగరంబునకున్
జేరుచు బంగరు మాల ధరించిన శ్రీ విలసిల్లెడి యావాలిన్
యుద్ధము సేయగ రమ్మని పిలిచెను యుద్ధతితోడను గూడికొనీ! 3

అటు బిమ్మట యా వాలి యమాత్యుడు నల తారుకు తండ్రియునైనా
సమర్థుండు వానరుడైనట్టీ తారుడు యా రావణు గాంచీ
యుద్ధము గావలెనని గోరుచునూ యద్ధతి వచ్చిన రాక్షసుతో
ఈ విధంబుగా బలికెను తారుడు నింపుగ చతురత దోడుతనూ! 4

రాక్షస రాజా! రావణ వినుమా! రమ్యముగా నా వచనములన్
నిన్నెదిరింపగ గలిగిన వాడును నిశ్చలమైన బలోన్నతుడున్,
అట్టి వాలి బైటికి పోయెను మఱి నిట్టి శౌర్యములు సేయంగన్,
యిక నీ యెదుటను నిలువ గలిగినా నిశ్చల వానరు డెవ్వడిటన్? 5

ఓ రావణ విను! వాలి సంద్రమున వనరగ నాలుగు దిక్కులనూ!
సంధ్యోపాసన జేయుచుండునూ చక్కగ ముహూర్త కాలమునన్,
రాగల డిచటకు వేగముగా మఱి రమ్యముగా నిలబడు మిచటన్
ముహూర్త కాలము వేచియుండుమా! మోదముగా రణమును జేయన్! 6

ఇదిగో! చూడుము నిచటనున్నవీ నింపుగ యస్థి చయంబులనూ
శంఖ పాండురములైన యస్థులును జక్కగ కనుగొనుమా యిచటన్!
ఇవి యుద్ధంబును గోరి వచ్చినా విస్తృత వీరుల శూరులయున్
వాలి తేజసున మరణించిన యా వారల యెముకల గుట్టలివీ! 7

రాక్షస రాజా! రావణ వినుమా! రయమున యమృతము ద్రావినమా
అటుల జేసినను గూడను నీవును నలయౌషధమును బొందినమా!
రణరంగంబున నీవు వాలినీ రయమున సమీప్యము నందీ
పట్టుబట్టితివా నీ జీవితమును బరగ యంతమగు నంతటితో! 8

ఓ విశ్రవసు కుమారుడా విను! నొనరగ నాదు సువచనములన్
జగదాశ్చర్యకరుండగు వాలిని వగలేకను గను మీ క్షణమున్
ముహూర్తకాలము నిరీక్షింపుమా! ముహూర్తకాలము దొరుక దికన్!
చిత్రమైన యీ జగమును గాంచుచు జీఋనవ్వను జిందించుమికన్!
వాలి తోడుతను అని దలచితివో యలరి దొరుక దవకాశంబున్! 9

లేదా యిపుడే మరణింపగనూ లీలగ కోరిక యుండినచో
దక్షిణ సంద్రమునకు బయనింపుము దగ యా వాలిని కవగలవూ!
అచ్చోటను మఱి ధరిత్రిపైనీ యలరు నగ్ని పిండమువోలెన్
ఉన్న వానినీ కనుగొన గలవూ! చెన్నుగ మృత్యువు సమమైనా! 10

లోక రావణుండగు రావణుడును లోలత తారుని భయపెట్టీ
పుష్పక విమాన మధిరోహించీ పొలుపుగ యమాత్యులను గూడీ
దక్షిణ సంద్రమునకు బోయెను మఱి దగవాలిని సందర్శింపన్
మల్లయుద్ధమున యా నాలిని మఱి మట్టుబెట్టగా రావణుడున్! 11

రావణు డచ్చట కనుగొనె వాలిని రయమున సముద్ర తీరమునన్
మేరు పర్వతము సమానుండునూ తరుణార్కుని సమ ముఖంబునూ!

సంధ్యోపాసన తత్పరుడైనా చక్కగ వాలిని గనుగొనుచున్,
కాటుకవంటీ శరీర ఛాయయు కాఱు చీకటియు గ్రమ్మినటుల్!

ఆ రావణుడును పుష్పకంబు దిగి యా వాలిని బట్టుట కొఱకై
అడుగుల చప్పుడుగాకుండగనూ యలరుచు మెల్లగ మెల్లగనూ!
ఆ వాలిని మఱి సమీపించెనూ యా దశగ్రీవుడు నెమ్మదిగా!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 12,13

ఆ సమయంబున వాలియు గూడను నలరు దైవ వశమున వలనన్
ఆ రావణునీ కనుగొనె నంతట యలరు దొంగవలె వచ్చుటయున్,
కానీ యాతని పాపపు తలపును బన్నుగ మదిలో గ్రహియించీ
కలత జెందగా లేదాతండును కంగారును బడలేదు గదా! 14

జెవుల పిల్లినీ గాంచి సింహమును జిఱునగవులనూ జింది నటుల్
పన్నగంబునూ గరుత్మంతుడును బన్నుగ గాంచిన యట్టులనూ
పాప నిశ్చయముగల రాక్షసునీ పన్నుగ యా వాలియు గూడన్
చింత జేయగను లేదు మఱియునూ చెంత గాంచి భయపడలేదూ! 15

వన్ను బట్టగను దలచి వచ్చెడీ నయముగ యా రావణుని మఱిన్
పాపపు దలపున వచ్చుచున్న యా పరమ నికృష్టుని యిపుడిపుడే,
కక్ష యందు వ్రేలాడు నట్లుగా కడిమి వేదనను గలిగించీ
మూడు మహా సంద్రముల జుట్టెదను మురిపెముగా యా రక్కసునీ! 16

శత్రువైన యా రావణుండునూ ఘన చైతన్యము దొలగుచునూ
గరుత్మంతునికి జిక్కినట్టి యా ఘన సర్పంబును బోలె మఱిన్
నాకును జిక్కిన కరము లూరువులు నయముగ వస్త్రములును జారన్
వ్రేలాడుచునుండగ జనంబులును వేడుక జూతురుగాత! యికన్! 17

ఈ విధముగ యా వానర విభుడును నింపుగ యాలోచించి మదిన్,
ఏమియు మాటాడక యుండెను మఱి నిమ్మగ మౌనము దాల్చుచునూ,
వేదంబులకును సంబంధిచిన విమల మంత్రముల జపించుచున్
పర్వత రాజుకు వోలె నుండెనూ పన్నుగ కదలక మెదలకనూ! 18

ఒకరినొకరు మఱి బంధింపగనూ యొనర ప్రయత్నము జేయుచునూ
బలము జేత మఱి గర్వితులైనా బన్నుగ వాలియు రావణులున్
ఆ కార్యంబును జేయుట కొఱకై యలరుచు జేసిరి యత్నంబున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 19

పరాఙ్ముఖుండై యున్నను గూడను బన్నుగ యడుగుల శబ్దముచే
ఆ రావణుడును తన హస్తమునకు నందునట్లుగా నుండెననీ,
గ్రహించి వాలియు తన మదియందున కరముగ పక్షియు సర్పంబున్
బట్టు నటుల యా రావణు బట్టెను పన్నుగ యా వాలియు మఱియున్! 20

ఆ వానరుడగు వాలియంతటను నలరి తనును బట్టుట కొఱకై
వచ్చినట్టి యా రావణాసురుని మచ్చిక హస్తములను బట్టీ
చంకయందు వ్రేలాడునట్లుగా పొంకముగా గ్రహియించి మఱిన్
ఆకాశములోనికి యెగిరెను మఱి యలరి పక్షి యెగరిన రీతిన్! 21

మాటిమాటికిని గోళ్లతోడనూ మానుగ రక్కుచు గీరుచునూ,
బాధించెడి యా రావణాసురుని బన్నుగ వాయువు మేఘములన్,
అపహరించినటు యెత్తుకబోయెను యంతులేని గగనంబునకున్
మంత్రులుగూడను హతాశులైరీ యా రావణునీ రక్షింపన్! 22

అటు బిమ్మట యా దశాననుండును నపహరింపబడుచుండగనూ
గాంచియు యాతని మంత్రులందఱును యాతని విడిపించుట కొఱకై
ధ్వనులు జేయుచును వెంబడించిరీ దగ వాలిని వెనువెంట మఱిన్
నక్కలు యఱచిన రీతి యఱచుచును రయమున సింహము వెనువెంటన్! 23

ఆ రాక్షసులును వెంబడింపగా నా వాలియు గగనమునందున్
మేఘంబులచే వెంబడింపబడు మేదుర సూర్యునకున బోలెన్
ప్రకాశించుచుండెను తేజస్సున బన్నుగ సహజ సుకాంతులతో!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 24

ఆ రాక్షస శ్రేష్ఠులు యా వాలిని యలరి చేరజాలక వారున్
అతని బాహువులు, మార్పుల చేతను నలరు వేగమున చేత మఱిన్

అలసిపోయినా వారగుచును మఱి యాగిపోయిరా మధ్యమునన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 24

బోవుచున్న యా వాలి మార్గమున పొలుపుగ పర్వతములు గూడన్
దూరముగా మఱి తొలగిపోయినవి తోరముగా భయపడుచు మఱిన్
మాంస శోణితము ధరించుచుండెడి మానుగ ప్రాణుల విషయమునన్
వారి మాట నిక జెప్పవలయునా? వారి భయము వివరించుచునూ? 25

మహాజవముగల వానరేంద్రుడును మానుగ సంధ్యా కాలమునన్
పక్షుల సముదాయంబులు గూడను బరగ యెగుర జాలగ లేనీ
సముద్రంబు లన్నింటిని గూడను సహజముగా వాలియు గనుచున్
మనసా వాచా కీర్తించుచునూ మానుగ వందనమును జేసెన్! 26

సురల జేత బూజింపగ బడుచును సురుచిరముగ యా వాలియునూ
ఆకాశంబున సంచరించెడీ యా ప్రాణులలో నుత్తముడున్
ఆ వాలియు దశగ్రీవుని తోడను నల గగనంబున యెగురుచునూ!
పశ్చిమ సంద్రము జేరుకొనియెనూ బాహు బలంబున తోని మఱిన్! 27

వాలియు పశ్చిమ సముద్రమందున యెనరగ స్నానము జేసి మఱిన్
సంధ్యోపాసన జేసి జపంబును సావధానముగ జేసి మఱిన్
ఆ దశ గ్రీవుని మోయుచు కక్షను నలరుచు బోవుచు గగనమునన్
ఉత్తర సంద్రమునకు జేరెను మఱి యున్నత శిఖరము దాటి మఱిన్! 28

మహా హరియునగు వానరేంద్రుడును మానుగ నెగురుచు గగనమునన్
బహు యోజన సాహస్రము బోయెను బన్నుగ రావణు మోయుచునూ
వాయు వేగమున బోయెను నాతడు వరుసగ గిరులను దాటుచునూ
మనోవేగమున నీదుచు బోయెను మానుగ నీలాకాశమునన్! 29

ఆ వాలియు నుత్తర సంద్రంబున యలరుచు స్నానముజేసి మఱిన్
సంధ్యోపాసన జేసి జపంబును సహజముగా నటజేసి మఱిన్,
ఆ దశగ్రీవుని కక్షను మోయుచు నలరుచు మౌనము ధరియించీ
తూర్పు సముద్రమునకు బోయెను మఱి సుందర దృశ్యములను గనుచున్! 30

హరీశ్వరుండగు నా వాలియునూ యల తూర్పు సముద్రంబుననూ
సంధ్యోపాసన జేసినవాడై చక్కగ జపమును జేసి మఱిన్
ఆ దశాసనుని గైకొని కక్షను నటునిటు బహు బరికించుచునూ
తన నగరంబగు కిష్కంధకునూ తగ బోయెను సంతస మందన్! 31

వానరేంద్రుడగు నా వాలియునూ వనరగ నాల్గు సముద్రములన్
సంధ్యోపాసన జేసినవాడై చారు మంత్రముల జపియించీ,
ఆ రావణునీ కక్షను మోయుచు నలసిన వాడై వాలియునూ
కిష్కింధకు దగ్గఱనున్నట్టీ క్రీడోద్యానమునందు దిగెన్! 32

అటు పిమ్మట యా కపిసత్తముడగు నా వాలియు నా రావణునీ
స్వకక్ష నుండీ జారవిడిచెనూ స్వాంతమునందున జాలిపడీ!
పకపకనవ్వుచు వా నరేంద్రుడును బరగ రావణుని ప్రశ్నించెన్
ఎట నుండియు నీ విటు వచ్చితివీ? యే కార్యము మఱి చేయంగన్? 33

రాక్షసేంద్రుడును రావణుండునూ రయమున విస్మయమొందుచునూ
శ్రమలోలంబగు నిరీక్షణంబుల భ్రమలోలంబగు హృదయముతో
వానరేంద్రుడగు వాలిని జూచీ వనరగ లంకేశుడు బలికెన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 34

మహేంద్రాభ! వానర రాజా! విను! మానుగ నా వాక్యంబులనూ
రాక్షసుండ! నే లంకేశుడునూ రావణుడను పేరును గలదూ!
నీతో రణమును సేయుట కొఱకై నిగిడి వచ్చితిని నే నిటకున్
నీచే నే పీడింపబడితినీ నిష్ఠురముగ నీ విధముననూ! 35

ఎంతటి యాశ్చర్యము నీ బలమును? నెంతాశ్చర్యము వీర్యంబున్?
ఎంతటి యాశ్చర్యము గాంభీర్యము? నెంతాశ్చర్యము ధైర్యంబున్?
నన్ను నీవు పశువును బట్టిన యటు నన్ను బట్టి చంకను జొట్టీ
నాల్గు సంద్రములు ద్రిప్పినావు గద! నయముగ నల్గురు గనుగొనగన్! 36

ఓ వీరా! ఓ ప్లవంగేశ్వరా! వనరగ బహు చిత్రం బిదియున్
ఈ విధముగ యలసట లేకుండగ యింపుగ నను మోయుచుగూడన్!
నాల్గు సంద్రములు ద్రిప్పినాడవూ! నయముగ క్రిందికి ద్రింపకనూ!
ఏ వీరుడు గమియింప గలగునూ యేకధాటిగా సంద్రములన్! 37

దానరేంద్ర విను! నా పలుకులనూ యాదరింప వలయును నీవున్
నీ గమనము మఱి మనస్సునకునూ నిశ్చయముగ వాయువునకునూ
గరుత్మంతునకు యా మువ్వురకును గలదు నీకునూ నలువురకున్
ఇతరులకును మఱి లేదు లేదు గద! నింపుగ యా గమనంబు మఱిన్! 37

హరి పుంగవ! ఓ వాలీ వినుమా! యలరు నాదు వచనంబులనూ
నీ బలమెంతో నాకుతెలిసినది నిశ్చయముగ నా కిపుడిపుడే!
చిరకాలంబును నగ్నిసాక్షిగా శ్రీకరమగు ఘన స్నేహమునూ!
గోరుచుంటినీ ప్లవంగేశ్వరా! కోరిక తీర్చగవలె నీవున్! 39

హరీశ్వరా! విను నాదు పలుకులను, నాదరింప వలయును నీవున్
దారా పుత్రులు పురము, రాష్ట్రమును దగ భోజన యాచ్ఛాదనముల్
భోగంబులు మఱి మన యిరువురకును బూర్తిగ కలిసియెయుండు మఱిన్
నీకును నాకును భేదములేదూ! నీవే నే నేనును నీవే! 40

అటు బిమ్మట యా హరి రాక్షసులును నగ్ని రగిల్చి వెనువెంటన్
పరస్పరంబును గౌగలించుకొని భాతృ సములమని యనుకొనుచున్
పెరుగన్నంబును భుజించి రప్పుడు బేరిమి యొక కంచమునందున్
కలసి త్రాగిరీ మదుర జలకమును కలశము నంగున స్నేహమునన్
భ్రాతృ స్నేహమును బొందిరి వారలు బరగ యన్న దమ్ములకు వలెన్! 41

అటుబిమ్మట యా హరి రాక్షసులును నన్యోన్యము జేతులు కలిపీ
భాతృ స్నేహమును బొందుచు వారలు, బన్నుగ మృదు వాక్యంబులతో
సంతసించుచును రెండు సింహములు సఖ్యత పర్వత గుహయందున్
ప్రవేశించినటు ప్రవేశించిరీ బన్నుగ కిష్కింధా నగరిన్! 42

లంకేశ్వరుడగు రావణుండునూ శంకలేక కిష్కింధ పురిన్
సుగ్రీవుని వలె సోదరునికి వలె సురుచిరముగ యొక నెలయుండెన్
ఇంత లోపలను మూడు లోకముల పంతముతో పీడింపగనూ!
కోరిక గలిగిన మంత్రులు వచ్చీ కూరిమి గొనిపోయిరి యతనిన్! 44

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
పూర్వము జరిగిన వృత్తాంతంబది పొలుపుగ జరిగిన దంతయునూ
వాలి రావణుని మునుముందుగనూ యొనరగ యవమానించి మఱిన్
తరువాతను మఱి యగ్నిసాక్షిగా దగ స్నేహంబును జేసికొనెన్! 45

రఘురామా జరిగిన వృత్తాంతము రమ్యముగా దెలిపితి నీకున్
ఈ విధముగ యా వాలి బలంబును నింపుగ యప్రతిమానంబున్
ఆ వాలిని కూడా మఱి నీవును నలరి మిడతనూ యగ్నివలెన్
మాడ్చివేసినటు మాడ్చి వేసితివి! మానుగ చిటికెన వేసినటుల్! 46

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ముప్పది నాల్గవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ముప్పది యైదవ సర్గము

(శ్రీరాముడు ప్రశ్నింపగా అగస్త్యుడు హనుమంతుని
జన్మ పరాక్రమాదులను వర్ణించి చెప్పుట)

ఆ సమయంబున రామచంద్రుడును నల దక్షిణ దిశయందుననూ
ఆశ్రయంబుగా గలవాడును మఱి యలర తేజమును గలవాడున్
అట్టి యగస్త్యుని గనుగొనుచును మఱి యిట్టె ప్రాంజలిని గూడికొనీ
వినయముతోడను గ్రూడినవాడై వేడుక నీ విధమున బలికెన్! 1

వాలి బలమును రావణు బలమూ యొనర యతులము గావచ్చున్
కానీ వారల యిద్దఱి బలములు క్రమముగా హనుమంతునితో
బోల్పగ రాదూ! ఓ మునీశ్వరా! పొందుగ వారిద్దఱి బలముల్!
హనుమంతునితో సమముకాదనీ యల నా దృఢ నిశ్చయము సుమా! 2

కార్యము, మంచితనంబు, బలంబును గడు సామర్థ్యము ధైర్యంబున్
యుక్తమైన కార్యము సాధించుట, బుద్ధి, నీతి విక్రమములునూ
ప్రభావమును, సద్భావములన్నియు బొందుగ హనుమంతుని యందున్
ఆశ్రయించుకొని యున్న వతనిలో ననుసరించు వానిని నతడున్! 3

మహా బాహువగు హనుమంతుండును మానుగ సాగరమును గాంచీ
దిగులు జెందెడీ కపి సైన్యంబును దీరుగ గాంచుచు నోదార్చి!
శత యోజనముల దూరము దాటీ శాంతముగా లంకను జేరీ
తిరిగి వచ్చెనూ నా హనుమంతుడు దీరుగ భయపడకను నతడున్! 4

లంకానగరంబును దర్శించీ లంక నంతయును గాలించీ
దశగ్రీవుని యంతఃపురంబునూ దగ గాంచియు మఱి శోధించీ
సీతను గాంచెను, సంభాషించెను, చింత దీర్చి మఱి యోదార్చి,
మఱల సముద్రము దాటి వచ్చెనూ మానుగ లంకను గాల్చి మఱిన్! 5

సేనను ముందుగ నడచి వచ్చినా స్థిర సంకల్పులు మంత్రి సుతుల్
కింకరులును మఱిరావణాత్మజుడు స్థిరుడగు నక్ష కుమారుండున్
చంపబడిరి హనుమంతుని జేతను పంపబడెను మఱి సేనలునూ
ఒక్కడే కదా యా హనుమంతుడు జిక్క లేదు గద యెవ్వరికిన్! 6

మఱల బంధనము నుండి బయటపడి మానుగ రావణు దర్శించీ
మాటలాడి మఱి నీతినిదెలిపీ మఱి లంకను భస్మముజేసీ
తిరిగివచ్చుచును సీతనుగాంచీ శ్రీకరముగ యంబుధి దాటీ
మఱలి వచ్చెనూ కపులను గలిసెను మానుగ కిష్కింధకు జేరెన్! 7

యుద్ధమునందున హనుమంతునిచే యుద్ధతి జేసిన కార్యంబుల్,
యెవి జేసినవని వినబడుచున్నదొ యవి కాలుని చేతనుగానీ
ఇంద్రుని చేతను గాని మఱియును సాంద్ర విష్ణుజేతనుగానీ
వినబడుటయునూ లేదుగదా మఱి విదిత కుబేరునిచే గానీ! 8

ఇతని బాహుబలంబు చేతనే నింపుగ లంకను జానకినీ,
లక్ష్మణునీ మఱి జయమును గూడను లావుగ నే బొందితిని గదా
రాజ్యంబును, మిత్రులను బంధువుల రయమున బొందితి నేను మఱిన్
నా విజయమునకు మూల మీతడే నయముగ మఱి జెప్పగనేలా? 9

వానరాధిపతి యా సుగ్రీవుని యొనర సఖుండగు వాడు మఱిన్
ఆ హనుమంతుడు నాకు లేనిచో నలరచు యా జానకివి మఱిన్
జాడనైననూ తెలిసికొనుటకును సఖుడెవ్వడు మఱి గలడచటన్
ఆ హనుమంతుడు జేసిన మేలును నలరి దెలుపగా లేను సుమా! 10

అపుడు వాలి సుగ్రీవులకును మఱి యలరి వైరమేర్పడినపుడున్
ఈ హనుమంతుడు సుగ్రీవునకును నింపుగ ప్రియమును గూర్చగనూ,
అట్టి కోరికను యా వాలిని మఱి యలరి యెందులకు మొక్కవలెన్
కాల్చి వేయబడలేదు యెందుకని? కనికరించెనూ యెందుకనీ? 11

హనుమంతుడు తన ప్రాణంబులతో నల సమానుడును నిష్ఠుండున్
అల సుగ్రీవుడు బాధబడుచునూ యటులుండగ చూచుచు నితడున్

నూరుకున్న వాడనగా యతనికి నున్న బలం బది యెంతటిదో
తెలియదనియు నే ననుకొనుచుంటిని తీరుగ నంతయు శోధింపన్! 12

ఓ పూజ్యుడ! ఓ అమరపూజితా! ఓ మహామునీ! వివరముగన్
ఆ హనుమంతుని విషయము నంతయు నలరి యున్నదన్నట్లుగనూ!
విషయమునంతయు దెలుపుము నాకును వివరముగా విశదముగ మఱిన్
అనుచు బలుక శ్రీరామచంద్రుడును నలరి బలికె యా యగస్త్యుడున్! 13

అటు బిమ్మట యా ఋషీశ్వరుండును నలరు రామచంద్రునితోడన్
హేతు యుక్తమగు వచనములను విని నీతి యుక్తుడగు హనుమంతూ
సమక్షముననే రామచంద్రునీ సరసత నుద్బోధించుచునూ!
సమస్త జనులును వినుచుండగనే సద్భావంబున ముని బలికెన్! 14

రఘుపతి రాఘవ రాజారామా పతిత పావనా సీతారామ్!
హనుమంతుని విషయంబునందునను నలరి నీవు వివరించినదీ
అంతయు సత్యము! బలమునందునను నలరు బుద్ధి యందునగానీ
ఇతనితోని మఱి సమానుండునూ యింపుగ మఱి యొకడును లేడూ! 15

అరి మర్దన! ఓ రఘురామావిను! నలరు నాదు వచనంబులనూ
పూర్వంబున యీ హనుమంతునికిని పొలుపుగ ఋషిముని గణములచే
వ్యర్థముగానీ శాపమివ్వబడె యొనరగ తత్కారణముననూ
ఈతడు మహాబలుండేకానీ యెఱుగడు తన బలమది యెంతటిదో! 16

మహాబలము గలవాడా! రామా! మానుగ విను! నా వచనములన్
బాల్యమునందున గూడ నీతడును బన్నుగ యెంతటి కార్యంబున్
జేసినాడొ యది వర్ణింపగనూ స్థిరముగ శక్యము కాదుగదా!
అజ్ఞానముచే నీ విధి యుండును నలరు జీవితము నంతయునూ!
ఆత్మబలంబున నెఱుగ జాలడూ యల మునీశ్వరుల శాపముచే! 17

రఘువంశంబున బుట్టినవాడా! రఘురామా! ఓ శ్రీరామా!
వినవలయును నను గోర్కెయున్నచో విశదముగా సర్వస్వమునూ

సావధాన చిత్తముతో వినుమా! సరసత జెప్పుచు నున్నాడన్
హనుమంతుని వృత్తాంత మంతయును నలరి వినుము శ్రీ రఘురామా! 18

సూర్యదత్తమగు వరంబు చేతను సుందర సువర్ణ మేఱువునా
సురుచిరమైనా నామము దోడుత సుందరగిరి యొక్కటి గలమా!
ఆ ప్రదేశమున యాతని తండ్రియు నలకేసరి యను నామముతో
పరిపాలించుచు నుండె నాతడును బన్నుగ యా పర్వత మందున్! 19

ఆ కేసరికిని యంజనా యనెడి యలరి ప్రసిద్దిని పొందియునూ
యిష్టురాలు నగు ప్రియురాలుండెను నింపుగ సతి యుత్తమురాలున్
ఆమె యందునను వాయుదేవుని వర ప్రసాదము జేత మఱిన్
నుత్తముడైనా పుత్రుడు గలిగెను నురుగుణ బలవంతుడు వేగన్! 20

అటు బిమ్మట యంజనా సతియు నల వరిగింజల ముల్లువలెన్
పచ్చని శరీర కాంతిగలిగినా పన్నుగ యా హనుమంతుని గనియెన్
ఉత్తమురాలగు నంజనా సతియు మరుతరములునగు ఫలంబులన్
దెచ్చుట కొఱకై యడవికి బోయెను మచ్చిక బాలుని నట నుంచీ! 21

తల్లి దగ్గఱను లేకపోవుటను దగ యాకలి చేతను గూడన్
భృశార్దితుండై యా శిశువును మఱి బన్నుగ బహు వేదన తోడన్
శరవణమున యా శిశువగు నట్టీ సరసత కుమారస్వామి వలెన్
కావుకావు మని రోదన జేసెను కనుల భాష్పములు బ్రవహింపన్! 22

ఆ సమయంబున యుదయించెడి యా యలరు జపా పుష్పంబులతో
సమానమైనా వివస్వంతునీ చక్కగ దర్శించెను నతడున్
ఫలమునందు లోభంబు వలననూ పరితపించుచును బాలుండున్
ఉదయింటెడి యా సూర్యుని గాంచుచు నురు జవంబునను పైకెగిరేన్! 23

మూర్తి మంతుడగు బాల సూర్యువలె మోహనుడగు నా బాలుండున్
ఉదయించెడి యా బాలార్కుని మఱి పదిలముగా గ్రహియించుటకున్
మనసునందునను గోరిక గలిగీ మానుగ గగనము మధ్యమునన్
నున్న సూర్యునికి యభిముఖుడై మఱి బన్నుగ యెగిరెను వేగముగన్! 24

ఈ విధముగ నా హనుమంతుండును నింపుగ శైశవ దశయందే
ఆకాశంబున యెగురుచుండగా నలరు పక్షివలె గాంచుచునూ
దేవతలకు మఱి దానవులకునూ, యక్షులకును, నాగులకు మఱిన్
మహా విస్మయంబును గలిగెను మఱి మానుగ గాంచిరి వింతగనూ! 25

అత్యున్నతమగు నా కాశమునకు నల వాయువునకు బుత్రుండున్
ఎంత వేగమున బోవుచుండెనో యల వేగము మఱి వాయువుకున్
అలరి లేదు గరుడునకును మఱియును నల మనస్సునకు లేదు గదా!
రఘుపతి రాఘవ రాజారామా పతిత పావనా సీతారామ్! 26

శిశువై యుండగనే యాతనినికి వశమైయుండగ యా బలమున్
గమన వేగములు నింతయున్నచో గడు యౌవనమున బలిమి మఱిన్
పొందిన బిమ్మట యాతని వేగము బొలుపుగ నండునో ఘనముగనూ!
రఘుపతి రాఘవ రాజారా మా పతిత పావనా సీతారామ్! 27

ఆ సమయంబున వాయువు గూడను నల యెగిరెడి తన సుతునిగనీ
సూర్యుని వలనను సోలిపోవునను సురుచిర భావము గలిగి మదిన్
రక్షించుచు మఱి మంచుగడ్డ వలె రయమున చల్లదనంబుననూ
ఎగురుచున్న యాతని వెనువెనుకను నగుచుబోయె కాపాడుటకై! 28

ఆ శిశువును మఱి తండ్రియైన యా యలరు వాయుదేవుని బలమున్
బాల్యమువలనను బహు యోజనముల బన్నుగ సహస్రములును మఱిన్
ఆక్రమించుచును యంబరమును దా నలరుచు బొందిన వాడగుచున్!
సూర్యుని దగ్గఱకును బోయెను దా చుక్కవోలె గనిపించుచునూ! 29

ఈతడు శిశువును దోషజ్ఞుడునూ దైవ సుకార్యంబులు యెన్నో
జేయగవలసిన పని యున్నదిగద! శ్రీకరముగ శుభకార్యంబుల్
అని దివాకరుడు మనసునందునను నలరుచు దివ్యాశ్చర్యమునన్
ఆ సూర్యుండును నా హనుమంతుని యాటుపోటు చేయగలేదూ! 30

ఈ హనుమంతుడు నే దివసంబున నింపుగ సూర్యుని దగ్గఱకున్
ఎగిరినాడో మఱి యా దివసంబున నింపుగ రాహువు గూడ మఱిన్

ఆ దివాకరుని బట్టు కొనుటకును నలరి వచ్చె యా దివసమునన్
విధి విధానమును గనజాలరుగా వేద విదులు గూడను జగతిన్! 31

సూర్యుని రథమున పై భాగమునను నలరు రాహువును వేగముగన్,
హనుమంతుండును హస్తము తోడను నలరి స్పృశించెను నెమ్మదిగా
సూర్యచంద్రులను మర్దించెడి యా శూరుడైన యా రాహువునూ
భయపడిపోయెను బహుదూరముగా పారిపోయె నటనుండి మఱిన్! 32

సింహికాసురుండైన రాహువును సంతోషముతో గూడికొని
ఆ దేవేంద్రుని భవనంబునకును నలరుచు నా స్వర్గాధిపతిన్
భృకుటిని ముడులను వేయుచు మఱియును భీతిలు దేవేంద్రుని గాంచీ
ఆ సురపతితో నీవిధి బలికెను నల దేవతలును వీక్షింపన్! 33

బల వృత్రాసుర సంహారకుడా! బాహు బలా! ఓ దేవేంద్రా!
చంద్ర సూర్యులను నా హారముగా సాంద్రముగా నా కిచ్చితివీ!
నీవే మఱి యా యాహారంబును నీవే యన్యుల కిచ్చితివీ!
ఇదేమి న్యాయ్యము? నిదేమి ధర్మము? నింపుగ తెలపుము! దేవేంద్రా! 34

ఈ రోజువనే పర్వకాలమున నింపుగ సూర్యుని గ్రహింపగన్
వచ్చినవాడను! కానీ వినుమా! మచ్చికతో మఱి యొకడును వచ్చీ
ఆ సూర్యుని మఱి పట్టుకొనెను గద! యటునిటు గదలక యుండగనూ!
నే నిరాశనూ బొంది వచ్చితిని! నిష్ఠురముగ నీతో బలుకన్! 35

ఆ వాసవుడును రాహువు బలికిన యా వచనములను వినియు మఱిన్
సంభ్రమాన్వితుం డగుచును నింద్రుడు సరసత కాంచన మాలికనూ
ధరించి వేగము లేచెను నింద్రుడు దగ సింహాసనమును విడిచీ,
ఐరావతమును నదిరోహించీ యలరు సూర్యు కడకును బోయెన్! 36

అటు బిమ్మట యా దేవేంద్రుండును వలరుచు కైలాసము వంటీ
శిఖరము వంటీ కాంతిగలిగినా చిత్రమైన దంతంబులతో
మదమును స్రవించుచున్నదియును మఱి మానుగ యలంకరణములనూ!

స్వర్ణ ఘంటికా నాదంబులతో సరసత ధ్వనులను జేసెడి యా
అల యైరావత కుంజరమెక్కి యల రాహువుతో గూడికొనీ
సూర్యుండును మఱి హనుమంతుడునూ సురుచిరముగ యెట నున్నారో
ఆ చోటికి దేవేంద్రుడు బోయెను నాలస్యము లేకుండగనూ! 37, 38

అపుడు రాహువును నింద్రుని దాటీ యతి శీఘ్రముగా బోవుచునూ
ఆ హనుమంతుని ముందుకు బోయెను నల సూర్యుని మ్రింగుట కొఱకై
శైల కూటమును సమముగనున్నా సరసత బరుగెత్తుచు నున్నా
అల రాహువునూ గని హనుమంతుడు నాశతోని ఫలమనుకొనెనూ! 39

అటుబిమ్మట యా హనుమంతుండును నల సూర్యుని విడి శీఘ్రముగన్
రాహువునే ఫలమనుకొనుచును మది యల రాహువును బట్టుటకై
మఱల నింగికిని హనుమంతుండును మానుగ యెగిరెను గ్రక్కుననూ!
తిండి మీదనే యాశగదా మఱి జిఱుత బుడతలకు నెప్పుడునూ! 40

రఘు రామా! యా సూర్యుని విడిచీ రయమున పరగులు దీయుచునూ
వచ్చుచున్న హనుమంతునిగాంచీ వనరగ యా రాహువును మఱిన్
జూచి వెంటనె ముఖ శేషంబును మిగిలిన వాడా రాహువునూ.
పరాఙ్ముఖుండై పరుగు దీసెనూ పన్నుగ మఱలెను వెనుకకునూ! 41

సింహినీ సుతుండైన రాహువును స్థిరబలుడగు స్వర్గాధిపతిన్
రక్షించెడి వానినిగా దలచుచు రయమున భయమును గూడికొనీ
'ఇంద్రా! యింద్రా! ఓ దేవేంద్రా! యింపుగ నను కాపాడు మిటన్,
మాటిమాటికిని బిలువగ సాగెను మానుగ రాహువు దేవపతిన్! 42

రాహువు నా విధి యఱచుచుండగా రయమున దేవేంద్రుం డపుడున్
పూర్వ పరిచితము స్వరమును వినియును పొంకముగా గుర్తించి మఱిన్
'భయపడకుము', నే నిపుడే యాతని పన్నుగ వధించెదను సుమ్మా!
అనుచు బలికె నా దేవేంద్రుండును నల రాహువుతో ధీరతనూ! 43

అటుబిమ్మట యా హనుమంతుండును నైరావతమును గాంచి మఱిన్
ఇది గూడను నేదో ఘనమైనా యింపుగ ఫలమనుచును మదిన్

భావించియు నా హస్తిరాజమును బరుగెత్తెను నింపుగ బట్టన్!
పాపపుణ్యములు తెలియవుగా మఱి బాల్యమందు పసిపాపలకున్! 44

ఆ విధముగ యా హనుమంతుండును నైరావతమును బట్టుటకై
బోవుచున్న యాతని రూపంబును బొలుపగ యట్టి ముహూర్తమునన్
భయంకరంబును నింద్రాగ్నులవలె బన్నుగ తేజోవంతముగన్
కనబడుచుండెను జూచెడి వారికి కమనీయంబగు రూపమునన్! 45

నాతి క్రుద్ధుడగు నా సురపతియును నయముగ పరుగెత్తుచును మఱిన్
ఈ విధముగ మఱి వచ్చుచున్న యా నింపుగ హనుమంతుని యప్పుడున్
చేతి చివఱి భాగము జేతను మఱి శ్రీకరముగ వజ్రము జేతన్
కొట్టినాడు గద! యా దేవేంద్రుడు కూరిమి మృదువుగ తీవ్రతనూ! 46

ఆ సమయంబున యా హనుమంతుడు నల దేవేంద్రుని వజ్రముచే
కలిగిన ఘాతంబున యాతండును దగ పర్వతమున బడిపోయెన్
పడిపోయిన యా సమయమునందున బన్నుగ హనుమంతునికి మఱిన్
ఎడమ దౌడ మఱి విరిగి పోయెనూ సడిలేకను ధర బడిపోయెన్! 47

వజ్రాఘాతముచే హనుమంతుడు వ్యాకులుడై పర్వత మందున్
పడిపోవగనే స్పృహను దప్పి మఱి బన్నుగ తండ్రియు వాయువునూ
ప్రజలకు కష్టము గలుగు విధముగా బగ సాధింపగ నింద్రునిపై
క్రోధ చూర్ణితుండై పోయెను మఱి గోపమానసుండై పోయెన్! 48

ప్రజల లోపలను నంతర్గతముగ బన్నుగ నుండెడి వాయువునూ
సమర్థుడగు నా వాయువు తదుపరి సంచారంబును నాపుచునూ
శిశువైనట్టి తన కుమారునీ శ్రీకరముగ హృది నెత్తుకొనీ
ఒక పర్వత గుహయందున జేరెను నొనర విరక్తిని జెందుచునూ! 49

ప్రజల యొక్క మల మూత్ర స్థానముల బరగ యడ్డగించుచు నతడున్
బహు బాధను గలిగించుచునుండెను బరగ సకల భూతంబులనూ,
ఇంద్రుడు వర్షము నిరోధించునటు సాంద్రముగా నా వాయువునూ
నిరోధించె ప్రజ మలమూత్రంబుల మానుగ కష్టము గలుగు నటుల్! 50

సకల ప్రపంచమునంతటనూ మఱి సర్వ ప్రాణులా యందుననూ
ఉచ్ఛ్వాసంబులు నాగిపోయినవి యూపిరి సలుపక యందఱునూ
వాయుప్రకోపము వలన కీళ్లనూ వలను దప్పినవి పట్టులునూ
ప్రాణులన్నియును కట్టెలును వలె బన్నుగ నిర్జీవము లయ్యెన్! 51

త్రైలోక్యంబుల సముదాయంబును వాయు ప్రకోపము వలన మఱిన్
స్వాధ్యాయంబును వషట్కారమున సర్వమాగి పోయెను మఱియున్
క్రియలన్నియు మఱి నిలిచిపోయినవి క్రియాధర్మములు లేకుండెన్!
ధర్మాచరణము లేకుండెను మఱి ధార్మికత్వమును నశియించెన్
నయముగ యీ విధి మూడు లోకములు నరకములో నున్నట్లుండెన్! 52

అటుబిమ్మట యా గంధర్వులునూ యా దేవతలునూ, యసురులునూ,
మనుష్యులును మఱి సర్వ ప్రాణులును మానుగ దుఃఖాక్రాంతులునై
సుఖమునందు మఱి కోరిక చేతను సురుచిరముగ బహు వాంఛలతో
ప్రజాపతియునగు బ్రహ్మ యొద్దను బరుగున బోయిరి వివరింపన్! 53

మహోదరునితో సమానమైనా మానుగ యుదరములును గలుగా
అట్టి దేవతలు యంజలి తోడను నల ప్రజాపతిని వేడిరిటుల్
భగవంతుడ, ఓ ప్రజానాథ విను! బన్నుగ నీ చేతను గాదా!
నాలుగు విధములునగు ప్రజలను మఱి నయముగ నీవె సృజించితివీ! 54

ఈ పవనుని మా యాయుష్యమునకు నిల నధిపతిగా నిచ్చితివీ,
ఓ సత్తమ! యీ వాయుదేవతయు నొనరగ ప్రాణంబులకు మఱిన్
అధిపతిగా నుండియు గూడను మఱి యలరి ప్రస్తుతము నెందులకున్
దుఃఖంబును గలిగించుచుండెనూ దూరదృష్టియును లేకుండన్! 55

అంత పురమున స్త్రీలను వలెనూ యలరి నిరోధించుచు మమ్మున్
వ్యధను గలుగ జేయుచునున్నవి ప్రభు! వేదన గలిగించుచు నుండెన్!
వాయువు చేతను బీడింపగబడి యొనరగ నీ కడ కొచ్చితిమీ!
దుఃఖంబులు దొలగించెడి వాడా! శరణు జొచ్చితిమి నిన్నిపుడున్
వాయు నిరోధము వలన గలిగినా వలనొప్పగ యీ దుఃఖమునూ
తొలగింపుము మము రక్షణ సేయుము! దోరముగా మా ప్రాణములన్! 56

ప్రజానాథుడగు ప్రజాపతియునూ, ప్రజావచనముల వినియు మఱిన్
'దీనికొక్క కారణమును గలదూ!' దీరుగ బలుకుచు బ్రహ్మయునూ
మఱల బలికె నీ విధమున వారికి మానుగ సంతాపము దొలగన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 57

ఓ ప్రజలారా! వినుడో దెలిపెద! వనరగ యా వృత్తాంతంబున్
ఏ కారణమున కోపము వచ్చెనొ! ఎందుల కీ విధి వాయువునూ
నిరోధించెనో యంతయు దెలిపెద! నిర్మల భావనను వినుడూ
మీ కందఱకును క్షేమము గలుగును! మేలగు వృత్తాంతంబుననూ! 58

వాయువు మాటలు విని దేవతలకు ప్రభువగు నా యింద్రుండు మఱిన్
వాయుపుత్రుడగు హనుమంతుని మఱి యలరి నేడు బడగొట్టె సుమా!
అందుచేత నా వాయుదేవుడును జందముగా బహు కోపించీ
వాయు నిరోధము కలిగించెను మఱి యొనరగ యీ స్థితి గలిగినదీ! 59

శరీరంబు మఱి లేని వాయువును శరీరమును బాలించుచునూ
ఆ శరీరమున సంచరించుచును నలరుచుండునూ నెల్లపుడున్!
వాయువు లేనిది యీ శరీరమును యొనరగ యొక క్షణముండదుగా
దారువుతోడను సమానత్వమును రహి బొందును భూతల మందున్! 60

వాయువు, ప్రాణము, వాయువు సుఖమును, వాయువు నీ జగమంతయునూ!
నిండియున్నదీ నీరధి యందును నిఖిల జీవకోటుల యందున్
వాయువు జేతను బరిత్యక్తమగు వనరగ యీ జగమంతయునూ
శూన్యముగా గనిపించును ధాత్రియు, సుఖముండదు మఱి ప్రాణులకున్! 61

ఆయుర్దాయ స్వరూపుడైన యా వాయువు జగమును నిపుడిపుడే
విడిచినాడు గద! ప్రాణులన్నియును విమలత గోల్పోయెను మఱియున్
ఇపుడే యుచ్ఛ్వాసంబులు మఱియును నిండుగ నిశ్వాసంబులునూ
గోల్పోయెను మఱి కాష్ఠంబులవలె గోడల వలెనూ యైరి జనుల్! 62

ఆ కారణమున రుద్రప్రదానమును నలరి యిచ్చినా వాయువునూ
ఎచట నుండెనో యచటికి బోదము! నాలస్యము లేకుండగనూ!
ఆ వాయువు యనుగ్రహము లేక మఱి యలరి యుండలే మీ వసుధన్
అతని యనుగ్రహమును లేకను నిట యారోగ్యంబును లేదు సుమా! 63

అటుబిమ్మట యా బ్రహ్మదేవుడును నలరుచు దేవతలను మఱియున్
గంధర్వులతో, సర్పంబులతో నల యక్షాదుల గూడికొనీ
ఇతర ప్రజల నందఱిని కలిపికొని నిమ్ముగ మహేంద్రుజేత మఱిన్
కొట్టబడిన తన సుతుని దీసికొని కూరిమి బోయిన వాయువునూ
జేరుకొనెను నా ప్రజాపతియునూ శీఘ్రము సకల జనంబులతో! 64

అటు బిమ్మట దేవతలతోడనూ యలరెడి గంధర్వుల తోడన్,
యక్ష రాక్షసుల కలిసి వెళ్ళినా యల ప్రజాపతియు నచ్చోటన్!
వాయువు నోడిలో నున్నటువంటి యొనరగ యా పసిబాలుండున్
సూర్యాగ్నియు మఱి సువర్ణములతో సుందర కాంతులు గలిగిన యా
ఆతని కుమారు గాంచి ప్రజాపతి యలరి జాలిపడె నంతటనూ! 65

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ముప్పది యైదవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ముప్పది యాఱవ సర్గము

(బ్రహ్మాది దేవతలు హనుమంతుని మఱల జీవింపజేసి వరములు ప్రసాదించుట, వాయువు హనుమంతుని తీసికొని వెళ్లుట - ఋషుల శాపము చేత హనుమంతుడు తన బలమును మఱచిపోవుట - నేను చేయబోవు యజ్ఞమునకు రావలెను అని ప్రార్థించి రాముడు అగస్త్యాదులను బంపివేయుట)

అటు పిమ్మటనూ పుత్రుని వధచే నట బీడితుడగు వాయువునూ
ఆ పితామహుని యటుల జూచుచును నా పసి పాపడి నెత్తుకొనీ
బ్రహ్మదేవునీ యెదుటను లేచియు బన్నుగ నిలబడె నంతటనూ!
అంజలి తోడుత యా ప్రజాపతిని యారాధించుచు నమ్రతనూ! 1

కదులుచున్న కుండలములు మఱియును కడు శిరోమాల్యములు గలుగా!
బంగరు యలంకరణములు గలిగిన రంగుగ యా వాయువు మఱియున్
బ్రహ్మదేవునకు మూడు సారులును బరగ యుపాస్థానము జేసీ
అతని పాదములపై బడియెను మఱి అలరి నేత్రముల భాష్పములన్! 2

వేదనిదుడు నా బ్రహ్మ దేవుడునూ వ్రేలాడెడి యాభరణములన్
ప్రకాశించెడీ హస్తంబులతో బన్నుగ యా వాయువును మఱిన్
పైకి లేవదీయుచు నోదార్చుచు బన్నుగ సాంత్వన వాక్యములన్
బాలశిశువునూ లేవదీసెనూ బన్నుగ స్వహస్తముల తోడన్! 3

అటు బిమ్మట నా బద్మజన్ముడగు బ్రహ్మదేవుడును నా వెనుకన్
విలాస పూర్వకముగ స్పృశింపబడి విమలుడైన యా శిశువు మఱిన్
జలసిక్తంబగు సస్యంబును వలె కలకల లాడుచు నవ్వుచునూ
మఱల జీవితము నొందెను నాతడు మానుగ పితామహుని కృపచే! 4

ప్రాణస్వరూపుండైన వాయువును బన్నుగ యా శిశువునకు మఱిన్
ప్రాణము మఱలను వచ్చుట గాంచియు బన్నుగ సంతోషముతోడన్

పూర్వమువలె మఱి యన్ని ప్రాణులను బొలుపుగ శరీరమందుండీ
సంచరించెనూ యుచ్ఛ్వాసములను సంచరించె నిశ్వాసములన్! 5

వాయు నిరోధము నుండి ముక్తులై యొనరగ యా ప్రజలును మఱియున్
ఉచ్ఛ్వాసంబుల నిశ్వాసంబుల యురుతర యుల్లాసముతోడన్
శీతవాతముల నుండి ముక్తమై శ్రీకరమగు పద్మంబులతో
నిండినట్టి పద్మముల లతను వలె నిండు శోభతో వర్ధిలిరీ! 6

అటు బిమ్మట యా యశో వీర్యములు నైశ్వర్యము శోభయు మఱియున్
జ్ఞానము వైరాగ్యము నను పేర్లను జంటలు మూడును గలవాడున్
మూడు మూర్తులను శ్రేష్ఠుండును మఱి మూడు లోకముల స్థానంబున్
గలవాడును మఱి త్రిదశార్చితుడును జాలిగలిగినాదేవుండున్
అయిన బ్రహ్మయును నా వాయువునకు నలరు సంతసము గలిగింపన్
కూరిమి తోడను యల దివిజులతో గూరిమి యీ విధముగ బలికెన్! 7

ఓ మహేంద్ర! ఓ అగ్నీ! వరుణా! ఓ కుబేర! ఓ మహేశ్వరా!
మీ కందఱకును దెలిసిన విషయము! మీ కందఱకును బరిచయమే!
ఈ విషయము దెలిసినదే యయినను నింపుగ దెలిపెద మీకు మఱిన్
మీకు దెలుపు విషయంబును వినుడీ! మీకు దెలుపు హితమును వినుడో! 8

ఈ శిశువును మున్ముందు మీ పనులు మీ కార్యంబులు జేయు మఱిన్
మీ కార్యంబులు సాధించుటకై మీరిన శక్తియు గావలయున్
అందువలన మఱి వాయుదేవునకు యలరి సంతసము గలిగింపన్
మీరందఱునూ బాలుని కిప్పుడు మిగుల వరములను నీయవలెన్! 9

అటు పిమ్మటనూ శుభావహుండును, నలరు వేయి నేత్రంబులునూ
గలవాడును మఱి ప్రేమ తోడుతను గూడినవాడై యాతండున్
బంగరు పద్మ వికారమైన యా రంగుగ మాలను యెత్తిమఱిన్
బాలునికిచ్చుచు నిటులను బలికెను బన్నుగ దీవించుచు మఱియున్! 10

ఇతని దౌడ నే ప్రయోగించినా నింపగు వజ్రముచేత మఱిన్
కొట్టబడినదీ అందుచేత మఱి కూరిమి యా వానరుకు మఱిన్

హనుమంతుండును ప్రసిద్ధ నామము నలరు నింక లోకంబుననూ
అంతియగాకను మఱి యొక వరమును మంతనమున నే నిచ్చెదనూ! 11.

ఈ వరంబు బహు నద్భుతమైనది నాశ్చర్యము గలిగించునదీ
నా వజ్రము బహు నమోఘమైనది నయముగ యెదురును లేదు మఱి
ఇటుపై నీతడు నా వజ్రముచే నింపుగ మరణింపడు నింకన్
నా వజ్రముచే బాధ నొందడూ! నయముగ నొందడు బంధనమున్! 12

భగవంతుడు తిమిరాపహుండునూ బన్నుగ మార్తాండుడు బలికెన్!
నా సంబంధమునైన తేజమును నయముగ నూఱవ వంతు మఱిన్
ఈ హనుమంతుని కిచ్చెద నిపుడే నింపుగ వినుడో! దేవతలున్
వర్ధిలు గాతను! బహు తేజమునను వంది మాగధులు కీర్తింపన్! 13

శాస్త్రములను నధ్యయనముజేయగ సమయమెపుడు వచ్చునా యపుడున్
శాస్త్రములను నే నేర్పెద నప్పుడు సరిసమానముగ యగు నితడున్
అందుచేత మాటలలో నేర్పరి యెందును బొరపడ డీతండున్
శాస్త్రజ్ఞానమునందు నతనికి సమాను డెవ్వడు లేకుండున్! 14

ఆ సమయంబున వరుణుడు గూడను నలరి ప్రసాదించెను వరమున్
పదిలక్షల వర్షములకు గూడను బరగ నాదు పాశము జేతన్
మృత్యువు గలుగదు జలముల జేతను మృత్యువు రాదు సుమా నితడున్
అజరామరుడుగ నుండు నెపుడునూ యతి హరిభక్తిని గూడికొనీ! 15

అల యముండునూ సంతోషించుచు నల తన దండము జేత మఱిన్
చావులేకపోవుటయును మఱియును దగ రోగము రాకుండటయున్
అల యుద్ధంబున యవిషాదంబును నలరు మూడు వరముల నేనున్
నిచ్చుచుంటినీ యీ హనుమంతుడు స్వచ్ఛముగా బలుకుట గూడన్! 16

ఏకాక్షి పింగలుడా కుబేరుడును నా సమయంబున నిటు బలికెన్
నాగద యెపుడును నితనిని జంపదు నయముగ యుద్ధములందుననూ! 17

ఇతడు నాదు యాయుధముల జేతను నా చేతను జంపగ బడడూ!
అపుడు శివుడు గూడను నాతనికి యలరుచు వరమును నవు డిచ్చెన్ 18

మహాబలుడు శిల్పులలో శ్రేష్ఠుడు మహాబుద్ధి గలవాడు మఱిన్
అయినయట్టి యా విశ్వకర్మయును నల బాలుని యా హనుమంతున్
గాంచి యతని కొక వరమును నిచ్చెను కమనీయంబగు జూపులతో! 19

నే తయారు జేసిన యస్త్రములను నే దివ్యాస్త్రములను గానీ
చంపగ శక్యము గానివాడునూ సరి దీర్ఘాయుర్దాయముతో
చిరకాలము జీవింపగ గలడూ చేతోమోదము తోడుతనూ! 20

బ్రహ్మదేవుడును నొక వర మిచ్చెను బన్నుగ బాలుని గాంచుచునూ
ఎట్టి బ్రహ్మదండము జేతను మఱి యిట్టె నీరసుండగుటయునూ
చంపబడడు! మఱి మృత్యువు నందడు వంపబడడు వేరెవ్వరిచే
అనుచు బ్రహ్మయును వరమును నిచ్చెను నలరుచు బాలుని గాంచుచునూ! 21

అటుబిమ్మట దేవతల వరములను నలంకృతుండగు హనుమంతున్
గాంచి జగద్గురు వైనట్టియునూ చతుర్ముఖుడు సంతసమందీ,
వాయువుతోడను నీవిధి బలికెను యొనరగ మందస్మితుడునునై!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 22

ఓ వాయువ! నీ కుమారుండునూ యొనరగ యీ హనుంతుండున్
శత్రువులకు మఱి భయంకరుండును, మిత్రులకును నభయంకరుడున్
భవిష్యత్తులో కాగలడు సుమా! కమ్మని యాలోచన గలిగీ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 23

ఎగురువారిలో శ్రేష్ఠుం డీతడు యెదిరి లేదు మఱి యెవ్వరునూ
కామరూపమును గలవా డీతడు కామచారి మఱి యీతండున్
సంచరించు నిష్టానుసారమును సహజశక్తి గలుగుచు నితడున్
అడ్డుకొనబడని గమనము గలిగీ నలరుచుండు భావిని యితడున్
మహాకీర్తిమంతుడు నగును సుమ! మఱువని వాడగు నెల్లటికిన్ ! 24

సంయుగ మందున యీ హనుమంతుడు సాహసకార్యములును జేయున్
రావణాసురుని వినాశమునకును రయముగ హేతువులగు పనులన్, 25

రాముని కును నానందకరములును నాశ్చర్యములును నగు బనులన్
జేయగలడు నీ హనుమంతుండును శ్రీరాముని కును సంప్రీతిన్! 25

బ్రహ్మ దేవుడును-దిక్పాలకులును బన్నుగ వాయువుతో బలికీ
అతని యనుమతిని తీసుకొనీ మఱి అలరి పోయెదము నని బలికీ
ఏ విధముగ వచ్చినవారో మఱి యా విధముగనే యందఱునూ
హనుమంతుని యాశీర్వదించి మఱి యలరి పోయిరీ గృహములకున్! 26

గంధవహుడు గూడను వేవెంటను వింధ్యగిరికి మఱి సమానుడున్
ఆ హనుమంతుని యలరి యెత్తుకొని యంజన యొద్దకు బోయి మఱిన్,
లభియించిన యా వరముల గూరిచి రహి యా యంజనకును దెలిపీ,
సంతోషించుచు వెడలిపోయెనూ సహజసేవలను గూర్చుటకై! 27

రామా! యీ హనుమంతుడు గూడను రమ్యముగా వరముల నందీ
వరదానంబుల గలిగన బలమును, వనర సహజబలమును గూడీ
సముద్రమును వలె తనలో నున్నా సహజవేగమును గూడికొనీ
జలసమృద్ధమగు భాండము వలెనూ సహజముగా నుండెను నతడున్! 28

ఆ సమయంబున బలము తోడనూ యమల వేగమును గలవాడై
ఆ హనుమంతుడు బాల్య చేష్టలను బన్నుగ గలవాడగుచు మఱిన్
మునుల మహర్షుల యాశ్రమములలో మోదముతో నవ్వులతోడన్
అపరాధములను జేయుచుండెనూ యరత తెలివిడితో నాతండున్! 29

యజ్ఞ సాధనములైన స్రుక్కులను నల పాత్రములను భాండములన్
అగ్ని హోత్రముల నారబట్టలను నటనుండెడి దర్భలగూడన్
భగ్నము జేయుచు విచ్ఛిన్నముగా బరగజేయుచును ధ్వంసముగన్
నశింపజేయుచు నుండెను నాతడు రహి కపి చర్యల సహజముగా! 30

ఎట్టి బ్రహ్మదండము జేతను మఱి యిట్టి మరణమును లేకుండన్
వరమును బొందిన యా హనుమంతుడు యొనరగ యీషణ్మాత్రంబున్
భయంబు లేనీ యీ హనుమంతుడు బన్నుగ కపి చేష్టల చేతన్
ఈ విధమైనా పనులను జేసెను నింపుగ మదిని హసించుచునూ! 31

సమస్తమైనా ఋషులందఱునూ సహజ శక్తినీ దెలిసి మఱిన్
ఆ హనుమంతుడు జేసెడి పనులను నలరి సహించుచు నుండిరటన్
తల్లియైన యంజన దేవియునూ తండ్రులు కేసరి, వాయువునూ
నిషేధించినను గూడ నాతడును నిలుపడు! నాపడు! చేష్టలనూ
బాలుడగుటచే కపియు నగుటచే బరగ చిలిపి చేష్టల నుండెన్! 32

అటు బిమ్మట యా భృంగ్వంగీరస యలరి జనించిన ఋషిమునులున్
గోపించిరి ఓ రఘురామా విను! కూరిమి ప్రేముడితో గూడన్!
కానీ మిక్కలి కోపముగానీ కనికరంబు పగయును కానీ,
లేని వారలై యా హనుమంతుని లీలగ శపించి రాతనినీ! 33

వానర! నీ వే బలము జూచుకొని వనరగ మము నీ విధముగనూ
బాధలు బెట్టుచు నున్నావో మఱి బలము చాల కాలము వఱకున్
నీకు మాదు శాపంబుచేత మఱి నిశ్చయముగా తెలియదు గాతన్!
నీ కీర్తిని మఱి స్మరింప జేతురొ నీ బలమప్పుడు పెంపొందున్! 34,35

అట్టి సమయమున ఋషి వాక్యంబుల యలర ప్రభావము జేత మఱిన్
తేజో బలములు నణగి పోయెనూ తీరుగ యా హనుమంతునకున్
మెత్తదనంబును, సాధు బావమును చిత్తము నందున దొలికె మఱిన్
ఆశ్రమమందున సంచరించెనూ యందు చంటిపాపను వోలెన్! 36

మఱియొక విషయం బేమనగా మఱి మానుగ తేజస్సుల జేతన్
సూర్యుని వంటీ వాడు నాతడును సురుచిరముగ ఋక్షారజసూ!
ఆ వాలీ సుగ్రీవుల తండ్రియు నఖిల వానరులకును ప్రభువున్
కిష్కింధకు మఱి రాజు నాతడును క్రీడగ రాజ్యము బాలించున్! 37

ఋక్ష రజస్సను పేరు గలిగినా యా వానర రాజును మఱియున్
వానరగుంపును మహేశ్వరుండును వనరగ రాజ్యము బాలించీ
అటుబిమ్మట యా ఋక్ష రజస్సును నలరి కాలధర్మము నందెన్!
ఎంతటి వారలకైన మృత్యువును సుంత వదలదూ దయ దలచీ! 38

ఋక్ష రజిస్సును నస్తమింపగా రూఢిగ యాతని స్థానమునన్
అటుబిమ్మట యా మంత్ర కోవిదులు మానుగ యాలోచించి మఱిన్
తండ్రి స్థానమున వాలిని యుంచిరి దగ రాజ్యంబును బాలింపన్
వాలి స్థానమున యా సుగ్రీవుని వనరగ జేసిరి యువరాజున్! 39

బాల్యము నుండియు యా వాలికిని బన్నుగ సుగ్రీవుని తోడన్
భేదభావమును కపటము లేని సోదర భావంబును నుండెన్
అగ్నితోడుతను వాయువులనటు వలె నలరు స్నేహ భావము నుండెన్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 40

రామా! విను! యా సోదరులకు మఱి రహి వాలీ సుగ్రీవులకున్
వైరభావమును నేర్పడి నప్పుడు వనరగ యా హనుమంతునకున్
తన బలమేమో తనకు దెలియకను తగ్గియుండె దన స్థానమునన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 41

ప్రభువగు రామా! వాలిచేత మఱి పన్నుగ తరుమగ బడుచున్నా
సుగ్రీవునకును  కూడ తెలియదూ సురుచిరముగ హనుమానునికిన్
ఎంత బలము గలదో మఱి తెలియదు సుంత దెలిసినా బాగుండున్!
తన బలమెంతో హనుమంతునకును దగ తెలియదు శాపము జేతన్! 42

ఆనా డిచ్చిన మునుల శాపమున హరింపబడినా బలంబుచే
ఆ వానర శ్రేష్ఠుడు హనుమంతుడు నలరగ యేనుగుజేత మఱిన్
సింహము బంధింపగ బడినట్లుగ జేరక వారల యుద్ధమునన్
సుగ్రీవునితో నిలిచిపోయె మఱి శూరుడు వాలిని గలియకనూ! 43

పరాక్రమము, నుత్సాహము, బుద్ధియు, ప్రతాపంబు గల స్వభావమున్
మాధుర్యము మఱి మంచితనంబును మానుగ నీతి యనీతులయున్
జ్ఞానంబును మఱి గాంభీర్యమును నేర్పు, ధైర్యమును, ఘన బలమున్
ఇట్టి గుణంబులు గలిగినట్టి యా గట్టి మనసు హనుమంతునికిన్
ఈ లోకమునను సమానుడెవ్వరు నింపుగ గలడా! యెవరైనా? 44

అప్రమేయుడగు నా హనుమంతుడు నల వ్యాకరణము నేర్చుటకై
మహా వ్యాకరణ గ్రంథము గ్రహించి యల సూర్యునకును నభిముఖుడై

ఆ సూర్యుని మఱి యడుగుట కొఱకై యటు నుదయాద్రిని మొదలుకొనీ
అస్తాద్రిని మఱి జేరు వఱకునూ యల ప్రయాణమును దా జేసెన్! 45

( ఈ 46వ శ్లోకము ప్రాచ్యప్రతిలో లేదని కొందఱి భావన)

వానర శ్రేష్ఠుండైన కపీంద్రుడు వనరగ పాణిని రచించినా
అష్టాధ్యాయీ యను వ్యాకరణము నలరు సూత్రముల తోని మఱిన్
వాని యొక్క వ్యాఖ్యల తోనీ వఱి వనరగ వార్తికముల తోడన్!
సంగ్రహంబు దోడను గూడిన యా సరస మహాభాష్యంబు మఱిన్
ధరించినాడూ యంతేగాకయు సహజ శాస్త్ర పాండిత్యమునన్
ఛందశ్శాస్త్ర సురీతి యందునూ సరసత యీతని సమానుడున్
లేనేలేడని విజ్ఞులు బలికిరి లీలగాదు దృఢ నిశ్చయమున్! 46

(ప్రాచ్యప్రతులు మొదలైన వాటిలో నీ శ్లోకము లేదు)

కపి శ్రేష్ఠుండగు నీ హనుమంతుడు గల విద్యల నన్నిటిలోనూ
తపశ్చర్య యందునను గూడనూ తగ సురగురువగు బృహస్పతిన్
ప్రతిస్పర్ధను జేయుచును నుండెనూ బన్నుగ లోకోత్తరుడును నై
నవ్య వ్యాకరణ తత్త్వవేత్తయును నయముగ నీతడు నీకరుణన్
రాబోయెడి కల్పంబు నందునను రహి బ్రహ్మయు గాగలడు సుమా! 47

భూమి నంతయును ముంచెత్తగనూ మఱియు సముద్రమునకు బోలెన్
లోకాలన్నియు గాల్చివేయగా లోలత దలచిన యగ్నివలెన్
ప్రళయ కాలమున యగ్నికి బోలెను ప్రభలు జిమ్ము జ్వాలల వోలెన్
యమునకు వలెను హనుమంతునకును ఎవడు యెదుట నిలువగ బడునూ? 48

శ్రీ రఘురామా! వినుమా తెలిపెద! చిత్తము హర్షము దొలుకగనూ
ఈ హనుమంతుని వలె సుగ్రీవుడు మైందుడు, ద్వివిదుడు, నలుండుడున్
తారుడు మఱియును నంగదుండను దగ నలుండు రంభుడు మఱియున్
ఇతరులైన వానర వీరులునూ నింపుగ నీకు సహాయమునూ
చేయుట కొఱకే సృజింప బడిరీ శ్రీకరముగ దివిజుల చేతన్! 49

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
గయుడు, గవాక్షుడు, గవయుండును మఱి సుదంష్ట్రుండు మైందుండు మఱిన్
జ్యోతి ముఖుండును నలులను పేరున ప్రీతిని భల్లూకంబులనూ
వానర నాయకులను నీ కొఱకే వనరగ సృజియింపగ బడిరీ
ధరింపబడిరీ నీ సాయమునకు దగ సేవలు సేయగ యనిలో
శిష్ట రక్షణము దుష్టశిక్షణము సేయగ భూతలమందుననూ! 50

నను ప్రశ్నించిన విషయములన్నియు నయముగ తెలిపితి రఘురామా!
పూస గ్రుచ్చినటు నన్నియు దెలిపితి బొలుపుగ నింతయు దాపకనూ
ఆ హనుమంతుని బాల భావమున నంతయు జరిగిన విషయములన్
విశదముగా నే విన్నవించితిని విమలమైన వృత్తాంతంబున్! 51

అగస్త్యముని చెప్పిన వృత్తాంతము నంతయు విని శ్రీరాముడునూ
లక్ష్మణుండునూ వానరు లందఱు రాక్షసులును గూడను నచటన్
లాలితమగు నా వృత్తాంతము విని లావుగ యాశ్చర్యము నందీ
ఎంత జెప్పినా దరుగనికథలని భ్రాంతి నొందిరీ వారలునూ! 52

ఆ యగస్త్యుడును శ్రీరామునితో నలరుచు బలికెను నీ విధమున్
మేము తెలిపినా వృత్తాంతములను మేదుర భావముతో నీవున్
విని యుంటివిగద! వేడుకతో మఱి విమల భావములు దొలుకొడన్!
కంటిమి! నీతో భాషించితిమి! యింటికి బోయెద మే మిపుడున్! 53

ఆ సమయంబున రాఘవుండునూ యలరు నుగ్ర తేజము గలుగూ!
ఆ యగస్త్యునీ వచనంబుల విని యలరి ప్రాంజలిని గూడికొనీ
నమస్కరించుచు రామచంద్రుడును నయముగ యాముని తోడుతనూ
బలికె నిట్టులను భవ్య భావమున బన్నుగ మధురాక్షరములతో! 54

నేడు దేవతలు, పితృదేవతలు, నిశ్చయముగ నా పితామహుల్
సంతోషంబును బొందిరి వారలు వింతలేదు నా మాటలలో
మీ మహోన్నతపు దర్శనంబునూ మిక్కిలి మేమందఱము నిటన్
సంతోషంబున నుంటి మిచ్చటను సత్కృతి మాపై జూపితివీ! 55

భగవంతుడ! నే యీ సమయంబున బన్నుగ నే నొక విజ్ఞప్తిన్
జేయుచుంటినీ, కృపతో మీరును శ్రీకరముగ వినవలయు సుమా!
కోరికతో నే నడుగు దానినీ కూరిమితో జేయగ వలయున్
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 56

పౌరులనూ, మఱి జానపదులునూ బన్నుగ వారల పనులందున్
నియమించియు నే తిరిగి వచ్చెదను నిశ్చయముగ మీ వద్దకునూ!
సత్పురుషులునగు మీ ప్రభావమున సరసత క్రతువులు జేసెదనూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 57

మహా తపోబల సంపన్నులునగు మానుగ మీరలు నెల్లపుడున్
నా యందున దయగలిగి యుండవలె నయముగ ప్రీతిని జూపుచునూ
నేను జేయబోయెడి యజ్ఞములను నిండు ననుగ్రహమునను గూడీ
సదస్యులై మీ రెల్లప్పుడునూ శాంతి గలుగ జేతురు గాతన్! 58

అందుచేత మీ రందఱునూ మఱి చందముగా గలియుచు నిటుకున్
ఎల్లప్పుడునూ వచ్చుచు బోవుచు నిల్లనుకొనవలె నా గృహమున్
అటుల బలుకగను రామచంద్రుడును నగస్త్యాది మును లందఱునూ!
'అట్లే' యగునని బలుకుచు మునులును నాశీర్వాదము జేసి మఱిన్
వచ్చిన విధమున తిరిగి పోయిరీ వనరగ తమ స్థానంబులకున్! 59

రాఘవుండునూ విస్మితుండునై రయముగ యీ విషయంబులనే
మనసునందు మఱి యాలోచించుచు మధురముగా నా పిమ్మటనూ
భాస్కరుండు మఱి యస్తాచలమున బన్ను గ బోవుచు నుండగనూ
నరోత్తముండగు రామచంద్రుడును నయముగ రాజుల వానరులన్
విడచుచు సంధ్యను నుపాసించుచును విమలమైన రాత్రియు నపుడున్
ప్రవేశింపగా రామచంద్రుడును బన్నుగ యంత పురమందున్
సంచరించు వాడగు చుండెను మఱి సహజమైనో బడలిక తోడన్! 60

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ముప్పది యాఱవ సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము ప్రథమ సంపుటము

# ముప్పది యేడవ సర్గము

(రాముడు సదస్యులతో గూడి రాజసభను అలంకరించుట)

ధర్మముచేతను విదితాత్ముండగు ధార్మికుడగు శ్రీరాముడునూ
కోసల దేశంబునకు నాతడును గూరిమి యభిషిక్తుండునునై
తదుపరి పౌరుల సంతోషంబును బన్నుగ వృద్ధిని బొందించూ
మొదటి రాత్రియును గడిచిపోయినది మోదముగా ప్రజకందఱికిన్ 1

ఆ రాత్రియు దెలవారుచుండగా నలరునట్టి శుభసమయమునన్
నృపతి బోధకులు సౌమ్యవంతులును నేపథ్యమునను విచ్చేసీ!
రాజ ప్రసాదమునకును వచ్చిరి నయముగ రాజును మేల్కొలుపన్
కర్తవ్యంబులు బోధ సేయుటకు కమ్మని సంగీతము తోడన్! 2

మధురమైన కంఠము గలవారును మామగ చక్కగ నేర్చిన యా
కిన్నరలకు వలె నుండినట్టి యా కీర్తనలను బాడెడి వారున్
సంతోషంబును గలవారందఱు చక్కని కంఠము నెత్తి మఱిన్
వీరులైన యా మహారాజునూ విమలముగా స్తుతియించి రిటుల్! 3

ఓ వీరా! ఓ సౌమ్యా! లెమ్మా! నింపుగ తెలవారుచు నుండెన్
కౌసల్యకు ఆనందము గూర్చెడి కనక కల్ప! రామా! లెమ్మా!
నీవు నిద్రనూ మునిగినచో మఱి నిఖిలము నిద్రను బొందుగదా!
నీ చైతన్యమె జగతికంతకును నిర్మల చైతన్యము గలుగున్! 4

నీ పరాక్రమము విష్ణుదేవునీ నిర్మల విక్రమమును బోలెన్
సరితూగును నీ రూపము గూడను సరి యశ్విని దేవతలకునూ!
సరితూగును మఱి బుద్ధి చేతనూ సామ్యంబగును బృహస్పతితో!
ప్రజాపతికి బోలెడి వాడవునూ ప్రజాపాలనా దక్షుడవున్! 5

నీదు నోర్పు పృథ్వీతుల్యంబును నిర్మల తేజస్సుల గూడీ
భాస్కరుతోడను సమానుండవును బన్నుగ నీ వేగము మఱియున్

వాయువుతోడను సమానమైనది యొనరగ గాంభీర్యము మఱియున్
సముద్ర గాంభీర్యము వంటిది గద సకల బాధలను దొలగింపన్! 6

శివుని వోలె మఱి కదల్ప శక్యము కాని వాడవును శ్రీరామా!
నీలో నుండిన సౌమ్యత్వము మఱి నిర్మలముగా శశిలో నుండున్
మహారాజ! నీ వంటి పార్థివులు మానుగ పూర్వమునను లేరూ!
ముమ్ముందును మఱి పుట్టబోరుగా మోదముగా నీ లోకమునన్! 7

పురుషశ్రేష్ఠుడ రామా! లెమ్మా! బొలుపుగ తెలతెల వారినదీ!
దుర్ధర్షుండవు రామచంద్ర! మఱి దూరదర్శివియు నీవు కదా!
ధర్మ నిత్యుడవు! ప్రజాహితుండవు దగ మృత్యు నిరోధకుడువునూ!
కీర్తియు మఱి నిను విడుచుట లేదూ! విడుచుట లేదూ లక్ష్మియునూ! 8

రామా! నీ యందున లక్ష్మియునూ స్థిరముగ ధర్మము నీయందున్
నిలిచి యున్న వనుచును వందులునూ నిర్మలముగ బోధించి రటన్!
వందులు నీ విధి స్తుతులను జేసిరి మానుగ మఱి కొన్నింటి మఱిన్
స్తుతులను జేసిరి సురుచిరముగనూ స్తుతి గీతములను బాడిరటన్! 9

సూతులు గూడను దివ్య స్తుతులతో శుద్ధమైన మధురోక్తులతో
రామచంద్రునీ మేలుకొలుపుచును రమ్యముగా బాడిరి యపుడున్
ఈ విధముగనూ వందులు సూతులు నింపుగ స్తుతులను జేయగనూ!
రామచంద్రుడును మేల్కొనె నపుడును రమ్య ప్రభాతమునకు ముందున్! 10

అట్టి సమయమున రామచంద్రుడును నిట్టె తెల్లనీ వస్త్రముచే
కప్పబడిన యా శయనము వీడి నొప్పుగ శేషుని శయనమునూ
సర్వ పాప హరుడైన విష్ణువును జక్కగ లేచిన యట్లుగనూ!
లేచెను శ్రీ రఘు రామచంద్రుడును లీలగ చిలుకల గాంచుచునూ! 11

రాముడు నిదురను లేచుచుండగా రయమున బరిచారకులును నపుడున్
వినయముతోడను నంజలి ఘటించి విమల నమస్కృతులను గూడీ
పాత్రలతోడను నీరము దెచ్చీ బన్నుగ యతని సమీపమునన్
నిలబడి రంతట పరిచారకులును నిర్మల భావము దొలుకాడన్! 12

అటు బిమ్మట యా రామచంద్రుడును నలరుచు స్నానము జేసి మఱిన్!
పవిత్రుడై తగు కాలమునందున బరగ యగ్ని హోమముజేసీ

శీఘ్రముగా నిక్ష్వాకు సేవితము నింపుగ దేవాలయమందున్
సేవింపగ యా మహావిష్ణువును స్థిరముగ మనసున ధ్యానింపన్! 13

రామచంద్రుడును నచటి దేవతల రయమున పితృ సుదేవతలన్
బ్రాహ్మణులను మఱి యథా శాస్త్రముగ బన్నుగ యర్చన జేసి మఱిన్
జనముగూడి పరిజనము దోడుతను బన్నుగ వెలుపలి వాకిలికిన్
వచ్చెను రాముడు నంజలి తోడుత వచ్చిన వారిని దర్శింపన్! 14

పురోహితులు మఱి మహాత్ములైనా మంత్రులు గూడను నగ్నులకున్
సమానులైనా వశిష్ఠాదులును చక్కగ యాదర పూర్వకమున్
రామచంద్రునీ ప్రక్కను జేరిరి రమ్యాశీస్సుల గూడికొనీ
యాశీనులునై యతని పార్శ్వమున నంతయు గనుచుండిరి వారున్ 15

నానా జనపద యీశ్వరులైనా నయముగ క్షత్రియులును మఱియున్
మహాత్ములును మఱి వచ్చి జేరిరీ మఱి శ్రీరాముని ప్రక్కకునూ!
శక్రుని పార్శ్వమునందు దేవతలు చారు శోభ గూర్చొనిన యటుల్
రామచంద్రునీ ప్రక్కను వారును రమ్యముగా గూర్చుండిరటన్! 16

అచ్చట భరతుడు లక్ష్మణుండును మచ్చిక కీర్తియు గలవారున్
ఆ శత్రుఘ్నుడు గూరుచుండెనూ యలరుచు శ్రీరాముని ప్రక్కన్
మూడు వేదములు యజ్ఞంబును మఱి మురిపెముగా గూడిన యట్లున్
ఆ శ్రీరాముని యుపాసించిరీ నంతట శాంతియు నెలకొనగన్! 17

కింకరు లంతట యంజలి తోడుత వంకర భావములను విడిచీ
సంతోషించిన వారగుచును మఱి శాంతముతోడుత ప్రక్కకునూ
పోయి నిలిచిరీ ముదితులు కొందఱు మోదముతో పార్శ్వంబుననూ
నిలుచు వారలను దగ్గఱ జేరీ నిర్మల మదినీ గూర్చొనిరీ 18

మహా విక్రమము తేజస్సును గల మానుగ స్వేచ్ఛా రూపంబున్
ధరించి సుగ్రీవుని తోడుతనూ దగ మఱి యిరువది మంది కపుల్
ఆ రామునకును సమీపంబునను నలరి గూర్చొనిరి వినయమునన్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 19

నలుగురు రాక్షసులను గూడికొనియు నయముగ విభీషణుండపుడున్
యక్షుండును మఱి కుబేరు వద్దను నలర గూర్చొనిన యట్లుగనూ

మహాత్ముడైనా రాముని ప్రక్కను మానుగ గూర్చుండెను నపుడున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 20

సమాజములలో సంఘములందున సహజముగా పెద్దలును మఱిన్
లలిత కళలలో నేర్పరులైనా లాలిత కళాకుశలురు మఱియున్
సత్కులమందున జన్మించిన యా సంపత్కళా కుమారులునూ
శ్రీరామునకును నమస్కరించీ చిత్తము హర్షము రంజిలగా
ఉపాసించు చుండిరి వారలునూ యురుతర భక్తి ప్రపత్తులతో! 21

అల దేవేంద్రుని చుట్టును మునులును నల ఋషులును నున్నట్లుగనూ!
రాముని చుట్టును తేజోవంతులు రయముగా నుత్తములైనట్టీ
మునులతోని మఱి ఋషులతోడనూ మహా వీర్యమును గలిగిన యా
రాజులతోడను, కవులతోడనూ రయమున విక్రమ వీరులతో
ఆశీనుండై యుండెను రాముడు యగణిత భాస్కర తేజమునన్!
రూపసంపదను రామచంద్రుడును రూఢిగ దేవేంద్రుని కంటెన్
ప్రకాశించు చుండెను నధికముగా భాస్కర చంద్ర సుకాంతులతో! 22, 23

వారందఱు నట గూర్చొని యుండగ వారందఱికిని మహాత్ములున్
పురాణములు దెలిసిన మహాత్ములును బూనికతో వారందఱికిన్
మధురములును మఱి ధర్మబోధకము మానుగ యితి హాసములైనా
ఆయా కథలును జెప్పుచుండిరీ యమృత వాహినియు ప్రవహింపన్! 24

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ముప్పది యేడవ సర్గము సమాప్తము

(ఇటుపైన అగస్త్యుడు రామునకు వాలి సుగ్రీవ వృత్తాంతాదులు చెప్పినట్లు ఐదు సర్గలు ఉన్నవి. ఇవి అసంగతములనీ ప్రక్షిప్త సర్గలనీ, వ్యాఖ్యాతలు వీనికి వ్యాఖ్యానములు వ్రాయలేదనీ పరిమళ పబ్లికేషన్సు వారు తమ వ్యాఖ్యాత్రయములో రామాయణ సంపాదకులు వ్రాసినారు)



## శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము ప్రథమ సంపుటము
## ఇది ప్రథమ నిక్షిప్త సర్గము

(బ్రహ్మదేవుని కన్నీటి నుండి ఋక్ష రజస్సు అను వానరుడు బుట్టుట
ఒక సరస్సులో మునుగగానే యతడు స్త్రీయగుట ఆమెను గాంచి మోహించిన
ఇంద్ర సూర్యుల ద్వారా వాలి సుగ్రీవులు జన్మించుట, ఋక్ష రజస్సును
బ్రహ్మదేవుడు కిష్కింధలో వానర రాజుగా జేయుట)

రాఘవుండు నిఖిలంబును వినియును రయమున యగస్త్యుతో ననియెన్
ఋక్ష రజస్సును బేరుగలిగినా రూఢిగ నాతండును మఱియున్
వాలి సుగ్రీవుల తండ్రికదా మఱి వనరగ తెలిసెను మాకు మతిన్,
వారల యుత్పత్తికి స్థానంబును వారల తల్లియు నెవరు మతిన్?
వాలియు మఱి సుగ్రీవుల పేరులు వనరగ వారికి యెటువచ్చెన్?
ఓ బ్రాహ్మణుడా! దీని నంతయును వరుసగ తెలుపుము మాకు మతిన్?
విన వేడుకగా నున్నది మాకును విన్నవింప వలయును మాకున్
గడిచిన దంతయు దెలియును మీకును గడు విచిత్ర వృత్తాంతంబున్! 1,2

ఆ రాఘవుచే నటుల పలుకబడి యా యగస్త్యుడును సంప్రీతిన్
శ్రీరామునితో నిటులను బలికెను చిత్తము సంక్షోభింపగనూ!
పూర్వము జరిగిన వృత్తాంతంబును బొలుపుగ దెలిపెద నీకు మతిన్
నాకును మఱియొక ప్రముఖ వ్యక్తియును నయముగ తెలిపెను శ్రీరామా! 3

నా యాశ్రమమును, నను జూచుటకును నయముగ వచ్చెను ఒక నాడున్
నారదుండు నాకీ వృత్తాంతము నయముగ తెలిపెను చిత్రముగా
లోకము నంతయు సంచరించుచును లోలత నా యాశ్రమమునకున్
అతిథిగ వచ్చెను హరి కీర్తనతో నలరి వచ్చె భగవద్భక్తిన్! 4

శాస్త్రోక్తంబగు ప్రకారంబునను సకల విధములను పూజించీ
అతిథి పూజలను జేసిన పిమ్మట యర్చించిన తరువాత మతిన్
నా చేతను ప్రశ్నింప బడుచునూ నయముగ స్మృతికిని దెచ్చుకొనీ
ఓ ముని చంద్రమ! ఓ యగస్త్యుడా! యెనరగ తెలిపెద విశదముగా!

వాలి సుగ్రీవుల వృత్తాంతంబును వరుసగ సంక్షిప్తముగానూ!
తెలుపుచుంటి మఱి సంగ్రహముగనూ దీరుగ తెలిపెద నీకు మఱిన్! 5,6

శోభాయుక్తము, సువర్ణ మయమును సుందరమగు నొక నగధరమున్
మేఱు పర్వతంబనునది గలదూ మేదిని యందున సుభతరమున్
మధ్యమ శిఖరము సురల చేత మఱి యారాధింపగ బడుచుండున్
దాని మీద శత యోజనంబులా దగ విస్తారము గల యట్టీ
బ్రహ్మదేవునికి సంబంధించిన భవ్య రమ్యమగు సభగలదూ
పద్మమునుండీ పుట్టినట్టి యా బరగ చతుర్ముఖు డైనట్టీ
బ్రహ్మదేవుడును పరివారముతో బన్నుగ నుండును నా సభలో! 7,8

బ్రహ్మదేవుడును యోగాభ్యాసము బన్నుగ జేయుచు నుండగనూ
అతని నేత్రముల నుండి జలంబును నలరి స్రవించెను నా క్షణమున్
ఆ బ్రహ్మయునూ యా జలంబులను నలరి గ్రహించియు హస్తమునన్
నేలమీద వ్రాసెను నాతండును నిశ్చలమగు మనసును గూడీ! 9

రఘురామా! కన్నీటి బిందువును రయమున లోక సుస్రష్టయునూ
బ్రహ్మదేవుడును నశ్రుకణంబును బన్నుగ ధాత్రిని యుంపగనే
అశ్రు కణంబును బుట్టె వానరుడు నాలస్యము లేకుండగనూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 10

నరోత్తమా! శ్రీరామా వినుమా! నయముగ నా వచనంబులనూ
అశ్రుకణంబున యా వానరుడును నలరి పుట్టగనె బ్రహ్మయునూ
మంచి మాటలను బుజ్జగించుచును మానుగ మధుర సువాక్యములన్
ఆ వానరుతో నిటుల బలికె నట యాప్యాయత మది దొలుకగనూ! 11

వానర శ్రేష్ఠుడ! ఎల్లప్పుడునూ వనరగ దేవ గణంబులచే
అధ్యుషితంబును సువిస్తీర్ణమును నలరి గాంచు నా పర్వతమున్
రమ్య శ్రేయమగు నీ పర్వతమున రమ్యమైన ఫలమూలంబుల్
లభించుచుండును నన్ని కాలముల నలరుచు నీవును భుజించియున్
నిత్యము నాదు సమీపంబుననూ నిరతము సంచారము జేసీ
ఇచ్చటనే నివసింపుము వానర! యిట్టి మేఱు పర్వతముననూ
అటు పిమ్మట మఱి నీకు శుభంబును నలరి గలుగు శ్రేయస్సులునూ! 12, 13

రఘురామా! యా బ్రహ్మదేవుడును రమ్యముగా బలుకగ బడినా
వానరోత్తముడు దేవదేవుడగు వనర ప్రజాపతికిని యపుడున్
శిరస్సువంచీ నమస్కరించుచు చేతోమోదము దొలకగనూ!
జగత్పతియు మఱి యాది దేవుడగు సారస్వత నాథుని తోడన్
వినయము తోడను విమల వాక్యముల విశదముగా నీ విధి బలికెన్!
దేవా! నీ వెటు నాజ్ఞాపింతువొ దీరుగ నుండెద నే నెపుడున్
నీ శాసనమును నే స్థిరుండనై నిశ్చయముగ పాలించెదనూ! 14, 15

అపుడు వానరుడు బ్రహ్మదేవుతో నటుల బలికి సంతోషముతో
సెలవు దీసికొని వెడలిపోయెనూ శిఖరంబున విహరింపన్
అట్టి బ్రహ్మదేవుని సమానమగు నిట్టె బలముగల వాడతడున్
ఫల పుష్పంబుల తోని గూడినా బహుళ వృక్ష సముదాయములన్
సంచరించుచును వనమునందుగల యంచితమగు ఫలముల దినుచున్!
తీయని మధువుల ప్రోవు జేయుచును దీరుగ పుష్పంబుల నచటన్
నేరుచు వానిని ప్రతి దిన మందున యేమరకను సాయంత్రములన్
బ్రహ్మ దగ్గఱకు జేరుచుండెనూ బన్నుగ తండ్రిగ భావించీ ! 16,17

ముఖ్యములైనా పుష్పంబులనూ మోదముతో ఫలములను మఱిన్
భక్తిభావమును గొని పోవుచునూ భవ్య భావమున నాతండున్
దేవదేవుడగు బ్రహ్మదేవునీ దివ్య పాదముల వద్ద మఱిన్
సమర్పించు చుండెడివా డాతడు సరసత భక్తియు దొలుకంగన్! 18

రఘురామా! యీ విధముగ నాతడు రమ్యముగా నాగిరి యందున్
దిరుగుచుండగా కొంతకాలమును దీరుగ గడిచెను నాతనికిన్
భల్లూకంబులకును ప్రభువగుచును బన్నుగ నుండెను నాతండున్
ఒక దినమున యా వానర శ్రేష్ఠుడు వనరగ దప్పిక చేత మఱిన్
పరిపీడితుడై జలముల కొఱకును బన్నుగ వెదుకుచు నుండె నటన్! 19,20

ఆ వానరుడును మేరు పర్వతపు నలరుచు నుత్తర శిఖరంబున్
వెళ్లినవాడై యాత డచ్చటను విమల వృక్షముల యందుననూ
అనేక విధముల పక్షుల చేతను నలరు ధ్వనులు జేయగ బడుచున్
ప్రసన్న సలిలము గల సరస్సునూ బరగ గాంచె యా వానరుడున్! 21

ఆ వానరుడును జాలు కదల్చుచు నాసరస్సు తీరము నందున్
నొడ్డున నిలబడి యా సరస్సులో నొనరగ తన ప్రతిబింబమునూ
గాంచి యాతడును కలవర బాటును కలత నొంది యొక క్షణముననూ
వేఱొక వ్యక్తిగ భావించెను మది విమలమైన ప్రతిబింబమునూ! 22

అంతర్జలమున శత్రు వెవ్వడో పంతమునను నివసించె నిటన్
మహాశత్రువని భావించెదనూ మానుగ నీతని కనుగొనగన్
అని భావించుచు నా వానరుడును నంతర్గతమున వీక్షించీ
క్రోధముతో గూడిన వాడగుచును కూరిమితో నీతడు నన్నున్!
అవమానించుచు నున్నవాడనుచు నంతర్గతమున భావించీ
దుష్టబుద్ధిగల యీ కుమతియునూ దురితము జేయగ నుండె మఱిన్
ఆ సరస్సునూ యతని గృహముగా నా వానరుడును భావించెన్
ఆజ్ఞానముచే నన్ని కష్టములు నలరి వచ్చు గద! నెల్లఱకున్! 23,24

ఆ వానర శ్రేష్ఠుండు నీ విధము నాలోచించి మనస్సుననూ
వానర సహజమునగు చాపలమున వనరగ యా వానరుడు మఱిన్
క్రోధము తోడను నెగిరి దూకెనూ కూరిమి యా హ్రదమున యందున్
ఆలోచింపని విషయంబులునూ యలరి జరుగుచుండును ధాత్రిన్! 25

అట్టి హ్రదమునుండియు వానరుడును నిట్టె యెగిరి పైకిని నిలెచెన్
చిత్రమైన విషయము జరిగెను నట శీఘ్రము యా వానరుడు మఱిన్
స్త్రీత్వంబును మఱి పొందెను నాతడు స్త్రీగా మారెను రఘురామా!
మనసున యోచింపని కర్మంబులు మానుగ జరుగుచు నుండు ధరన్! 26

ఆ స్త్రీ మనోజ్ఞ రూపము గలదియు నలరుచు లావణ్యము జేతన్
సుందరమైనది, మంగళ పద్రయును సురుచిర జఘనము గలదియునూ
అందమైన కనుబొమ్మలు గలదియు చందురు ముఖమును గలదియునూ!
నల్లని ముంగురులును గలదియునూ ముగ్ధమైన స్మిత వక్త్రంబున్
బలిసినట్టి స్తన ప్రదేశంబునూ బన్నుగ యా హ్రద తీరమునన్
ఋజువగు దండము నందు గలిగినా రూఢిగ శ్రీలతను బోలెన్
జూచు వారలను నగుబడుచుండెను చూడగ చక్కని బొమ్మ వలెన్! 27,28

త్రైలోక్యములను లేని సుందరియు ముగ్ధ మనోహరురాలు మఱిన్
అందఱి చిత్తములను నాకర్షించూ నలరుచు బీడించెడిది మఱిన్!
పద్మరహిత యగు లక్ష్మికి వోలెను బన్నుగ కన్పించెడిదియునూ
నిర్మలమైనా చంద్ర జ్యోత్స్నవలె నిరుపమానముగ నట నుండెన్! 29

ఆ స్త్రీ సౌందర్యము రూపంబున యలరుచు లక్ష్మికి వలె నుండెన్
బ్రహ్మరాణి యగు సరస్వతికి వలె బన్నుగ పార్వతి దేవి వలెన్!
ఆ వరాంగనయు నన్ని దిక్కులను నలరి ప్రవేశము జేయుచునూ
ఉదయ సంధ్యలా యరుణిమ వోలెను నురు తరముగ మెఱయుచు నుండెన్! 30

ఈ యంతరమున సురనాయకుడును నింపుగ దేవేంద్రుండు మఱిన్
బ్రహ్మదేవునీ పాదంబులనూ బన్నుగ సేవించియు మఱియున్
ఆ మార్గమునను బోవుచునుండెను నలరు స్వర్గలోకంబునకున్
ఆ సుర సుందరి నచట గాంచెనూ యబ్బురమందెను చిత్తమునన్! 31

ఆ సమయంబున పరిభ్రమించుచు నలరు భాస్కరుడు శీఘ్రముగన్
బ్రహ్మదేవునీ పాదంబులను బన్నుగ సేవించియు మఱియున్
ఆ మార్గమునను బోవుచుండెనూ యలరు స్వర్గ లోకంబునకున్
ఆ సుర సుందరి నచట గాంచెనూ, యబ్బుర మందెను చిత్తమునన్! 32

ఆ విచిత్ర సుందరిని వారునూ యల దేవేంద్రుడు సూర్యుడునూ,
ఒకే సమయమున జూచిరి వారలు నోరిమి గోల్పోయిరి వారున్
ఆమెను గాంచియు వారిద్దఱునూ యట మన్మథునకు వశమైరీ
పరస్త్రీ యనియెడి భావము మఱచిరి పన్నుగ వారిద్దఱు గూడన్! 33

అటు పిమ్మట సర్పంబులకును వలె యలరు క్షుభిత సర్వాంగములున్
సురేంద్రులగు నా యింద్ర సూర్యులును సురుచిర తద్రూపము గాంచీ
తమ ధైర్యంబును గోలుపోయిరీ తత్తర బాటును జెంది రటన్,
మనసును నిలుపగ లేరుగదా మఱి మహనీయులునూ గొందఱిలన్! 34

అటు బిమ్మటనూ యామె విషయమున యల స్ఖలితము నగు వీర్యంబున్
ఆమె శిరసుపై యా దేవేంద్రుడు నలరి విడువగా వేగముగన్!

అది యామెను జేరగలేదు మఱిన్ నటు నిటు బోయెను జారుచునూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 35

అటుబిమ్మట యా మహాత్ముడైనా యల దేవేంద్రుని యమోఘమున్
వీర్యము నుండీ వానర పతియును విమల సమర్థుడు నగు వాడున్!
ఒక వానరునీ యామెయు కనెనూ వనరుగ బహు విక్రము డతడున్!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 36

ఆ రేతస్సున పుచ్ఛ భాగమున యలరుచు బడె నా సమయమునన్,
అందుకనే వాలీ యను పేరను చందముగా స్థిరమాయె నటన్
అల సూర్యుండును దన కర్తవ్యము వారించుచునూ మన్మథునీ
వశంవదుండై యా తరుణీమణి వనరగ కంఠము మీద మఱిన్
స్ఖలనమైన రేతస్సును వదిలెను గడు తీవ్రముగా నాతండున్! 37

శ్రేష్ఠమైన శారీరము గలిగిన స్థిరచిత్తము గల స్త్రీ తోడన్
ఆమెతోని యా సూర్య దేవుడును నలరుచు నొక మాటయు గూడన్
పలుకలేదు, భాషింపగ లేదూ, బలుచ దనంబును బడలేదూ
అతని నుండీ దూరమాయెనూ యా మన్మథుడును గూడ మఱిన్
గ్రీవమునను రేతస్సుబడుటచే సుగ్రీవుండను బేరొందెన్! 38, 39

వీరులు మఱియును మహా బలముగల విమల వానరేంద్రులు మఱియున్,
ఈ విధముగ యుత్పాదితులైరీ విమలమైన ప్రత్యేకతనూ,
దేవేంద్రుండును వానరేంద్రుడగు దీరుగ వాలిని దీవించీ
స్వర్ణ వికారము గలదియు మఱియును సహజ గుణములను నిండినదీ,
అక్షయమైనా మాలను నిచ్చీ నాతడు జనె స్వర్గంబునకున్! 40

సర్వ కామముల కనెడి సూర్యుడును సమతావాదియు నగువతడున్
తన కుమారునికి బవనాత్మజునీ తగ మిత్రునిగా జూపించీ,
తాను జేయవలసిన కార్యములను దగజేయగ సంసిద్ధతనూ
ఆకాశమునకు వెడలి పోయెనూ యంబరమందు బ్రకాశింపన్! 41

ఓ రాజా! ఓ రఘురామా! విను! నోరగ యారాత్రియు మఱియున్
గడచిన దగుచుండగ సూర్యుండును గడు ప్రకాశ మగుచుండగనూ!
ఋక్ష రజస్సుకు స్త్రీ రూపంబును రూఢిగబోయెను వానరుడై
యధా ప్రకారము కపిరూపుండై యల విహరించుచు నుండె నటన్! 42

ఋక్ష రజస్సును స్త్రీ రూపంబును రూఢిగ మారుచు వానరుడై
తన పుత్రులు వాలీ సుగ్రీవులు దగ పింగేక్షణులైనట్టి
బలవంతులు మఱి కామరూపులును బన్నుగ వానరులను గాంచెన్
వారిద్దఱునూ నతని జేత మఱి యొనరగ యమృత కల్పములౌ
తీయని మధువులు ద్రావింపగ బడి తీరుగ మధువులు బొంది రటన్! 43, 44

ఋక్షరజస్సును వారిద్దఱినీ రూఢిగ నెత్తుక వొడియందున్
బ్రహ్మ సమీపంబునను వచ్చెను బన్నుగ యాశీస్సుల నందన్
లోకంబులకును బితామహుండును లోలత బ్రహ్మయు గూడ మఱిన్
ఋక్ష రజస్సును గాంచి సుతులతో రూఢిగనున్నా యాతనినీ,
అనేక విధముల నోదార్చెను మఱి యలత కలతలును దొలగగనూ! 45

ఋక్షరజస్సును నోదార్చియునూ రూఢిగ యటు బిమ్మటను మఱిన్
పితా మహుండును దేవదూతనూ ప్రీతిని యిట్లాజ్ఞాపించెన్!
ఓ దూతా నా యజ్ఞ ప్రకారము నొనరగ కిష్కింధకు బొమ్మా!
మంచిగుణంబులు గలిగి నట్టియును మానుగ మంగళ ప్రదమైనా
ఆ పురంబు నీ ఋక్షరజస్సుది యంతులేని సుఖమైనదియున్! 46, 47

ఆపురంబులో ననేకమైనా యలరెడి వానర యూధంబుల్
వసించుచున్నది నంతియగాదూ! యనేక రత్నములను గూడీ,
కామ, రూప ధారులునైనట్టీ క్రమశిక్షణ గలిగినయట్టీ
వానరాధిపులతోని నిండినది వనరగ రత్నము వంటిదదీ! 48

పవిత్రమైనది పుణ్యవతియునది ప్రవేశింప శక్యముగానీ
నాల్గు వర్ణముల నివాసమైనది నందనవన సామ్యముగలదీ
సవ్యము దివ్యము సుందరమైనది నయముగ యా కిష్కింధపురీ
నా యాజ్ఞలచే విశ్వకర్మయును నయముగ నిర్మించెను దానిన్! 49

అల కిష్కింథాపురి జేరి నీవునూ యల నా యాజ్ఞను దెలిపి మఱిన్
పుత్రసహితుడగు వానర శ్రేష్ఠుడు బొలుపుగ ఋక్షరజస్సు నికన్
జూపియు వానర యూధనాయకుల సామాన్యులు నగు వానరులన్
బిలిచి జనుల సభలో నందఱినీ ప్రీతిని నా యోజను దెలిపీ
ఋక్ష రజస్సును సింహాసనమున రూఢిగ గూర్చుండగ జేసీ
రాజునుగా సింహాసనంబునను రయముగ జేయుము నభిషిక్తున్! 50,51

వారందఱునూ కిష్కింథాపురి వనరగ ధీమంతుడునైనా
ఋక్ష రజస్సును జూడగనే మఱి రూఢిగ యాజ్ఞాబద్ధులునై!
నిత్యము వశమున యుండగలరు సుమ! నిండు వినయమున గూడికొనీ,
అనుచు బలికె నా ప్రజాపతియునూ యందముగా మధురాక్షరముల్! 52

బ్రహ్మచేత నిటు బలికిన బిమ్మట ప్రీతిపాత్రుడగు దూతయునూ
ఆ హరీశ్వరుని ఋక్షరజస్సును నలరి ముందుగా నుంచుకొనీ
సుందరమైనా కిష్కింథకునూ యందమైన నగరంబునకున్
ప్రయాణించెనూ నా దూతయును బరగ కార్యదక్షత తోడన్! 53

ఆ దూతయు మఱి వాయువేగమున యా కిష్కింథా నగరంబునకున్
బోయి ప్రజాపతి యాజ్ఞతీరునను బొందుగ సభికులకును దెలిపీ
బ్రహ్మ దేవుడును బలకిన విధమున బన్నుగ ఋక్షరజస్సునటన్
రాజునుగా నభిషేకము చేసెను రమ్యముగా నా దూతయునూ! 54

శ్రీమంతుడునగు ఋక్ష రజస్సును జిత్తము హర్షము నందగనూ
విధి విధానముగ యభిషేకంబును విమలముగా బొందుచునతడున్
అభ్యర్చితుడై బద్ధముకుడుడై యలంకరణములను గూడికొనీ
సభికుల చేతను నభినుతింపబడె యందఱిచే గారవముగనూ! 55

సప్తద్వీపములు సముద్రములుగల సమస్త భూతములందుననూ
ఏయే వానరులును గలరో యట నా యా వానరలందఱునూ
ముదిత మానసుండై యాతండును మోదముతో బాలించుచునూ
ధర్మంబును బాలించుచుండెనూ దగ న్యాయంబును వర్ధిలగన్! 56

ఈ విధముగ యా ఋక్ష రజస్సును నింపుగ వాలి సుగ్రీవులకున్
తండ్రి యాతడే, తల్లియు గూడను దగ యాతండే నిక్కముగన్!
ఈ విషయంబును నీకు దెలిపితిని యిల నే వినియుండిన దానిన్!
నీకు భద్రమగు గాత! దమ్ములకు నీ వారల యందఱకు మఱిన్! 57

ఏ విద్వాంసుడు నిట్టి గాధనూ వినిపించుచు చుండునొ నెపుడున్
ఎవడు దీనినీ శ్రద్ధాభక్తుల నింపుగ వినునో వారలకున్
వారల మనసుకు నానందంబును నొనరగ గలుగును మధురముగన్
చిత్తము గోరిన సిద్ధులు బొందును శ్రీ విలసిల్లును నిరతంబున్! 58

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
ఈ విషయంబును నంతయు నీకును నింపుగ తెలుపగబడెను గదా!
యధార్ధముగనూ సవిస్తరముగా నర్ధవంతముగ దెలిపితినీ
రాక్షసులయు నుత్పత్తి మఱియునూ రహీ వానరులయు నుత్పత్తిన్
తెలుపబడినదీ తేటతెల్లముగ తీరుగ జరిగిన దాని మఱిన్! 59

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ప్రథమ ప్రక్షిప్త సర్గము సమాప్తము



శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

## ఇది ద్వితీయ ప్రక్షిప్త సర్గము

(రావణుడు సనత్కుమారుని నుండి శ్రీ మహావిష్ణువునకు గల మహోత్సవమును
దెలిసికొని అతని చేతిలో మరణము తనకెట్లు లభించునా యని ఆలోచించుట)

ఆ సమయంబున దమ్ములతోడను నలరు వీరుడగు రాముడునూ!
దివ్యమైన పౌరాణికమైనా యీ వృత్తాంతము వినియు మతిన్!
బహుళాశ్చర్యము బొందెను రాముడు భరితు డాయె సంతసముననూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 1,2

ఆ శ్రీరాముడు నగస్త్యు మాటలు నలరి వినియు నిటులను బలికెన్!
త్వత్ ప్రసాదమున పుణ్య ప్రదమును దగ మహనీయంబగు కథనూ!
వింటిగదా యిపుడే జరిగిన యటు కంటను జూచిన యట్లుగనూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 3

ముని శ్రేష్ఠుడవగు బ్రహ్మణోత్తమా! మోదము సంభ్రమును గలిగెన్
వాలి సుగ్రీవుల దివ్యోత్పత్తియు వనరగ యెట్టిదియో యనుచున్
సందేహంబును గలుగుచున్నదీ సరసత హృదయము నందుననూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 4

ఓ బ్రహ్మర్షి బలము జేతనూ బలవంతులునగు వారలలో
శ్రేష్ఠులైన యీ యిద్దఱు సురలును శ్రీకరముగ యింద్రాదిత్యుల్
వారిద్దరునూ యా నరేంద్రులుగ యలరుచు జన్మించిరి పుడమిన్
ఎంత చిత్రమది మహామునీ మతీ? యే మాశ్చర్యము నీ కథయున్! 4

రామచంద్రుడును నీ విధి బలుకగ రమ్యముగా నా యగస్త్యుడున్
ఆ మహాత్ముని సంబోధించుచు నా ముని యీ విధమున బలికెన్
మహా బాహు! ఓ రామచంద్ర! విను! మానుగ నా వచనంబులనూ
పూర్వకాలమున యీ వృత్తాంతము బొలుపుగ జరిగినదట రామా! 5

రఘురామా! విను మతియొక కథమా, రమ్యమైనదియు దివ్యంబున్,
ప్రాచీనంబగు కథను దెలిపెదను ప్రవిమలమగు వృత్తాంతంబున్!

రామా! పూర్వము రావణుజేతను రమణి పతివ్రత సీతయునూ!
ఎందు నిమిత్తము హరింపబడెనో చందముగా నే దెలిపెదనూ!
సావధాన చిత్తముతో వినుమా! సరసత నా వచనంబులనూ! 6

రామా! పూర్వము కృతయుగమందున రాక్షసాధిపతి రావణుడున్
బ్రహ్మపుత్రుడును సమర్థుండునగు బన్నుగ సనత్కుమారుండున్
ఒక ప్రదేశమున గూర్చునియుండగ నొనరగ రావణుడును గాంచీ
మనసున గలిగిన యొక సందేహము మానుగ నాతని ప్రశ్నించెన్! 7

ఆ రావణుడును దేహము జేతను వనరగ సూర్య సమానుండున్
తేజస్సులచే జ్వలించు నట్టుల దీరుగ కనబడువాడు మఱిన్
సత్య వాదియగు నా మహాఋషిని సరసత యంజలి ఘటియించీ
వినయము జేతను నమస్కరించుచు వేడుక నీ విధమున బలికెన్! 8,9

ఈ లోకంబున దేవతలందున నింపుగ బలవత్తరు డెవడూ?
ఎవని యాశ్రయము నంది దేవతలు నిలలో రణరంగము నందున్
జయింప గలుగుచునున్నారో మఱి శత్రుని వధింప గలుగుచునూ!
సురలందున మఱి యధిక బలుండును నాతని దెలుపుము మనివర్యా! 10

ఓ భగవంతుడ! తపోధనా విను! వనరగ నా వచనంబులనూ!
బ్రాహ్మణు లెవరిని భక్తి శ్రద్ధలను బన్నుగ పూజలు జేయుదురూ?
యోగులు నెవరిని హృదయము నందున తగ ధ్యానించుచు న్నారూ?
దీనిని నాకు సవిస్తరంబుగా దీరుగ దెలుపుము మునివర్యా! 11

ధ్యాన దృష్టిగల మహాయశుండును దగ సనత్కుమారుడు వేగన్
వానియొక్క హృద్గత భావంబును వనరగ గ్రహించి యాతండున్
'పుత్రక! విందువుగాక!' యనుచునూ ప్రేమ పూర్వకము యాతనితో
తన యనుభవమును జోడించియు మఱి తన్మయమున నిటులను బలికెన్! 12

ఎవడు సమస్తమునైన జగత్తును నొనరగ భరించుచున్నాడో,
ఎవని యొక్క యుత్పత్తియు జననము నింపుగ గుర్తింపగ లేమో!
సర్వ పాపముల హరించువాడును సర్వేశుడు నారాయణుడున్

నిత్యండును మఱి సురాసురులచే నిత్యము నమస్కరింపబడీ
సన్మానింపగ బడుచు నుండునో సత్కృతులను బొందుచు మఱియున్
సకల లోకముల సృజనకర్తయగు సరసత నా బ్రహ్మయుగూడన్
సృజింపబడెనో యా విష్ణువునే సమాశ్రయించుచు దేవతలున్!

ఎవని నాభి కమలంబున బుట్టెనా యెవని చేత నీ విశ్వంబున్!
యజ్ఞమునందున బూజలు సేయుచు యాగములందున యాహుతులన్
అమృత పానమును జేయుచు వారలు సమరత్వంబునుబొందెదరో
అందఱి చేతను సత్కృతులందుచు హరినే పూజలు జేయుదురా! 13, 14, 15

పురాణములచే వేదంబులచే బొలుపుగ పంచ సురాత్రములన్
దెలిపిన విధముగ జనులందఱునూ దీరుగ పూజలు సేయుదురా!
నిత్యము యోగులు నా విష్ణువునే నిరతము ధ్యానము సేయుదురా!
యజ్ఞంబులచే యాగంబులచే ననిశము ధ్యానము సేయుదురా! 16

దైత్య దానవుల రాక్షసులను మఱి దగ నితరులునగు వారలునూ
దేవతలకు శత్రువు లెవరుందురో దీరుగ వారల నందఱినీ
యుద్ధములందున హరించు చుండును పద్ధతితో నోడించు మఱిన్
శాంతిని సంరక్షించుచునుండును సజ్జనులను గాపాడుచునూ!
యుగయుగమున జన్మించుచు నుండును యుద్ధతి మాపగ 'దుష్టులయున్'! 17

రాక్షస రాజగు దశగ్రీవుండును రయముగ మా ఋషి పలుకు వినీ
మఱియు వినయమున బలికె నతనితో మాధుర్యంబును దొలుకాడన్! 18

యుద్ధమునందున హరింపబడినా యుద్ధతి శత్రువులగు వారల్
దైత్యులు దానవులును, రాక్షసులును దగ వారికి యే గతి వచ్చున్?
విష్ణుమూర్తిచే జంపబడిన యా వినుల మూర్తులగు వారలకున్
యేగతి గలుగును? నదియును దెలుపుము నే పరమార్థము గలుగు మఱిన్! 19

ఆ రావణునీ వచనంబును విని యలరుచు సనత్కుమారుండున్
ఈ విధముగ మఱి తెలియజేసెనూ యింపుగ మధురాక్షరములతో!

సురలచేత జంపగబడు వారలు సునిశ్చితముగా స్వర్గంబున్
బోవుచుందురూ స్వర్గ ధామమున బొందుగ వసియింతురు నచటన్! 20

స్వర్గమునుండీ పరిభ్రష్టులునై సరసత వసుధా స్థలముననూ
పుట్టుచునుందురు పూర్వార్జితమగు పుణ్య పాపముల ఫలితములన్
అనుభవింపగా బుట్టుచు నుందురు నల మరణంబును బొందుదురూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 21

చక్రధరుడు త్రైలోక్యనాథుడును సకలంబులకును ప్రభువైనా
విష్ణువు చేతను నెవరెవ్వరు మఱి విలసితముగ హతమైనారో
ఆ రాజులు మఱి వారలందఱును యా విష్ణువు స్థానంబునకున్
పోయినారు మఱి దేవదేవుని పొలుపుగ క్రోధముగూడ మఱిన్
వరముతోని మఱి సమానమైనది వసుధను పవిత్రతను గూడీ! 22

ఆ నిశాచరుడు నటు బిమ్మటనూ యాముని నోటను వెలువడినా
ఆ వచనంబుల విని రావణుడును నలరి పొందె సంతోషంబున్
ఆనందంబును, నాశ్చర్యంబును నలరి కుతూహలమును బొందెన్!
నే నే విధమున రణరంగంబున నిలకడగా విష్ణువును హరిన్
ఎదిరించుట సిద్ధించును నాకును వేగము నందగ మోక్షంబున్!
అని యోజించెను రాక్షసుండునూ యల ఋషి వాక్యములను వినియున్! 23

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
ద్వితీయ ప్రక్షిప్త సర్గము సమాప్తము



## శ్రీరామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

## ఇది మూడవ నిక్షిప్త సర్గము

(సనత్కుమారుడు రావణునకు శ్రీ మహావిష్ణువు గొప్ప తనమును వర్ణించి చెప్పి నాతడు రామునిగాను, లక్ష్మి సీతగాను నవతరింపగలరని తెలుపుట)

దురాత్ముడగు నా రావణుండునూ దూరాలోచన గూడికొనీ
చింతించుచు నుండగ యంతటనూ జింతను మాన్పుచు మునియు మఱిన్
రావణుతోడను నిటులను బలికెను రయమున సుధలను రాల్చుచునూ!
రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్! 1

మహాబాహువులు గలవాడా విను! మానుగ నాదు సువచనములన్
నీ మనసునకును నేది యిష్టమో నిశ్చయముగ కాగలదు సుమా!
నీ కోరిక సిద్ధింపగలదు సుమ! నిశ్చయముగ రణమందుననూ
సుఖముగ నుండుము గొంత కాలమిటు గోరిక సిద్ధించును నీకున్! 2

మహా బాహు! యా రావణుండునూ మానుగ విని ఋషి వాక్యములన్
అలరుచు బలికెను యా రావణుడును మనసున కోరిక చిగురొత్తన్
ఆ విష్ణువు శుభలక్షణంబులను నవి యే యే రీతిగ నుండున్?
సమస్తమును సవిశేషితంబుగా సరగున దెలుపుము ఋషివర్యా! 3

రాక్షసేశ్వరుని వచనంబుల విని రయమున సనత్కుమారుండున్
మఱల రావణునితో నిటు బలికెను మాధుర్యము పొంగులు వారన్
రాక్షస పుంగవ! సమస్తంబు మఱి రమ్యముగా దెలిపెద వినుమా
సావధానముగ సౌమ్యభావమున సరసత దెలిపెద నీకు మఱిన్! 4

దేవదేవు డా విష్ణువు జగతిని దీరుగ నుండెను నంతటన్
సూక్ష్మమైన రూపముగలవాడును సునిశితముగ యవ్యక్తుండున్
అతి ప్రాచీనుడు, సచరాచరుడును త్రైలోక్యంబులనంతటనూ
వ్యాపించియు నతడుండె సుమా మఱి వ్యాపింపని దేదియులేదూ! 5

భూమి, స్వర్గమును, పాతాళంబును బొలుపుగ వనములు స్థావరముల్
నదులు, గిరులు నగరంబులన్నియును సమముగ ప్రాణుల యందుననూ

అన్నిటి యందున యా హరియుండెను బన్నుగ గాంచిన యెందైనన్!
గాలియందునను గలడు సుమా మఱి గల డా వ్యోయమునందుననూ
విష్ణువు గల డంతటను రాక్షసా! విమలముగా నణువణువుననూ! 6

అతడే ఓంకారంబు మఱియునూ యతడే సత్యస్వరూపుండున్
సావిత్రియు మఱి భూతలంబునూ సరసత ధరించు బర్వతముల్
పర్వతములనూ ధరించునట్టీ పన్నుగ దేవుండైనట్టీ
ఆదిశేషుడును నతడే యనుచును నలరి ప్రసిద్ధము నాయె ధరన్! 7

పగలు రాత్రియును, నుభయ సంధ్యలును, బన్నుగ సూర్యుడు చంద్రుండున్
యముడు, కాలమును, వాయువు, అగ్నియు నలరు బ్రహ్మ రుద్రుండు మఱిన్
ఉదకము, వనస్పతులును, గొండలు దీరుగ నాతడె నతడు సుమా!
విష్ణువు లేనీ ప్రదేశంబునూ విశదముగా లే దెచ్చటనూ! 8

అవ్యయుడైనా లోకనాథుడును నల పురాణ పురుషుండైనా
భవనాశంబును జేయునట్టి యా భగవంతుండును నొకడైనా!
అందుచేతనే సృష్టియంతయును నలరి ప్రకాశింపగ జేయున్
అతడే జ్వలించుచుండెను మఱియును నతడె ప్రకాశించుచునుండెన్!
లోకములను మఱి సృజించుచుండును లోలత రక్షించుచు నుండున్!
అతడే లోకములన్నియు గూడను నలరి సంహరించుచు నుండున్!
ఈ విధముగ క్రీడించు చుండునూ! నింపుగ బాలునికిని వోలెన్! 9

దశాననా! ఇది యంతయు దెలిపిన దగ ప్రయోజనము యేముందీ?
ఒక్క మాటలో జెప్పవలయునని నిక్కముగా సర్వస్వమునూ!
జంగమ స్థావరములనుగూడినా సర్వస్వంబును నీ వసుధన్
త్రైలోక్యంబుల సముదాయంబున తీరుగ నుండెను విష్ణువునూ! 10

కింజిల్కారుణ వాసము జేతను నీలోత్పల దళ శ్యాముండున్
ఏ విధముగ యెట్లుండుననగనూ యింపుగ ప్రావృట్ కాలమువన్
గగనము నందున మెఱుపుల గూడిన మేఘము వలె నాతడు నుండున్,
శంఖ చక్రముల గూడియుండినా శార్ఙ్గ గదా ఖడ్గంబులతో! 11

మేఘము వంటి శరీరంబునూ మెఱుపు వంటి శోభయు గలిగీ
నల్లని వాడును, సమర్థుండునూ పన్నుగ పంకజ నేత్రుండున్
వక్షస్థలమున శ్రీవత్సముతో వనరగ యుండిన వాడు మఱిన్
వక్షస్థలమున శ్రీవత్సమనే వనర పుట్టుమచ్చయు నుండన్
మచ్చయున్న చంద్రునికి భోలెనూ మానుగ చంద్రుని వలె నుండున్! 12

మేఘమునందున మెఱుపు దీగవలె మిఱుమిట్లును మఱి గొలుపుచునూ
నిత్యము నాతని శరీరమందున నిగనిగ కాంతులు జిమ్ముచునూ
రణరూపముగల లక్ష్మీదేవియు రమ్య రూపమున నాతనిలో
నావరించి యుండును నెల్లపుడును ననుసరించి యుండును నెపుడున్! 13

ఆ విష్ణువు మఱి సురలచేతనూ యసురల చేతనుగాని మఱిన్
ఆ పన్నగులా చేతనుగానీ యల పక్షుల చేతను గానీ
చూడగజాలరు నా విష్ణువునూ సుందరమగు నా రూపమునూ,
అత డెవ్వరిని యనుగ్రహించునొ వారు జూడ గలుగుదు రతనిన్! 14

తండ్రీ రావణ! యల భగవంతుని దగిన యజ్ఞ యాగంబులయున్
ఫలములచేగానీ యా దేవుని బరగ శక్యమును కాదు గదా!
సంచితమగు తపసులచే గానీ యంచితముగ శక్యముగాదూ!
దాన యాగముల చేతనుగానీ, దగ చూడగ శక్యము గాదూ! 15

తద్గత ప్రాణులు నగు వారలునూ తద్గత చిత్తము గల వారున్
తత్పరాయణులు నగు వారలనూ తగ జ్ఞానము చేతను మఱియున్
కాల్చి వేయబడినట్టి పాపములు గలుగువారు తద్భక్తులునూ
చూడగలుగుదురు నా విష్ణువునూ జూడగ శక్యము గలుగుచునూ! 16

అటు గాకను ఓ రాక్షసేంద్ర విను! వలరుచు నా భగవంతు మఱిన్
దర్శింపగ దలచినచో దెలిపెద దగ రహస్యమును గల దిచటన్
అంతయు దెలిపెద నాల కింపుమా! నింత కొఱత లేకుండగనూ
ఇష్టమైనచో వినుమా దెలిపెద! విశదముగా నా భావములన్! 17

ఈ కృత యుగమును గడిచిన బిమ్మట త్రేతాయుగ ప్రారంభమునన్-
ఆ భగవంతుడు విష్ణుదేవుడును వలరుచు సురల హితార్థమునన్

మానవులను రక్షించుట కొఱకై మానుగ హితమను జేయుటకై
రాజ రూపమును ధరించి యాతడు రమ్యముగా ధర జన్మించున్! 18

ఈ భూలోకమునందు రావణా! యిక్ష్వాకుల వంశీయులలో
దశరథుడనియెడి పేరు గలిగినా దగ రాజును జన్మించు ధరన్
ఆతనికిని బహు తేజస్సులతో నలరుచు రాముడు ననుపేరన్
పుత్రుండును జన్మించు లోకమున బొలుపుగ ధర్మము నిలుపగనూ! 19,20

అపుడు ప్రభువునగు నారాయణుడును నలరి యుద్ధ రంగమునందున్
ఆదిత్యుని వలె దుష్ప్రేక్షుండును నలరి మానవుని రూపమునన్
నరరూపంబున యవతరించునూ నయముగ ధర్మము నిలుపగనూ!
అన్ని యుగములను నవతరించునూ యలరుచు నానా రూపములన్
సత్యము, ధర్మము నిలబెట్టగ ధర సరస మానవత్వము నిలుపన్! 21

ధర్మాత్ముండును, మహా మనసుగల మహితాత్ముడు శ్రీ రాఘువుడున్
పితృవియోగము చేత నాతడును ప్రీతిని దండక వనమందున్
తమ్ముడు లక్ష్మణ కమారుతోడను నిమ్ముగ విహరించుచును మఱిన్
ధర్మపత్ని సీతామహాలక్ష్మిని దగ కూడికొనీ వనికొచ్చున్! 22

లక్ష్మీదేవియు సీత యనియెడీ లాలిత నామముతోని మఱిన్
మహాభాగ్యమతి యగు నీమెయునూ దగ సువర్ణమయ పేటికనూ
ధాత్రి నుండి యావిర్భవించునూ దగ సువర్ణమయ పేటికనూ
మిధిల రాజునకు కుమార్తెయగుచును మేదుర సుశీల భావమునన్! 23

రూపము జేతను లోకమునందున రూఢిగ సకల సల్లక్షణముల్
గలిగినట్టి యా సీతాదేవియు కాంతివోలె యా చంద్రునికిన్
అనుసరించుచుండును యా రాముని యలరు నీడ వలె సీతయునూ!
అతనిపాదముల ననుసరించి మఱి యలరుచు బోవును వెనువెంటన్! 24

శీలాచార గుణోపేతయునూ శీలతసాధ్వీ పతివ్రతయున్
ధైర్యముగూడిన యా సీతయునూ దగ భానుని యారశ్మి వలెన్
మఱియొక మూర్తిగ యుండగలదు సుమ మానుగ యా జానకియు మఱిన్
సతీపతులకును నాదర్శముగా జక్కగ నుందురు దంపతులున్! 25

ఓ రావణ! విను! నే నీ విధముగ వనరగ నీకును దెలిపితినీ
భావి యుగంబున జరుగ బోయెడీ భవ్యమైన వృత్తాంతంబున్
సర్వోత్తముడును నిత్యుండును మఱి వినాశ రహితుని వేదవిదున్
దేవదేవుడగు విష్ణుదేవునీ దీరుగ ప్రభావమంతయునూ!
సవిస్తరముగా దెలియజేసితిని సద్గుణ భావ సుపుంజమునూ! 26

ఓ రఘురామా! సీతారామా! యొనరగ విను! నా వచనములన్
మహా బాహువులు గల వాడును మఱి మహావిక్రమము గలవాడున్
అగు రావణుడును నీతో వైరము నలరి బెట్టుకొన దలచి మఱిన్
మనస్సునందున యాలోచించెను మానుగ యీ విషయము దెలిసీ! 27

శ్రీ మంతుండగు రావణుండునూ స్థిరముగ సనత్కుమారుండున్
తెలుపగా వినిన యా రావణుడును దీరుగ మాటికి మాటికినీ
ఆలోచించుచు, మననము జేయుచు మనసున బహు సంతసమందెన్,
యుద్ధంబునకై సంచరించెనూ యుద్ధతుడై లోకంబుననూ! 28

రామచంద్రుడును నా వృత్తాంతము నలరి వినియు నాశ్చర్యమునన్
నేత్రంబులు వికసింపగా మఱియు నీరజంబులకు వోలె మఱిన్
తలపంకించుచు దీర్ఘాలోచన తరగలలో మునిగెను నతడున్
ఆశ్చర్యంబును నబ్బురబాటును నటుబొందెను! శ్రీ రాఘవుడున్! 29

అట్టి సమయమున సర్వేశ్వరుడగు నా శ్రీరాముడు వేగముగన్
ఆ వాక్యంబును విని సంతసమున నలరుచు గూడిన వాడగుచున్
దిస్మయమానము నగు చక్షువులును వేడుకగలవాడగుచు మఱిన్
జ్ఞానవంతులను ప్రధానుడైనా వినయముతో నా యగస్త్యునీ
పురాతనంబగు వాక్యంబును మఱి పొలుపుగ తెలుపుము నని పలికెన్! 30

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
తృతీయ ప్రక్షిప్త సర్గము సమాప్తము



### రామ కథా సుధాలహరి - ఉత్తరకాండము ప్రథమ సంపుటము

## ఇది నాల్గవ నిక్షిప్త సర్గము

(ఇది నారదుడు తెలిపినట్లుగా నీ కథ వృత్తాంతమును కొనసాగించుట)

అనంతరంబున మహాతేజుడును మహా యశస్సును గలవాడున్
కుంభయోని యగు నగస్త్యుండునూ కూరిమి పితామహుండు మఱిన్
పరమశివునితో బలికినట్లుగా బన్నుగ యంజలి ఘటియించీ
నమస్కరించెడి రాముని తోడను నయముగ యగస్త్య డిటు బలికెన్! 1

మహా తేజుడును సమర్థుడైనా మానుగ యట్టి యగస్త్యుండున్
సత్య పరాక్రమమును గలిగిన యా సరసిజ నేత్రుడు రామునితో
విందువుగాత! కుమారా యనుచును వివరముగా నా కథను మఱిన్
కథా శేషమును దెలుపగ మొదలిడె కమనీయంబగు వచనములన్! 2

మహాబుద్ధిగల యగస్త్యుండునూ, మానుగ ప్రీతాత్ముం డగుచున్
దనకు నితరులును దెలిపిన విధమున తన చేతను వినబడిన కథన్,
జరిగిన విధమున యున్నదున్నటుల సరసత రాఘవునకు దెలిపెన్!
తనకు నారదుడు దెలిపినట్లుగా దగ రామునికిని ముని దెలిపెన్! 3

మహాబాహువులు గలవాడా, మఱి మహామతియునగు రఘురామా!
దురాత్ముడైనా రావణు జేతను దూరదృష్టితో నందులకే
జనక రాజ సుత; మహా పవిత్రత సతి సీతను మఱి హరియించెన్!
రాముని తోడను వైరము బూనీ రమణి సీతనూ చెఱబట్టెన్! 4

మహాబాహు! ఓ దుర్ధర్షా వినుమ! మానుగ యీ వృత్తాంతంబున్
సుమహాయశుండగు నారదుండునూ సురుచిరమగు పర్వతములలో
ఉత్తమమైనా మేరు పర్వతము నురుతర శిఖరము పైని మఱిన్
మహర్షులకు మఱి తెలిపినాడు గద! మానుగ వింటిని నే నపుడున్! 5

మానద! రాఘవ! వినుమా దెలిపెద! మానుగ మిగిలిన యీ కథనా!
మహాతేజమును గల నారదుడును మానుగ సంతసమున దెరలీ

నవ్వుచు మిగిలిన కథ యంతయునూ నయముగ మహర్షులకు నపుడున్
మఱల దెలుపుటకు పూనుకొనెను మఱి మానుగ సహజోత్సాహమునన్! 6

మహాబాహువులు గలవాడా మఱి మానుగ రాజేంద్రా! వినుమా!
సురలను గూడిన సమస్త ఋషులును సురుచిరముగ సంతోషముతో
వ్యాకులమగు నేత్రములు గలుగగా వనరగ యా నారదుడు మఱిన్
దేనిని పలికెనొ నా వృత్తాంతము దీరుగ పాప ప్రణాశనమున్
ఆ కథ వృత్తాంతము రఘురామా! నలరి వినుము బహునాసక్తిన్! 7,8

రఘురామా! ఎవ్వడు దీనిని మఱి రమ్య భక్తి శ్రద్ధలగూడీ
నిత్యంబును వినిపించు చుండునో నిరతము భక్తిని గూడికొనీ
వినుచుండునొ యా యిరువురునూ మఱి పుత్రపౌత్రులును గలవాడై!
ఈ లోకంబున సుఖమును బొందీ యింపుగ స్వర్గమునందు మఱిన్
పూజింపగ బడుచుందు రనుచునూ బొలుపుగా బలికిరి ఋషిమునులున్! 9

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
చతుర్థ ప్రక్షిప్త సర్గము సమాప్తము



## రామ కథా సుధాలహరి - ఉత్తరకాండము (ప్రథమ సంపుటము)

# ఇది పంచమ నిక్షిప్త సర్గము

(నారదుడు దెలుపగా శ్వేత ద్వీపమును గురించి విని రావణుడు అచ్చటి వారితో యుద్ధము జేయుటకై బోవుట, అచ్చటి స్త్రీల చేతిలో అవమానమును బొందుట, సనత్కుమారుడు రావణునికి శ్రీ మహావిష్ణువు ప్రభావమును దెలుపుట, అతని చేతిలో మరణింపవలెనని రావణుడు నిశ్చయించుకొనుట)

శ్రీ రఘురామా! నటు బిమ్మటనూ చిత్తమందు హర్షము దొలుకన్
శ్రేష్ఠమైన యా వృత్తాంతంబును స్థిరముగ వినుమా నాసక్తిన్
అటు బిమ్మటనూ బలదర్పితులగు నలరు మహా శూరులునైనా
యసురులచే పరివృతుడైనట్టీ యా రావణుడును వేగముగన్
విజయము గోరుచు పృధ్వీతలమున వేగ పర్యటన జేయుచునూ
దైత్య దానవుల రాక్షసులందున దగ బలాధికునిగా వినునో
ఆతని యుద్ధము జేయుట కొఱకును యాహ్వానించుచు మండెనటన్! 1,2

ఓ రఘురామా! యీ విధముగనూ యొనరగ సమస్త ధరిత్రినీ,
సంచరించు నా రావణుండునూ సరసరీతి యటుపిమ్మటనూ
బ్రహ్మ లోకముననుండి నారదుడు బరగ తిరిగి వచ్చుట గాంచీ
మేఱు పర్వతపు పై భాగంబున మెఱయుచు బోవుచు నున్నట్టీ
మఱియొక సూర్యుని వోలె నున్న యా మధుర మూర్తి యా నారదునీ
గాంచి రావణుడు మనసునందునను గలిగిన సంతోషము దోడన్
ఆ నారదునీ సమీపించి మఱి యంజలి ఘటించి వినయమునన్
నమస్కరించుచు నిటుల బలికెనూ నయముగ వినయము బొంగారన్! 3,4

మహాభాగ! ఓ నారద వినుమా! మహా బ్రహ్మలోకము వఱకున్
లోకములన్నియు నీ చేతను మఱి లోలత జూడగ బడియె మఱిన్
ఏ లోకంబున నున్న మానవులు నింపుగ బలవంతులుమ మఱిన్
వారితోని నే యథా కామముగ వనరగ యథా సుఖంబుగనూ!
యుద్ధము జేయగ కోరుచుంటినీ యుద్ధతి విక్రమమును జూపి! 5,6

నారదుండు మఱి ముహూర్తకాలము నయముగ యాలోచించి మఱిన్
ప్రత్యుత్తర మిచ్చెను రావణునకు బన్నుగ యీ విధముగను మఱిన్
లంకేశ్వర! ఓ రావణ రాజా! నయముగ విను నా వచనములన్
క్షీరసాగరము సమీపంబునను స్థిరముగ నున్నది ద్వీపంబున్! 7

అట్టి మహాద్వీపము వసించెడీ యలరు మానవుల జూడగనూ
చంద్రుని తోడను సమానులును మఱి చారుసుందరులు జూచుటకున్
మహాకాయులును సుమహాబలులునూ మఱి విక్రమమును గలవారున్
వారలకంఠ ధ్వని యుండును మఱి వనరగ మేఘము లురిమినటుల్! 8

రాక్షసాధిపా! నీవు ప్రస్తుతము నింపుగ గోరిన వారలునూ
బలపరాక్రమము సమోపేతులును బన్నుగ నీవును మనసుననూ
ఎట్టివారలను గోరుచుంటివో యట్టి ప్రమాణము గలవారున్
ధైర్యవంతులును, ధీరోదాత్తులు దగ స్థిర చిత్తము గలవారున్
మహా పరిఘలా వంటి బాహువులు మానుగ గలిగిన వారు మఱిన్
శ్వేత ద్వీపమున నుండిన వారిని స్థిరముగ నాచే జూడబడెన్! 9

ఆ నారదునీ వచనములను విని యల రావణుడును నటు మీదన్
ప్రశ్నించెను నా మహామునిని మఱి బన్నుగ కుతూహలము తోడన్!
ఓ నారద! ఓ మహామునీ! విను! యొనరగ నాదు సుప్రశ్నలకున్
సమాధానమును దెలియ జేయునూ! శాంత వచనములతోని మఱిన్
మహాబలులు నా ద్వీపమునందును మానుగ జన్మింతురు నెటులన్?
ఆ మహాత్ములకు శ్వేత ద్వీపమున యెట్లు లభించెను నివాసమున్? 10,11

సమర్థుండవగు ఓ నారదముని! సరసత విషయమునంతయునూ
యధార్థంబుగా నున్న దున్నటుల తథార్థంబు దెలుపుము నాకున్
నీవు ప్రపంచము నంతటినీ మఱి నిండుగ జూచుచునుందువుగా,
హస్తామలకము వలెను జూచెదవు నాశ్చర్యము లేదిందు మఱిన్! 12

ఆ రావణునీ పలుకులు వినియును నా నారదుడును నిటు బలికెన్
రాక్షస శ్రేష్ఠుడ! లంకేశ్వర విను! రమ్యముగా నా వచనములన్!

ఆ నరులును అనన్య మనస్కులు నా నారాయణు నందుననూ
ఆసక్తియు మఱి గలిగి యుందురూ యంతులేని శ్రద్ధాభక్తిన్
గలిగియుండెదరు నాతని గూర్చియు నాలోచించుచు నుండెదరూ!
ఆతడొక్కడే యుత్తమ గతి యని యలరుచు నుండెద రెల్లపుడున్
ఆతనినే సేవించు చుండెదరు నతి భక్తిని, గడు నా సక్తిన్! 13, 14

అచ్చటి జనులా నారాయణు పై యల చిత్తంబును నిలిపి మఱిన్
అతనికే ప్రాణము లర్పించుచునూ నతని సేవ జేసెద రెపుడున్
ఆ మహాత్ములును శ్వేత ద్వీపమున యలరు నివాసంబును మఱియున్
పుణ్యము జేతను సత్కర్మలచే బొలుపుగ సంపాదించి రటన్! 15

లోకనాథుడగు నారాయణుచే లోలత శార్ఙ్గముచే గానీ
చక్రాయుధమున బ్రయోగించి మఱి సరసత ఖడ్గముచే గానీ,
సంహరింప బడునో మఱి వానికి స్వర్గధామమున యందుననూ
నివాసంబు మఱి లభించు స్థిరముగ నిఖిల వాంఛలును సమకూడున్! 16

తండ్రీ! యా లోకంబు మఱియునూ యజ్ఞ యాగములచే గానీ
ఘనమగు తపసుల చేతగాని మఱి ఘన నియమంబులచే గానీ
ముఖ్యములైనా దాన ఫలములను మోదముననను నందగలేరూ!
ఆ లోకంబును బొందగ జాలరు సనాయాసముగ నెవ్వరునూ! 17

దశగ్రీవుడును యా నారదునీ దగ వచనంబుల వినియు మఱిన్
సువిస్మితుండై యద్ధమునందున యా నారాయణు తోడుతనూ!
యుద్ధము జేసెద ననుచును మదిలో యుద్ధతి తోడుత యోజించీ,
ఆ నారదునీ యనుమతి గైకొని యలరి నమస్కృతు లొనరించీ
ఆ రావణుడును శ్వేత ద్వీపమును నలరి పోయె రణమును సేయన్! 18

ఆ నారాదుడును జాలసేపు మఱి యాలోచించియు చిత్తమునన్
కుతూహలంబును గూడిన వాడై కూరిమి యాశ్చర్యము తోడన్
చూడగదలచిన వాడై రణమును సూత్రధారిగా రంగమునన్!
శ్వేత ద్వీపమునకును బయనించెను స్వేదాశ్రువులును దొలుకగనూ!
ఆ బ్రాహ్మణుడును కేలికరుడు మఱి యలరు సమర ప్రియుడును మఱియున్! 19,20

రఘుపతి రాఘవ రాజారామా! పతితపావనా సీతారామ్!
ఆ సమయంబున యా రావణుడును నలరి సింహనాదము జేసీ
దశదిశలును మఱి జీల్చివేయుచును దగ ఘనధ్వనులను జేయుచునూ
మహా రాక్షసుల తోని గలిసి మఱి మహాద్వీపమునకును బోయెన్! 21

నారదుండు మఱి శ్వేతద్వీపమున నయముగ బొందిన వాడగుచున్
నుండగనే మఱి మహా యశుండును చండశాసనుడు రావణుడున్
సురలకు గూడను దుర్లభమైనా సురుచిరమగు నా ద్వీపంబున్
జేరుకొనెను తన మంత్రులతోడను చిరతర సహచరులను గూడీ! 22

ఆ ద్వీపము తేజస్సుల చేతను నలరి బలీయసు డైనట్టీ
ఆ రావణునీ వాహనమైనా యలరు పుష్పకము శీఘ్రముగన్
గాలివేగమున గొట్టబడినదై, గాలిచేత గొట్టగబడినా
అంబుదమును వలె నిలుచుటకును మఱి యట విలువగ లేకను పోయెన్! 23

రాక్షసేంద్రునీ మంత్రులైన యా రయమున మారీచాదులునూ
చూడ శక్యమును గాని ద్వీపమును జూచుచు భయపడు వారగుచున్
పుట్టిన కంపము గలవారగుచును బూనికతో నిలువగ లేకన్
దశకంఠునితో నిటులను బలికిరి తత్తరబాటును జెందుచునూ! 24

లంకేశ్వర! ఓ రాక్షసేంద్ర విను! శంకలేక యా వచనములన్
స్పృహయు దప్పి పోవుచునున్నది మఱి చూడ్కి దప్పిపోవుచు నుండెన్!
చైతన్యంబును దొలగుచు నున్నది చీకటి గ్రమ్ముచు నుండె నిదే!
ఏ విధముగనూ నిలచి యుద్ధమును నింపుగ జేయగ లేము ప్రభూ!
అనుచు బలుకుచును రాక్షసులందఱు నటు నిటు బరుగెత్తిరి వారున్! 25, 26

ఆ సమయంబున దశగ్రీవుండును నలరు హేమభూషితమైనా
పుష్పక విమానమును విడిచెను మఱి పాలుపుగ రాక్షసులను మఱియున్
విడిచివేసెనూ, విసర్జించెనూ విలవిలబోయెడి వారలనూ!
అదిరి బెదిరినా పుష్పకంబును నటనే వదిలెను రాక్షసుడున్! 27

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
పుష్పకమైతే వెడలి పోయినది పాలుపుగ తన స్థావరమునకున్!
రాక్షసులందఱు వెడలిపోయిరీ రయమున రావణు నటవిడిచీ
రాక్షసాధిపుండయిన రావణుడు రయమున నా సమయంబుననూ!

భయంకరంబగు రూపముదాల్చి ప్రబలమైన గర్జనతోడన్
శ్వేత ద్వీపమున బ్రవేశించెనూ స్థిరమగు ఖడ్గముతోని మఱిన్
అతడు ద్వీపమున యడుగుబెట్టగను నా సమయంబున నాతండున్
అచ్చట నుండిన స్త్రీలచేత మఱి యలరి జూడగాబడె నంతన్! 28,29

ఒక స్త్రీ చిఱునవ్వును నవ్వుచునూ వనరగ యాతని హస్తమునన్!
గ్రహించి యాతని యాగమంబునూ గ్రక్కున ప్రశ్నించెను నతనిన్!
నీ విచ్చటికిని వచ్చితి వెందుకు? నీ వెవ్వడవో దెలుపుమనీ
ఎవరి పుత్రుడవు నెవ్వరు బంపిరి? యింపుగ దెలుపు మటంచు మఱిన్! 30

రఘురామా! యా స్త్రీల మాటలకు రయమున రావణుడును మఱియున్
కోపించిన వాడగుచును మఱియును క్రోధముతో నిటులను బలికెన్
నేను విశ్రవసు పుత్రుండును మఱి నేను రావణుండను బేరన్
బరుగుచుంటినీ రాక్షసుండ నే బలవీర్యుండను నేను మఱిన్
యుద్ధార్థము నే నిచటికి వచ్చితి యుద్ధతిని నే పోరాడన్
కానీ పురుషుండెవ్వ డిచ్చటను కంటికి కనబడుటయు లేదూ! 31, 32

దురాత్ముఁడగు నా రావణు డిటులను దురిత భావమున దెలుపగనూ
అటు బిమ్మట యా యువతీ జనమును నందఱు గూడుక నొకసారీ
సుస్వనంబుగా ధ్వని గలుగంగను సురుచిరముగ పకపక నగిరీ
ఆ రావణుడును నాశ్చర్యముగా నటునిటు గాంచెను దడబడుచున్! 33

ఆ స్త్రీలందఱి లోపల నొక స్త్రీ యలరుచు కోపముతో వానిన్
చిన్న పిల్లవానికి వోలెను మఱి వెన్నెల రాత్రులయందుననూ
త్రిప్పినటుల మఱి యనాయాసముగ దీరుగ నడుమున గ్రహియించీ
సఖియల మధ్యను త్రిప్పె రావణుని సఖీ జనంబులు హసియింపన్! 34

ఆ స్త్రీయును యొక సఖియను బిలిచీ సరసత్వంబును విరియుచునూ!
చూడుము సఖి! యిట పదిముఖంబులును! జూడుము నిరువది హస్తములున్!
గలిగిన కాటుకరంగు పురుగునూ గడగి బట్టితిని హస్తమువన్
జూడుమనుచు బలికెను నా స్త్రీయును సుదతుల నచ్చట గాంచుచునూ! 35

ఒక స్త్రీ హస్తమునుండి వేఱొకటి యొనరగ హస్తము లోనికినీ
విసరుట చేతను నలసిపోయినా విమల బుద్ధిగలవారు మఱిన్
బలవంతుండగు రావణుండునూ బన్నగ యీ విధముగ నపుడున్
కొంతసేపు జరిగిన పిమ్మటనూ కోపముతో నొక స్త్రీకరమున్
కొఱికెను నాతడు నా స్త్రీయును మఱి కుదురుగ బాధయుగల చేతన్
దులిపె దూరముగా బడునట్టులుగా ఆ యశుభమైనా పురుగు నటన్! 36,37

మఱి యొక స్త్రీయును రాక్షసేంద్రునీ మానుగ కరమున బట్టి మఱిన్
ఆకాశంబునకును యెగిరెను మఱి నందఱు గన నాశ్చర్యముగన్!
అటుపిమ్మట యా రావణుండునూ యలరుచు సంక్రుద్ధుడు నగుచున్
ఆమెను గూడను గోరులచేతను నలరి ఱక్కె రక్తము జిందన్! 38

ఆ వెనుకను నా స్త్రీయును నతనిని యలరి దులిపి వేయగ నపుడున్
ఆ రాక్షసుడగు రావణుండునూ నటు భయ వ్యాకులుడును నగుచున్
సముద్ర మధ్య జలంబుల బడియెను సాంద్రముగా మునుగుచు నతడున్
నూపిరాడకను నీదుచు నాతడు నొడుపుగ తీరము జేరగనూ! 39

ఆ స్త్రీ యాతని దులిపి వేయుగా నా విధముగ నాతండు మఱిన్
వజ్రముచేతను జీల్చబడిన యా వన్నెల పర్వత శిఖరముగా
సముద్ర జలముల యందు బడెను మఱి సాహసవంతుని పనియిటులన్
గొప్పలు బలికెడి వారికి యిటులను దిప్పలు గలుగును మునుముందున్! 40

రఘుపతి రాఘవ రాజారామా! పతిత పావనా సీతారామ్!
ఓ రామా! యా లంకేశుండగు నొనరగ రావణుడును మఱియున్
శ్వేత ద్వీపమున వసించుచుండెను స్త్రీల చేత నీ విధముగనూ!
అవమానింపగ బడి రావణుడును నాదర మింతయు లేక మఱిన్
అటునిటుబోవగ విసిరివేసరీ యాట బంతి వలె నాతనినీ! 40

మహోతేజమును గల నారదుడును మానుగ యవమానింపబడీ
కలత జెందెడీ దశాననునితో కలిసి వెళ్లి యాశ్చర్యముతో
ప్రకటించియునూ బక బక నవ్వుచు బహు బిగ్గఱగా బాడుచునూ
బాలుకుండు నృత్యము జేసిన యటు బహుభంగుల నర్తన జేసెన్! 42

మహో బాహువులు గలవాడా? ఓ రామా వినుమా! నా పలుకుల్
ఇందు నిమిత్తము దుష్టబుద్ధిగల నింపుగ రావణు జేత మఱిన్
నీచే మరణము నందవలయునని నిర్మలమగు కోరిక తోడన్
కావలెననియే సీతాదేవిని కలవర బడకను హరియించెన్! 43

నీవే భగవంతుడవు మఱియును నీవే నారాయణుడవునూ!
శంఖు చక్రముల గదా ధరుండవు! శార్ఙ్గ పద్మములు ధరించినా!
సమస్త దేవతలును బూజింతురు సరసత భక్తిని నిన్ను మఱిన్!
శ్రీవత్సాంకముగల వాడవునూ! పద్మ నాభుడవు నీవు మఱిన్
మహోయోగులకు, భక్తులకును మఱి మానుగ యభయము నిచ్చెదవూ
నీవే యా పరమాత్మ రూపుడవు! నీవే నారాయణుడవునూ! 44, 45

నీవు రావణుని సంహరింపగా నిర్మల మానుష రూపమునూ
ధరించినాడవు జన్మించితివీ తగ యయోధ్య పురమందుననూ!
నే నారాయణుడను అని మనసున నిర్మలమగు భావము తోనీ
తెలిసికొనుటలే దెందుకనీ మఱి తేటతెల్లముగ హరి ననుచున్! 46

మహోభాగ! ఓ రామచంద్ర విను! మానుష మోహము జెందకుమా!
నిన్ను గూర్చి మఱి నీవే స్వయముగ నిశ్చితముగ మఱి దెలిసికొనూ!
రహస్యములలో పరమ రహస్యము ననుచు బ్రహ్మదేవుడు తానే
స్వయముగా జెప్పెను గద! రఘురామా! స్వయముగ యాలోచింపు మికన్! 47

రాక్షసులను మర్దించెడివాడా! రమ్య త్రిగుణములు గలవాడా!
మూడు కాలములు దెలిసినవాడవు! మూలంబును దెలిసినవాడా!
మూడడుగులచే బలి రాజ్యంబును ముదమున హరియించినవాడా!
ఓం తత్ సత్ అను మూడు పదంబుల నొనరగ జెప్పగ బడువాడా!
మూడు కాలముల జరిగెడి పనులను మోదముగా నడిపించెదవూ!

మూడు వేదముల జేతను మఱియును ముదమున ప్రతిపాదింపబడీ
అలరుచుండెదవు! నఖిలేశ్వర! విను! యంతములేనీ వాడవునూ! 48

పూర్వ కాలమును మూడడుగులచే బొలుపుగ త్రైలోక్యంబులనూ
ఆక్రమించితివి గద! శ్రీరామా యల దేవతలను గాపాడన్!
బలి బంధనకై యల దేవేంద్రుని యలరు దమ్మునిగ నగుటకునై
అతిథి గర్భమున జననమొందితివి! విదితముగా యాలోకమనన్
సనాతనుండగు విష్ణువు నీవే! సదాచారముల రక్షింపన్,
లోకంబును రక్షించుట కొఱకై లోలత మానుష రూపమునన్
ధాత్రీతలమున జన్మించితివీ దగ యయోధ్య పురమందుననూ! 49, 50

సురసత్తమ! దేవతల కార్యమును సాధించితివీ నీ విపుడున్
పాపాత్ముండగు రావణాసురుని బన్నుగ పుత్రులతోని మఱిన్
పరివారంబును బంధులతోడను బరగ హరించిన వాడవునూ
శాంతిస్థాపనము జేసినావు గద! శాంతి గూర్చితివి లోకమునన్! 51

సురేశ్వరా! ఓ రఘురామా! విను! బొలుపుగ నాదు సువచనములన్
దేవతలును మఱి తపోధనులునగు దీరుగ ఋషి మును లందఱునూ
ప్రహృష్టులైరీ సకల ప్రాణులును సంతసమందెను నీ పుడమిన్
త్వత్ప్రసాదమున సకల జగత్తును దగ ప్రశాంతతను బొందినదీ! 52

మహా భాగయగు లక్ష్మీ దేవియు మానుగ ధాత్రీ తలమందున్
సీతాదేవిగ జన్మించినదీ శ్రీకరముగ యాసాధ్వియునూ!
ఓ రామ ప్రభు! నీ కొఱకే గద! నీరజాక్షి జన్మించినదీ!
జనక రాజా నింటను బెరిగినదీ సకల శోభలను గూడికొనీ! 53

మహాయశా! శ్రీ రఘురామా! విను! నయముగ నారదుడును దెలిపెన్
లంకకు గైకొనివచ్చి యత్నమున లంకేశుడు సీతాలక్ష్మిన్
తల్లివోలె రక్షింపబడినదీ తగ యశోక వనమందుననూ!
విషయమునంతను విశదబఱచితిని విశదముగా నింతయు లేకన్! 54

నా కీ వృత్తాంతంబు నంతయును నయముగ నారదుడును దెలిపెన్
దీర్ఘజీవి యగుటను నారదుడును దీరుగ దెలిపెను వినిపించీ

సనత్కుమారుడు దశగ్రీవునకును సరసత దెలిపెనొ యే విధమున్
అంతా యా విధముగ జేసెను మఱి శాంతిమగను సద్భాషణలన్। 55

ఏ విద్వాంసుడు బ్రాహ్మణ సన్నిధి నింపుగ శ్రాద్ధ సుసమయములన్
ఈ వృత్తాంతము వినిపించునొ మఱి నింపుగ శ్రద్ధా భక్తులతో
ఆ శ్రాద్ధమునకు నిచ్చిన యన్నము యక్షయమై పితృదేవులకున్
జేరును వారును తృప్తి జెందుదురు శ్రీకరమగు ఫలములనందీ। 56

రాజీవలోచనుండైన రాఘవుడు రమ్య ప్రభావము గలవాడున్
అతని తమ్ములును గూడ లక్ష్మణుడు నల భరతుడు శత్రుఘ్నుండున్,
దివ్యమైన యా వృత్తాంతము విని దీరుగ సంతోషించి మఱిన్
ఆశ్చర్యంబును బొందుచు వారలు నానందంబును బొందిరటన్। 57

సుగ్రీవునితో గూడినట్టి యా సురుచిర వానరులును మఱియున్,
విభీషణునితో గూడినట్టి యా వినయ భూషణులు రాక్షసులున్,
రాజులు మఱియును వారి యమాత్యులు రమ్య సహచరులు గూడ మఱిన్,
అట జేరిన తదితరులందఱునూ యలరెడి బ్రాహ్మణు లందఱునూ!
క్షత్రియులును వైశ్యులు శుద్రులునూ సామంతపు రాజులు మఱియున్
అందఱు గూడను నానందంబును నలరుచు మునుగుచు దేలుచునూ!
వికసించిన నేత్రంబుల తోడను విమలమైన దృష్టిని బఱపీ
రామునివైపే గనుచుండిరి మఱి రమణీయంబగు జూపులతో! 58, 59, 60

అటుబిమ్మటనూ మహాతేజుడును నలరుచు నగస్త్యుడును మఱియున్
శ్రీరామునితో నిటులను బలికెను జిత్తము వార్ధము బులకింపన్
'రామా! మాకును దర్శనమిచ్చీ రహి సన్మానించితివి మమున్
వెళ్లి వచ్చెదము' ననుచు బలికెనూ విమలమైన యార్ద్రత దొలుకన్!
ఇటుల బలికి వారందఱునూ మఱి నింపుగ పూజలు గైకొనుచున్
వచ్చినట్లుగానే మఱి పోయిరి మచ్చిక తమ యాశ్రమములకున్! 61

శ్రీరామ కథా సుధాలహరి యందు - ఉత్తరకాండలో
పంచమ ప్రక్షిప్త సర్గము సమాప్తము

## ప్రథమ సంపుటము సమాప్తము